Bruhadaranyakopanishat

**బృహదారణ్యకోపనిషత్తు**

వ్యాఖ్యాత :

**శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు**

ముద్రణ : సెప్టెంబర్, 2014

**SRI RAMAKRISHNA TAPOVANAM**
**20, Race Course Road**
**Guindy, Chennai - 600 032**
**Mobile : 9884708559**
**E-mail ID : chvenkateswarlu30@gmail.com**
**Website : sriramakrishnatapovanam.org**

డి.టి.పి. : ఆర్. అనురాధ రఘురాం (9441186831)

# గ్రంథకర్త పరిచయం

ప్రఖ్యాత రచయిత, విమర్శకులు, వక్త, ఉపాధ్యాయులు అగు శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులుగారు సంస్కృతాంధ్ర, ఆంగ్ల, హిందీ భాషలలో పండితులు. స్వయంకృషితో తెలుగు, ఇంగ్లీషు, హిందీ భాషలలో అనేక పట్టములు సంపాదించారు. 1943-48 సంవత్సరాలలో గాంధీగారి నిర్మాణ కార్యక్రమములో చురుకుగా పాల్గొని ఖద్దరు, హిందీ భాషా ప్రచారము చేశారు. తరువాత కృష్ణాజిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా చేరి 1977లో ప్రధానోపాధ్యాయులుగా పదవీ విరమణ చేశారు. ఆ కాలములో వారు రచించిన గ్రంథాలలో శుభోదయము, తుక్కాంబ, రఘునాథ విలాసము, పూర్వాంధ్ర కవులు మొదలగు గ్రంథములు ఆంధ్ర, ఉస్మానియా, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయాలలో పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించబడ్డాయి. ఉద్యోగ విరమణ తరువాత వేద వాఙ్మయముపై అపారకృషి చేసి ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, పాతంజలి యోగ సూత్రముల వంటి విషయములపై సరళమైన తెలుగు భాషలో అనేక గ్రంథములు రచించిన శ్రీ సోమయాజులుగారు స్వతంత్రభావనాశక్తి కలిగిన పండితులు. 13-12-1922 తేదీన కృష్ణాజిల్లా తోట్లవల్లూరు గ్రామంలో జన్మించిన వీరు 2-2-1997న తాడిగడప గ్రామములో వారి స్వగృహమున దివంగతులైనారు.

# ప్రవేశిక

'ఉపనిషద్దర్శనం' మొదటి భాగం చదివిన పాఠకులు చాలామంది తమ సంతృప్తిని, ఆమోదాన్ని తెలియజేయటం వల్లను, కొంతమంది పెద్దల ఆశీర్వచనం వల్లను ఉత్సాహం కలిగి ఈ మార్గంలో ఇంకా రెండడుగులు ముందుకు వేద్దామని సాహసించాను. దానికి ఫలమే ఈ రెండవ భాగం – బృహదారణ్యకోపనిషత్తు.

బృహదారణ్యకోపనిషత్తు శుక్లయజుశ్శాఖకు సంబంధించినది – వాజసనేయ బ్రాహ్మణాంతర్గతమైనది. ఈ బృహదారణ్యకానికి రెండు పాఠాలు కనిపిస్తున్నాయి. (1) కాణ్వశాఖీయము (2) మాధ్యందిన శాఖీయము. మాధ్యందిన శాఖీయము. మాధ్యందిన శాఖీయ ప్రక్రియకు ఆచార్యులుగా భర్తృప్రపంచ, మండనమిశ్రాదులు పరిగణింపబడుతున్నారు. శ్రీ ఆదిశంకరులు కాణ్వశాఖీయమైన దానిని గ్రహించారు.

ఈ బృహదారణ్యకంలో మొత్తం ఎనిమిది అధ్యాయాలు ఉండగా, మొదటి నాలుగు అధ్యాయాలు, మధుకాండ అని, 5,6 అధ్యాయాలు యాజ్ఞవల్క్యకాండ, లేక మునికాండ అని, 7, 8 అధ్యాయాలను ఖిలకాండ (అనుబంధము) అని వ్యవహరిస్తారు. అయితే మొదటి 4 అధ్యాయాల్లో మొదటివైన రెండు అధ్యాయాల్లోను ప్రవర్గ్య కర్మాంగాలను గూర్చి విపులంగా చెప్పటం వల్ల, జ్ఞానానికి, ఉపాసనకు అవి సంబంధించనందువల్ల, వాటిని వదలివేసి 3వ అధ్యాయం నుండి ఉపనిషత్తుగా గ్రహించారు. ఈవిధంగా ఇప్పుడు బృహదారణ్యకోపనిషత్తు 6 అధ్యాయాలుగా కలదిగా ఉంది. (1, 2 అధ్యాయాలు మధుకాండ, 3, 4 అధ్యాయాలు మునికాండ, 5,6 అధ్యాయాలు ఖిలకాండ.) ఈ ఆరు అధ్యాయాలకు శ్రీ ఆదిశంకరులు భాష్యాన్ని వ్రాశారు. శ్రీ ఆనందగిరి టీకను వ్రాశారు. శ్రీ సురేశ్వరులు వార్తికాన్ని, శ్రీవిద్యారణ్యులు వార్తికసారాన్ని, ఇట్లాగే వారి శిష్య ప్రశిష్యులు అనేక రచనలు చేశారు. ఆదిశంకరులు తమ భాష్యంలో మాధ్యందిన శాఖీయ ప్రక్రియను ఖండించారు. వారి శిష్యులు శ్రీ సురేశ్వరుల వారు ఇంకా రెండడుగులు ముందుకు వేసి పండిత మండనుడైన మండనమిశ్రుని పండితమ్మన్యుడని కూడా దూషించారు. ఆ దూషణలను మనం హర్షించలేకపోయినా ఆదిశంకరులు ప్రతిపాదించిన కేవలాద్వైతానికి మోకరిల్లక తప్పదు.

శ్రీ ఆదిశంకరులు స్థాపించిన పీఠాలన్నింటిలోకి తలమానికమైనది శృంగేరి శారదాపీఠం. ఇది యజుర్వేదీయం – దక్షిణదిక్కు గలది. దీనికి ప్రథమపీఠాధిపతి శ్రీ సురేశ్వరాచార్యులవారు. (ఆదిశంకరుల తరువాత) విద్యారణ్యస్వామి పంద్రెండవ పీఠాధిపతి. ఇక్కడ ముచ్చటించుకోవాల్సిన విషయం ఒకటి ఉంది. అదేమంటే – శ్రీ ఆదిశంకరులు సురేశ్వరాచార్యులవారిని, తాము రచించిన తైత్తిరీయ, బృహదారణ్యక భాష్యాల మీద వార్తికం వ్రాయమని ఆదేశించారని ప్రతీతి.

ఈ రెంటిమీద ఎందుకింత పక్షపాతం చూపించారు? శ్రీ ఆదిశంకరులు తైత్తిరీయ శాఖకు చెందినవారు. శ్రీ సురేశ్వరులు కాణ్వశాఖకు చెందినవారు. ఇరువురు యజుశ్శాఖీయులే! ఒకరిది కృష్ణయజుశ్శాఖ, మరొకరిది శుక్లయజుశ్శాఖ. సురేశ్వరాచార్యుల వారి వార్తికం ఈ రెంటిమీదనే కనిపిస్తోంది. పైగా అధిక ప్రచారం గల మాధ్యందిన శాఖీయులైన వారిని పరుషంగా దూషించటానికి ఇదే కారణమని కొందరి ఊహ. అయితే అద్వైతమూర్తులకు ఇటువంటి పక్షపాతాన్ని మనం ఆరోపించలేము – ఊహించలేము. కాని బృహదారణ్యవార్తికసార కర్తలు శ్రీ మాధవ విద్యారణ్యులవారి శంకర దిగ్విజయంలోని మాటలను కాదనలేము. శిష్యానురాగం ఉండవచ్చు.

*సత్యం యదాత్థ వినియన్ మమ యాజుషీయా,*
*శాఖా తద న్తగత భాష్య నిబన్ధ ఇష్టాః ।*
*తద్వార్తికం మమకృతే భవతా విధేయం,*
*సచ్చేష్టితం పరహితైకఫలం ప్రసిద్ధం ॥*

*తద్వత్ త్వదీయా ఖలు కణ్వశాఖా,*
*మమాపి తత్రాస్తి తద న్త భాష్యమ్ ।*
*తద్వార్తికంచాపి విధేయమిష్టం,*
*పరోపకారాయ సతాం ప్రవృత్తిః ।*

తైత్తిరీయ, బృహదారణ్యకాల్లోనే విషయ ప్రతిపాదనలోను, విషయ విపులీకరణలోను ఒక క్రమ వికాసం కనిపిస్తోంది. కాబట్టి, ఈ రెంటికి ప్రాధాన్యత ఇచ్చి ఉంటారని మనం అనుకోవచ్చు.

శ్రీ ఆదిశంకరులు భాష్యం వ్రాసిన ఈశాది ఉపనిషత్తులన్నింటిలోకి ఈ బృహదారణ్యకోపనిషత్తు పెద్దది. గ్రంథ పరిమాణంలోనేకాక, విషయ గౌరవం దృష్ట్యా కూడా గొప్పదే! గంభీరమైనదే! మిగతా ఉపనిషత్తులన్నీ చదివిన దానికంటే బృహదారణ్యకం ఒక్కటే చదివితే చాలునంటారు – అన్ని ఉపనిషత్తులలోని విషయము ఇందులో ఉన్నది – ఆ ఉండటం విపులంగా ఉంది. ఈ ఉపనిషత్తు ఏషణత్రయాన్ని (పుత్రైషణ, ధనైషణ, లోకైషణ) అతిక్రమించమని బోధిస్తుంది. ధర్మమనేది లోకానికి సాధనభూతమైన అంతఃకరణ శుద్ధికి ఉపకరిస్తుంది. మనస్సులోని మాలిన్యాలు తొలగిపోతే వివిదిష – సిద్ధిస్తుంది. తద్వారా జ్ఞానం ఆ జ్ఞానం ద్వారా అద్వైతసిద్ధి కలుగుతుందని ఈ ఉపనిషత్తు నిరూపిస్తుంది. అంతేకాదు. సామాన్య మానవులను సైతం ఎదుర్కొనే అనేక ప్రశ్నలకు (ఉదా॥ మరణమంటే ఏమిటి? మరణం ఎట్లా సంభవిస్తుంది? మరణించేటప్పుడు ఇంద్రియాలన్నీ ఏ స్థితిలో ఉంటాయి? జీవాత్మ మరొక శరీరంలోకి ఎట్లా చేరుతుంది?) చక్కటి సమాధానాలు ఇవ్వబడ్డాయి.

ఈ ఉపనిషత్తు మూడు భాగాలుగా ఉన్నదని చెప్పాం. అందులో మొదటిదైన మధుకాండలో ఉపదేశం, రెండవదైన యాజ్ఞవల్క్యకాండలో ఉపపత్తి (యుక్తి) మూడవదైన ఖిలకాండలో ఉపాసన, ప్రాధాన్యం వహిస్తాయి. ఇది బోధనకు సక్రమమైన పద్ధతి.

స్థూలంగా ఈ మూడుకాండలలోని విషయాలు చెపితే పాఠకునికి విషయ ప్రవేశం సులభంగా ఉంటుందనే ఉద్దేశంతో క్లుప్తంగా ఆయాకాండలను వివరిస్తున్నాను.

మొదటికాండలోనికి మధువిద్య. ఈ మధువిద్యను కూడా మనం బ్రహ్మవిద్యగానే అంగీకరించాలి. దీనిని హిరణ్యగర్భుడు ప్రజాపతికి ఉపదేశించాడు. పృథివి మొదలుగా గల జగత్తు అంతా ఒకదానికొకటి ఉపకార్య ఉపకారకాలుగా ఉంటాయి. దానితోబాటు లోకంలోని అన్ని పదార్థాలు ఒకే కారణాన్ని కలిగి, ఒకే చైతన్యంచేత అనువిద్ధమై, ఒకే ప్రళయస్థానం కలవిగా ఉన్నాయి. అంటే, ఉత్పత్తి, స్థితి, లయం అన్నింటికి ఒకటిగానే కనిపిస్తోంది. ఈ పృథివి, సమస్త భూతాలు, పార్థివరూపంలో ఉండే పురుషుడు, శరీరం, ఈ నాలుగు ఒకదానికొకటి మధువు (అనేక తేనెటీగలు కలసి తేనెతుట్టెను తయారుచేసినట్లే సమస్త భూతాలు కలిసి ఈ పృథివిని – సృష్టిని నిర్మించాయి. కాబట్టి ఇవి ఒకదానికొకటి ఉపకార్య ఉపకారకాలు.) ఈ పృథివి సమస్త భూతాలకు కార్యం. అందుచేత దీనిలో (ఒకే కారణంచేత ఉత్పన్నమవటం అనేది) ఏకకారణకత్వం కనిపిస్తోంది. ఆ కారణం ఏది? పరబ్రహ్మ! ఈ జ్ఞానం వల్ల సమస్త జగత్తు బ్రహ్మమే! ఈ విధంగా మధుచతుష్టయం చెప్పబడ్డది. దీని పర్యవసానం బ్రహ్మను బోధించటమే కాబట్టి ఈ ప్రకరణం కూడా ఉపనిషత్తే అవుతోంది.

అయితే, పాఠకులకు ఇంకొక అనుమానం కలగటానికి అవకాశం ఉంది. ఏమని? – ఇది ఉపనిషత్తుగదా! జ్ఞానమార్గ బోధకమైన ఈ ఉపనిషత్ప్రారంభంలో ఈ అశ్వమేధాశ్వ వర్ణనం ఏమిటి? అని. బృహదారణ్యకంలోని 8 అధ్యాయాల్లోను మొదటి రెండు అధ్యాయాలు కేవలం కర్మకాండలకు చెందిన అశ్వమేధాదులతో కూడినందున వారీని వదలివేశారని, 3వ అధ్యాయంతో ప్రారంభించారని చెప్పాం. అరణ్యకంలో ఉపాసనకు, జ్ఞానానికి కూడా ప్రాధాన్యం ఉంది. ఆ ఉపాసన కూడా సగుణోపాసన కాకుండా నిర్గుణోపాసనకు ఉపనిషత్తుల్లో స్థానం ఇచ్చారు. ఈ నిర్గుణోపాసన జ్ఞానం ద్వారా మోక్షం పొందటానికి సోపానంగా ఉపయోగిస్తుంది. అందుచేతనే తైత్తిరీయాదుల్లో చాలాభాగం ముందుగా ఉపాసనకాండ చర్చనీయాంశమైంది.

కర్మలలో ప్రధానమైనది, అత్యంత ఫలప్రదమైనది అశ్వమేధం. ఈ అశ్వమేధ వృత్తాంతాన్ని వదలివేశారు. కాని ఉపాసన నిమిత్తం ఆ అశ్వమేధాశ్వ వర్ణనంతో ఆరంభించారు. ఈ యాగం రాజులు మాత్రమే చేయదగింది. కాబట్టి రాజులవలె శక్తి సామర్థ్యాలు లేని సామాన్యులకు ఆ యాగఫలం రావాలంటే ఎట్లా? దానికి ఉపాసనే మార్గం. కాబట్టి ఆ యాగంలో ప్రధానమైన

అశ్వాన్ని ప్రజాపతిగా భావించి ఉపాసిస్తే అశ్వమేధఫలం వస్తుందని చెపుతున్నారు – అంటే వ్యష్టి సమష్టి రూపమైన హిరణ్యగర్భ పదం లభిస్తుంది. కాబట్టి ఈ అశ్వమేధాశ్వ వర్ణనంతో గ్రంథం ఆరంభించారు. ఇది సముచితమే గదా! తరువాత ఈ మధుకాండలోని విషయాలు స్థూలంగా చెప్పాలంటే ఈవిధంగా ఉన్నాయి.

విరాట్ స్వరూపమైన అగ్నియొక్క సృష్టి, ఋగ్వేదాదుల సృష్టి, మృత్యువు యొక్క అదితిత్వం, అశ్వమేధోపాసనా ఫలం, దేవతల ఉద్గీథం ద్వారా అసురులను జయించటానికి ప్రయత్నించటం, ముఖ్య ప్రాణం తప్ప, వాగాదులన్నీ పాపవిద్ధమవటం, ముఖ్యప్రాణోపాసన, సృష్టిక్రమ వర్ణనం, చాతుర్వర్ణ సృష్టి, పాంక్తకర్మ నిరూపణం, సప్తాన్నసృష్టి, తద్విభాగం, ఆత్మకు అన్నమైనవాటిని ఉపాసించినందువల్ల కలిగే ఫలం, సంప్రత్తి కర్మ – తత్ఫలం, అధిదైవ దర్శనం చెప్పబడ్డాయి. ఇంతవరకు అవిద్యా విషయమైన సంసార స్వరూపం.

తరువాత గార్గ్యుడు. అజాత శత్రువుల సంవాదం వస్తుంది. గార్గ్యుడు ప్రతిపాదించిన ఆదిత్యాదుల్లోని బ్రహ్మత్వాన్ని అజాతశత్రువు ఖండించటం జాగ్రత్స్వప్నసుషుప్తుల నిరూపణం చేసి, శిశునామకమైన మధ్యమ ప్రాణాన్ని ఉపకరణ సహితంగా వర్ణించారు. శ్రోత్రాదుల్లో సప్తర్షి దృష్టిని విధించటం బ్రహ్మకున్న మూర్త అమూర్తరూపాలు, లింగస్వరూపుడైన పురుషుని వర్ణనం, యాజ్ఞవల్క్య మైత్రేయీ సంవాదం, దుందుభి మొదలైన దృష్టాంతాలతో ఆత్మయొక్క సర్వవ్యాపకత్వాన్ని నిరూపించటం, తరువాత పృథివ్యాదులలో మధుదృష్టి, మధువిద్యకున్న సంప్రదాయ పరంపర చెప్పారు. స్థూలంగా ఇది మధుకాడం స్వరూపం.

ఇక, యాజ్ఞవల్క్యకాండ లేక మునికాండల (3, 4 అధ్యాయాలు) విషయం.

జనకమహారాజు సభలో యాజ్ఞవల్క్యుడు ఎదుర్కొనవలసి వచ్చిన ప్రశ్నలు కొన్నింటిని స్థూలంగా చెప్పుకొందాం. యజమానుడు మృత్యువును అహోరాత్రాలను, కృష్ణపక్ష శుక్లపక్షాలను ఎట్లా తరిస్తాడు? స్వర్గానికి ఏ ఆధారంతో వెడతాడు? గ్రహాలెన్ని? అతిగ్రహాలెన్ని? మృత్యువు దేనికి అన్నమౌతుంది? తత్వజ్ఞాని యొక్క దేహావసాన క్రమం ఏమిటి? ఇంద్రియాభిమానులీన దేవతలు తొలగిపోగా కర్త (జీవుడు) యొక్క స్థితి ఎట్లా ఉంటుంది? సర్వాంతరాత్మ అంటే ఏమిటి? సన్యాసంతో కూడిన ఆత్మజ్ఞాన స్వరూపం ఏమిటి? అనుమాన ప్రమాణంతో అక్షర తత్వవర్ణనం, దేవతల సంఖ్యను గూర్చిన వివరణ, ఇవన్నీ చర్చించబడ్డాయి. పిమ్మట యాజ్ఞవల్క్యుడు సభాసదుల్ని ప్రశ్నించటం, వారు నిరుత్తరులై ఓడిపోవటం, వృక్షాన్ని దృష్టాంతంగా తీసికొని నరకబడిన పురుషుడు మళ్ళీ ఏమూలం నుండి పుడుతున్నాడు? అని ప్రశ్నించి సమాధానం ఇవ్వటం ఇదంతా మూడవ అధ్యాయంలోని విషయం.

ఇక నాల్గో అధ్యాయంలో జనకుని ప్రశ్నలకు యాజ్ఞవల్క్యుని సమాధానాలున్నాయి. వాగాది దేవతల ప్రతిష్ఠ, ఆయతనం, ఉపాసనారూపాలను, విశ్వతైజస ప్రాజ్ఞతురీయ బ్రహ్మలను గూర్చిన

వివరణ, ఆత్మస్వరూప వర్ణనం, అవస్థాత్రయం, ప్రాణాలు వేరొక శరీరంలో ప్రవేశించేవిధం, లింగ దేహంలో ఇంద్రియాలు లయమవటం, ఉత్క్రమించటం, బ్రహ్మజ్ఞానికి మోక్షం కలదనేందుకు ప్రమాణాలు, బ్రహ్మవేత్త యొక్క స్థితిని వర్ణించారు. పిమ్మట యాజ్ఞవల్క్యుడు మైత్రేయి అనుమతి తీసుకొని సన్యసించటం. ఇది మునికాండ యొక్క సంక్షిప్త స్వరూపం.

5, 6 అధ్యాయాలు ఖిలకాండ అనుకున్నాం. ఇది ఉపాసన ప్రధానాంశంగా గల గ్రంథం. మొదటి రెండు కాండలలోను చెప్పని విషయాలు దీనిలో ఉన్నాయ. ఆకాశ బ్రహ్మోపాసన, ప్రజాపతి దేవమానవ దానవులకు చేసిన ఉపదేశం, హృదయబ్రహ్మ, సత్య బ్రహ్మ, విద్యుద్బ్రహ్మ వాగాది బ్రహ్మోపాసనలు – తత్ఫలం; ఆదిత్యునికున్న వ్యాహృతి రూపాత్మకమైన అవయవాలు, ప్రాణ, అన్న, వేద దృష్టితో బ్రహ్మోపాసనము, గాయత్రీ శబ్దవ్యుత్పత్తి, ఉపాసన మహిమ చెప్పబడ్డాయి. తరువాత ఇంద్రియాలు తమ తమ శ్రేష్ఠత్వాన్ని నిరూపించటానికి యత్నించి విఫలమవటం, ప్రాణానికి మాత్రమే శ్రేష్ఠత్వ, వసిష్ఠత్వ, జ్యేష్ఠత్వ గుణాలున్నాయని తీర్మానించటం జరిగింది.

తరువాత ప్రవాహణ శ్వేతకేతు సంవాదం. ప్రవాహణుడడిగిన ప్రశ్నలు. 1) చనిపోయినవారు ఏఏ మార్గాలలో వెడతారు? (2) వారు మళ్ళీ ఏవిధంగా ఇచటికి వస్తారు? (3) ఇట్లా అనేకమంది అనేకసార్లు చచ్చినా ఆ లోకం ఎందుచేత చావటం లేదు? (4) ఎన్ని ఆహుతులిస్తే జలం పురుషరూపం దాల్చి, లేచి మాట్లాడగలుగుతుంది? (5) దేవయాన, పితృయాన మార్గాలకు సంబంధించిన కర్మరూపమైన సాధనాలు ఏమిటి?

వీటికి శ్వేతకేతుని తండ్రియైన ఆరుణి ప్రవాహణుని వద్ద శుశ్రూష చేసి ఈ ప్రశ్నలకు సమాధానాలు గ్రహించటం, దేవయాన, ధూమయానాలు, మంథవిద్యావర్ణనం, సంతానోత్పత్తి విజ్ఞానం, ఇవి ఆరవ అధ్యాయంలోని ప్రధానాంశాలు. మూడు కాండలకు చివర ఆయా కాండల ఆచార్యపరంపర ఇవ్వబడ్డది. ఇది కాండ త్రయాత్మకమైన ఈ ఉపనిషత్తు యొక్క స్థూలరూపం.

అపౌరుషేయాలైన వేదాలకు శిరోభాగాలైన ఈ ఉపనిషత్తులు కూడా అపౌరుషేయాలే! వీటిని వివరించటం సామాన్య మానవులవల్ల అయ్యేపనికాదు. అందుచేతనే పూజ్యులైన భగవత్పాదులు అవతరించాల్సి వచ్చింది. అట్లా అవతరించిన ఆదిశంకరులు ఔపనిషద పురుష సాక్షాత్కారాన్ని కలిగించారు.

ఈ గ్రంథం స్థూలంగా భావం మాత్రం చేతనైన మేరకు వివరించటం జరిగింది. ఎక్కడైనా సరిగా వివరించలేకపోతే, అర్థానికి ప్రతిబంధకం ఏర్పడితే అది నా తప్పు – నా అజ్ఞత. అయితే విషయాన్ని నిర్దుష్టం చెప్పటం మీదకంటె నా దృష్టి అందరికి అర్థమయ్యే విధంగా వివరించటం మీద అధికంగా లగ్నమవటం వల్ల పండితులు గుర్తించగలిగే చాలా దోషాలు కనిపించవచ్చు. ఆ

బాధ్యతను సవినయంగానే భరిస్తాను.

కొన్ని చోట్ల వివరణ అవసరమైనప్పటికి ఉపేక్షించటం జరిగింది. ఉదా॥ 3 అ 9. బ్రా 26 మంత్రంలో 'శాకల్యుని తలక్రింద పడిపోయింది'. ఇది యాజ్ఞవల్క్యుడన్న మాటలు కావు. ఇంకొకరెవరో చెప్పినవీ కావు. అఖ్యాయిక పూర్తి అయిపోయింది కాబట్టి ఉపనిషత్తు చెప్పిన వాక్యంగానే గుర్తించాలి. శిష్యులు శాకల్యుని అస్థికలను అగ్ని సంస్కారం కోసం తీసికొని పోతూండగా దొంగలు దోచుకోవటం వగైరా కథ, కర్మ ప్రకరణానికి సంబంధించినదైనా మంత్రాంతంలో ఉదహరించారు కాబట్టి కొంత ఇబ్బంది కలగవచ్చు – అన్వయానికి. ఇటువంటివి కొన్ని అక్కడక్కడ ఉన్నాయి. అట్లాగే 166వ పేజీలో ఆరవ మంత్రార్థానికి, ఏడవ మంత్రార్థానికి మధ్య వ్యవధానం కూడా దూరాన్వయం కావచ్చు. ఇటువంటివి పాఠకులు మన్నించి కొంత శ్రమ తీసికోవాలి.

ఇంకొక విషయం – కొందరు రచయితలు తమ గ్రంథాలలో 6వ అధ్యాయంలోని శ్రీమంథ బ్రాహ్మణం, పుత్రమంథనాది బ్రాహ్మణాలకు అర్థం వ్రాయటం వదలిపెట్టారు. బహుశ అవి కామశాస్త్ర సంబంధమైనవిగా ఉండి అందరు పఠించటానికి బాగుండవని తలచి కావచ్చు! కాని శ్రీ భగవత్పాదుల భాష్యం ఉంది. కాబట్టి, దానిలో అనౌచిత్యమనేది సంస్కారాన్ని బట్టి ఉంటుందని తలచి, కొంత పీఠిక ముందుగా వ్రాసి, ఆ భాగాలను కూడా తెలియజేసాను.

శ్రీ కైలాసాశ్రమం, ఋషీకేశం వారు తమ ఆశ్రమ శతాబ్ద్యుత్సవాలను పురస్కరించుకొని ఈ బృహదారణ్యకాన్ని మూలము, శంకరభాష్యం, ఆనందగిరి, భాష్యటీక, శ్రీ ఉమేశానందశాస్త్రి వారి 'కుముదతోషిణిటీక', విద్యావాచస్పతి, స్వామి విష్ణుదేవానంద రచిత టిప్పణి, కైలాస పీఠాధీశ్వరులు మహామండలేశ్వర, స్వామి విద్యానందగిరిజీ మహరాజ్‌వారి 'మితాక్షర' సహితంగా రెండు భాగాలలో బృహద్గ్రంథం ప్రచురించారు. ఆ గ్రంథం విశేషంగా సహాయపడ్డది. అంతేగాక ఆంగ్లంలో అద్వైతాశ్రమం వారు ప్రచురించినట్టి స్వామి శ్రీ మాధవానంద విరచితమైన బృహదారణ్యకోపనిషత్తు కూడా బాగా సహాయపడ్డది. ఇవి కాక సంస్కృతీ సంస్థాన్, బరైలీవారు ప్రచురించినవి తోడ్పడ్డాయి. ఆ రచయితలకు ప్రకాశకులకు కృతజ్ఞతాపూర్వక నమోవాకాలు. గుణమనేది ఏ లేశమైనా ఉంటే అది పైవారందరికీ చెందాల్సిందే!

ఈ ఉపనిషద్దర్శనం మీద తమ అమూల్యమైన అభిప్రాయాన్ని ఇచ్చి ప్రోత్సహించిన శ్రీ కె. సచ్చిదానందమూర్తిగారికి నమస్సులు.

నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

# శాంతి పాఠము

*హరిః ఓం। పూర్ణమదః పూర్ణమిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే ।*
*పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే ॥*

*ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥*

ఓం. ఆ పరబ్రహ్మ అనంతుడు – పూర్ణుడు. ఈ ఆత్మకూడా పరబ్రహ్మవలెనే అనంతమైనదే! పూర్ణమైదే! ఈ ఆత్మ అనేది ఆ అనంతాత్మ నుండి పుట్టింది. అనంతాత్మ అంటే పరమాత్మ అంటే పూర్ణమైనట్టి పరమాత్మ నుండి, పూర్ణమైనట్టి ఆత్మ పుట్టింది. కాబట్టి, జ్ఞానం ద్వారా ఆత్మను పరమాత్మగా గ్రహిస్తే ఆత్మయే పరమాత్మ అవుతుంది – అంటే, ఆత్మయే పరమాత్మ అని తెలుస్తుంది.

ఈ మంత్రంలో ఆత్మకు పరమాత్మకు గల సంబంధం చక్కగా వివరింపబడ్డది. ఆత్మ – పరమాత్మ రెండూ అనంతాలే! సంపూర్ణాలే! అంశలు కావు అన్నమాట! పరమాత్మ ఎంత సత్యమో ఎంత అనంతమో ఎంతటి విజ్ఞాన స్వరూపమో ఈ ఆత్మకూడా అంతే సత్యం, జ్ఞానం, అనంతమూను. ప్రళయకాలంలో ఉపాధితో కూడిన (శరీరంతో కూడిన) ఈ కార్యబ్రహ్మను (ఆత్మను) తనలో లీనం చేసుకోవటం వల్ల పూర్ణమైన నిరుపాధిక బ్రహ్మ మాత్రమే ఉంటుంది. పూర్ణమైన దానినుండి పూర్ణమైన దానిని తొలగిస్తే (తెలుసుకుంటే) మిగిలేది పూర్ణమే అనటంలోని ఉద్దేశ్యం అదే!

త్రివిధ తాపములు శాంతించుగాక!

**ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తి**
వైస్ ఛైర్మన్
యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్
బహదూర్ షా జఫర్ మార్గ్
న్యూఢిల్లీ - 110002

తేది : 9-3-1987

విషయ గాంభీర్యంలోను, పరిమాణంలోను ఉపనిషత్తులు అన్నిటిలోనికి బృహదారణ్యకోపనిషత్తు గొప్పది. దీనిపై శ్రీ శంకరాచార్యులవారి భాష్యం సాటిలేనట్టిది. దానిపై శ్రీ సురేశ్వరాచార్యుల వార్తికం ప్రసిద్ధం. వీటి ఆధారంగా బ్రహ్మశ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులుగారు చేసిన అనువాదం, టీక చూచినాను. ఎంతో బాగున్నది. శైలి సులభం, స్పష్టం; భావాలు సంప్రదాయానికి అనుకూలంగా విశదీకరింపబడినవి.

ఈ ఉపనిషత్తును ఈవిధంగా తెలుగులో వివరించి ప్రచారంలోకి తేవటం ఎంతో ప్రశంసనీయం. దీన్నికై కృషి చేసిన శ్రీ సోమయాజులుగారిని అభినందించుచున్నాను.

కె. సచ్చిదానందమూర్తి

# బృహదారణ్యకోపనిషత్తు

## మొదటి అధ్యాయం

### మొదటి బ్రాహ్మణం

**మం॥ ఓం. ఉషా వా అశ్వస్య మేధ్యస్య శిరః సూర్యశ్చక్షు, ర్వాత ప్రాణోవ్యాత్త మగ్నిర్వైశ్వానర, సంవత్సర ఆత్మా శ్వస్య మేధ్యస్య ద్యౌః పృష్ఠ, మన్తరిక్ష ముదరం, పృథివీ పాజస్యం, దిశః పార్శ్వే, అవాన్తర దిశః పర్శవః, ఋతవో ఙ్గాని, మాసాశ్చార్థమాసాశ్చ పర్వా, ణ్యహోరాత్రాణి ప్రతిష్ఠా, నక్షత్రాణ్య స్థీని, నభో మాంసాని, ఊవధ్యగ్ం సికతాః, సిన్ధవో గుదా, యకృచ్చ క్లోమానశ్చ పర్వతాః, ఓషధయశ్చ వన స్పతయశ్చ లోమా, న్యుద్యన్పూర్వార్థో నిమ్లోచజ్జఘ నార్థో యద్విజ్రుంభతే తద్విద్యోతతే, యద్విధూను తే తత్‌స్తనయతి, యన్మేహతి తద్వర్షతి, వాగేవాస్య వాక్. 1**

అశ్వమేధయాగంలో ఉపయోగించే యాగాశ్వంలో కాలము మొదలైన వాటిని (ఈ విశ్వరూపాన్ని లేదా ప్రజాపతి రూపాన్ని లేదా అశ్వ ప్రజాపతిని) నిరూపిస్తున్నారు. ఈ విధంగా యాగాశ్వంలో ప్రజాపతిని భావించుకొని ఉపాసించటం కోసం–

ఈ యాగాశ్వం యొక్క శిరోభాగం బ్రహ్మముహూర్తం– (సూర్యోదయానికి 45 నిముషాలు ముందు బ్రహ్మ ముహూర్తం. బ్రహ్మ ముహూర్తమనేది ముందుగా కాలాన్ని సూచిస్తోంది. అవయావాలలో శిరస్సులాగా కాల విభాగాల్లో బ్రహ్మ ముహూర్తం ప్రధానమైంది.) నేత్రాలకు అభిమాన దేవత అయిన సూర్యుడు ఈ అశ్వానికి నేత్రాలు. వాయువు ప్రాణం. నోటికి అధిష్ఠానదేవత అయిన వైశ్వానరాగ్ని ఈ అశ్వానికి తెరచివున్న నోరు. ఈ యాగాశ్వం యొక్క శరీరమే సంవత్సరం. (ఇంతవరకు కాల దృష్టితో యాగాశ్వాన్ని వర్ణించారు). ఇకలోక దృష్టితో వర్ణిస్తున్నారు. –ఎత్తుగా ఉండే ఈ యాగాశ్వం యొక్క వీపు ద్యులోకం. చిద్రరూపంలో ఉండే అంతరిక్షమే దాని ఉదరం. భూమి ఆ అశ్వానికి పాదాలు ఉంచే చోటు. నాలుగు దిక్కులు దాని పార్శ్వ భాగాలు (ప్రక్కలు). ఈశాన్యాది అవాంతర దిక్కులు (మూలలు) పార్శ్వకవభాగంలో ఉండే ఎముకలు. సంవత్సరంలో భాగాలుగా (అంగాలుగా) ఉండే ఋతువులు అశ్వానికి అంగాలు. మాసాలు పక్షాలు దానికి సందులు. రాత్రింబవళ్ళు పాదాలు. తెలుపుదనం యొక్క సామ్యంవల్ల

నక్షత్రాలు అశ్వానికి ఎముకలు. ఆకాశంలో ఉండే మేఘాలు మాంసం. ఇసుక అనేది సగం జీర్ణమైన అన్నం (ఆహారం). నదులు ఈ అశ్వానికి నాడులు. పర్వతాలు యకృత్, క్లోమాలు అనే మాంస ఖండాలు.ఓషధి వనస్పతులు దాని వెంట్రుకలు (తరువాత మళ్ళీ దేవతాతత్వాన్ని ఆరోపిస్తున్నారు.) మధ్యాహ్న సమయం వరకు పైకిపోయే సూర్యుడు దాని నాభికి పై భాగం. మధ్యాహ్నం నుండి క్రిందికి దిగే సూర్యుడు దాని నాభికి క్రింది భాగం. దాని ఆవులింతయే మెరపు (విద్యుత్తు). అది శరీరాన్ని విదిలించటమే మేఘ గర్జనం. అది వదలిపెట్టే మూత్రమే వర్షం. దాని సకిలింపే వాక్కు. (ఈ యాగాశ్వాన్ని పవిత్రంగా భావించటం కోసం, ఉపాసన కోసం దీనియందు కాలము, లోకాలు, దేవతలను ఆరోపించి ప్రజాపతి భావాన్ని కలిగించారు.)

**మం॥ అహర్వా అశ్వం పురస్తా న్మహిమాన్వజాయత, తస్య పూర్వే సముద్రే యోనిః, రాత్రిరేనం పశ్చాన్మహి మాన్వజాయత, తస్యాపరే సముద్రే యోనిః, ఏతౌ వా అశ్వం మహిమానావభితః సంబభూవతుః. హయో భూత్వా దేవానవహత్ వాజీగంధర్వాన్, అశ్వో మనుష్యాన్, సముద్ర ఏవాస్య బంధుః, సముద్రో యోనిః. 2**

ఈ యాగాశ్వానికి ముందు భాగంలోను, వెనుక భాగంలోను మహిమ అనే పేరు గల స్వర్ణపాత్రను, రజతపాత్రను (దీనినే గ్రహమంటారు) ఉంచుతారు. ముందు భాగంలో ఉండేది స్వర్ణపాత్ర. అదే పగలు. (పగలే మహిమ రూపంలో అశ్వప్రజాపతి ముందు ప్రకటమైంది). ఆ స్వర్ణప్రాతకు (పగలు లేక సూర్యుడు) జన్మస్థానం తూర్పు సముద్రం. ఆ అశ్వానికి వెనుక ఉండే మహిమ అనే పేరు గల వెండిపాత్రయే రాత్రి. దాని జన్మస్థానం పశ్చిమ సముద్రం. ఈ గుఱ్ఱం హయమై దేవతలను మోసింది. వాజియై గంధర్వుల్ని మోసింది. అశ్వమై మానవులను మోసింది. సముద్రమే (పరమాత్మయే) దీనిని బంధించి ఉంచే చోటు. పరమాత్మయే దీనికి ఉత్పత్తి స్థానం.

(కాంతి లేక ప్రకాశం అనే ధర్మం రెంటిలోను ఉండటం వల్ల స్వర్ణపాత్రను పగటితోను కాంతి తక్కువగా ఉండటం నికృష్టత్వం అనే ధర్మాలు రెంటిలోను సమానం అవటం వల్ల వెండిపాత్రను రాత్రి అన్నారు.)

## రెండవ బ్రాహ్మణం

**మం॥ నైవేహ కించనాగ్ర ఆసీత్, మృత్యునైవేద మావృత మాసీత్. అశ నాయా. అశనాయా హి మృత్యుః, తన్మనోఽకురుత ఆత్మన్వీ స్యామితి. సోఽర్చన్నచరత్, తస్యార్చత ఆపోఽజాయన్త, అర్చతే వై మే కమ భూదితి, తదేవార్కస్యార్కత్వమ్, కం హ వా అస్మై భవతి య ఏవమే తదర్కస్యార్కత్వం వేద 1**

అశ్వమేధంలో ఉపయోగించే అగ్ని ఏ విధంగా పుట్టిందో ఈ మంత్రంలో చెపుతున్నారు.

మనస్సు మొదలైన వాటి పుట్టుకకు పూర్వం, ఈ విశ్వంలో, నామరూపాలుగా విభక్తమైనది ఏదీ లేదు. అంటే, కార్యము కారణమూ రెండూ లేవు. ఇదంతా క్షుధ (ఆకలి) రూపంలో ఉన్న మృత్యుదేవత చేత (హిరణ్య గర్భునిచేత) ఆవరింపబడి ఉండేది. క్షుధయే మృత్యువు. (ఆకలి కలగటంతోనే ఆ ఆకలిని తీర్చటానికి దేనినో ఒకదానిని చంపుతాన్నరు. కాబట్టి ఆకలే మృత్యువు) అతడు (హిరణ్యగర్భుడు) తనకు మనస్సు అనేది ఒకటి కావాలని అనుకొని (మనస్సుతో కూడినవాడుగా ఉండాలని) మనస్సును సృష్టించాడు. అతడు అర్చన చేస్తూ ఆచరణ ప్రారంభించాడు. అతడు చేసిన అర్చనవల్ల పూజకు అవసరమైన, రసాత్మకుమైన జలం పుట్టింది.'పూజ చేస్తూండగా (అర్చన) నాకు ఈ జలం (క) లభించింది. కాబట్టి ఇదే 'అర్కా'నికి అర్కత్వం' అనుకున్నాడు. అంటే, అశ్వమేధంలో ఉపయోగించే విరాట్ అగ్నికి అర్కమనే పేరు ఈ విధంగా వచ్చింది. అగ్నికి 'అర్క' మనే పేరు రావటానికి ఒక విధంగా నిర్వచనం అన్నమాట. (క– అనేది జలానికి, సుఖానికి సమానార్థకం) ఈ విధంగా అర్కానికి అర్కత్వం తెలుసుకున్నవాడు నిశ్చయంగా జలాన్ని– సుఖాన్ని పొందుతాడు.

సుఖానికి హేతుభూతమైన అర్చన (పూజ) చేయటం వల్ల, జలం (క)తో సంబంధం ఉండటంవల్ల 'అర్క' ము అయినది. ఏది?– అగ్ని. అశ్వమేధంలో ఉపయోగించే అగ్నికి 'అర్క' మనే పేరు రావటానికి కారణం ఇదే. దీనిని తెలుసుకొనిన వానికి లభించే ఫలం పైన చెప్పారు.

**మం॥ ఆపోవా అర్కః, తద్యదపాం శర ఆసీత్తత్సమహన్యత. సాపృథివ్యభవత్, తస్యశ్రాన్తస్య తప్తస్య తేజో రసో నిరవర్తతాగ్నిః 2**

జలమే అర్కము (అర్కానికి జలమే కారణం గదా!) ఆ జలంలో సారభూతమైన నురుగులాంటి, నేతి ముద్దలాంటి స్థూలభాగం ఘనీభవించి, అదే పృథివిగా (భూమిగా) మారింది. అంటే జలంలో నుండి ఈ బ్రహ్మాండం ఆవిర్భవించిందన్న మాట. భూమి ఈ విధంగా ఉద్భవించేటప్పటికి ప్రజాపతి (మృత్యువు) అలసిపోయాడు. ఆ విధంగా అలసిపోయిన ప్రజాపతి యొక్క శరీరం నుండి సారభూతమైన తేజోరసం– (అగ్ని) బయలు వెడలింది. (పృథివిని సృష్టించటమనే మహత్కార్యం ప్రజాపతి అసిపోవటానికి కారణం.)

ఈ మంత్రంలో జలం నుండి విరాట్ స్వరూపమైన అగ్ని ఏ విధంగా పుట్టిందో చెప్పారు.

**మం॥ స త్రేధాత్మానం వ్యకురుత, ఆదిత్యం తృతీయం, వాయుం తృతీయం, స ఏష ప్రాణస్త్రేధా విహితః తస్య ప్రాచీ దిక్ శిరః, అసౌ చాసౌ చేర్మౌ, అథాస్య ప్రతీచీ దిక్ పుచ్ఛం అసౌ**

**చాసౌ చ నక్థ్యౌ, దక్షిణా చోదీచీ చ పార్శ్వే, ద్యౌః పృష్ఠమ్, అంతరిక్షముదరం, ఇయ మురః, స ఏషోఽప్సు ప్రతిష్ఠితః । యత్ర క్వ చైతి తదేవ ప్రతితిష్ఠ త్యేవం విద్వాన్. 3**

ఆ విధంగా విరాట్ స్వరూపం నుండి పుట్టిన హిరణ్య గర్భుని (అగ్ని) యొక్క అవయవాలను దిక్కులలో ఆరోపిస్తున్నారు.

ఆ ప్రజాపతి తనను తాను మూడుగా విభజించుకున్నాడు. అతడు అగ్ని వాయువులతోబాటు ఆదిత్యుని కూడా (సూర్యుని) గ్రహించి మూడు సంఖ్యను పూరించారు. అగ్ని, వాయువు కూడా ఇట్లాగే పూరకాలు అవుతాయి. (అగ్ని, వాయువు, ఆదిత్యుడు ఈ మూడూ కూడా మూడు సంఖ్యకు పూరకాలు అవుతాయి. అగ్ని ఆదిత్యులకు వాయువు పూరకం. వాయువు ఆదిత్యులకు అగ్ని పూరకం) ఈ విధంగా ఈ ప్రాణం (విరాట్ పురుషుడు) మూడు భాగాలుగా విభక్తుడైనాడు.

తూర్పు దిక్కు ఆ విర్పాటురుషుని ఇరస్సు. ఈశాన్య ఆగ్నేయ విదిశలు (మూలలు) ఆతని భుజాలు. పశ్చిమ దిక్కు అతని పుచ్ఛం. వాయవ్య నైఋతి విదిశలు తొడలు. దక్షిణ, ఉత్తరదిక్కులు అతని పార్శ్వాలు. ద్యులోకం అతని పృష్ఠము (వెనుక భాగం– వీపు) అంతరిక్షం ఈఅతని ఉదరం. ఈ పృథివియే (అధోభాగ సామ్యం వల్ల క్రిందగా ఉండటంవల్ల) అతని హృదయం. అగ్ని స్వరూపంలో ఉండే ఈ ప్రథమ ప్రజాపతి జాలంలో ఉంటాడు. ఈ విధంగా అగ్ని (ప్రజాపతి) జలంలో ఉన్నట్లు తెలుసుకొన్నవాడికి ఎక్కడికి వెళ్ళినా స్థిరమైన విశ్రమస్థానం లభిస్తుంది. ఇది ఆనుషంగిక ఫలము– అగ్నిజలంలో విశ్రమించటమనే గుణాన్ని ఉపాసించినందువల్ల వచ్చే ఫలం. అంతేగాని ఆ గుణాలు గల ప్రజాపతిని (అగ్ని) ఉపాసించినందువల్ల వచ్చే ఫలం కాదు. ఆ ఫలము ఇంకా గొప్పదిగా ఉంటుంది.

**మం॥ సోకామయత, ద్వితీయో మ ఆత్మా జాయేతేతి. స మనసా వాచం మిథు నం సమభవదసనాయా మృత్యుః. తద్యద్రేత ఆసీత్స సంవత్సరోఽభవత్. న హ పురా తతః సంవత్సర ఆస; తమేతావన్తం కాలమబిభః, యావాన్సంవత్సర, తమేతావతః కాలస్య పరస్తాద సృజత. తం జాతమభివ్యాదదాత, స భాణకరోత్ సైవ వాగభవత్. 4**

ఆ మృత్యువు (హిరణ్య గర్భుడు) తనకు రెండవ శరీరం కావాలని కోరుకున్నాడు– శరీరధారిని కావాలని కోరుకున్నాడు. ఆట్లా అనుకొని. ఆకలి రూపంలో ఉన్న మృత్యు ప్రజాపతి తన మనస్సులో వేదత్రయాన్ని గురించి మనస్సులో ఆలోచించాడు. అంటే విహితమైన సృష్టి క్రమాన్ని గురించి మనస్సులో ఆలోచించాడు. ఆ విధంగా ఆలోచించటం వల్ల కలిగిన వీర్యమే సంవత్సరం అయినది. అంతకు పూర్వం సంవత్సర మనేది లేదు. ఆ సంవత్సరమనే కాలాన్ని సృష్టించిన మృత్యురూపుడైన ప్రజాపతి గర్భస్థుడై ఉన్నట్టి ప్రజాపతిని సంవత్సర కాలంపాటు

గర్భంలో ధరించి ఉంచాడు. సంవత్సర కాలం పూర్తి అయిన తరువాత అతనిని (గర్భంలో ఉన్న ప్రజాపతిని) సృష్టించాడు. ఆ విధంగా మొట్టమొదటగా శరీరాన్ని ధరించిన ఆ బాలుని మ్రింగటానికి మృత్యురూపుడైన ప్రజాపతి నోరుతెరిచాడు. స్వాభావికమైన ఆవిద్య కారణంగా భయపడిన (భయానికి కారణం అజ్ఞానం) ఆ బాలుడు 'భాణ్' అనే శబ్దం చేశాడు- ఆ శబ్దమే వాక్కు అయినది.

ఈ విధంగా సంవత్సరము, వాక్కు పుట్టినాయి.

**మం॥ స ఐక్షత, యది వా ఇమమభిమంస్యే, కనీమోఽన్నం కరిష్య ఇతి, స తయా వాచా తేనాఽత్మనేదం సర్వ మసృజత యదిదం కించ- ఋచో యాజూగ్ంషి సామాని ఛందాంసి యజ్ఞాన్ ప్రజాః పశూన్ స యద్యదేవా సృజత తత్తదత్తుమధ్రియత, సర్వం వా అత్తీతి తదదితే రదితిత్వమ్, సర్వస్యై తస్యాత్తా భవతి, సర్వమస్యాన్నం భవతి, య ఏవ మేతదది తేరదితిత్వం వేద. 5**

మృత్యు ప్రజాపతి ఆ బాలుని కేకవిని ఆలోచించాడు- నేనీ బాలుని చంపితే నాకు లభించేది చాలా స్వల్పమైన ఆహారం (బీజాన్ని తింటే లభించేది స్వల్పమైన ఆహారమేగదా ! ఆ బీజం ద్వారా అధికంగా ఉత్పత్తి చేస్తే అధికమైన ఆహారం లభిస్తుంది) అని తలచి ఆ బాలుని తినలేదు. ఆ వాక్కు మనస్సు ద్వారా ఋక్కులు (ఋగ్వేద మంత్రాలు) యజుస్సులు (యజుర్వేద మంత్రాలు సామాలు (సామవేద మంత్రాలు) ఛందస్సు, యజ్ఞం, ప్రజలు, పశువులు, వీటి అన్నింటిని సృష్టించాడు. అతడు ఏఏ వస్తువుల్ని సృష్టించాడో వాటన్నింటిని తిందామనుకున్నాడు- తింటున్నాడు. అందుచేతనే అతనికి (మృత్యురూప ప్రజాపతికి) అదితి అనే పేరు వచ్చింది. ఈ విధమైన మృత్యుదేవత యొక్క తినటం అనే స్వభావాన్ని (అదితిత్వం) తెలుసుకున్నవాడు అన్నిటికి తాను భోక్త అవుతాడు, అంటే తాను అదితి అవుతాడు- ఇవన్నీ అతనికి అన్నం అవుతాయి.

(వాక్కు – మనస్సు ఈ రెంటి మిథునభావం (దాంపత్యభావం) వల్ల ఋక్కులు మొదలైనవి జడ చేతనాలు పుట్టినాయి. అన్నిటిని తినేవాడు కాబట్టి అదితి అనే పేరు వచ్చింది. స్వర్గమే అదితి, ఆకాశం అదితి, తల్లి అదితి, తండ్రి అదితి. అని ఈవిధంగా ఋగ్వేదంలో ప్రజాపతిని వర్ణించారు. సృష్టి ఏవిధంగా వృద్ధి పొందిందో ఇందులో చెప్పారు.)

**మం॥ సోఽకామయత, భూయాసా యజ్ఞేన భూయో యజే యేతి, సోఽశ్రామ్యత్, సతపోతప్యత, తస్య శ్రాన్తస్య తప్తస్య యశో వీర్యముద క్రామత్ ప్రాణావై యశో వీర్యమ్, తత్ప్రాణేషుత్క్రాన్తేషు శరీరం శ్వయితు మధ్రియత; తస్య శరీర ఏవ మన ఆసీత్. 6**

ఈ మంత్రంలోను, తరువాతి మంత్రంలోను అశ్వము, అశ్వమేధము అనే శబ్దాల వ్యుత్పత్తిని గూర్చి చెవుతున్నారు–

ఆ ప్రజాపతి మళ్ళీ తాను గొప్పదైన అశ్వమేధం లాంటి యజ్ఞాల ద్వారా యజనం చెయ్యాలని అనుకున్నాడు (మళ్ళీ చెయ్యాలి అని అనుకోవటం వల్ల, అతడు పూర్వకల్పంలో చేసిన యజ్ఞ సంస్కారంతో మళ్ళీ పుట్టటమే కారణం అని తెలుస్తోంది) ఈ మహత్తరమైన ఆలోచనతో అతడు అలసిపోయాడు. అతడు తపస్సు చేశాడు. అలసిపోయి, తపించి పోయిన అతని యొక్క (మృత్యుప్రజాపతి) శరీరం నుండి యశస్సు బలము (వీర్యము) దూరమైపోయాయి. చక్షురాది ఇంద్రియాలు, ప్రాణం, ఇవే అతని యశస్సు, బలమూను. ఇంద్రియాలే యశస్సు. ప్రాణమే వీర్యం. ఈ రెండూ దూరమైపోగానే శరీరం ఉబ్బిపోవటం ఆరంభమైంది. ఇంత జరిగినా అతని మనస్సు మాత్రం ఆ శరీరంలో ఉండనే ఉంది గదా ! (ఇంద్రియాలు, ప్రాణం అలసిపోయినా మనస్సు పని చేస్తూనే ఉంటుంది గదా ! 'అశ్వయితుం' = ఉబ్బిపోవటంలాంటి మార్పు. అధ్రియత = ఆరంభమైంది. అట్లా ఉబ్బిపోయిన శరీరం అశ్వం అయినట్లు తరువాతి మంత్రంలో చెపుతారు.)

**మం॥ సోఽ కామయత, మేధ్య మ ఇదం స్యాత్, ఆత్మన్వ్య యేన స్యామితి, తతోఽ శ్వః సమభవత్, యదశ్వత్, తన్మేధ్యమభూదితి, తదేవాశ్వ మేధస్యాశ్వ మేధత్వం. ఏష హ వాఅశ్వమేధం వేద త వేనమేవం వేద. తమ నవరుధ్యైవా మన్యత, తం సంవత్సరస్య పరస్తాదాత్మన ఆలభత. పశూన్దే వతాభ్యాః ప్రత్యౌహత్. తస్మాత్సర్వ దేవత్యం ప్రోక్షితం ప్రాజాపత్యమాలభన్తే ఏష హ వా అశ్వమేధో య ఏష తపతి, తస్య సంవత్సర ఆత్మా, అయమగ్నిరర్కః, తస్యేమే లోకా ఆత్మనః. తావేతావర్కాశ్వమేధౌ. సో పునరేకైన దేవతా భవతి మృత్యురేవ, ఆపపునర్మృత్యుం జయతి, నైనం మృత్యురాప్నోతి, మృత్యురస్యాత్మా భవతి, ఏతాసాం దేవతానామేకో భవతి. 7**

"నా యీ శరీరం యజ్ఞానికి యోగ్యమైనదిగా కావాలి. నేను ఈ శరీరంతో శరీరధారిని కావాలి. యశస్సు, బలము లేక ఈ శరీరం ఉబ్బిపోయింది. కాబట్టి నేను ఈ శరీరంతోనే (ఉబ్బిపోయిన) శరీరాన్ని ధరించాలి" అని అనుకున్నాడు. ఆ శరీరంలో ప్రవేశించి అతడు అశ్వమైనాడు. ఆ అశ్వం యజ్ఞానికి తగినదైంది. అందుచేతనే ఆ యజ్ఞానికి అశ్వమేధమనే పేరు వచ్చింది. ఈ విషయాన్ని తెలుసుకొన్నవాడే అశ్వమేధాన్ని తెలుసున్నవాడౌతాడు. తనను అశ్వంగా భావించుకొని స్వేచ్ఛగా (బంధనం లేకుండా) ఉండిపోయాడు. అట్లా ఒక సంవత్సరం ఉండి, తరువాత దానిని తనకోసమే ఆలభనం చేశాడు– అంటే బలి యిచ్చాడు. ఇతరమైన గ్రామ్యక పశువుల్ని, ఆరణ్య పశువుల్ని ఇతర దేవతల కోసం పంపాడు. అందుచేతనే ఈనాడు కూడా

యాజ్ఞికులు మంత్రాలతో పవిత్రం చేయబడిన ప్రజాపతి సంబంధమైన పశువును దేవతలందరికోసము ఆలభనం (బలి) చేస్తారు. ఈ మండుతున్న సూర్యుడు అశ్వమేధమే ! అతని శరీరమే సంవత్సరం. (సూర్యుడు కాలమే శరీరంగా కలవాడు) ఈ పార్థివమైన (భూమి మీది) అగ్నియే అర్కం. ఈ ప్రపంచాలన్నీ అతని అవయవాలు. కాబట్టి – అగ్ని, సూర్యుడు ఈ రెండూ అర్కము, అశ్వమేధము అయినాయి. ఈ రెండూకలిస్తే (అర్కము అశ్వమేధలు కలిస్తే– అగ్ని + సూర్యుడు–) ఆ మృత్యు ప్రజాపతి అవుతాయి.

ఈ పార్థివాగ్ని దేవతాత్వ స్వరూపంతో అర్కమైంది. ఈ అర్కానికి భూః, భువః, సువః అనే లోకాలు అవయవాలు. ఈ యాగానికి ఫలం ఆదిత్యుడు. అగ్ని + ఆదిత్యుడు ఈ రెంటి తాదాత్మ్యం వల్ల అయిన (ఏకీభావం వల్ల) ఒకే దేవత మృత్యువు (ప్రజాపతి) కాబట్టి "నేనే అశ్వమేధ రూపమైన మృత్యువును. అశ్వము – అగ్ని ఈ రెంటి వల్ల సిద్ధించిన మృత్యుదేవతా స్వరూపమే నాది" అని భావించి ఉపాసించేవాడు పునర్జన్మను జయిస్తాడు.

ఎందుచేతనంటే, మృత్యువు అతని ఆత్మయే అవుతుంది. అతడు ఈ దేవతలలో ఒకడౌతాడు. అశ్వమేధాన్ని ప్రజాపతిగా భావించి ఉపాసన చేస్తే కలిగే ఫలం ఇది.

## మూడవ బ్రాహ్మణం

**మం॥ ద్వయా హ ప్రజాపత్యాః దేవాశ్చాసురాశ్చ తతః కానీయసా ఏవ దేవా జ్యాయసా అసురాస్త ఏషు లోకేష్వస్పర్ధన్త తేహ దేవా ఊచుః, హన్తాసురాన్యజ్ఞ ఉద్గీథేనాత్యయామేతి. 1**

ప్రజాపతికి దేవతలు అసురులు అనే రెండు రకాలవారైన పుత్రులున్నారు. వారిలో దేవతల సంఖ్య తక్కువ (శాస్త్రజన్యమైన ప్రవృత్తి తక్కువగా ఉంటుంది.) అసురుల సంఖ్య ఎక్కువ (స్వాభావికమైన కర్మజన్య ప్రవృత్తి ఎక్కువగా ఉంటుంది.) వారి యొక్క ఆయా ప్రవృత్తుల్ని బట్టే– స్వభావాన్ని బట్టే– దేవాసుర విభాగం జరిగింది. ఈ దేవాసురు లిద్దరు ప్రజాపతి శరీరంలోనే ఉన్నారు– మంచి, చెడు రెండూ మనలో ఉన్నట్లు వారిరువురు జ్ఞానసాధ్యమైన లోకం కోసం పరస్పరం ఈర్ష్యపడుచున్నారు. అందులో దేవతలు ఉద్గీథం ద్వారా అసురుల్ని జయించాలని అనుకున్నారు. (మానవునిలోని మంచికి చెడుకి రిగే సంఘర్షణ కూడా సూచిత మౌతోంది) (జ్యోతిష్టోమం అనే యజ్ఞాలలో చదివే మంత్రాలను ఉద్గీథం అని. ఆ మంత్రాలను చదివే వానిని ఉద్గాత అని అంటారు. ఉద్గీథాన్ని ముఖ్య ప్రాణంగా భావించి ఉపాసించటం, దానివల్ల కలిగే ఫలము ఈ ప్రకరణంలోని ప్రధానాంశాలు).

**మం॥ తే హ వాచమూచుః, త్వం న ఉద్గాయేతి, తథేతి, తేభ్యో వాగుదగాయత్ యో వాచి భోగస్తం దేవేభ్య ఆగాయత్, యత్కల్యాణం వదతి తదాత్మనే తే విదురనేన వైన ఉద్గాత్రాత్యేషయన్తీతి, తమభి ద్రుత్య పాప్మనావిధ్యన్, స యః స పాప్మా యదే వేదమ ప్రతిరూపం వదతి స ఏవ స పాప్మా. 2**

ఈ విధంగా ఆలోచించుకొన్న దేవతలు, వాగభిమాన దేవతయైన వాగింద్రియంతో నీవు మా కోసం ఉద్గాత చేసే పని చేయమన్నారు. (జ్యోతిష్టోమ యాగంలో ఉద్గాత 12 మంత్రాలు చదవాలి. అది అతని పని). వాణి అందుకు సమ్మతించింది. దేవతల కోసం ఉద్గానం చేసింది. (పై మంత్రాలలో 3 మంత్రాలు యజమాని కోసం,మిగతాని తన కోసం ఉద్గాత చదువుతాడు.) ఆ ఉద్గానంలో ఉన్న భోగాన్ని దేవతల కోసం, అందులో ఉన్న కల్యాణప్రదమైన భాషణాన్ని (స్పష్టమైన, నిర్దుష్టమైన ఉచ్చారణను) తన కోసం గానం చేసింది. ఈ ఉద్గాత ద్వారా దేవతలు తమను (అసురులను) జయిస్తారని అసురులు తెలుసుకున్నారు. అందుచేత అసురులు వాణి వద్దకు పోయి ఆ వాక్కును పాపంతో కొట్టారు– వాణి పాపనిద్ధమైంది– పాపం చేత కొట్టబడ్డది. ఆ పాపం ఏమిటంటే, మనం మాట్లాడేటప్పుడు మన నోటి వెంట వచ్చే అపశబ్దాలు, అబద్ధాలు, నిషిద్ధమైన మాటలు. ఇవే ! ఈ అనరాని వాటిని ఉచ్చరించటమే పాపం. అందుచేత వాక్కులో ఉండే ఉద్గాన మహాత్మ్యం తగ్గిపోయింది.

**మం॥ అథ హ ప్రాణమూచుః, త్వం న ఉద్గాయేతి, తథేతి తేభ్యః ప్రాణ ఉద్గాయత్ యః ప్రాణే భోగస్తం దేవేభ్య ఆగాయత్,యత్ కల్యాణం జిఘ్రతి తదా త్మనే, తే విదురనేన వై న ఉద్గాత్రాఽత్యేష్య న్తీతి, తమభిద్రుత్య పాప్మనావిధ్యన్, స యః స పాప్మా, యదేవేదమ ప్రతిరూపం జిఘ్రతి స ఏవ స పాప్మా. 3**

తరువాత దేవతలు ఘ్రాణేంద్రియంతో (ముక్కుతో)– "నీవు మా కోసం ఉద్గానం చేయాలి" అని అన్నారు. ఘ్రాణేంద్రియం అంగీకరించింది. దేవతల కోసం ఉద్గానం చేసింది. ఆ గానంలో వెలువడిన సామాన్య భోగాన్ని దేవతల కోసము, చక్కటి ఘ్రాణశక్తిని తనకోసం ఉపయోగించుకుంది. అసురులకి విషయం తెలిసింది. ఈ ఉద్గాత ద్వారా దేవతలు తమ్ము జయిస్తారని తెలుసుకొని, పాపంతో దానిని విద్ధం చేశారు– కొట్టారు. ఆ ఘ్రాణేంద్రిం పాపవిద్ధమైంది. అంటే ఆ ఘ్రాణానికి అనర్హమైన వాటిని ఆఘ్రాణించటమే ఆ పాపం !

**మం॥ అథ హ చక్షురూచుః, త్వం న ఉద్గాయేతి; తథేతి, తేభ్యశ్చ క్షురుదగాయత్, యక్షక్షుషి భోగస్తం దేవేభ్య ఆగాయత్, యత్కల్యాణం పశ్యతి తదాత్మానేతే విదురనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి, తమ భిద్రుత్య పాప్మనా విధ్యన్, స యః స పాప్మా, యదే వేదమ ప్రతిరూపం పశ్యతి స ఏవ స పాప్మా. 4**

తరువాత దేవతలు చక్షురింద్రియంతో నీవు మా కోసం ఉద్గానం చెయ్యవలసింది అన్నారు. చక్షురింద్రియం అంగీకరించి ఉద్గానం చేసింది. అంటే, చతురింద్రియంలో ఉన్న సమిష్టి భోగాన్ని దేవతల కిచ్చి, మంచి దృశ్యశక్తిని తనకోసం ఉంచుకుంది ! ఈ ఉద్గాత ద్వారా దేవతలు తమను జయిస్తారని తెలుసుకోవటంతోనే ఆసురులు చక్షురింద్రియం వద్దకు వెళ్ళి దానిని పాపవిద్ధం చేశారు. ఆ పాపం ఏమిటి ?– నిషిద్ధమైన రూపాలు చూడటమే ఆ పాపం !

**మం॥ అథ శ్రోత్రమూచుః, త్వం న ఉద్గాయేతి; తథేతి, తేభ్యః శ్రోత్రముద్గాయత్, యః శ్రోత్రే భోగస్తం దేవేభ్య ఆగాయత్. యత్కల్యాణం శృణోతి తదా త్మనే, తే విదురనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి, తమభిద్రుత్య పాప్మనా విధ్యన్, స యః స పాప్మా, యదేవేదమ ప్రతిరూపం శ్రుణోతి స ఏవ స పాప్మా. 5**

పిమ్మట దేవతలు శ్రోత్రేంద్రియంతో 'నీవు మా కోసం ఉద్గానం చెయ్యవలసిందని' అడిగారు. శ్రోత్రేంద్రియం 'తథాస్తు' అని, దేవతల కోసం ఉద్గావం చేసింది. శ్రోత్రంలో ఉన్న భోగాన్ని దేవతలకు ఇచ్చి, శుభశ్రవణాన్ని తన కోసం ఉంచుకుంది. ఈ ఉద్గాత ద్వారా దేవతలు మనల్ని జయిస్తారని తలచి అసురులు ఆ శ్రోత్రేంద్రియాన్ని పాపంతో కొట్టారు. నిషిద్ధమైన శబ్దాలను, వినరాని వాటిని వినటమే ఆ పాపం.

**మం॥ అథ హ మన ఊచు:, త్వం న ఉద్గాయేతి, తథేతి, తేభ్యోమన ఉదగాయత్, యో మనసి భోగస్తం దేవేభ్య ఆగాయత్, యత్కల్యాణం సంకల్పయతి తదాత్మనే. తే విదురనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి, తమభిద్రుత్య పాప్మనా విధ్యన్; స యః స పాప్మా, యదేవేదమ ప్రతిరూపం సంకల్పయతి స ఏవ స పాప్మా. ఏవం ఖల్వేతా దేవతా ః పాప్మభిరుపాసృజన్, ఏవమేనాః పాప్మనా విధ్యన్ 6**

తరువాత దేవతలు మనస్సుతో 'నీవు మా కోసం ఉద్గానం చేయవలసింది' అని అడిగారు. మనస్సు సరే అని అంగీకరించి ఉద్గానం చేసింది. ఆ ఉద్గానంతో మనసు, తనలోని భోగాన్ని దేవతల కోసం (యజమాని కోసం) ప్రకటించింది– (వారికి చెందాలని). శుభ సంకల్పాన్ని తన కోసం ఉపయోగించుకొన్నది– (ఉద్గాత కోసం ఉపయోగించుకొన్నది.) తమను దేవతలు ఈ ఉద్గాత ద్వారా జయిస్తారని తెలుసుకున్న అసురులు ఆ మనస్సును పాపంతో కొట్టారు. నిషిద్ధమైనట్టి, పాపపు ఆలోచనలు (సంకల్పాలు) చేయటమే ఆ పాపం. ఈ విధంగానే ఇతర దేవతలందరికి (చర్మం మొదలైన ఇంద్రియాలన్నింటికి) పాపం సంక్రమించింది. (ఉద్గానంలో మూడు మంత్రాలు యజమాని కోసమని, మిగతావి తన కోసమని చెప్పిన విషయం గుర్తుంచుకోవాలి. ఆ మూడు మంత్రాలను పవమానమంటారు– మిగతావి తొమ్మిది మంత్రాలు ఉద్గాతగామియైన మంత్రాలు, మొత్తం 12 మంత్రాలు).

**మం॥ అథ హేమమాసన్యం ప్రాణమూచుః, త్వం న ఉద్గాయేతి; తథేతి, తేభ్య ఏష ప్రాణ ఉద్గాయత్. తే విదురనేన వై న ఉద్గాత్రాత్యేష్యన్తీతి, తమభిద్రుత్య పాప్మనావిధ్యన్, స యథాశ్మానమృత్వా లోష్టో విధ్వంసేత, ఏవం హైవ విధ్వంసమానా విష్వంచో వినేశుః, తతో దేవా అభవన్, పరాఽసురాః భవ త్యాత్మనా, పరాస్య ద్విషన్భ్రాతృవ్యో భవతి య ఏవం వేద 7**

ముఖ్యప్రాణం మిగతా ఇంద్రియాలవలే పాపవిద్ధం కాకపోవటం, ఆ ముఖ్య ప్రాణాన్ని ఉపాసించటంవల్ల వచ్చే ఫలం చెపుతున్నారు–

పిమ్మట దేవతలు నోటిలో ఉండే ప్రాణంతో 'నీవు మా కోసం ఉద్గానం చేయవలసింది' అని అన్నారు. ప్రాణం అందుకు అంగకీరించి, తనను శరణువేడిన దేవతల కోసం ఉద్గానం చేసింది. దేవతలు ఈ ఉద్గాత ద్వారా తమను జయిస్తారని తలచిన అసురులు ముఖ్యప్రాణం వద్దకు పోయి దానిని పాపంతో కొట్టాలని యత్నించారు. కాని, రాతిని ఢీకొని చూర్ణమైపోయే మంటిబెడ్డలాగా అసురులు కూడా ప్రాణాన్ని ఢీకొని అనే విధాలుగా విధ్వస్తమైనారు. అప్పటి నుండి దేవతలు స్వస్థులైవారు. వారికి ఊరట చిక్కింది. అసురులకు పరాభవం జరిగింది. ఈ విషయమంతా తెలుసుకున్నవాడు తాను ప్రజాపతిరూపం పొందుతాడు. అతనిని ద్వేషించే జ్ఞాతులంతా పరాభవాన్ని పొందుతారు (దేవాసురులు జ్ఞాతులే గదా!) ఓడిపోతారు.

**మం॥ తే హోచుః, క్వ ను సోఽభూద్యో న ఇత్థమసక్తేతి, అయమాస్యేఽన్తరితి, సోఽయమాన్య అంగిరసః, అంగానాం హి రసః. 8**

ముఖ్య ప్రాణానికి అంగిరసత్వం లభించిన విధం ఈ మంత్రాల్లో చెప్పబడుతోంది.

దేవతలు (ప్రజాపతి యొక్క ఇంద్రియాలు) తమలో తాము ఆలోచించటం మొదలు పెట్టారు– 'ఈ విధంగా మనకు దేవత్వాన్ని ప్రసాదించిన ముఖ్య ప్రాణం ఎక్కడ' ఉంది? అది నోటిలో ఉన్నది. (నోరు = అస్యము) అందుచేతనే అది ఆయాస్యము (ఎవరి ఆశ్రయము కోరనిది) అయినది. అట్లాగే ఆ ముఖ్య ప్రాణం అంగిరసము అయింది. ఎందుచేత ? – ఈ ముఖ్య ప్రాణమే సమస్త భూతాలకు, ఇంద్రియాలకు, అవయవాలకు సారభూతమైన 'రసం' కాబట్టి అంగి + రసము.

దోషాస్పదాలైన ఇతర అవయవాలకు– ఆత్మత్వం సిద్ధించలేదు. ముఖ్యప్రాణం పాపరహితమైనది కాబట్టి ఆత్మత్వ సిద్ధి పొందినది. కాబట్టి మిగతా ఇంద్రియాలన్నీ ఈ ముఖ్యప్రాణాన్ని ఆత్మరూపంలో ఆశ్రయించాలని తేలుతున్నది. ఆ ముఖ్యప్రాణం ఎక్కడ ఉన్నది?

ఆస్యంలో = నోటిలోని ఆకాశంలో ! అది ఆశ్రయం లేనిది (ఆకాశానికి ఆశ్రయం లేదు) కాబట్టి అయాస్యము అయినది. అట్లాగే అంగి= శరీరావయవాలకు, రసం= సారభూతమైనది కాబట్టి 'అంగి రసము' అయినది.

**మం॥ సా వా ఏషా దేవతా దూర్నామ, దూరం హ్యస్యా మృత్యుః, దూరం హ వా అస్మాన్మృత్యుర్భవతి; య ఏవం వేద. 9**

ఈ ముఖ్యప్రాణమనే దేవతకు 'దూర్' అనే పేరు ఉంది. ఎందుచేతనంటే – ఈప్రాణదేవతతకు మృత్యువు ఎప్పుడూ దూరంగానే ఉంటుంది. మృత్యువు ప్రాణం మీద అసక్తితో ఉన్నా, ఎప్పుడూ దానికి దూరంగానే ఉంటుంది. పవిత్రమైన ప్రాణానికి మృత్యువు ఎప్పుడూ దూరంగానే ఉంటుంది. (ప్రాణం లేచిపోయిన చోటుకు గాని మృత్యువు రాదు. మృత్యువు ప్రాణాల్ని తీసినట్లు కనిపించటం మన భ్రమ. ఇక్కడ మృత్యువంటే మృత్యు ప్రజాపతి కాదు. పాపమనే మృత్యువు. స్వభావసిద్ధమైన అజ్ఞానం వల్ల ప్రేరితులై విషయవాసనల మీద ఉండే మహకారాన్నే పాపంగా గ్రహించాలి.) ఈ సత్యాన్ని గ్రహించినవానికి కూడా మృత్యువు దూరంగానే ఉంటుంది– ఇది ఫల శ్రుతి.

**మం॥ సా నా ఏషా దేవతై తాసాం దేవతానాం సాప్నానం మృత్యుమపహత్యత్రా సాం దిశామన్తస్థమయాం చకార, తదాసాం పాప్మనో విన్యదధాత్, తస్మాన్న జనమియాత్, నాన్తమియాత్, నేత్పాప్మానం మృత్యు మన్వవాయానీతి. 10**

ఈ ప్రాణదేవత, ఈ వాగాది దేవతల యొక్క పారూపమైన మృత్యువును (స్వబావసిద్ధమైన అజ్ఞానం వల్ల ప్రేరేపింపబడగా విషయ వాసనల వల్ల కలిగిన మమకారమే పాపం) తొలగించి దిగంతాలకు తీసికొని పోయింది. అక్కడ ఈ ముఖ్యప్రాణం, ఇంద్రియాల యొక్క పాపాన్ని తిరస్కారపూర్వకంగా అక్కడ (దిగంతాల వద్ద– జనులు నివసించనిచోట) ఉంచింది– ప్రజలకు పాపరూపమైన మృత్యు సంసర్గ భయం లేకుండా ఉండేందుకు జనం లేనిచోట దానిని పారేసింది. అందుచేతనే పాపరూపంలో ఉండే మృత్యువు తన్ను చేరకుండా ఉండాలంటే, ఇతరుల సంసర్గానికి పోకూడదు– అట్లాగే సీమోల్లంఘనం చేయరాదు– హద్దు మీరరాదు. శ్రౌత విజ్ఞాన సంపన్నులైనవారు దిక్కుల అంతానికి ఈవలే ఉంటారు. వేద విరుద్ధమైన పనులు చేసే వారంతా సీమోల్లంఘనం చేసే పాపులు అన్నమాట. వీరు ఉండేది దిగంతానికి ఆవల. (కాబట్టి వారి సంసర్గం లేకుండా ఉండాలంటే మనం ఆ హద్దుకు ఈవలే ఉండాలి.)'

**మం॥ సానా ఏషా దేవతైతాసాం దేవతానాం సాప్నానం మృత్యుమపహత్యాథైనా మృత్యు మత్య వహత్ 11**

ఈ ప్రాణదేవత ద్వారా వాగాది ఇంద్రియాలకు అగ్ని మొదలుగా గల దేవభావం సంక్రమించటాన్ని చెపుతున్నారు.

ఈ ప్రాణదేవత వాక్కు మొదలుగా గల ఇంద్రియాలకు సంక్రమించిన పాపరూపమైనట్టి మృత్యువును పోగొట్టి, మళ్ళీ వాటికి అధి దైవికమైన అగ్ని మొదలుగా గల దేవత్వ భావాన్ని కలుగజేసింది. మృత్యువుకు దూరంగా తీసుకొని పోయింది. అంటే, ప్రాణం ఆయా ఇంద్రియాలను ఆధ్యాత్మిక (శరీర సంబంధమైన) పరిచ్ఛేద రూపమైన మృత్యువు నుండి తరింపచేసింది. ఇంద్రియాల యొక్క అధిదైవిక రూపాలు ఏవో తరువాత చెపుతున్నారు–

**మం॥ స వై వాచమేవ ప్రథమామత్యవహత్, సా యదా మత్యముచ్యత సోఽగ్ని రభవత్, సోఽయ మగ్నిః పరేణ మృత్యుమతి క్రాన్తో దీప్యతే. 12**

**అథ ప్రాణ మత్యవహత్, స యదా మృత్యుమత్య ముచ్యత, స వాయుర భవత్, సోఽయం వాయుః పరేణ మృత్యుమతిక్రాన్తః పవతే. 13**

**అథ చక్షురత్యవహత్, తద్యదా మృత్యుమత్య ముచ్యత, స ఆదిత్యోఽభవన్, సోఽసావాదిత్యః పరేణ మృత్యుమతి క్రాన్త స్తపతి. 14**

**అథ శ్రోత్రమత్యవహత్, తద్యదా మృత్యు మత్య ముచ్చత, తా దిశోఽభవన్, తా ఇమా దిశః పరేణ మృత్యుమతిక్రాన్తా ః 15**

**మం॥ అథ మనోఽత్యవహత్, తద్యదా మృత్యుమత్య ముచ్యత, స చంద్రమా అభవత్, సోఽసౌచంద్రః పరేణ మృత్యుమతిక్రాన్తో భాతి, ఏవం హ వా ఏన మేషా దేవతా మృత్యుమతివహతి య ఏవం వేద. 16**

ఆ ప్రాణదేవత, వాగ్దేవత చేత ఆధ్యాత్మిక పరిచ్ఛేదరూపమైన (శరీరపు హద్దులకు లోబడి ఉన్న) మృత్యువును దాటింప చేసింది. వాక్కు మృత్యువును తరించగానే– దానితో సంబంధం పోగానే– అది అగ్ని అయినది. ఆ అగ్ని, పరిచ్ఛిన్నమైన (హద్దులకు లోబడి ఉన్న) మృత్యువునకు అతీతంగా– మృత్యువును తరించి– దేదీప్యమనాంగా వెలుగొందింది.

అట్లాగే ప్రాణం. ఘ్రాణేంద్రియాన్ని కూడా మృత్యువు నుండి ఆవలకు చేర్చింది. మృత్యువు నుండి దాటిపోవటంతోనే ఘ్రాణేంద్రియం వాయువు అయినది. అందుకనే అతిక్రాంతమై (అందకుండా పోయినదై) వాయువును వీస్తోంది.

తరువాత ప్రాణం, చక్షురింద్రియాన్ని మృత్యుపు నుండి తప్పించింది. మృత్యువు నుండి తప్పించుకోగానే ఆ చక్షురింద్రియం ఆదిత్య రూపాన్ని పొందింది. ఈ విధంగా మృత్యువు నుండి తప్పించుకొన్న ఆదిత్యుడు దానికి అందకుండా తపిస్తున్నాడు (మండుతున్నాడు).

పిమ్మట ప్రాణం, శ్రోత్రేంద్రియాన్ని మృత్యువు నుండి తప్పించింది. ఆ విధంగా మృత్యువు నుండి తప్పింపబడ్డ శ్రోత్రం (చెవి) దిక్కులైనది. అందుచేతనే మృత్యువు నుండి తప్పించుకున్న దిక్కులు మృత్యువుకు అందటం లేదు.

(ఆయా ఇంద్రియాలను వదలగానే మృత్యువుతో సంబంధం వదలిపోయింది. దేహంతో ఆ యింద్రియాలకు గల సంబంధం (ఆధ్యాత్మిక సంబంధం) అధిదైవిక సంబంధంగా మారింది. వాక్కు, ఘ్రాణం, చక్షుస్సు, శ్రోత్రం, మనస్సు, వీటికి అధిదైవిక రూపాలు క్రమంగా అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిక్కులు, చంద్రుడు అని తెలుస్తోంది.)

**మం॥ అథమనోఽ త్యవహత్, తద్యదా మృత్యుమత్య ముచ్యత స చంద్రమా అభవత్, సోఽ సౌచంద్రః పరేణ మృత్యుమతిక్రాన్తో భాతి, ఏవం హ వా ఏన మేషా దేవతా మృత్యుమతివహతి య ఏవం వేద. 16**

**అథాత్మనేఽ న్నాద్య మాగాయత్ యద్ధి కించాన్న మద్యతేఽ నేనైన తదద్యతే, ఇహ ప్రతితిష్ఠతి. 17**

తరువాత ప్రాణం, మనస్సును మృత్యువు నుండి తప్పించింది. మృత్యువు నుండి దూరం కాగానే ఈ మనస్సు చంద్రునిలాగా ప్రకాశించింది. అందుచేత, ఈ విధంగా మృత్యువుచేత తప్పింపబడ్డ మనస్సు చంద్రుని రూపంలో ఇట్లా ప్రకాశిస్తోంది. ఈ విషయాన్ని ఈ విధంగా గ్రహించి తన్ను గూర్చి (ప్రాణాన్ని గూర్చి) ఉపాసన చేసే వానిని (తానే ప్రాణంగా భావించుకొని ఉపాసన చేసే వానిని) ప్రాణదేవత మృత్యువు నుండి తరింపచేస్తుంది. ఇది ఉపాసనా ఫలం.

తరువాత ఆ ప్రాణం తనకు ఆహారం కావటానికి తగిన భక్ష్యాన్ని గూర్చి ఆగానం చేసింది– ఆహారాన్ని పొగడుతూ గానం చేసింది. ఎందుచేతనంటే, ఏ ఆహారం తినాలన్నా ప్రాణం ద్వారానే తినాలి– (ప్రాణం లేకపోతే తినలేముగదా! అందుచేత అన్నంలోనే ప్రాణం ప్రతిష్ఠితమై ఉంది. అంటే ప్రాణానికి అన్నం వాసస్థానం అన్నమాట.

**మం॥ తే దేవా అబ్రువన్, ఏతావద్వా ఇదం సర్వం యదన్నం, తదాత్మన ఆగాసీః అనునోఽ స్మిన్నన్న ఆ భజస్వేతి, తే వై మాఽ భిసంవిశతేతి, తథేతి, తం సమన్తం పరిణ్యవిశ న్తన్తంతస్మాద్యదనేనాన్నమత్తితేనైతా స్తృప్యన్తి, ఏవం హ వా ఏనం స్వా అభిసంవిశన్తి, భర్తా స్వానాం శ్రేష్ఠః పుర ఏతా భవత్యన్నా దోధిపతిర్య ఏవం వేద, య ఉ హైవం విదం స్వేషు ప్రతి ప్రతిర్బుభూషతి న హైవాలం భార్యేభ్యో భవతి, అథ య ఏ వైతమను భవతి యో వైతమను భార్యాన్బుభూర్షతి, సహైవాలం భార్యేభ్యో భవతి 18**

అప్పుడు, వాక్కు మొదలైన దేవతలు ప్రాణంతో ఇట్లా అన్నారు. "ఉన్న అన్నమంతా ఇదే! దీనిని నీవు నీ కోసం ఆగానం చేసి ఉంచుకున్నావు. మమ్మల్ని కూడా ఈ అన్నానికి భాగస్వాముల్నిగా చెయ్యి !" అని. ఇది విని ప్రాణం అన్నిది – "మీరంతా అన్ని వైపుల నుండి నాలో ప్రవేశించండి" అని. "తథాస్తు' అంటూ వాగాది ఇంద్రియాలన్నీ ప్రాణంలో ప్రవేశించాయి. అందుచేతనే ప్రాణం ద్వారా జీవులు అన్నం తినేటప్పుడు వాగాది ఇంద్రియాలన్నీ తృప్తిని పొందుతున్నాయి. ఈ విధంగానే చుట్టాలంతా చుట్టూ చేరి ఉన్నవాడు, స్వజనులకు భర్త (భరించే వాడు), వారందరిలోను శ్రేష్ఠుడు, వారందరికి మార్గదర్శకుడైన నాయకుడు అవుతాడు. ఈ విధంగ అన్నం భక్షించేవాడు (స్వజనుల్ని పోషిస్తూ) అందరికి అధిపతి, అవుతాడు. స్వజనుల్లో ఎవరైనా, ఈ విధమైనట్టి ఉపాసకుని యెడల విముఖుడైతే అతడు ఆశ్రితుల్ని పోషించేందుకు సమర్థుడు కాడు. వీరికి అనుకూలుడై శరణాగతుల్ని పోషించేవాడు. నిశ్చయంగా అట్లా పోషించటానికి సమర్థుడౌ తాడు. (ప్రాణం చేత పోషింపబడ్డ వాగాది ఇంద్రియాలు తమకు అధీనంలో ఉన్న అవయవాలను పోషిస్తున్నట్లుగా, ఒక నాయకుని చేత పోషింపబడే వాడు తన అధీనంలోని వారిని కూడా అట్లా పోషించాలని భావం.)

**మం॥ సో యాస్య ఆంగిరసః, అంగానాంహి రసః, ప్రాణోవా అంగానాంరసః, ప్రాణో సోహి వా అంగానాంరసః, తస్మా ద్యస్మాత్క స్మాచ్ఛాంగాత్ప్రాణ ఉత్క్రామతి తదేవ తచ్ఛుష్యతి, ఏష హి వా అంగానాం రసః 19**

ఈ ప్రాణం 'అయాస్య' 'అంగిరసం' అయినది. అది (ప్రాణం) అవయవాలన్నింటికి (అంగాలకు) రసం (సారం) కాబట్టి ఆ పేరు– అంగిరసమనే పేరు రూఢమైనది. అట్లాగే, దేని ఆధారమూ లేకుండా నోటిలో (ఆకాశంలో) ఉన్నందున 'అయాస్యము' అయినది. ఇది నిజంగా అంగాలన్నింటికి సారమే ! కారణమేమంటే, ఏ అవయవం నుండి అయినా ప్రాణం తొలగిపోయిందంటే ఆ అవయవం శుష్కించి (ఎండిపోయి) శక్తిహీనం అవు తుంది. (ఈ విషయం పక్షవాతాది రోగాల్లోను, చెట్ల కొమ్మలు కొన్ని ఎండిపోవటంలోను చూస్తూనే ఉన్నాము. కాబట్టి ప్రాణమనేది అన్ని' అవయవాలలోను వ్యాప్తమై ఉన్నదని గ్రహించాలి.)

**మం॥ ఏష ఉ ఏవ బృహస్పతిః, వాగ్వై బృహతీ, తస్యా ఏష పతిః, తస్మాదు బృహస్పతిః. 20**

**ఏష ఉ ఏవ బ్రహ్మణస్పతిః, వాగ్వై బ్రహ్మ, తస్యా ఏషపతిః, తస్మాదు బ్రహ్మణ స్పతి : 21**

ఈ ప్రాణమే బృహస్పతి. ఎందుచేతనంటే– వాక్కే బృహతి– బృహతిలోనే అన్ని ఋక్కులు– మంత్రాలు– ఉన్నాయి. ఆ వాక్కుకు ప్రాణం పతి. కాబట్టి ప్రాణం బృహస్పతి అయినది. (బృహత

వాక్కును ఇస్తుంది. ఋక్కులన్నీ ఉదరంలో ఉన్న అగ్ని చేత రగుల్కొల్పబడి వాయువు చేతనే వల్లింపబడుతున్నాయి. కాబట్టి ఈ విధంగా కూడా ప్రాణమనేది వాక్కుకు పతి అవుతోంది.)

ఈ ప్రాణమే బ్రహ్మణస్పతి కూడాను. ఎందుచేతనంటే, ప్రాణమే యజుస్సులకు పతి. వాక్కే బ్రహ్మ. లేక యజుస్సు. ఆ యజుస్సుకు (బ్రహ్మకు) పతి కాబట్టి బ్రహ్మణస్పతి అయినది. (వెనుకటి మంత్రంలో వాక్కే ఋక్కు అన్నారు. ఈ మంత్రంలో వాక్కే యజుస్సు అన్నారు. రాబోయే మంత్రంలో వాక్కే సామం అన్నారు. కాబట్టి వాక్కుకు ఋక్, యజుస్, సామాలతో సామ్యం చెప్పబడ్డది.)

**మం॥ ఏష ఉ ఏవ సామః, వాగ్వైసా, అమైషః, సా చామ శ్చేతి తత్సామ్నః సామత్వం, యద్వేవ సమః ప్లుషిణా, సమోమశకేన, సమో నాగేన, సమ ఏభిస్త్రిభిర్లోకైః సమో నేన సర్వేణ, తస్మాద్వేవ సామ, అశ్నుతే సామ్నః సాయుజ్యం సలోకతాం య ఏవమేతత్సామ వేద. 22**

ఈ ప్రాణమే సామము. అందులోని 'సా' అనే అక్షరం వాక్కు 'అమ' అనే అక్షరం ప్రాణం. ఈ రెండూ కలసి సామం అయినది. 'సా' అనేది స్త్రీ వాచకము (సర్వనామ సంజ్ఞక శబ్దం). 'అమ' అనేది అన్ని జీవారసుల్లోను పురుష వాచనాకిని చిహ్నం. పురుష వాచకాలన్నీ ప్రాణం వల్ల, స్త్రీ వాచకాలన్నీ వాక్కు వల్ల సిద్ధిస్తాయని శ్రుతి. (కౌషీతక్యుపనిషత్తు) ఈ చెదపురుగు, ఈ దోమ, ఈ ఏనుగు, త్రిలోకాలు, ఈ విశ్వం అన్నీ సామమే ! – ప్రాణమే ! ఇక్కడ అత్యంత అల్పజీవి నుండి త్రిలోకాలు (ప్రజాపతి) విశ్వం (హిరణ్యగర్భుడు) పర్యంతం అంతా ఈ సామమే ! ఈ సామాన్ని ఈ విధంగా తెలుసుకున్నవాడు, సామంతో సాయుజ్యం పొంది సాంఖ్యాన్ని కూడా పొందుతాడు. ప్రాణంతోబాటు అవి ఉండే అన్ని లోకాల్లోను నివసిస్తాడు.

**మం॥ ఏష ఉ వా ఉద్గీథః, ప్రాణో వా ఉత్, ప్రాణేన హీదం సర్వము త్తబ్ధమ్, వాగేన గీథా, ఉచ్చ గీథా చేతి స ఉద్గీథః 23**

(ఉద్గీథ మనేది సామంలో ఒక భాగం– సామ అవయవ రూపమైన భక్తి విశేషం. ఇది ఒక స్వరమే తప్ప, దీనిని లోగడ చెప్పిన ఉద్గావమని భ్రమపడరాదు.) ప్రాణమే ఉద్గీథం. ప్రాణం వల్లనే ఈ జగత్తు అంతా పైకి నిలబడ్డది– ఈ శబ్దంలో ప్రాణమై ఉన్న 'ఉత్' ఈ అర్థాన్నే సూచిస్తుంది. 'గీథా' అంటే వాక్కు, ఈ రెండూ కలిసి ఉద్గీథమైనది. దేనిచేత పాడబడుతుందో అటువంటి స్వరం ఉద్గీథమని అన్నారు. అంటే వాక్కు అన్న మాటే ! ఉద్గీథ భక్తి అనే శబ్దం ఉంది కాబట్టి భక్తితో కూడిన సామాన్ని కూడా ఉద్గీథ మనవచ్చు.

**మం॥ తద్ధాసి బ్రహ్మదత్తశ్చైకితానేయో రాజానం భక్షయ న్నువాచ, అయం త్వస్య రాజా మూర్ధానం విపాత యతాత్, లే యదితో యాస్య ఆంగిరసో న్యేనోద గాయ దితి, వాచా చ హ్యేవ స ప్రాణేన చోదగాయ దితి. 24**

ఈ విషయమైన ఒక అఖ్యాయిక చెప్పబడ్డది–

చికితామని పుత్రుడు బ్రహ్మదత్తుడు సోమపానం చేస్తూ ఈ విధంగా అన్నాడు– 'అయాస్య, అంగిరస అనే పేర్లు గల ప్రాణం– వాక్కుతో కూడిన ప్రాణం, ద్వారా ఉద్గానం చేసి ఉండకపోతే (మరియొక విధంగా ఉద్గానం జరిగి ఉంటే) నా తలను ఈ సోమదేవత పడగొట్టు గాక!' అని (తాను చెప్పినది, ఏమని ? అయాస్య అంగిరసుడే ఉద్గానం చేశాడని. ఈ విషయం అబద్ధమైతే తన తల పడిపోవు గాక అని శపథం) అయాస్య అంగిరసుడు పూర్వం ఋషులు చేసిన విశ్వసృజయాగంలో ఉద్గాతగా ఉన్నాడు. ఈ శపథం వల్ల ప్రాణం + వాక్కు ద్వారానే ఉద్గానం జరిగిందని తెలుస్తోంది.)

**మం॥ తస్య హైతస్య సామ్నో యః స్వం వేద భవతి హాస్య స్వమ్; తస్య వై స్వర ఏవ స్వమ్, తస్మాదార్త్విజ్యం కరిష్యాన్వాచి స్వరమిచ్ఛేత, తయా వాచా స్వరసంపన్నయార్త్విజ్యం కుర్యాత్, తస్మాద్యజ్ఞే స్వరవన్తం దిదృక్షన్త ఏవ, అథో యస్య స్వం భవతి, భవతి హాస్య స్వం య ఏవమేతత్సామ్నః స్వం వేద. 25**

ఈ సామశబ్దవాచ్యమైన ముఖ్య ప్రాణం యొక్క సంపదను (ధనాన్ని) తెలుసుకున్నవాడు నిజంగానే ధనసంపన్నుడౌతాడు– ఉద్గాత యొక్క కంఠ స్వరంలో ఉండే మాధుర్యమే అతని నిజమై ధనం. అందుచేతనే ఋత్విక్కు అయినవాడు కంఠస్వరంలో మాధుర్యాన్ని తెచ్చేందుకు ప్రయత్నించాలి. అటువంటి సుమధురమైన కంఠ స్వరంతోనే ఋత్వి సుమధురమైన కంఠ స్వరంతోనే ఋత్విక్కార్యం నిర్వహించాలి. (దంతధావనం. తైలపానాదులవల్ల సర్వ మాధుర్యాన్ని పెంపొందించుకోవాలి) అందుచేతనే, యజమాని యజ్ఞంలో శ్రేష్ఠమైన, మధురమైన స్వరం కలిగిన ఋత్విక్కులను చూచుకోవాలి. ఎందుచేత ? – లోకంలో ధనసంపన్నుని వైపు అంతా చూచినట్లే యజ్ఞం చూడటానికి వచ్చిన లౌకిక పురుషులంతా మధురస్వర సంపన్నుడైన ఉద్గాతవైపు చూస్తారు– ఈ విధంగా సామం యొక్క ధనాన్ని గూర్చి తెలుసుకున్నవాడు సర్వమాధుర్య రూపమైన ధనంతో కూడినవాడౌతాడు.

**మం॥ తస్య హైతస్య సామ్నో యః సువర్ణం వేద, భవతి హాస్య సువర్ణం, తస్య వై స్వర ఏవ సువర్ణం, భవతి హాస్య సువర్ణం య ఏవమేతత్సామ్నః సువరణం వేద. 26**

ఈ సామానికి బంగారం వంటిదైన దాన్ని ఎవరు తెలుసుకుంటారో వారు బంగారాన్ని పొందుతారు. సామానికి సువర్ణం ఏది? సామానికి చక్కటి స్వరమే బంగారం. ఈ విషయం తెలుసుకున్నవాడు లౌకికమైన బంగారాన్ని లేదా బంగారం వంటి కంఠస్వరాన్ని పొందుతాడు.

**మం॥ తస్య హైతస్య సామ్నో యః ప్రతిష్ఠాం వేద ప్రతి హ తిష్ఠతి, తస్య వై వాగేవ ప్రతిష్ఠా, వాచి హి ఖల్వేష ఏతత్ప్రాణః ప్రతి తిష్ఠతో గీయతే; అన్న ఇత్యు హైక ఆహుః. 27**

ఎవడు ఈ సామానికి ఆధారభూతమైన దానిని (ప్రతిష్ఠను) తెలుసుకుంటాడో, వాడు ఆధారాన్నిఇ పొందుతాడు. ఈ సామానికి వాక్కే ప్రతిష్ఠ (ఆధారం.) వాక్కుల ప్రతిష్ఠితమైనప్పుడే ఈ ప్రాణం పాడబడుతోంది. అంటే గీతిభావాన్ని పొందుతోంది. కొంత మంది ఏమంటారంటే– "ప్రాణము అన్నంలో ప్రతిష్ఠింపబడి (ఆధారాన్ని పొంది) పాడబడుతోంది" అని. అందుచేత ప్రాణానికి వాక్కుగాని, అన్నంగాని ప్రతిష్ఠ (ఆధారం) అని గ్రహించాలి.

**మం॥ అథాతః పవమానానా మేవాభ్యారోహః, స వై ఖలు ప్రస్తోతా సామప్రస్తౌతి; స యత్ర ప్రస్తుయా త్తదే తాని జపేత్– అసతో మా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మామృతం గమయేతి స యదాహాసతో మాసదగ్గమయేతి, మృత్యుర్వా అసత్, సదమృతమ్, మృత్యోర్మామృతం గమయ, అమృతం మాకుర్విత్యేవైతదాహ; తమసోమా జ్యోతిర్గమయేతి, మృత్యుర్వై తమః, జ్యోతిరమృతం, మృత్యోర్మా మృతం గమయ, అమృతం మా కుర్విత్యేవైతదాహ, మృత్యోర్మామృతం గమయేతి నాత్ర తిరోహిత మివాస్తి, అథ యానీతరాణి స్తోత్రాణి తేష్వాత్మనే న్నాద్యమాగాయేత్, తస్మాదు తేషు వరం వృణీత యం కామం కామయేత తం, స ఏష ఏవం విదుద్గా తాత్మనే వా యజమానాయ వా యం కామం కామ యతే తమాగాయతి, తద్ధైతల్లోకజిదేవ, న హైవాలోక్య తాయా ఆశాస్తి య ఏవమేతత్సామ వేద. 28.**

ఈ విధంగా ప్రాణోపాసనను గురించి తెలుసుకున్న ఉపాసకుడు చేయాల్సిన జపవిధానం చెపుతున్నారు– పవమానాలను జపించటం గూర్చి చెపుతున్నారు. ముందు చెప్పబోయే మూడు యజుర్మంత్రాలు పవమానాలు.

ప్రస్తోత (ఒక ఋత్విక్కు) నిజంగా సామన్నే ఆరంభిస్తాడు. అతడు సామాన్ని ఆరంభించినపుడు (ప్రస్తానం చేసినపుడు) ఈ మంత్రాలను జపించాలి. 'అసతోనూ సద్గమయ', 'తమసోమా జ్యోతిర్గమయ'. 'మృత్యోర్మా మృతంగమయ' అని. ఇవి యజుస్సులు. (నన్ను) అసత్తు నుండి (చెడు నుండి) సత్తుకు (మంచికి) తీసికొనిపో, నన్ను ఆంధకారం నుండి వెలుగు వైపుకు తీసికొనిపో, నన్ను మృత్యువు నుండి అమరత్వానికి తీసికొనిపో అని. ఇక్కడ అసత్తు లేక చెడు

అంటే మృత్యువు. సత్ లేక మంచి అంటే అమరత్వం. అట్లాగే అంధకారం అంటే మృత్యువు. వెలుగు అంటే అమరత్వం. ఇక మూడవదైన 'మృత్యువు నుండి అమరత్వానిక తీసికొనిపో – అంటే నన్ను అమరుణ్ణి చెయ్యి–। అనేది స్పష్టమే ! దీంట్లో దాగి ఉన్న రహస్యమేదీ లేదు. పిమ్మట ఉపాసకుడు మిగతా మంత్రాలతో తనకోసం. అన్నం మొదలైన వాటిని గుర్చి ఆ గానం చేయాలి. అట్లా ఆ గానం చేసేటప్పుడు యజమాని తనకు కావలసిన వరాలను కోరాలి. తరువాత ఉద్గాత తనకు, యజమానికి కావలసిన భోగాల కోసం ఆ గానం చేస్తాడు. ఈ విధమైన ప్రాణోపాసన సంపూర్ణ లోక ప్రాప్తికి (హిరణ్య గర్భ ప్రాప్తికి) సాధనం. ఈ విధమైన సామాన్ని గురించి (ప్రాణాన్ని గురించి) తెలుసుకున్న వానికి లోకప్రాప్తికి అయోగ్యత అనేది ఉండదు.

## నాల్గవ బ్రాహ్మణం

**మం॥ ఆత్మైవేదమగ్ర ఆసీత్పురుష విధః, సో నువీక్ష్య నాన్యదాత్మనో పశ్యత్, సో హమస్మీత్యగ్రేవ్యాహరత్, తతో హంనామాభవత్, తస్మాదప్యేతర్హ్యా మంత్రితో హమయ మిత్యేవాగ్ర ఉక్త్వాథాన్యన్నామ ప్రబూబ్రూతే యదస్య భవతి; స యత్పూర్వో స్మా త్సర్వ స్మాత్సర్వాన్ పాప్మన ఔషత్ తస్మాత్పురుషః, ఓషతి హ వై స తం యో స్మాత్పూర్వో బుభూషతి యం ఏవం వేద. 1**

ఉపాసనతోబాటు కర్మల ద్వారా హిరణ్య గర్భునితో తాదాత్మ్యాన్ని– అభేదాన్ని –పొందటానికి ఉపాయాలు చెప్పారు. ప్రాణోపాసన వల్ల కూడా సరిగ్గా అదే ఫలం కలుగుతుందని చెప్పారు. ఆ ప్రస్తుతాధ్యాయంలో వైదికోపాసన, కర్మల ద్వారా (పూర్వజన్మ కర్మ సంస్కారం ద్వారా సృష్టి పోషణ లయాలకు కారకుడు అయిన హిరణ్యగర్భుని యొక్క స్వతంత్ర శక్తులను గూర్చిన ఉపాసన ద్వారా) మనం పొందటానికి వీలయ్యే అద్భుత ఫలితాలను గూర్చి చెపుతున్నారు.

ఈ సృష్టికి పూర్వం మానవాకారంలో – శిరః పాదాది రూపంలో– ఉన్న విరాడాత్మ మాత్రమే ఉంది. ఆ విరాట్పురుషుడు ఆలోచించి చూడగా తన కంటె భిన్నమైనదేదీ గోచరించలేదు. సర్వాత్మ భావంలో తనను మాత్రమే చూచుకొన్నాడు. వేదవిజ్ఞానం వల్ల కలిగిన సంస్కారంతో కూడి ఉన్నట్టి ఆ ప్రజాపతి 'అహమస్మి' –నేను ఉన్నాను– అని అనుకున్నాడు. అందుచేతనే అతడు 'అహం' అనే పేరు కలవాడైనాడు. అందుచేతనే ఈనాడు కూడా ఎవరైనా పిలిస్తే (ఎవరు అని అడిగితే ) 'అయమహం' = నేను ఉన్నాను అని తరువాత పేరు మొదలైనవి చెపుతూ ఉంటారు. ఎందుచేత? నేను అనేది అన్నిటి కంటె ముందు పుట్టింది కాబట్టి ! ఆ పురుషుడనే పేరుతో ఉండిన ప్రజాపతి సమస్త పాపాలను దగ్ధం చేశాడు కాబట్టి పురుషుడనే పేరు వచ్చింది.

ఎవరు ఈ విధంగా ఉపాసిస్తారో- అంటే, తనకు, ఆ 'అహం' రూపదారియైన ప్రజాపతికి అభేదాన్ని స్థాపించుకొని ఉపాసిస్తారో వారు శత్రువులను దగ్ధం చేసేస్తారు- (శత్రువు లెవరు? తనకంట ముందుగా ప్రజాపతి కావాలని అనుకొనేవారు) అంటే తానే ప్రజాపతి అవుతాడు, అని భావం.

**మం॥ సో బిభేత్ తస్మాదేకాకీ బిభేతి, సహాయమీక్షాం చక్రే, యన్మదన్యన్నాస్తి, కస్మాన్ను బిభేమీతి, తత ఏవాస్య భయం వీయాయ, కస్మాద్ధ్య భేష్యత్ ? ద్వితీ యాద్వై భయం భవతి. 2**

ఆ పురుషాకారంతో ఉండిన ప్రజాపతి భయభీతుడైనాడు. ఎందుకు ? ఒంటరిగా ఉన్నందుకు. ఈనాడు కూడా ఒంటరిగా ఉన్నవాడు భయపడతాడు. తరువాత అతడు (ప్రజాపతి) ఆలోచించాడు- "నేను తప్ప ఇతరులెవరూ లేరు గదా ! అటువంటప్పుడు నేను ఎందుకు భయపడాలి? ఎవరిని చూచి భయపడాలి?" అని, ఈ ఆలోచనతో అతని భయం తొలగిపోయింది. భయానికి కారణమే లేదుగదా ! భయమనేది ఎప్పుడూ ఇతరుల వల్ల (రెండవవారివల్ల) కలుగుతుంది. రెండవవాడే లేకపోతే భయానికి కారణమే లేదుగదా ! ఉన్నవాడు తానొక్కడే అనే భావంతో అతని భయం పోయింది. అందుచేతనే ఈనాడుకూడా 'ఆత్మ ఒకటే' అనే యదార్థాన్ని దర్శించిన వాడు భయవిముక్తుడౌతున్నాడు.

**మం॥ స వై నైవ రేమే, తస్మాదేకాకీ న రమతే; స ద్వితీయమైచ్ఛత్, న హైతావానాస యథా స్త్రీ పుమాంసౌ సంపరిష్వక్తౌ, స ఇమమేవాత్మానం ద్వేధా పాతయత్, తతః పతిశ్చ పత్నీ చాభవతామ్, తస్మా దిదమర్థమృగలమివ స్వఇతి హ స్మాహ యాజ్ఞావల్క్యః, తస్మాదయమాకాశః స్త్రియా పూర్యత ఏవ, తాం సమభవత్, తతో మనుష్యా అజాయన్త. 3**

ఆ ప్రజాపతి ఒంటరితనంలో ఆనందాన్ని అనుభవించలేక పోయాడు. ఈనాడు కూడా ఒంటరిగా ఉన్నవాడు రతిని- ఆనందాన్ని అనుభవించలేడు. (ఇష్టవస్తు సంయోగంతో చేసే క్రీడనే రతి అంటారు) అందుచేతనే ప్రజాపతి స్త్రీని కోరాడు. అట్లా కోరటంతోనే సత్యసంకల్పుడైన ఆ ప్రజాపతి స్త్రీ పురుషులు పరస్పరాలింగనం చేసుకొన్నట్లే రూపుదాల్చాడు. అంటే అతడు తన శరీరాన్నే రెండు భాగాలుగా విభజించాడు. ఆ భాగాలే పతి, పత్ని రూపాలు. అందుచేతనే లౌకిక శరీరం ద్విదళాలున్న ధాన్యపు గింజలోని ఒక దళం లాంటిది- ఒక పప్పుబద్ద లాంటిది. ఈ రెండు దళాలు స్త్రీ పురుష రూపాలని భావం. ఒంటరిగా ఉన్నవాడు ఒకే బద్ధలాంటి వాడని యాజ్ఞవల్క్యుడు అన్నాడు. కాబట్టి పురుషుని యొక్క ఈ అర్థశరీరాకాశం ('ఖాళీగా ఉన్న అర్థశరీరం) స్త్రీ రాగానే పరిపూర్ణమౌతుంది. వివాహమై, స్త్రీతో కూడినవాడు పూర్ణుడు (ద్విదళబీజం) అవుతున్నాడు. ఈ మైథున (మిథున సంబంధమైన, దాంపత్య సంబంధమైన) ప్రవృత్తివల్లనే మనుష్యుల ఉత్పత్తి జరుగుతోంది.

**మం॥ సా హేయమీక్షాం చక్రే, కథం ను మాత్మన ఏవ జనయిత్వా సంభవతి? హన్తతిరో సానీతి సా గౌర భవత్, ఋషభ ఇతరః, తాం సమేవాభవత్, తతో గావో జాయన్త, వడ్వేతరాభవత్, అశ్వవృష ఇతరః, గర్దభీతరా, గర్దభ ఇతరః, తాంస మేవాభవత్ తత ఏకశఫమజాయత, ఆజేతరాభవత్, వస్త ఇతరః, అవిరితరా, మేష ఇతరః, తాం సమేవాభవత్, తతో జావయో జాయన్త, ఏవమేవ యదిదం కించ మిథునం, ఆ పిపీలికాభ్య, తత్సర్వమసృజత 4**

ఆమె (శతరూప) ఈ విధంగా ఆలోచించింది. – తన కుమార్తెలతో రమించటం నిషిద్ధం గదా ! (తాను ప్రజాపతి నుండి జనించిందే కాబట్టి) తన నుండి పుట్టిన నాతో ఎట్లా రమిస్తాడు! అందుచేత నేను దాగుకొనటం మంచిది.' ఇట్లా అనుకొని ఆమె ఆవు రూపం ధరించింది. ఇది చూచి పురుషుడు (మనువు) తాను వృషభమై సంభోగించాడు. అందువల్ల ఆవులు, వృషభాలు పుట్టినాయి. తరువాత ఆ శతరూప ఆడగుఱ్ఱమైంది. మనువు మగగుఱ్ఱమైనాడు. తరువాత ఆమె ఆడగాడిద రూపం దాల్చింది. మనువు మగ గాడిద రూపంతో సంభోగించాడు. ఆ విధంగా ఒకే గిట్టగల జంతువులు పుట్టినాయి. పిమ్మట శతరూప మేకరూపం ధరించింది. మనువు మేకపోతు అయినాడు. శతరూప గొఱ్ఱెరూపం దాల్చింది. మనువు పొట్టేలు అయినాడు. ఈ విధంగా గొఱ్ఱెలు,పొట్టేళ్ళు పుట్టినాయి. ఈ విధంగా స్త్రీ పురుషరూపాల్లో చీమ మొదలుకొని సమస్త జీవుల సృష్టి జరిగింది.

**మం॥ సో వేత్, అహం వావ సృష్టిరస్మి, అహం హీదం సర్వమసృక్షీతి, తతః సృష్టి రభవత్, సృష్ట్యాం హాస్యైతస్యాం భవతి య ఏవం వేద. 5**

ఈ విధంగా పూర్తిగా సృష్టిరచన చేసిన తరువాత ఆ ప్రజాపతి "ఈ సృష్టి అంతా నేనే ! ఈ సృష్టినంతటిని నేను సృష్టించాను" అని తెలుసుకున్నాడు. అందుచేతనే సృష్టి అందుచేతనే సృష్టి అనేది ప్రజాపతికి పేరు అయినది. (సృష్టి అంతా నేనే అని అనుకున్నాడు కాబట్టి). ఈ విధంగా తెలుసుకున్న వాడు ప్రజాపతిలాగానే తానుకూడ స్రష్ట అవుతాడు. అంటే, ప్రజాపతితో అభేద స్థితిని పొందుతాడు.

**మం॥ అథ్యేత్యభ్యమన్థత్, స ముఖాచ్చ యోనేర్హస్తాభ్యాం చాగ్ని మసృజత, తస్మాదేతభయమలోమకమన్త రతః, అలోమకా హి యోనిరన్తరతః. తద్యదిద మాహుః, అముం యజాముం యజేతి, ఏకైకం దేవం ఏతస్యైవ సా విసృష్టిః ఏష ఉ హ్యేవ సర్వే దేవాః అథ యత్కించేదమార్ద్రం, తద్రే తసే సృజత, తదు సోమః, ఏతావిద్వా ఇదం స్వరం, అన్నం చైవాన్నా దశ్చ, సోమ ఏవాన్నమ్, అగ్ని రన్నాదః,సైషా బ్రాహ్మణో తిసృష్టి**

**ర్య (శ్రేయసో దేవానసృజత, అథ యన్మర్త్యః సన్నమృతానసృజత తస్మాదతిసృష్టిః, అతిసృష్ట్యాం హాస్యైతస్యాం భవతి య ఏవం వేద. 6**

అగ్ని మొదలైన దేవతలకు సంబంధించిన అతి సృష్టిని చెపుతున్నారు.

తరువాత ప్రజాపతి ఈ విధంగా మంథనం చేశాడు– రాపిడి కలిగించాడు. ఎట్లా ? అతడు నోటిలో రెండు చేతులతోను బాగా రాపిడి చేసి అగ్నిని పుట్టించాడు. యోని అంటే ఉత్పత్తి స్థానం. వాక్కుకు యోని నోరు. అగ్నికి యోని నోరు. అందుచేతనే అరి చేతులలోను, నోటిలోను, స్త్రీల యోనియందు రోమాలు ఉండవు. ఈ విధంగా అగ్నిని సృష్టించటంవల్లనే నోటి చేతులను దాహకాగ్నులు అంటున్నారు. యజ్ఞం చేసేవారు అగ్ని, ఇంద్రుడు మొదలైన వారిని వేరు వేరు దేవతలుగా తలచినప్పటికి ఈ అగ్నికి యజనం చెయ్యి ! ఇంద్రుడికి యజనం చెయ్యి ! అంటున్నారు. ఎందుచేత ? వీరంతా ప్రజాపతి యొక్క విసృష్టులే ! ఆ ప్రజాపతియే సమస్తదేవతా స్వరూపుడు, పిమ్మట ప్రజాపతి వీర్యాన్ని సృష్టించాడు. ఆ పల్చగా ఉండే ద్రవమే సోమం ! ఈ ప్రపంచమంతా ఇంతే ! అన్నము– అన్నాదము, అన్నము– భోక్త, ఇక్కడ సోమము అన్నము. అగ్ని అన్నాదము. ఇదంతా ప్రజాపతి చేసిన అతిసృష్టి తనకు మించిన సృష్టి తనను మించిన దేవతలను సృష్టించాడు. తాను మరణధర్ముడైనా. అమరణ ధర్ములైనవారిని సృష్టించాడు. అందుచేత ఇది అతిసృష్టి ఈ విధంగా తనకు ఆ ప్రజాపతికి అభేదాన్ని భావించుకొని ఉపాసన చేసేవాడు ఆ ప్రజాపతిలాగానే తాను కూడా జగత్స్రష్ట అవుతాడు.

మం॥ **తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్, తన్నామరూపాభ్యా మేవ వ్యాక్రియత, అసౌనామాయమిదం రూప ఇతి; తదిదమ ప్యేతర్హి నామరుపాభ్యామేవ వ్యాక్రియతే, అసౌనామాయ మిదంరూప ఇతి; స ఏష ఇహ ప్రవిష్ట ఆ నఖాగ్రేభ్యః యథా క్షురః క్షురధానే వహితః స్యాత్, విశ్వంభరో వా విశ్వంభరకులాయే; తం న పశ్యన్తి. అకృత్స్నో హి సః, ప్రాణన్నేవ ప్రాణో నామ భవతి, వదన్ వాక్, పశ్యంశ్చక్షుః, శృణ్వన్ శ్రోత్రం, మన్వానో మనః, తాన్యస్యైతాని కర్మనా మాన్యేవ. స యో త ఏకైక ముపాస్తే న స వేద, అకృత్స్నో హే షోత ఏకై కేన భవతి, ఆత్మే త్యే వోపాసీత, అత్ర హ్యేతే సర్వ ఏకం భవన్తి తదేత త్పదనీయమస్య సర్వస్య యదయమాత్మా, అనేన హ్యేతత్సర్వం వేద. యథా హ వై పదేనానువిన్దే దేవం, కీర్తిం శ్లోకం విందతే య ఏవం వేద. 7**

ఈ ప్రత్యక్షాది ప్రమాణాలతో వ్యక్తమౌతున్న ఈ జగత్తు పుట్టటానికి పూర్వం అవ్యక్తంగానే ఉండేది. అట్లా అవ్యక్తంగా (కిపించకుండా, గోచరించకుండా) ఉన్న జగత్తే నామరూపాలతో కూడి వ్యాకృతమైంది (వ్యక్తమైంది) అంటే, అది ఫలానా పేరు గలది, ఇది ఫలానా రూపంగలది

అని వ్యవహారంలోకి (వాడుకలోకి) వచ్చింది. అంటే నామరూపాలు లేకుండా అవ్యక్తంగా ఉన్న తత్త్వం. నామరూపాలతో కలసి వ్యక్తమైందన్న మాట. అందుచేత, ఇప్పుడు– సృష్టి జరిగేటప్పుడు– కూడా ఈ రూపం కలది. ఈ పేరు కలది అని వ్యక్తం అవుతోంది. అంటే, మనం ఇపుడు ఆయా జీవజంతువుల యొక్క పుట్టుకను నామరూపాలతో గుర్తిస్తున్నాము. ఈ విధంగా వ్యాకర్త అయిన (వ్యక్తమైన) పురుషుడు నఖశిఖ పర్యంతంవ్యాప్తమై ఉన్నాడు. ఒరలో కత్తిదాగి ఉన్నట్లుగా, విశ్వభర్తయైన అగ్ని కాష్ఠాదులలో దాగి ఉన్నట్లుగా ! అందుచేతనే ప్రజలు అతనిని చూడలేక పోతున్నారు. అతడు అసంపూర్ణుడు. ప్రాణనక్రియకు కారణమైనందున ప్రాణం అవుతున్నాడు. అతడే నోటికి కారణమైనందున వాక్కు; దర్శనానికి కారణమైనందున నేత్రం; శ్రవణానికి కారణమైనందున చెవి; మనన క్రియకు (ఆలోచనకు) కారణమైనందున మనస్సు అవుతున్నాడు. ఇవన్నీ అతడు చేసే పనినిబట్టి వచ్చిన పేర్లు కాబట్టి వీటిని వేరువేరుగా ఉపాసించేవాడు అతనిని తెలుసుకోలేడు– వస్తుతః అతడు అసంపూర్ణుడే ! అందుచేతనే ఒక్కొక్క పరిస్థితిలో ఒక్కొక్క విశేషణంతో కూడి ఉంటాడు. అందుచేతనే 'అతడు ఆత్మ' అని ఈ విధంగా ఆ ప్రజాపతిని ఉపాసించాలి. ఎందుచేతనంటే, ఈ ఆత్మలోనే అవన్నీ– వేరువేరుగా ఉన్న ఆ నామరూపాలన్నీ– కలసిపోతాయి. ఈ జీవులన్నీ పొంద వలసినది ఆ ఆత్మనే ! ఈ ఆత్మను తెలుసుకొన్నందువలన సమస్త జగత్తును తెలుసుకోగలుగుతాడు. పాదాల గుర్తునుబట్టి అది ఏ జంతువు అయినది గుర్తించగలిగినట్లే, ఆత్మను ఆయా ఇంద్రియాల ద్వారా గుర్తించ గలిగినవాడు కీర్తిని, ఇష్టపురుషుల సమాగమాన్ని (కలయికను) పొందుతాడు.

**మం॥ తదేతత్ప్రేయః పుత్రాత్, ప్రేయో విత్తాత్, ప్రేయో న్యస్మాత్సర్వస్మాత్, అన్తరతరం యదయమాత్మా. స యో న్యమాత్మనః ప్రియం బ్రువాణం బ్రూయాత్, ప్రియం రోత్స్యతీతి, ఈశ్వరో హ, తథైవ స్యాత్, ఆత్మానమేవ ప్రియముపాసీత, స య ఆత్మానమేవ ప్రియముపాస్తేన హాస్య ప్రియం ప్రమాయికం భవతి.** **8**

లోకంలో పుత్రులు మిక్కిలి ప్రేమాస్పదులని అనుకుంటారు. కాని, ఈ ఆత్మతత్త్వం పుత్రునికంటె కూడా ప్రేమాస్పదమైంది– లోకంలో అత్యంత ప్రియతమమైన వాటి అన్నింటికంటె ప్రేమాస్పదమైంది. ఎందుచేతనంటే, ఆ ఆత్మ తత్త్వమనేది అన్నిటికంటె మిక్కిలి సమీపంగా ఉండేది. లోకంలో ఆత్మకంటె సమీపవర్తి అయినదేదీ లేదుగదా ! ఈ విధంగా ఆత్మను ప్రేమాస్పదమైన దానినిగా చూచేవాడు, ఆత్మను కాకుండా అనాత్మను ప్రేమాస్పధమైనదిగా చూచే వానితో– 'నీ ఆత్మ నష్టమై పోతుంది' అని, అంటే నిజంగా అట్లాగే అవుతుంది. ఎందుచేతనంటే, అట్లా అనేందుకు తగిన సమర్థత ఆత్మను ప్రియతమమైనదిగా భావించేవాడికి ఉంది కాబట్టి !

పైగా ఆత్మను కాకుండా అనాత్మపదార్థాలను (ధనధాన్యాదులను) ప్రియమైనవిగా భావించేవాని ఆత్మ, పతనమై పోవటంలో సందేహం లేదుగదా ! అందుచేత అనాత్మ పదార్థాలను పూర్తిగా వదలిపెట్టి. ఆత్మ తత్వాన్ని ఉపాసించాలి. ఈ విధంగా ఎవడు ఆత్మతత్వాన్ని ఉపాసిస్తాడో వానికి ఇతర లౌకిక పదార్థాలు ఎంత గొప్పవైనా అప్రియమైనవే అవుతాయి. ఈ విధంగా నిశ్చయించుకొని ఉపాసన చేసేవాని ఆత్మ, మరణ స్వభావం కలది కాదు.

**మం॥ తదాహుః యత్ బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యన్తః మనుష్యా మన్యన్తే, కిము తద్బ్రహ్మ వేద్యస్మా త్తత్సర్వమభవదితి. 9**

బ్రహ్మజిజ్ఞాన కలవారు అంటారు– "బ్రహ్మవిద్య ద్వారా మానవులు తాము సర్వస్వరూపులము అవుతాము (అనంతత్వాన్ని పొందుతాము)" అని అనుకుంటారు. వారు ఈ విధంగా అనుకునేందుకు ఆధారమేమిటి? ఎవరైనా బ్రహ్మను తెలుసుకున్నారా? ఈ విధంగా అనుకొనేవారి విషయంలో ఒక ప్రశ్న ఉదయిస్తుంది. 'ఆ బ్రహ్మ తెలుసుకున్న దేమిటి? ఏ విజ్ఞానం వల్ల అతడు (బ్రహ్మ) సర్వస్వరూపుడైనాడు ? అంటే, అనంతుడైనాడు?' అని, (సమాధానం తరువాతి మంత్రంలో చూడండి.)

**మం॥ బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీత్, తదాత్మానమేవావేత్, అహం బ్రహ్మాస్మీతి. తస్మాత్తత్సర్వమభవత్, తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తద భవత్, తథర్షీణామ్, తథా మనుష్యాణాం, తద్ధైతత్పశ్యన్నృ షిర్వామదేవః ప్రతిపేదే, అహం మనురభవం సూర్య శ్చేతి. తదిదమ ప్యేతర్హి య ఏవం వేద, అహం బ్రహ్మాస్మీతి, స ఇదం సర్వంభవతి, తస్య హ న దేవా శ్చానా భూత్యా ఈశతే, ఆత్మా హ్యేషాం స భవతి, అథ యో న్యాం దేవతా ముపాస్తే, అన్యో సా వన్యో హ మస్మీతి, న స వేద, యథా పశురేవం స దేవానాం యథా హ వై బహవః పశవో మనుష్యం భుఞ్జ్యుః, ఏవమేకైకః పురుషో దేవాన్ భునక్తి, ఏకస్మిన్నేవ పశావాదీయమానే ప్రియం భవతి, కిము బహుషు? తస్మాదేషాం తన్న ప్రియం యదేతన్మ మష్యా విద్యుః 10**

ఉత్పత్తికి పూర్వం ఈ నామరూపాత్మకంగా కనిపించే విశ్వమంతా బ్రహ్మ రూపమే ! అతడు 'నేను బ్రహ్మను' అని తననుతానే తెలుసుకున్నాడు. అందుచేతనే అతడు అనంతుడైనాడు– సర్వస్వరూపుడైనాడు. అట్లాగే దేవతలు ఎవరెవరు తెలుసుకున్నారో వారంతా తద్రూపులే (బ్రహ్మ స్వరూపులే) అయినారు. అట్లాగే ఋషులలోను, మనుష్యులలోను కూడా బ్రహ్మను పై విధంగా (నేనే బ్రహ్మను అని) తెలుసుకున్నవారు బ్రహ్మ స్వరూపులైనారు. వామదేవమహర్షి ఆ తత్వాన్ని ఆత్మభావంతో చూస్తూ తెలుసుకున్నాడు– నేనే మనువును నేను సూర్యుణ్ణికూడా ! అని ఈనాటికి

కూడా 'నేనే బ్రహ్మను' అని తెలుసుకున్నవాడు ఈ తత్త విజ్ఞానం వల్ల సర్వ స్వరూపుడు (విశ్వరూపుడు) అవుతాడు. అటువంటి తత్త్వవేత్తను దేవతలు కూడా మించలేదు– అటువంటివానిని దేవతలు కూడా పరాభవించలేరు. ఎందుచేత ? అతడు ఆ దేవతల ఆత్మయే అయినాడు కాబట్టి ! నేను పూజించే దేవుడువేరు, నేనువేరు, అని భావించి, తనకంటె (ఆత్మకంటె) వేరైన దేవతలను ఉపాసించేవాడు అజ్ఞానంవల్ల పరమార్థమైన తత్వాన్ని తెలుసుకోలేడు. ఇటువంటి భేదదర్శిని బరువుమోసే పశువుతో పోలుస్తున్నారు. లోకంలో అనేక పశువులు బరువు మోస్తూ ఇతర విధాలుగాను మానవులను పోషించినట్లే ఈ భేదదృష్టిగల ఉపాసకులు హవిష్యాన్నాలు ఇస్తూ దేవతలను పోషిస్తూ ఉంటారు. మనను పోషించే పశువు ఒకటి తప్పించుకొనిపోయినా, అపహరింపబడ్డా, మనం బాధపడతాం గదా ! అట్లాగే తమను పోషించే మానవుల (దేవతల దృష్టిలో పశువులు) తప్పించుకుపోతే (అనగా అభేదదృష్టితో బ్రహ్మసాక్షాత్కారం పొందితే) తమకు ఆ విధమైన హవిష్యాన్నాలు ఇచ్చి పోషించేవారు లేక దేవతలుకూడా బాధపడటం సహజమే కదా ! అందుచేతనే మానవులు తత్వజ్ఞానులై– ఆత్మతత్వాన్ని తెలుసుకొని –బ్రహ్మస్వరూపులవటం దేవతలకు ఇష్టం ఉండదు.

**మం॥ బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీదేకమేవ, తదేకం సన్న వ్యభవత్, తచ్ఛ్రేయో రూపమత్యసృజత క్షత్రం, యాన్యేతాని దేవత్రా క్షత్రాణి– ఇంద్రో వరుణః సోమో రుద్రః పర్జన్యో యమో మృత్యురీశాన ఇతి తస్మాత క్షత్రాత్పరం నాస్తి; తస్మాద్బ్రాహ్మణః క్షత్రియ మధస్తాదుపాస్తే రాజసూయే, క్షత్ర ఏవ తద్యశో దధాతి; సైషా క్షత్రస్య యోనిర్యద్బ్రహ్మ. తస్మా ద్యద్యపి రాజా పరమతాం గచ్ఛతి బ్రహ్మైవాన్తత ఉపనిశ్రయతి స్వాం యోనిం; య ఉ ఏనం హినస్తి స్వాం స యోనిమృచ్ఛతి, స పాపీయాన్ భవతి, యథా శ్రేయాంసం హింసిత్వా. 11**

ఈ సృష్టికి– నామరూపాత్మకమైన బ్రహ్మవిభూతికి– ఆరంభంలో ఉన్నది బ్రహ్మమాత్రమే! బ్రహ్మము అంటే విరాట్ స్వరూపంలో ఉన్న అగ్ని– అదే బ్రాహ్మణరూపం. అంతవరకు క్షత్రియాది వర్ణభేదాలు లేవు. క్షత్రియాది పాలకులు లేకపోవటం వల్ల తన పనిని తాను సమర్థవంతంగా నిర్వర్తించలేక పోయాడు. అప్పుడా విరాట్ బ్రహ్మ– "నేను బ్రాహ్మణుడను, ఇవి నా విధులు" అని తలచి (బ్రాహ్మణునికి కర్మలు చేయటం విధికాబట్టి) ప్రశస్తమైన క్షత్రియ రూపాన్ని సృష్టించాడు. దేవతలలో ఇంద్రుడు, వరుణుడు, సోముడు, రుద్రుడు, మేఘుడు, యముడు, మృత్యువు, ఈశానుడు వీరంతా క్షత్రియులు. ఆ విరాట్ప్రజాపతి క్షత్రియుల్ని ప్రత్యేక ప్రయోజనం కోసం సృష్టించాడు– వారు బ్రాహ్మణులకు రక్షకులు, అందుచేతనే దేవక్షత్రియుల్ని (దేవతలలో పైన పేర్కొన్న క్షత్రియుల్ని)

సృష్టించాడు. అందుచేతనే క్షత్రియుల్ని మించిన వాళ్ళులేరు.కాబట్టే రాజమాయ యాగంలో బ్రాహ్మణులు దిగువన ఉండి క్షత్రియుల్ని పూజిస్తారు. ఆ క్షత్రియుల్లోనే బ్రహ్మ ఈ నామరూపాత్మకమైన తన కీర్తిని స్థాపిస్తున్నాడు. బ్రహ్మ ఈ క్షత్రియులకు యోని- ఉత్పత్తి స్థానం, అందుచేతనే క్షత్రియుడు (రాజు) విధమైన గొప్ప దనాన్ని పొందినా, రాజసూయం పూర్తికాగానే మళ్ళీ బ్రాహ్మణునే ఆశ్రయిస్తాడు. తనకు జన్మస్థానం కాబట్టి ! అందుచేత బ్రాహ్మణుని క్షత్రియుడు పీడిస్తే తన ఉత్పత్తిస్థానాన్ని తానే నాశనం చేసుకుంటున్నాడన్నమాట. సత్పురుషుణ్ణి హింసించినందువల్ల కలిగే పాపం, ఆవిధంగా బ్రాహ్మణ హింసచేసే క్షత్రియునికి కూడా కలుగుతుంది.

**మం॥ స నైవ వ్యభవత్, స విశమసృజత, యాన్యేతాని దేవజాతాని గణశ ఆఖ్యాయన్తే- వసవో రుద్రా ఆదిత్యా విశ్వే దేవా మరుత ఇతి. 12**

బ్రహ్మ క్షత్రియుల్ని సృష్టించిన తరువాతకూడా తనపనిలో- విభూతితో కూడినపనిలో- కృతకృత్యుడు కాలేదు. సంపదను, ధనాన్ని కూడబెట్టేవాడు లేకపోవటంవల్ల తనపనిలో సమర్థుడు కాలేకపోయాడు. అందుచేత బ్రహ్మ వైశ్యజాతిని సృష్టించాడు. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వదేవులు, మరుత్తులు మొదలైన దేవతల్ని, ఒక్కొక్క గణంగా పేర్కొనబడేవారిని సృష్టించాడు. వైశ్యులంతా గణాలుగా- సమూహాలుగా సృష్టింపబడ్డారు. సమూహంగా కలసి ధనసంపాదన చేస్తారు కాబట్టి. వసువులు 8 గణాలు, రుద్రులు 11 గణాలు. ఆదిత్యులు 12 గణాలు. విశ్వేదేవులు 13 గణాలు. మరుద్గణాలు 49- ఏడు సమూహాలుగా 7 × 7 = 49 గణాలు.

**మం॥ స నైవ వ్యభవత్, స శౌద్రం వర్ణమసృజత పూషణం, ఇయం వై పూషా, ఇయం హీదం సర్వం పుష్యతి యదిదం కించ. 13**

సేవకుడు లేకపోవటంవల్ల బ్రమ్మ తన విశ్వభూతితో కూడిన కర్మచేయటంలో సమర్థుడు కాలేకపోయాడు- విశ్వరచనలో అభివృద్ధి చూపలేక పోయాడు. అందుచేత శ్రూదవర్ణాన్ని సృష్టించాడు పూషుడు శూద్రవర్ణుడు. ఈ భూమియే పూష, ఎందుచేతనంటే ఈ పూషాదేవతయే (భూమియే) అందరిని పోషిస్తోంది కాబట్టి.

**మం॥ సనైవ వ్యభవత్, తచ్ఛ్రే యోరూపమత్యసృజత ధర్మమ్; త దేతత్ క్షత్రస్య క్షత్రమ్ యద్ధర్మ, తస్మాద్ధర్మాత్పరం నాస్తి; అథో అబలీయాన్ బలీయాంస మాశంసతే ధర్మేణ, యథా రాజ్ఞైవమ్, యో వై స ధర్మః సత్యం వై తత్, తస్మాత్ సత్యం వదన్త మాహుః ధర్మం వదతీతి, ధర్మం వా వదన్తం సత్యం వదతీతి, ఏతద్ధ్యేవైతదుభయం భవతి. 14**

ఈ విధంగా నాలుగువర్ణాలు సృష్టించి నప్పటికి, విశ్వవిభూత సంబంధమైన కర్మ చేయటంలో అభివృద్ధి చూపించలేకపోయాడు. అప్పుడాతడు. కల్యాణప్రదమైన –శ్రేయోరూపమైన ధర్మమే క్షత్రియుణ్ణి కూడా నియమిస్తుంది– శాసిస్తుంది . అందుచేత ధర్మాన్నిమించి శ్రేష్ఠమైనది ఏదీ లేదు. అందుచేతనే సాధారణ మానవుడు కూడా రాజ (క్షత్రియ) సహాయంతో తనకంటె బలవంతుడైన వానిని పరాభవించాలని అనుకుంటున్నాడు. అట్లాగే, ధర్మం ద్వారానే దుర్బలుడు బలవంతుణ్ణి జయించాలని అనుకుంటున్నాడు. అంటే దుర్బలుడికి ధర్మమే బలం– అతనికి ధర్మం చేత నియమితుడైన రాజు యొక్క బలం ఉంటుంది. నిజానికి ధర్మమే సత్యం. అందుచేతనే సత్యం మాట్లాడే వానిని ఉద్దేశించి 'వాడు ధర్మం చెబుతున్నాడు' అని అంటారు. రెండూ ధర్మాలే కాబట్టి ! అందుచేతనే ధర్మమనేది జ్ఞానాన్ని, అనుష్టానాన్ని కూడా చెప్పుచేతల్లో ఉంచుతుంది. అంటే శాస్త్రం తెలిసినవారిని తెలియనివారిని కూడా నియమిస్తుంది. అట్లాగే అనుష్టానం చేసేవారిని, చేయనివారిని కూడా నియమిస్తుంది – చెప్పుచేతల్లో వుంచుతుంది. అంటే, మొత్తానికి ధర్మమే నాలుగు వర్ణాలను కూడా తన అధీనంలో ఉంచుకుంటుంది.

**మం॥ తదేతద్బ్రహ్మ క్షత్రం విట్ శూద్రః, తదగ్నినైవ దేవేషు బ్రహ్మాభవత్; బ్రాహ్మణో మనుష్యేషు, క్షత్రియేణి క్షత్రియో, వైశ్యేన వైశ్యః, శూద్రేణ శూద్రః, తస్మాదగ్నావేవ దేవేషు లోకమిచ్ఛన్తే, బ్రాహ్మణే మనుష్యేషు, ఏతాభ్యాం హి రూపాభ్యాం బ్రహ్మాభవత్, అథ యో హ వా అస్మాల్లోకాత్స్వం లోకమదృష్ట్వా ప్రైతి, స ఏనమవిదితో న భునక్తి, యథా వేదో వానయుక్త, అన్యద్వా కర్మాకృతమ్, యద్విహ వా అస్యనేవం విన్మహత్పుణ్యం కర్మ కరోతి తద్ధాస్యాంతతః క్షీయత ఏవ, ఆత్మానమేవ లోక ముపాసీత, సయ ఆత్మానమేవ లోకముపాస్తే, న హాస్య కర్మ క్షీయతే అస్మాద్ధ్యేవాత్మనో యద్యత్కా మయతే తత్తత్సృజతే. 15**

ఈ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణాలు నాలుగు. వీటిని సృష్టించిన బ్రహ్మ అగ్నిరూపంలో దేవతలలో బ్రాహ్మణుడుగా ఉన్నాడు. ఆ బ్రహ్మయే మనష్యులలో బ్రాహ్మణరూపంతో బ్రాహ్మణుడుగాను, క్షత్రియరూపంలో క్షత్రియుడుగాను, వైశ్యరూపంలో వైశ్యుడుగాను ఉన్నాడు. దేవతల మధ్య కర్మచేస్తూ అగ్నిలోనే కర్మఫలాన్ని కోరుకోవటానిక కారణం ఇదే!– ఈ అగ్నిగాను, బ్రాహ్మణుడుగాను బ్రహ్మ వ్యక్తమైనాడు కాబట్టి! బ్రాహ్మణునిలో అగ్నిరూపం, బ్రాహ్మణుడుగాను బ్రహ్మ వ్యక్తమైనాడు కాబట్టి ! బ్రహ్మణునిలో అగ్నిరూపం, బ్రహ్మరూపం రెండు ఉన్నాయి. అందుచేతనే అగ్నిలో హవనం చేసి, బ్రాహణునికి దానమిచ్చి, పరలోక ప్రాప్తిని కోరుతూ ఉంటారు. తన ఆత్మనుగురించి తెలుసుకోకుండా ఈ లోకము నుండి నిష్క్రమిస్తే ఆ ఆత్మలోకం అతనిని కాపాడదు. అధ్యయనం చేయని వేదం, అనుష్ఠానం లేనికర్మ పురుషుణ్ణి కాపాడవు – అట్లాగే

ఆత్మను తెలుసుకోని పురుషుడు ఈ లోకం నుంచి పోతే, అతడు ఎన్నెన్ని గొప్పకర్మలు, పుణ్యకార్యాలు చేసినా చివరికాతనిపుణ్యం నష్టమే అవుతుంది. కేవలం ఆత్మలోకోపాసన చేసేవాని కర్మ ఎన్నటికి నశించదు. అంటే, ఆత్మజ్ఞానం లేనిదే శోకనివృత్తికాదు. ఆ ఆత్మవల్లనే మానవుడు తనకు కావలసినవన్నీ సృష్టించుకో గులుగుతాడు.

**మం॥ అథో అయం నా ఆత్మా సర్వేషాం భూతానాం లోకః; స యజ్జుహోతి, యద్యజతే, తేన దేవానాం లోకః, అథ యదమీ(బ్రూతే తేన ఋషీణామ్, అథ యత్పితృభ్యో నిపృణాతి, య(త్ప్రజామిచ్ఛతే, తేన పితృ ణామ్, అథ యన్మనుష్యాన్వాసయతే, యదేభ్యో శనం దదాతి, తేన మనుష్యాణామ్, అథ యత్పశుభ్యస్తృ ణోదకం విన్దతి, తేన పశూనామ్, యదస్య గృ హేషు శ్వాపదా వయాంస్యా పిపీలికాభ్య ఉపజీవన్తి, తేన తేషాం లోకః, యథా హ వై స్వాయ లోకాయారిష్టి మిచ్ఛేత్, ఏవం హైవంవిదే సర్వాణి భూతాన్యరిష్టి మిచ్ఛన్తి, తద్వా ఏతద్విదితం మీమాంసితమ్ 16**

కర్మాధికారి, అజ్ఞాని అయినవాని ఆత్మ అన్ని జీవరాసులకు భోగ్యవస్తువు అవుతుంది. అతడు చేసే హోమంవల్ల, యజ్ఞంవల్ల అతడు దేవతలకు భోగ్యం అవుతాడు. అతడు చదివే వేదంవల్ల ఋషులకు భోగ్యం అవుతాడు. అతడుచేసే పిండ(ప్రదానం వల్ల పితృదేవతలకు భోగ్యం అవుతాడు. ఆ(శ్రయము, భోజనము ఇవ్వటం వల్ల మానవులకు, గడ్డి; నీరు ఇవ్వటం వల్ల పశువులకు భోగ్యం అవుతాడు. అట్లాగే ఈ ముముక్షువు ఇంటిలో ఉండే పిల్లులు కుక్కలు మొదలైన జంతువులు, చీమలు మొదలైన జీవులన్ని, ఆ ఉపాసకుని ఆ(శ్రయించుకొనే (బతుకుతున్నాయి.

అందుచేత అతడు వాటికి భోగ్యం అందుచేత అతడు వాటికి భోగ్యం అవుతున్నాడు. తనది నాశనం కాకూడదని (ప్రతివాడూ ఎట్లా కోరుకుంటాడో అట్లాగే ఈ దేవ, ఋషి, పితృ, మనుష్య, జీవజంతువులన్నీ తమకు భోగ్యమైన ఈ ఉపాసకుని క్షేమాన్ని కోరుతూ ఉంటాయి. ఈ దేవ పితృయజ్ఞాలన్నీ అవశ్యం ఆచరణీయాలని పంచమహాయజ్ఞ (ప్రకరణంలో చెప్పబడ్డది. అవధాన (ప్రకరణంలో వ్యాఖ్యానింపబడ్డది. పైన చెప్పిన గృహస్థులాంటి వాళ్ళు తమకు భోగ్యాలు కాబట్టి, వారు ఆత్మతత్వాన్ని తెలుసుకొని కర్మపరిత్యాగం చేసి మోక్షాన్ని పొందటం దేవతలకు మొదలైనవారికి ఇష్టం ఉండదని భావం. తమకు సేవచేసేవారు ఉండరు కాబట్టి !

**మం॥ ఆత్మైవేదమ(గ ఆసీదేక ఏవ, సో కామయత– జాయా మే స్యాత్, అథ (ప్రజాయేయ ! అథ విత్తం మే స్యాత్; అథ కర్మకుర్వీయేతి; ఏతావాన్ వ కామః, నే చ్ఛంశ్చానాతో భూయో విన్దేత్, విన్దేత్ తస్మాదప్యే తర్హ్యేకాకీ కామయతే–జాయామేస్యాత్, అథ (ప్రజాయేయ, అథ**

**విత్త మే స్యాత్, అథ కర్మకుర్వీ యేతి, స యావదప్యే తేషామేకైకం న ప్రాప్నోతి, అకృత్స్న ఏవ తావన్మన్యతే, తస్యోకత్స్నతా మన ఏవాస్యాత్మా, వాగ్జాయా, ప్రాణః ప్రజా, చక్షు ర్మానుషం విత్తమ్, చక్షుషా హి తద్విన్దతే, శ్రోత్రం దైవమ్, శ్రోత్రేణ హి తచ్ఛృణోతి, ఆత్మైవాస్య కర్మ, ఆత్మనా హి కర్మ కరోతి, స ఏష పాఙ్క్తో యజ్ఞః, పాఙ్క్తః పశుః, పాఙ్క్తః పురుషః, పాఙ్క్త మిదం సర్వం యదిదం కించ, తదిదం సర్వమాప్నోతి య ఏవం వేద. 17**

**స్త్రీతో సంబంధం కలగటానికి పూర్వం, ఈదేహేంద్రియ సంఘాత రూపమైన ఆత్మతత్వం మాత్రమే ఉండేది. అది (ఆత్మ) అవిద్యాజనితమైన వాసన (కోరిక) వల్ల, కర్తనైన నాకు కర్మాధికారానికి హేతుభూతమైన స్త్రీ కావాలని కోరుకున్నాడు. అంటే, తాను కర్తయై కర్మచేయాలని, ఆ కర్మచేసే అధికారం భార్యవల్ల వస్తుందని, కాబట్టి తనకు భార్య కావాలని కోరుకున్నాడు. ఆ స్త్రీ యందు సంతానరూపంలో తానే జన్మించాలని, తనకు ఆవులు మొదలుగాగల సంపద కావాలని కోరాడు. ఈ రెండూ లభిస్తే (భార్య- ధనము) లోకకల్యాణానికి సాధనభూతమైన కర్మను ఆచరించవచ్చునని తలచాడు. ఇదే విషయ పరిచ్ఛిన్నమైన కామం. కోరినప్పటికి ఎవరూ ఇంతకంటె ఏమీ పొందలేరు. ఈనాడు కూడా ఒంటరిగా ఉన్నవాడు తనకు భార్యకావాలని, ఆ భార్యయందు తానే సంతానరూపంలో మళ్ళీ జన్మించాలని, డబ్బు గనుకవుంటే కర్మచేయగలుగుతానని అనుకుంటాడు. వీటిని తాను పొందేదాకా తాను అసంపూర్ణుడుగా ఉన్నట్లే భావిస్తాడు. అతనికి పూర్ణత్వం రావాలంటే ఇవి (భార్య, సంతానం, సంపద) లభించాలి.**

బాహ్య సాధనాలు లేనప్పుడు, మనస్సే అతని ఆత్మ (శరీరం) వాక్కే భార్య, (మనస్సు అనే పురుషుని అనుసరించేది వాక్కు అనే స్త్రీయే !) ప్రాణమే సంతానం. నేత్రాలే మానుష సంపద. (కండ్లతోనే ఆవులు మొదలైన మానుషనిత్తాన్ని తెలుసుకోగలుగుతాడు) చెవులు దైవవిత్తము- దేవతా సంబంధమైన ధనం (శ్రోత్రాలవల్లనే మానవుడు దైవవిత్త సంబంధమైన కర్మను గూర్చి వింటున్నాడు. శరీరమే అతనికి కర్మ- శరీరరూపంలో ఉండే ఆత్మతోనే పనిచేస్తున్నాడు కాబట్టి. అందుచేత దీనికి యజ్ఞపాంక్తము అని పేరు. జంతువులలోను, మానవులోను కూడా ఈ పాంక్తముఅయిదు సంఖ్య కలవి) ఉంది. మనస్సు, వాక్కు, ప్రాణం చక్షుస్సు, శ్రోత్రం ఈ అయిదింటిద్వారా సంపాదితమైనది పాంక్తము. ఇది పురుష పాంక్తము. ఇదే కర్మకు సాధనం ఫలమూ కూడాను. అంతా పాంక్తమేనని భావించేవాడు ఈ జగత్తునంతా ఆత్మరూపంలో పొందగలుగుతాడు.

# ఐదవ బ్రాహ్మణం

శ్లో॥ యత్సప్తాన్నాని మేధయా తపాస జనయత్పితా ।
ఏకమస్య సాధారణం, ద్వే దేవానభాజయత్ ॥
త్రీణ్యాత్మనే కురుత, పశుభ్య ఏకం ప్రాయచ్ఛత్ ।
తస్మిన్ సర్వం ప్రతిష్ఠతం యచ్చప్రాణితి యచ్చన ॥
కస్మాత్తాని న క్షోయన్తే ద్యమానాని సర్వదా ।
యో వైతామక్షితిం వేద సో న్నమత్తి ప్రతీకేన ॥
స దేవానపిగచ్ఛతి, స ఊర్జముపజీవతి ఇతి శ్లోకా ః ॥ 1

వెనుకటి బ్రాహ్మణంలో ఆవిద్యతో కూడి ఉన్నట్టి, వర్ణాశ్రమాభిమానియైన పరుషుడు కర్మకర్తవ్యానికి లోనై యాగాది కర్మలద్వారా, దేవతలకు సమస్తజీవజంతువులకు ఏ విధంగా భోగ్యమవుతున్నాడో చెప్పారు. అట్లాగే ఆ కర్మానుష్ఠాత యాగాది పాంక్త కర్మలద్వారా ప్రాణులను, ప్రపంచాన్ని తనకు భోగ్యరూపంలో సృష్టించాడు. ఈ విధంగా అన్నీ అన్నిటికి భోక్త, భోజ్యము, కర్త,కార్యము అవుతున్నాయి అని చెప్పారు. ఈ బ్రాహ్మణంలో ప్రజాపతి విజ్ఞానం, కర్మద్వారా ఏడు విధాలైన అన్నాలను సృష్టించినట్లు చెపుతున్నారు. ఇక్కడ ఆవిద్యను గూర్చి చెపుతున్నారు.

ప్రజాపతి విజ్ఞానంద్వారా, కర్మలద్వారా ఏడురకాలైన అన్నాలను సృష్టించాడు. వాటిలోయవాదిరూపమైన అన్నం సాధారణమైనది. అంటే అన్ని ప్రాణాలకు అవసరమైనది. యోగ్యమైనది. హుతము, ప్రహృతము అనే రెండు విధాలైన అన్నాలను దేవతల కోసం విభజించి యిచ్చాడు. మూడు విధాలైన అన్నాలను తన కోసం ఉంచుకున్నాడు. దుగ్ధ రూపమైన (పాలు) అన్నాన్ని పశువులకు యిచ్చాడు. ప్రాణనక్రియ జరిపేవి (ఊపిరి పీల్చేని) జరపనివి కూడా ఆ పశు అన్నంలోనే ప్రతిష్ఠితమై ఉన్నాయి. అంటే, వీటి అన్నింటికి ఆధారం అదే ! ఎల్లప్పుడు ఇట్లా భక్షింపబడుతూ ఉన్నా, ఈ అన్నం ఎందుచేత తరిగిపోవటంలేదు? అన్నం యొక్క ఈ అవినశ్వర భావాన్ని (తరగకపోవటాన్ని) తెలుసుకొని, అన్నాన్ని అనుభవించేవాడు దేవభావాన్ని పొందుతాడు– అమృతత్వాన్ని పొందుతాడు. ఈ విషయమై ఈ శ్లోకాలు చెప్పబడ్డాయి. వీటినే ఈ దిగువ మంత్రంలో విశదీకరిస్తున్నారు.

మం॥ 'యత్సప్తాన్నాని మేధయా తపసాజనయత్పితా' ఇతి మేధయా హి తపాసా జనయత్పితా, 'ఏకమస్య సాధా రణం' ఇతీదమేవాస్య తత్సాధారణమన్నం యదిద మద్యతే. స య ఏతదుపాస్తే న స పాప్మనో వ్యావర్తతే, మిశ్రం హ్యేతత్, 'ద్వే దేవానభాజ యత్' ఇతి

**హుతంచ ప్రహృతంచ, తస్మాద్దేవేభ్యో జుహ్వతి, చ ప్ర జుహ్వతి, అథో ఆహుర్దర్శపూర్ణ మాసావితి, తస్మాన్నేష్టియాజుకః స్యాత్. 'పశుభ్య ఏకం ప్రాయచ్ఛత్' ఇతి తత్పయః పయో హ్యేవాగ్రే మనుష్యాశ్చ పశవశ్చోపజీవన్తి, తస్మాత్ కుమారం జాతం ఘృతం వై వాగ్రే ప్రతిలేహయన్తి, స్తనం వానుధాపయన్తి, అథ వత్సం జాతమాహుర తృణాద ఇతి, 'తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం యచ్చ ప్రాణితి యచ్చన, ఇతి పయసి హీదం సర్వం ప్రతిష్ఠితం యచ్చ ప్రాణితి యచ్చన, తద్యదిదమాహుః, సంవత్సరం పయసా జుహ్వదప పునర్మృత్యుం జయతీతి, న తథా, విద్యాద్, యదహారేవ జుహోతి తదహః పునర్మృత్యుమపజయ త్యేవం విద్వాన్, సర్వం హి దేవే భ్యో న్నాద్యం ప్రయచ్ఛతి, 'కస్మాత్తాని న క్షీయ న్తే ద్యమానాని సర్వదా' ఇతి పురుషోక్ష వా అక్షితిః స హీదమన్నం పునః పునర్జనయతే, 'యో వైతామ తిం వేద' ఇతి పురుషో వా అక్షితిః, స హీదమన్నం ధియా ధియా జనయతే కర్మభిః, యద్ధైతన్న కుర్యాత్క్షీ యేత హ, 'సో న్నమత్తి ప్రతీకేన' ఇతి ముఖం ప్రతీకం, ముఖేనే త్యేతత్. 'స దేవాన పిగచ్ఛతి స ఊర్జముపజీవతి' ఇతి ప్రశంసా. 2**

ఆ తండ్రియే (ప్రజపతి) జ్ఞానంద్వారా, కర్మలద్వారా, సప్తాన్నాలను సృష్టించాడనే విషయం ప్రసిద్ధమే ! అందులో ఒక అన్నం మనమంతా తినేది– ధాన్యాధిరూపంలో ఉండేది. – అది సామాన్యమే ! సాధారణమైనది. ఈ సాధారణమైన అన్నాన్ని ఉపాసించేవాడు పాపవిముక్తుడుకాడు ఎందుచేతనంటే, ఈ అన్నం అన్ని ప్రాణులలో కలసివుంది కాబట్టి– అది అన్ని ప్రాణులకోసం ఉన్నది కాబట్టి ! ఆ ప్రజాపతి హుతము, ప్రహృతము అనే రెండు విధాలైన అన్నాలను దేవతలకోసం విభజించి యిచ్చాడు. అందుచేతనే గృహస్థులు బలి, హవనము అనేవాటిని యిస్తూ ఉంటారు– అంటే దేవతల కోసం హోమంచేసేది హవనం. నైవేద్యంగా ఇచ్చేది బలి, కొంతమంది, దేవతలకు ఇచ్చిన రెండువిధాలైన ఆహారం దర్శము పూర్ణమాసమనే యజ్ఞాలని అంటారు. అందుకని, కోరికలతో కూడిన (సకామేష్టి) పూర్ణమాసమనే యజ్ఞాలని అంటారు. అందుకని, కోరికలతో కూడిన (సకామేష్టి) హోమాలలో ప్రవృత్తులు కాకూడదు. పాలు అనే అన్నాన్ని పశువులకోసం ఇచ్చాడు మానవులు, పశువులు కూడా ముందుగా పాలు ఆధారంగానే బ్రతుకుతున్నాయి. అందుకనే అప్పుడే పుట్టిన శిశువుకు నేయి నాకిస్తారు. లేదా పాలు ఇస్తారు. అట్లాగే అప్పుడే పుట్టిన దూడకు (గడ్డి మేయలేదు కాబట్టి) పాలు యిస్తారు. ప్రాణనక్రియ చేసేవి, చేయనివి అన్నీ కూడా ఈపశ్నం అయిన పాలమీదనే ఆధారపడి ఉంటాయి. అందుచేత ఒక సంవత్సరంపాటు పాలతో హవనం చేసేవాడు అపమృత్యువును జయిస్తాడనీ అంటారు. అట్లా అనుకోకూడదు– యదార్థమేమంటే సంవత్సరందాకా వేచి ఉండనక్కరలేదు– ఏనాడు పాలతోహవనం చేస్తాడో అనాడే అపమృత్యువును జయిస్తాడు. ఈ విధంగా ఉపాసన చేసేవాడు

దేవతలకు పూర్తిగా భక్ష్యప్రదానం చేస్తున్నాడన్నమాట. అయితే ఇట్లా అందరిచేత సర్వదా భక్షింపబడుతూ ఉన్నా, అన్నం పూర్తి గా నాశనం కావటం లేదేమి అనే అనుమానం కలగవచ్చు. దీనికి కారణమేమంటే ఈ అన్నానికి జనకుడైన పురుషుడు అవినాశి కాబట్టి– నాశనం లేనివాడు కాబట్టి ! అతడు అవసరమైనప్పుడల్లా మాటిమాటికి అన్నాన్ని ఉత్పత్తి చేస్తాడు కాబట్టి ! అన్నానికున్న ఈ అవినాశిత్వాన్ని– నాశనం లేకపోవటాన్ని తెలుసుకున్న పురుషుడు కూడా అవినాశియే ! అతడు జ్ఞానం ద్వారా, కర్మద్వారా అన్నాన్ని సృష్టిస్తాడు. ఈ విధంగా ఎప్పటికప్పుడు సృష్టించకపోతే అన్నం నాశనమై పోతుంది. ఈ విధంగా తెలుసుకున్నవాడు ముఖమనే ప్రతీకం (శ్రేష్ఠమైనదాని) ద్వారా అన్నభక్షణం చేస్తాడు. అతడు భోక్త అవుతాడేకాని భోగ్యంకాడు. ప్రతీకంతో– శ్రేష్ఠత్వంతో అతడు దేవత్వాన్ని పొందుతాడు. అమృతంతో బ్రతుకుతాడు అనేది ఫలస్తుతి కోసం చెప్పిన మాటలు. (ఇంతవరకు నాలుగవిధాలైన అన్నాలను గూర్చి చెప్పారు.)

**మం॥ 'త్రీణ్యాత్మనే కురుత' ఇతి మనో వాచం ప్రాణం, తాన్యాత్మనే కురుత, 'అన్యత్ర మనా అభూవం, నాదర్శం', 'అన్యత్రమనా అభూవమ్, నాశ్రౌషమ్' ఇతి, మనసా, హ్యేవ పశ్యతి, మనసా శ్రుణోతి, కామః సంకల్పో విచిత్సా శ్రద్ధా శ్రద్ధా ధృతిరధృతిర్హ్రీర్ధీర్భీ రిత్యేతత్సర్వం మన ఏవ, తస్మాదపి పృష్ఠత ఉపస్పృష్టో మనసా విజానాతి, యః కశ్చ శబ్దో వాగేవ సా ఏషా హ్యన్తమాయత్తా, ఏషాహి న, ప్రాణో పానో వ్యాన ఉదానః సమానో న ఇత్యేతత్సర్వం ప్రాణ ఏవ; ఏతన్మయో వా అయమాత్మా, వాఙ్మయో మనో మయః ప్రాణమయః. 3**

ఆ పరమపితయైన ప్రజాపతి మనస్సు, వాక్కు, ప్రాణం అనే మూడు విధాలైన అన్నాలను తనకోసం ఉంచుకొన్నాడు. "నా మనస్సు ఎక్కడో ఉంది. అందుచేత నేను వినలేదు" అని అంటూ ఉంటాము గదా ! దీనివల్ల మనకు ఏమి స్పష్టమౌతోంది ? మనస్సుతోనే మనం వింటామని, మనస్సుతోనే మనం చూస్తామని తేలుతోంది. కోరిక, సంకల్పము, సంశయము ఆస్తిక్యబుద్ధి, శ్రద్ధ, దానికి వ్యతిరేకమైన అశ్రద్ధ, ధారణశక్తి, ధృతి, అధృతి, లజ్జ, బుద్ధి, భయం ఇవన్నీ కూడా మనస్సు తప్ప వేరేమి కాదు. అందు చేతనే వీపు మీద స్పృశించినా (చూడకపోయినా) మానవుడు మనస్సుతో తెలుసు కుంటున్నాడు. కాబట్టి మనస్సు ఉన్నదన్న మాట. ఏ విధమైన శబ్దమైనా వాగ్రూపమే ! ఎందుచేతనంటే, అది తన వాచ్యార్థాన్ని అనుగమిస్తుంది కాబట్టి. అంటే అది (శబ్దం) ఒక వస్తువును ఇది ఫలానా అని నిర్ణయిస్తుంది. అది మాత్రం వ్యక్తంకాదు. ఇందవరకు మనస్సు, వాక్కు ఈ రెంటిని విశ్లేషించారు. ఇక ప్రాణం ! ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు, అన్నము ఇవన్నీ ప్రాణం తప్ప వేరుకావు. ఈ శరీరం వీటివల్లనే (మనస్సు,

వాక్కు, ప్రాణం) గుర్తింపబడుతోంది. అంటే విశదమౌతోంది. (క్రిందటి మంత్రంలో చెప్పిన నాలుగు ఈ మంత్రంలో చెప్పిన మూడు మొత్తం సప్తాన్నాలయినాయి.)

తరువాతి 4, 5, 6, 7 మంత్రాల్లో ప్రజాపత్య సంబంధమైన అన్నాలకు (మనస్సు, వాక్కు, ప్రాణం) ఆధిభౌతిక విస్తారాన్ని ప్రతిపాదిస్తున్నారు.

**మం॥ త్రయో లోకా ఏత ఏవ, వాగేవాయం లోకః మనో**
**న్తరిక్షలోకః ప్రాణో సౌ లోకః 4**

**త్రయో వేదా ఏత ఏవ, వాగేవర్వేదః మనో యజు**
**ర్వేదః ప్రాణః సామవేదః 5**
**దేవాః పితరో మనుష్యా ఏత ఏవ, వాగేవ దేవాః**

**మనః పితరః । ప్రాణో మనుష్యాః 6**
**పితా మాతా ప్రజైత ఏవ, మన ఏవ పితా, వాఙ్మాతా**

**ప్రాణః ప్రజా. 7**

ఈ మూడూ (వాక్కు, మనస్సు, ప్రాణం) మూడు లోకాలు. వాక్కు భూలోకం, మనస్సు అంతరిక్షలోకం (భువర్లోకం), ప్రాణమనేది ఆలోకం, సువర్లోకం, స్వర్గ లోకం.

ఈ మూడు మూడూవేదాలు, వాక్కు ఋగ్వేదం, మనస్సు యజుర్వేదం, ప్రాణం సామవేదం.

ఈ మూడు దేవ పితృ మానవులు, వాక్కు దేవతలు, మనస్సు పితృ దేవతలు, ప్రాణం మానవులు.

ఈ మూడు తల్లి, తండ్రి, సంతానం అవుతున్నాయి. వాక్కు తల్లి, మనస్సు తండ్రి, ప్రాణం సంతానం.

**మం॥ విజ్ఞాతం విజిజ్ఞాస్యమవిజ్ఞాతమేత ఏవ, యత్కించ విజ్ఞాతం వాచ స్తద్రూపం, వాగ్ఘి విజ్ఞాతా,**
**వాగేనం తద్భూత్వావతి. 8**

తెలిసినది, తెలుసుకోవలసినది, తెలియనిదికూడా ఈమూడే! అంటే వాక్కు అనేది తెలిసినది అంటే తెలిసినవాడు. ఈ విధమైన వాక్కు యొక్క గొప్పదనాన్ని చెపుతున్నారు– వాక్కే విజ్ఞాతమై తెలిసినదై ఈ విషయం తెలుసుకున్నవానిని రక్షిస్తుంది.

**మం॥ యత్కించ విజిజ్ఞాస్యం మనసస్తద్రూపం, మనో**
**హి విజిజ్ఞాస్యమ్, మన ఏనం తద్భూత్వావతి. 9**

విస్పష్టంగా తెలుసుకోవలసింది అంతా మనస్సు రూపంలో ఉంటుంది. ఎందుచేతనంటే, మనస్సే సంశయాత్మకమైన దైనందున తెలుసుకోవలసింది అవుతోంది. మనస్సు యొక్క ఈ శక్తిని తెలుసుకున్న వానిని మనస్సే విజిజ్ఞాస్యమై – తెలుసుకోవలసినదై రక్షిస్తుంది.

**మం॥ యత్కించా విజ్ఞాతం ప్రాణస్య తద్రూపం, ప్రాణో**
**హ్యతిజ్ఞాతః ప్రాణ ఏనం తద్భూత్వావతి. 10**

మనకు తెలియనవిది అంతా కూడా (ప్రాణస్వరూపమే ! ప్రాణమే అవిజ్ఞాతమై తన (ప్రాణం యొక్క) మహత్వాన్ని తెలుసుకున్నవానిని కాపాడుతుంది. ఇంతవరకు వాఙ్మనః ప్రాణాల అధిభౌతిక విస్తారాన్ని వ్యాఖ్యానించారు. ఇక అధిదైవిక విస్తారాన్ని చెపుతున్నారు–

**మం॥ తస్యై వాచః పృథివీ శరీరమ్, జ్యోతీరూపమయమగ్ని ః తద్యావత్యేవ వాక్, తావతీ పృథీవీ, తావానయ మగ్నిః. 11**

ప్రజాపతికి అన్నస్వరూపమైన వాక్కుకు భూమియే శరీరం. బాహ్య ఆధారం. ఈ భూమికి ఆధేయస్వరూపమైన పార్థివాగ్నియే దాని ప్రకాశాత్మక కారణం. ప్రజాపతికి రెండు విదాలైన వాక్కు ఉంది. ఒకటి అప్రకాశక రూపం. రెండవది ప్రకాశకరూపం. కార్యకరణ రూపాలైన, (ఆధారమైన పృథివి, ఆధేయమైన అగ్ని) ఈ రెండూ ప్రజాపతి యొక్క వాక్కే. భూమి, అగ్ని ఈ రెండూ కూడా హిరణ్యగర్భుని వాగింద్రియమే ! వాక్కు వ్యాపించినంతమేర పృథివి, పృథివి వ్యాపించినంతమేర అగ్ని వ్యాపిస్తుందని భావం.

**మం॥ అథైతస్య మనసోద్యౌః శరీరం, జ్యోతీరూపమసా వాదిత్యః, తద్యావదేవ మన, తావతీద్యౌ, తావా నసావాదిత్యః, తౌ మిథునం సమైతాం, తతః ప్రాణో జాయత; స ఇంద్రః, స ఏషో సపత్నః, ద్వితీయో వై సపత్నః, నాస్య సపత్నో భవతి య ఏవం వేద. 12**

అట్లాగే ప్రజాపతికి అన్న స్వరూపమని చెప్పుకొన్న మనస్సు యొక్క శరరీం (ఆధారం) ద్యులోకం. సూర్యుడు జ్యోతిస్వరూపం. అక్కడ (ద్యులోకంలో) మనస్సు వ్యాప్తమై ఉన్నంత మేర ద్యులోకము, ద్యులోకం వ్యాప్తమై ఉన్నంతమేర మనస్సూ, అంతమేర సూర్యుడూ కూడా వ్యాపించి ఉన్నారు. ఆదిత్యుడు, అగ్ని, ఈ ఇద్దరి సంసర్గం వల్ల ప్రాణం పుట్టింది. అదే ఇంద్రుడు– (ఉపాసన కోసం ఇట్లా చెప్పారు) అతడు శత్రుహీనుడు. ఎందుచేతనంటే, తనకంటే రెండవవాడుంటే, వాడు శత్రువే అవుతాడు. ఎవరూ లేరు కాబట్టి శత్రుహీనుడు. ఈ రహస్యం తెలుసుకున్నవాడికి శత్రువులు ఉండరు.

**మం॥ అథైతస్య ప్రాణస్యాపః శరీరమ్, జ్యోతీరూప మసౌ చంద్రః, తద్యావానేత ప్రాణః, తావత్య అసః, తావా నసౌ చంద్రః, త ఏతే సర్వ ఏవ సమాః, సర్వే నన్తాః, స యో హైతాన**

**న్తవత ఉపాస్తే న్తవన్తం స లోకం జయతి, అథ యో హైతానన్తానుపాస్తే నన్తం స లోకం జయతి. 13.**

ఈ ప్రాణానికి శరీరం (ఆధారం) జలం. చంద్రుడు జ్యోతి రూపుడు. అక్కడ ప్రాణం విస్తరించినంతమేర జలం విస్తరిస్తుంది. జలం విస్తరించినంతమేర చంద్రుడు విస్తరిస్తాడు. ఇవి అన్నీ సమానమే ! ఇవన్నీ ప్రపంచం ఉన్నంతవరకు ఉండేవే కాబట్టి అనంతమైనవే ! ఉపాసకుడు ఈ మూడింటిని (ప్రాణం, జలం, చంద్రుడు) పరిమితమైనవిగా తలచి పరిమితమైన లోకాలకు పోతాడు, వీటిని అనంతమైనవిగాతలచి ఉపాసిస్తే అనంతమైన లోకాలకు పోతాడు.

మం॥ **స ఏష సంవత్సరః ప్రజాపతిః షోడశ కలః, తస్య రాత్రయ ఏవ పంచదశ కలాః, ధ్రువైవాస్య షోడశీ కలా; స రాత్రిభిరేవా చ పూర్యతే ప చక్షీయతే, సో మావాస్యాం రాత్రిమేతయా షోడష్యా కలయా సర్వమిదం ప్రాణ భృదను ప్రవిశ్య తతః ప్రాతర్జాయతే; తస్మాదేతాం రాత్రిం ప్రాణభృతః ప్రాణం న విచ్ఛి న్ద్యాత్, అపి కృకలాసస్య, ఏతస్యా ఏవ దేవతాయా అపచిత్యై. 14**

పైన చెప్పిన మూడు– మనస్సు, వాక్కు ప్రాణం– రూపంగా కలిగి ఉన్న ప్రజాపతికి పదహారుకళలు ఉన్నాయి–(తిథులు) రాత్రులే 15 కళలు, పదహారవదైన కళ ఎన్నడూ క్షీణంకానిది కాబట్టి అది నిత్యమైనది. సంవత్సర రూపమైన ఈ ప్రజాపతి రాత్రులవల్లనే శుక్లపక్షంలో వృద్ధిచెందుతాడు. కృష్ణపక్షంలో క్షీణిస్తాడు. అమావాస్య రాత్రులందు ఈ సంవత్సర రూపమైన ప్రజాపతి ఈ పదహారవ కళలో అన్ని ప్రాణులందు అనుప్రవేశం చేసి, మరునాడు ప్రాతః కాలంలో రెండవ కళతో కూడిన వాడై ఉద్భవిస్తాడు. అందుచేత, ఆ రాత్రియందు ఏ ప్రాణియొక్క ప్రాణము–తీయురాదు– ఏ ప్రాణిని చంపరాదు. అంతేకాదు, ఈ సంవత్సరం రూపమైన ప్రజాపతి పూజ నిమిత్తం అమావాస్య నాటి రాత్రివేళ అమంగళ స్వరూపమైనదని తలచేటటువంటి, సామాన్యంగా ప్రజలు చంపేటటువంటి తొండను కూడా చంపకూడదని నిషేధింపబడ్డది.

మం॥ **యో వై స సంవత్సరః ప్రజాపతిః షోడశ కలః, అయ మేవ స యో యమేవం విత్పురుష, తస్య విత్తమేవ పంచదశ కలాః ఆత్మైవాస్య షోడశీ కలా, స విత్తే నైవా చపూర్యతే ప చ క్షీయతే, త దేతన్నభ్యం యదయమాత్మా, ప్రధిర్విత్తమ్, తస్మాద్యద్యపి సర్వ జ్యానిం జీయతే, ఆత్మనా చేజ్జీవతి, ప్రధినా గాదిత్యే వాహుః, 15**

ఈ పదహారు కళలు కలిగినట్టి సంవత్సర ప్రజపతి ఇతడే ! ఈ విధంగా అన్నత్రయ రూపుడైన (మనస్సు, వాక్కు, ప్రాణం) ప్రజాపతిని తెలుసుకున్న వానికి విత్తమే (ధనమే) పదిహేను కళలు. శరీరమే ఈ రహస్యవేత్తకు పదహారవ కళ. అతడు చంద్రునిలాగానే ఆవులు, గుఱ్ఱాలు

మొదలైన ధనంతో వృద్ధి చెందుతాడు. మళ్ళీ క్షీణిస్తూ ఉంటాడు– కృష్ణ పక్షంలో చంద్రునిలాగా, ఈ శరీరం రథచక్రానికి ఉండే నాభిలాంటిది. సంపదలు ఆ నాభిలో బిగించి ఉండే ఆకులవంటివి. అందుచేతనే ధనము, సంపద క్షీణించిపోగా శరీరంతో మిగిలి ఉన్నవానిని చూచి కేవలం చక్ర నాభిలాగా ఉన్నాడని అంటారు. అంటే మళ్ళీ ధనాన్నిపొంది సుఖాన్ని పొందుతాడని భావం. సంపద పోయినా చక్రానికి మధ్య ఉండే కుండలాగా ఉండే శరీరం పోదని భావం.

**మం॥ అథత్రయో వావ లోకాః– మనుష్యలోకః పితృ లోకో దేవలోక ఇతి; సో యం మనుష్యలోకః పుత్రే ణైవ జయ్యః, నాన్యేన కర్మణా, కర్మణా పితృలోకః, విద్యయా దేవలోకః, దేవలోకో వేలోకానాం శ్రేష్ఠః, తస్మాద్విద్యాం ప్రశంసన్త. 16**

మనుష్యలోకం, పితృలోకం, దేవలోకం అని మూడులోకాలున్నాయి. ఈ మనుష్యలోకాన్ని పుత్రుని ద్వారా జయించగలుగుతాము. ఇతర కర్మల వల్ల జయించలేము. సాధించగలుగుతాము. అట్లాగే ఉపాసనవల్ల– విద్యయల్ల దేవ లోకాన్ని సాధించగలుగుతాము. ఈ మూడు లోకాల్లోను దేవలోకం శ్రేష్ఠమైనది. అందుచేత, ఆ దేవలోకాన్ని పొందటానికి సాధనభూతమైన విద్యను ప్రశంసిస్తూ ఉంటారు.

వెనుకటి మంత్రంలో సంపదను గూర్చి చెప్పారు– ఈ ప్రపంచంలో సంపదయొక్క మహిమను వర్ణించారు. ఇక ఈ లోకాన్ని సంపదద్వారా అనుభవించి, కర్మలుచేసి, ఏ విధంగా తరిస్తాడో చెప్పబోతున్నారు.

**మం॥ అథాతః సంప్రత్తిః – యదా ప్రైష్యన్మన్య తే థ పుత్రమాహ, త్వం బ్రహ్మ, త్వం యజ్ఞః, త్వం లోక ఇతి, స పుత్రః ప్రత్యాహ, అహం బ్రహ్మ, అహం యజ్ఞః, అహం లోక ఇతి; యద్వై కించానూక్తం తస్య సర్వస్య బ్రహ్మేత్యేకతా. యే వై కే చ యజ్ఞా స్తేషాం సర్వేషాం యజ్ఞ ఇత్యేకతా, యే వై కే చ లోకా స్తేషాం సర్వేషాం లోక ఇత్యేకతా,ఏతా వద్వా ఇదం సర్వం, ఏతన్మా సర్వం సన్నయమితో భువజ దితి, తస్మాత్ పుత్రమనుశిష్టం లోక్యమాహు, తస్మా దేవమనుశాసతి, స యదైవం విదస్మాల్లోకాత్ప్రైతి, అథైభిరేవ ప్రాణైః సహ పుత్రమాఇశతి స యద్యనేనం కించిదక్ష్ణ యా కృతం భవతి, తస్మాదేనం సర్వ స్మాత్ పుత్రో ముంచతి, తస్మాత్పుత్రో నామ, స పుత్రే ణై వాస్మిం ల్లోకే ప్రతితిష్ఠతి, అథైనమేతే దైవాః ప్రాణా అమృతా ఆవిశంతి. 17**

ఇప్పుడు సంప్రదాన కర్మను గురించి చెపుతున్నారు సంప్రదాన కర్మ అంటే తండ్రి, తన బాధ్యతలను అంత్యకాలంలో పుత్రునికి అప్పగించటం.

తండ్రి తనకు మరణకాలం సమీపించిందని తెలుసుకొని, పుత్రుని పిలిచి అంటాడు– "నీవు బ్రహ్మవు. నీవు యజ్ఞానివి ; నీవు లోకానివి' అని. ఈ విధంగా తండ్రిచేత బోధింపబడిన పుత్రుడు సమాధానంగా అంటాడు. "అవును ! నేను బ్రహ్మను. నేను యజ్ఞాన్ని, నేనులోకాన్ని" అని. ఈ మూడు వాక్యాలను శ్రుతి బాగా వివరించే ఉంది. తండ్రి, కుమారుడు బ్రహ్మవేత్త కావాలని, యజ్ఞశీలుడు కావాలని, లోకంలో యశస్వి (కీర్తిమంతుడు) కావాలని కోరతాడు. కుమారుడు ఆ విధంగానే తండ్రి కోరిక ననుసరించి శుభకర్మలు చేస్తాడు. తండ్రి ఈ విధంగా తలుస్తాడు– "ఈ ప్రపంచంలో చదవబడినది, ఇంకా చదవటానికి మిగిలి ఉన్నట్టి స్వాధ్యాయులు (వేదాలు) అంతా బ్రహ్మమే ! అట్లాగే చేసినట్టి, చేయవలసినట్టి యజ్ఞాలన్నీ 'యజ్ఞం' అనే పదంలోనే ఏకీభావం చెందుతాయి. ఇవే గృహస్థు నిర్వర్తించాల్సిన కర్తవ్యాలు." తండ్రి ఇంకా ఈ విధంగా అనుకుంటాడు– "బ్రహ్మము, యజ్ఞం లోకాలు, నా కుమారుడే ! కాబట్టి, అతడే నన్నీ సంసార బంధనాల నుండి విముక్తుణ్ణి చేస్తాడు" అని.

ఈ విధంగా అనుశాసింపబడినట్టి, యోగ్యుడు, శిక్షితుడు అయిన కుమారుడు లోకప్రాప్తికి అనుకూలమైనవాడని తండ్రి అనుకుంటాడు. అందుచేతనే తండ్రి ఈ విధంగా బోధించటం.

ఈ విధమైన విజ్ఞానం పొంది ఉన్న తండ్రి ఈ లోకం నుండి నిష్క్రమించేటప్పుడు తన వాక్కు, మనస్సు, ప్రాణాలతోబాటు పుత్రునిలో లీనమైపోతాడు. ఒకవేళ, అజాగ్రత్తవల్ల, పొరపాటువలన, ఏదైనాకర్మ అతనివల్ల (తండ్రివల్ల) నిర్వర్తింపబడక, మిగిలిపోయి ఉంటే దానినుండి పుత్రుడు తండ్రిని విముక్తుణ్ణి చేస్తాడు– ఆ కర్మలను తాను నిర్వర్తించి లోకప్రాప్తికి ఉన్న ఆటంకాన్ని తొలగిస్తాడు– అతన్ని ముక్తుణ్ణి చేస్తాడు. అందుచేతనే అతనికి పుత్రుడనే పేరు వచ్చింది. అపూర్ణమైన కర్మను పూర్తిచేసే తండ్రిని రక్షిస్తాడు కాబట్టి. ఆ తండ్రి పుత్రుని ద్వారానే ఈ లోకంలో ప్రతిష్ఠితుడౌతాడు– ఆధారం పొందుతాడు. పిమ్మట ఆ తండ్రిలో వాగాది హిరణ్యగర్భ సంబంధమైనట్టి, అమరణధర్మమైనట్టి వాఙ్మనః ప్రాణాలు ప్రవేశిస్తాయి.

**మం॥ పృథివ్యై చైనమగ్నేశ్చదైవీ వాగావిశతి; సా వై**
**దైవీ వాగ్యయా యద్యదేవ వదతి తత్తద్భవతి. 18**

ఈ విధమైన సంప్రత్తికర్మ నిర్వర్తించినవానిలో (పుత్రునికి తన విధులన్నింటిని అప్పగించినవానిలో) పృథివి, అగ్ని ఈ రెంటితో కూడిన అధిదైవికమైన వాక్కు ఆవేశిస్తుంది. ఎందుచేతనంటే, పృథివి, అగ్ని రూపమైన దేవీ వాక్కు అన్ని విధాలైన వాక్కులకు ఉపాదానభూతమైనది కాబట్టి. అది అమోఘమైన దైవీవాక్కు కాబట్టి అతడు ఏ విధంగా అంటే ఆ విధంగా తప్పక జరిగి తీరుతుంది. (అజ్ఞానియైనవానిలో ఈ వాక్కే ప్రాపంచిక సంబంధాలవల్ల, కేవలం శారీరకంగా ఉండి శక్తిహీనంగా ఉంటుంది. ఋషియైనవానిలో వాక్కు పాపరహితమై,

అసత్యదూరమై, దైవీశక్తి సంపన్నమై, అడ్డంకులు లేనిదై ఉంటుంది. కాబట్టి జలంలాగా, కాంతిలాగా సర్వత్ర వ్యాపించి అమోఘశక్తి సంపన్నమై ఉంటుంది.)

**మం॥ దివశ్చైన మాదిత్యాచ్చ దైవం మన ఆవిశతి, తద్వై దేవం మనోయేనానన్త్వేవ భవతి, అథో న శోచతి. 19**

అటువంటివానిలో ద్యులోకం నుండి, సూర్యునినుండి, దైవీశక్తితో కూడిన మనస్సు ఆవహిస్తుంది. స్వభావతః నిర్మలమై ఉండటంవల్ల మనస్సు దైవీశక్తి సంపన్నమై ఉంటుంది. అటువంటి మనస్సువల్ల అతనికిసుఖం కలుగుతుంది. దుఃఖమనేది ఎన్నడూ కలగదు.

**మం॥ అద్భ్యశ్చైనం చంద్రమసశ్చ దైవః ప్రాణ ఆవిశతిః, స వై దైవః ప్రాణో యః సంచరంశ్చా సంచరంశ్చ న వ్యథతే, అథో న రిష్యతి, స ఏవం విత్సర్వేషాం భూతానామాత్మా భవతి, యథైషా దేవతైనం సః, యథైతాం దేవతాం సర్వాణి భూతాన్యవన్తి, ఏవం హైవంవిదం సర్వాణి భూతాన్యవన్తి, యదుకించేమాః ప్రజాః శోచన్తి, అమైనాసాం తద్భవతి, పుణ్యమే వాముం గచ్ఛతి, న హ వై దేవాన్ పాపంగచ్ఛతి. 20**

జలం నుండి, చంద్రుని నుండి వచ్చిన దైవ సంబంధమైన ప్రాణం అతనిలో చేరుతుంది. సుఖదుఃఖాదులు లేనందున అదే దైవీప్రాణం. అది దైవ సంబంధమైనది అయినందున సమిష్టిరూపంలో, వ్యష్టిరూపంలో ప్రాణుల్లో సంచరిస్తూ ఉన్నా, అది బాధపడదు. నాశనమూ కాదు. ఈ విషయాన్ని తెలుసుకున్నవాడు తానే సమస్త ప్రాణుల ఆత్మ అవుతాడు. అంటే సమస్త ప్రాణుల ప్రాణము. వాక్కు. మనస్సు అవుతాడు అని భావం. హిరణ్యగర్భునివలెనే ఆపరిచ్ఛిన్నుడు (పరిమితమైన రూపం లేనివాడు) అవుతాడు. సమస్త దేవతలు హిరణ్యగర్భుని సేవించినట్లే ఈ ఉపాసకుణ్ణి కూడా సేవిస్తారు. ఈ జీవరాసులకు కలిగే శోకము, దుఃఖము ఆ ప్రాణులతో పాటే ఉంటుంది. ఈ ఉపాసకునికి ఈ విద్వాంసునికి సంక్రమించదు. అతనికి పుణ్యం మాత్రమే సంక్రమిస్తుంది– దేవత అయినాడు కాబట్టి– దేవతలవద్దకు పాపం పోదు కాబట్టి !

**మం॥ అథాతో వ్రతమీమాంసా; ప్రజాప్రతిర్హ కర్మాణి ససృజే, తాని సృష్టాన్యన్యోన్యేనాస్పర్ధన్త– వదిష్యా మ్యేవాహమితి వాగ్దధ్రే ద్రక్ష్యామ్యహమితి చక్షుః, శ్రోష్యామ్యహమితి శ్రోత్రమ్, ఏవమన్యాని కర్మాణి యథాకర్మః, తాని మృత్యుః శ్రమో భూత్వోపయేమే, తాన్యాప్నోత్, తాన్యాప్త్వామృత్యురవారున్ధ; తస్మాచ్ఛ్రామ్యత్యేవవాక్, శ్రామ్యతి చక్షుః, శ్రామ్యతి శ్రోత్రం, అథేమమేవ నాప్నోద్యోఽయం మధ్యమః ప్రాణః, తాని జ్ఞాతుం దధ్రిరే అయం వై నః శ్రేష్ఠో యః సంచరంశ్చాసంచరంశ్చ న వ్యథతే, అథో న రిష్యతి, హన్తాస్యైవ సర్వే రూపమసామేతి, త ఏత స్యైవ సర్వే రూప మభవన్, తస్మాదేత ఏతా నాఖ్యాయన్తే ప్రాణా**

**ఇతి; తేన హ వావ తత్కులమా చక్షతే యస్మిన్కులే భవతి య ఏవం వేద; య ఉ హైవంవిదా స్పర్ధతేఽనుశుష్యతి, అనేశుష్య హైవా న్తతో మ్రియత ఇత్యధ్యాత్మమ్ 21**

ఇప్పుడిక ఇక్కడ నుండి వ్రతాన్ని గురించిన మీమాంస– విచారణ చేస్తున్నారు– అంటే ఉపాసనాకర్మను గురించిన విచారణ చేయబడుతోంది– ప్రజాపతి కర్మలకు సాధనభూతములైనట్టి వాక్కు మొదలైన ఇంద్రియాల్ని సృష్టించాడు. సృష్టింపబడ్డ ఆ ఇంద్రియాలు తమలో తాము పోట్లాడుకోవటం ప్రారంభించాయి. 'నేను ఎల్లప్పుడు మాట్లాడుతూనే ఉంటాను' అని దీక్షపూనింది వాగింద్రియం. 'నేను ఎల్లప్పుడు చూస్తూనే ఉంటాను' అని వ్రతం పట్టింది చక్షురింద్రియం. 'నేను ఎల్లప్పుడూ వింటూనే ఉంటాను అని దీక్షపూనింది శ్రోత్రేంద్రియం. ఇట్లాగే మిగతా ఇంద్రియాలన్నీ తమతమ పనులు విరామం లేకుండా చేస్తామని దీక్ష వహించాయి. అప్పుడు వీటన్నింటికి మారకమైన మృత్యువు, అలసట రూపంలో వాటినన్నింటిని అడ్డగించి, వాటివాటి పనులకు అపరోధం కలిగించింది. అందుచేత మాట్లాడుతున్న వాక్కు అలసిపోయింది. చూచే కన్నులు అలసిపోయాయి. వింటూన్న చెవులు అలసిపోయాయి. కాని వీటి అన్నింటిలోను వ్యాప్తమై ఉన్న ప్రాణంలో మాత్రం ఈ అలసట (మృత్యువు) వ్యాపించ లేకపోయింది. అందుచేత ఈ సంఘటనకు ఆశ్చర్యపడిన ఇంద్రియాలు అలసట ఎరుగని ప్రాణాన్ని గురించి తెలుసుకోవాలని అనుకున్నాయి. "నిజానికి మన అందరికంటే ప్రాణమే శ్రేష్ఠమైనది.– అది సంచరించేటప్పుడు, సంచరించనప్పుడు కూడా అలసిపోదు– క్షీణించదు. కాబట్టి, మనమంతా కూడా ఈ శ్రేష్ఠమైన ప్రాణస్వరూపాన్ని పొందాలి" అని అనుకున్నాయి. ఈ విధంగా అనుకొని ఆ వాగాది ఇంద్రియాలు అన్నీ ముఖ్యప్రాణం రూపాన్ని దాల్చాయి. అందుచేతనే వాటి అన్నింటికి ప్రాణమనే వ్యవహారనామం వచ్చింది. అందుచేతనే ఇది తెలిసిన విద్వాంసునితో ఎవరైనా పోట్లాడితే వాళ్ళు క్షీణించి పోతారు– ఎండిపోతారు. ఎండిపోయి మరణిస్తారు. ఇదే శరీరానికి సంబంధించిన ప్రాణదర్శనం (అధ్యాత్మ ప్రాణదర్శనం). తరువాత అధిదైవ దర్శనాన్ని గురించి చెపుతారు.

**మం॥ అథాధిదైవతం–జ్వలిష్యామ్యేవాహమిత్యగ్నిర్దధ్రే, తప్స్యామ్యహమిత్యాదిత్యః, భాస్యామ్యహమితి చంద్రమాః, ఏవమన్యా దేవతా యథా దైవతం; స యథైషాం ప్రాణానాం మధ్యమః ప్రాణః, ఏవ మేతా సాం దేవతానాం వాయుః, నిమ్లోచన్తి హాన్యా దేవతాః, న వాయుః, సైషాన స్తమితా దేవతా యద్వాయుః. 22**

ఇక దేవతా విషయకమైన దర్శనాన్ని గురించి–

అగ్ని, 'నేను ఎల్లప్పుడూ మండుతూనే ఉంటాను' అని దీక్ష పూనింది. సూర్యుడు, 'నేనుసర్వదా తపిస్తూనే (వేడిని ఇస్తూనే) ఉంటాను' అని దీక్షపట్టాడు. అట్లాగే చంద్రుడు, 'నేను ఎల్లప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటాను' అని దీక్షపూనాడు. ఈ విధంగానే మిగతా దేవతలంతా ఎడతెగకుండా

తమతమ పనులు చేస్తామని దీక్షవహించారు- (వాక్కు మొదలైన ఇంద్రియాలలాగానే) వాగాది ఇంద్రియాల్లో ప్రాణంలాగాలనే ఈ దేవతల్లో వాయువు వ్యాప్తమై ఉంది. అందుకనే ఇతర దేవతలంతా అస్తమించినా వాయువు మాత్రం అస్తమించదు. ఈ వాయుదేవతయే ఎన్నడూ అస్తమించని దేవత.

**మం॥ అథైష శ్లోకో భవతి- 'యతశ్చోదేతి సూర్యః, అస్తం యత్ర చ గచ్ఛతి' ఇతి ప్రాణాద్వా ఏష ఉదేతి, ప్రాణేఽస్తమేతి; 'తం దేవాశ్చక్రిరే ధర్మం, స ఏవాద్య, స ఉశ్వః' ఇతి, యద్వా ఏతేఽముర్హ్యధ్రియన్త త దేవాప్యద్య కుర్వన్తి, తస్మాదేక మేవ వ్రతం చరేత్, ప్రాణ్యాచ్చైవాపాన్యాచ్చ, నేన్మా పాప్మా మృత్యురాప్నువదితి; యద్యు చ రేత్సమాపిపయిషేత్, తేనో ఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోకతాం జయతి. 23**

'ఏ వాయువులో సూర్యుడు ఉదయిస్తున్నాడో, ఏ వాయువులో అస్తమిస్తున్నాడో అనే మంత్రార్థాన్ని విశదీకరిస్తున్నారు.

అతడు ప్రాణంలోనే ఉదయించి, ప్రాణంలోనే అస్తమిస్తున్నాడు. ఈ ధర్మాన్నే ఇతరదేవతలూ పాటిస్తున్నారు. ఇతర దేవతలు అంటే సూర్యాగ్ని చంద్రాదులు అని ఉద్దేశ్యం అధ్యాత్మ దేవతలు (ఇంద్రియాలు) ప్రాణవ్రతాన్ని, అధిదైన దేవతలు (సూర్యాగ్ని చంద్రాదులు) వాయు వ్రతాన్ని అవలంబించారు. ఆ వ్రతం అనాడు చేశారు. ఈనాడూ చేస్తున్నారు. అందుచేత ప్రతివ్యక్తీ ఒకే వ్రతాన్ని ఆచరించాలి. -ప్రాణాపానాలనే (ఊపిరి పీల్చటం, వదలటం) ఒక కర్మను మాత్రమే చేయాలి. లేకపోతే మృత్యువు (అలసట) ఇంద్రియాలను అణచివేసినట్లే నన్ను కూడా అణచివేస్తుందేమోననే భయంతో ఈ విధమైన వ్రతాన్ని (ఉచ్ఛ్వాస నిశ్వాసల్ని) ఆచరించాలి. ప్రాణవ్రతాన్ని ప్రారంభిస్తే దానిని పూర్తిచేద్దామని కూడా అనుకోవాలి (లేకపోతే మృత్యువు- అలసట- అణచివేస్తుంది.) ఈ విధమైన ప్రాణవ్రతాన్ని పూని ఆచరించేవాడు ఆ దేవతతో పాటు (హిరణ్యగర్భుడు లేదా సమిష్టి ప్రాణంతో పాటు) సాయుజ్యం, సాలోక్యం పొందుతాడు- అతనితో కలసి అతడున్న లోకాన్ని పొందుతాడు.

## ఆరవ బ్రాహ్మణం

**మం॥ త్రయం వా ఇదం- నామ రూపం కర్మ, తేషాం నామ్నాం వాగిత్యేత దేషాముక్థమ్, అతో హి సర్వాణి నామాన్యుత్తిష్ఠన్తి, ఏత దేషాం సామ, ఏతద్ధి సర్వైర్నా మభిః సమం, ఏత దేషాం బ్రహ్మ, ఏతద్ధి సర్వాణి నామాని బిభర్తి. 1**

నామము, రూపము, కర్మ ఈ మూడింటి సముదాయాన్ని త్రయమంటారు. నామములు (పేర్లు) అన్నింటికి వాక్కు కారణం. అంటే పేర్లు అన్నీ ఈ వాక్కు నుండి (శబ్దం నుండి) పుడుతున్నాయి. ఈ వాక్కు అనేదే నామాలకు సామం. ఎందుచేతనంటే, దేవదత్తుడు, యజ్ఞదత్తుడు మొదలైన పేర్లన్నీ ఈ వాక్కు (సామం) వల్లనే విభజింప బడుతున్నాయి. ఈ వాక్కు (సామం) అన్ని పేర్లకు సమానంగా ఉంటుంది. అంటే, వాగ్రూపమైన సామాన్యం నుండే నామరూపాత్మకమైన విశేషవిభాగం లోకంలో చూస్తున్నాము. కాబట్టి పేరుకు (నామానికి) ఉపాదానకరాణం వాక్కు అన్నమాట. ఈవాక్కే నామానికి బ్రహ్మ. అంటే ఆత్మ అన్నమాట. ఎందుచేతనంటే, ఎన్ని రకాల పేర్లు ఉన్నా వాటి అన్నింటిని ధరించి పోషించేది ఈ వాక్కే ! వాక్కు లేకపోతే నామమే లేదు గదా !

**మం॥ అథ రూపాణాం చక్షురిత్యేత దేషాముక్థమ్, అతో హి సర్వాణి రూపాణ్యుత్తిష్ఠన్తి, ఏతదేషాం సామ, ఏతద్ది సర్వై రూపైః సమం; ఏతదేషాం బ్రహ్మ; ఏతద్ధి సర్వాణి రూపాణి బిభర్తి. 2**

ఇక ఇప్పుడు తెలుపు, నీలం మొదలైన రూపాలకు సామాన్యమైనది (ఉపాదనకారణం) కన్ను. ఈ చక్షువువల్లనే సమస్త రూపాలు పుడుతున్నాయి. కండ్లు లేకపోతే రూపమే లేదు గదా ? కాబట్టి, ఈ చక్షువులే ఆ రూపాలకు సామం. ఎందుచేతనంటే, సమస్త రూపాలను ప్రకాశింప చేసేది కాబట్టి– వాటి అన్నింటిలోనూ (రూపాలన్నింటిలోను) సమంగా ఉండేది కాబట్టి. ఈ చక్షువులే ఈ నీలము మొదలైన రూపాలన్నింటికి ఆత్మ– అన్ని రూపాలను ఇదే ధరిస్తోంది కాబట్టి !

**మం॥ అథ కర్మణా మాత్మేత్యేతదేసాముక్థమ్, అతో హి సర్వాణి కర్మాణ్యుత్తిష్ఠన్తి; ఏతదేషాం సామ, ఏతద్ధి సర్వైః కర్మభిః సమం, ఏతదేషాం బ్రహ్మ; ఏతద్ధి సర్వాణి కర్మాణి బిభర్తి; తదేతత్త్రయం సదేకమయ మాత్మా, ఆత్మో ఏకః సన్నేతత్త్రయమ్; త దేత దమృతం సత్యేన ఛన్నం, ప్రాణా వా అమృతం, నామ రూపే సత్యం, తాభ్యామయం ప్రాణశ్ఛన్నః. 3**

ఇక కర్మలకు సామాన్యమైన ఆత్మను గూర్చి– కదలిక, దర్శనం, మననము మొదలైన సమస్త కర్మలకు శరీరమనేది సామాన్యము. ఈ శరీరమే సమస్త కర్మలకు ఉపాధాన కారణం. ఈ శరీరంవల్లనే అన్ని పనులు జరుగుతున్నాయి; కాబట్టి శరీరం వీటి సామం– సమస్త కర్మలకు ఇది (శరీరం) సమం కాబట్టి ఈ శరీరం ఆ కర్మలన్నింటికి ఆత్మ– అన్ని కర్మలను ధరించేది శరీరమే కాబట్టి. ఈ కార్యకారణ సంఘాత రూపమైన ఆత్మ ఒకటే మూడుగా కనిపిస్తుంది. అనశ్వరమైన తత్త్వం (ప్రాణమే) సత్యం చేత (పంచ భూతాలు) ఆచ్ఛాదింపబడి ఉంది. ప్రాణమనేది

శాశ్వతమైన తత్త్వం. పేరు. రూపము అనేవి సత్యం, కాబట్టి ప్రాణం వాటిచేత ఆచ్ఛాదింపబడి ఉంది.

(ఇంత వరకు అవిద్యకు విషయమైనట్టి ప్రపంచాన్ని గురించి చెప్పారు. ఇక విద్యావిషకమైన ఆత్మను గురించి చెప్పబోతున్నారు)

# రెండవ అధ్యాయం

## మొదటి బ్రాహ్మణం

**మం॥ ఓం; దృప్త బాలాకిర్హానూచానో గార్గ్య ఆస, స హోవాచాజాతశత్రుం కాశ్యం, బ్రహ్మ తే బ్రవాణీతి, సహోవాచాజాతశత్రుః, సహస్రమేతస్యాం వాచి దద్మః, జనకో జనక ఇతి వై జనా ధావన్తీతి.** **1**

ఒకప్పుడు గార్గ్యగోత్రంలో పుట్టినట్టి, గర్విష్ఠియైన బాలకి అనేవాడుండేవాడు. అతడు వాచాలుడు– అధికంగా మాట్లాడే స్వభావం కలవాడు. అతడొకసారి కాశీరాజైన జాతా శత్రువు వద్దకు వెళ్ళి అన్నాడు– 'నేను నీకు బ్రహ్మోపదేశం చేస్తాను' అని. ఆ మాటలు విని ఆజాత శత్రువు అన్నాడు– "నీవు పలికినట్టి యీ మంగళప్రదమైన మాటలకు వేయి గోవులు ఇస్తాను. ప్రజలంతా జనకుడు జనకుడు అంటూ అతని వద్దకు పరుగెడుతున్నారు." అని.

(జనకుడు గొప్ప జ్ఞాని అని, గొప్పదాత అని, గొప్పశ్రోత అని. బ్రహ్మజ్ఞానానికి సంబంధించిన విషయాలు ఎవరు చెప్పినా విని, సత్కరిస్తాడని అతని వద్దకు అంతా వెడుతూ ఉంటారు. నీ ప్రతిపాదన వల్ల నాకు కూడా జనకుని లక్షణాలు, గుణాలు ఉన్నాయని ప్రదర్శించటానికి అవకాశం లభించింది; అని భావం.)

**మం॥ స హోవాచ గార్గ్యః య ఏవాసావాదిత్యే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి; స హోవాచాజాత శత్రుః,మా మైతస్మిన్సం వదిష్ఠాః, అతిష్ఠాః, సర్వేషాం భూతానాం మూర్ధా రాజేతి వా అహమేత ముపాస ఇతి; స య ఏతమేవముపాస్తేఽ తిష్ఠాః సర్వేషాం భూతానాం మూర్ధా రాజా భవతి.** **2**

ఈ మంత్రంలో గార్గ్యుడు ఆదిత్యాదులందు బ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించటం, ఆజాత శత్రువు దానిని ఖండించటం చెపుతున్నారు–

గార్గ్యుడు అన్నాడు– "ఆదిత్యునిలో (సూర్యునిలో) ఉన్న పురుషుడే బ్రహ్మ. నేను అతనినే ఉపాసిస్తున్నాను" అని. ఈ మాటలు విని ఆజాతశత్రువు అన్నాడు – 'కాదు, కాదు అతనిని

గురించి మాట్లాడవద్దు– చెప్పవద్దు. ఈ బ్రహ్మను గురించి (సూర్యుని గురించి) నే నెరుగుదును. అందరిని మించిన వానినిగా (అతిక్రమించిన వానినిగా) అని భూతాలకు శిరస్సువంటివానినిగా, దీప్తిమంతునిగా నేను అతనిని గురించి ఉపాసన చేస్తూ ఉంటాను" అని. (అంటే, బ్రహ్మగా మాత్రం నేను గుర్తించటం లేదని భావం.) ఎవరు ఈ విధంగా సూర్యుని సర్వభూతాలకు శిరస్థానీయునిగా, దీప్తివంతునిగా భావించి ఉపాసిస్తారో అట్టివారు అన్నిటిని మించినవారై, అదరికి శిరఃస్థానీయులౌతారు. రాజు అవుతారు. (ఏ గుణాలు కలవానిని మనం ఉపాసిస్తామో అటువంటి ఫలితాలే మనకు లభిస్తాయి.)

**మం॥ స హోవాచ గార్గ్య, య ఏవసౌ చంద్రే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి; స హోవాచాజాత శత్రుః మా మైతస్మిన్సంవదిష్ఠాః, బృహన్పాండర వాసాః సోమో రాజేతి వా అహమేతముపాస ఇతి; స య ఏతమేవముపాస్తే హరహర్హ సుతః ప్రసుతో భవతి; నా స్యాన్నం క్షీయతే. 3**

గార్గ్యుడు మళ్ళీ ఈ విధంగా అన్నాడు– "ఈ చంద్రునిలో ఉన్న పురుషుని నేను బ్రహ్మగా ఉపాసిస్తున్నాను" అని.

ఇది విని అజాతశత్రువన్నాడు– "కాదు, కాదు. ఇక చాలించు. ఈ విషయమై ఇక చెప్పవద్దు. ఆ బ్రహ్మను నేనూ ఎరుగుదును. అతడు గొప్పవాడు. తెల్లని వస్త్రాలు ధరించిన సోమరాజు. నేను ఈ రూపంలోనే అతనిని ఉపాసిస్తున్నాను' అని. ఈ విధంగా ఈ రూపంలో చంద్రుణ్ణి ఉపాసించిన వానికి ప్రతిరోజూ రెండు విధాలైన యజ్ఞాలకు కావలసిన సామర్థ్యం కలుగుతుంది. అతనికి అన్నం ఎన్నడూ లోటు కాదు. (సోమరసం పుష్కలంగా లభించి ప్రకృతి, వికృతులనే ప్రధాన సహాయక యజ్ఞాలకు లోటు ఉండదని భావం.)

**మం॥ స హోవాచ గార్గ్యః, య ఏనాసౌ విద్యుతి పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి; స హోవాచాజాత శత్రుః, మా మైతస్మిన్సంవదిష్ఠాః తేజస్వీతి వా అహ మేతముపాస ఇతి; స య ఏత మేవ ముపాస్తే తేజస్వీ హ భవతి, తేజస్వినీ హాస్య ప్రజా భవతి. 4**

గార్గ్యుడు మళ్ళీ అన్నాడు– 'ఈ విద్యుత్తు (మెఱపు) లో ఉన్నట్టి పురుషుణ్ణి నేను బ్రహ్మగా భావించి ఉపాసిస్తాను.' అని.

ఆజాత శత్రువు అన్నాడు– 'నాకు తెలుసు.ఆ విషయమై చెప్పనక్కరలేదు. దానిని మహాశక్తివంతమైన దానినిగా భావించి (బ్రహ్మగా మాత్రం కాదు) నేను ఉపాసిస్తున్నాను' అని. ఈ విధంగా భావించి విద్యుత్తును ఉపాసించేవాడు, అతని సంతానము కూడా తేజోవంతులు, శక్తివంతులు అవుతారు.

**మం॥ సహోవాచా గార్గ్యః, య ఏవాయమాకాశే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి; స హోవాచాజాత శత్రుః, మా మైతస్మిన్సంవదిష్ఠాః, పూర్ణమప్రవర్తీతి వా అహమేతముపాస ఇతి; స య ఏతమేవముపాస్తే పూర్యతే ప్రజాయా పశుభిః, నాన్యస్మాల్లో కాత్ప్రజో ద్వర్తతే. 5**

గార్గ్యుడు ఈ విధంగా అన్నాడు– 'నేను ఆకాశంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా ఉపాసిస్తున్నాను." అని.

ఇది విని అజాత శత్రువు అన్నాడు– "కాదు, కాదు, ఈ విషయమై ఇట్లా మాట్లాడకు. నాకు తెలుసు, నేను ఈ ఆకాశాన్ని పూర్ణమైనదానినిగా, నిశ్చలమైన దానినిగా భావించి ఉపాసిస్తాను." అని. ఈ విధంగా ఆకాశాన్ని ఉపాసించేవారు సంతానంతో, పశువులతో పరిపూర్ణులౌతారు. ఈ లోకంలో వారి సంతతికి ఎన్నడూ విచ్ఛిత్తి ఉండదు.

**మం॥ స హోవాచ గార్గ్యః య ఏవాయం వాయౌ పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి, స హోవాచాజాత శత్రుః, మా మైతస్మిన్సంవదిష్ఠాః, ఇంద్రో వైకుంఠోఽ పరాజితా సేనేతి వా అహమేతముపాస ఇతి, స య ఏతమేవ ముపాస్తే జిష్ణుర్హా పరాజిష్ణుర్భవత్యన్యత స్త్య జాయీ. 6**

గార్గ్యుడు మళ్లీ ఈ విధంగా అన్నాడు– 'నేను ఈ వాయువులో ఉన్న పురుషుణ్ణి బ్రహ్మగా భావించి ఉపాసిస్తాను.' అని.

అది విని అజాత శత్రువు ఇట్లా అన్నాడు– "చాలు, చాలు ! ఈ విషయమై ఇక మాట్లాడవద్దు. ఇది నాకు తెలుసు. ఈ వాయువును నేను వైకుంఠ రూపంలో అపరాజితయైన (ఓటమి ఎరుగని) సేన రూపంలో, ఉపాసిస్తున్నాను." (మరుద్గణాలు –వాయుదేవతలు సమూహాలుగా ఉండటం లోగడ చెప్పకున్నాము.) ఈ విధంగా ఉపాసించేవాడు జయశీలుడౌతాడు. ఎవరిచేత ఓటమి ఉండదు. శత్రువులను జయిస్తాడు.

**మం। సహోవాచ గార్గ్యః, య ఏవాయమప్సు పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి, స హోవాచాజాత శత్రుః, మా మైతస్మిన్సంవదిష్ఠాః, ప్రతిరూప ఇతి వా అహమేతముపాస ఇతి; స య ఏతమేవముపాస్తే ప్రతి రూపం హైవైన ముసగచ్ఛతి, నా ప్రతిరూపం, అథో ప్రతిరూపోఽ స్మాజ్జాయతే. 8**

ఇది విని గార్గ్యుడన్నాడు– "నేను ఈ జలంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా భావించి ఉపాసిస్తాను." అని.

అందుకు అజాత శత్రువు ఇట్లా అన్నాడు– "కాదు, కాదు; ఆ విషయం చెప్పకు. దీనిని (జలాన్ని) నేను ప్రతి రూపంగా– (అనుగుణమైన దానినిగా– శ్రుతి స్మృతులకు విరుద్ధం కాదు

కాబట్టి) భావించి ఉపాసన చేస్తున్నాను." అని. ఈ విధంగా ఉపాసన చేసిన వానికి అనుగుణమైన వస్తువులే లభిస్తాయి– ప్రతికూలమైనవి లభించవు. అట్లాగే సంతానం కూడా అనుగుణమైనది– తగినట్టిదే కలుగుతుంది.

**మం॥ స హోవాద గార్గ్యః, య ఏవాయమాదర్శే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి; స హోవాచాజాత శత్రుః, మా మైతస్మిన్సంవదిష్ఠాః, రోచిష్ణురితి వా అహమేతముపాస ఇతి; స య ఏతమేవముపాస్తే రోచిష్ణుర్హ భవతి; రోచి ష్ణువర్హాస్య ప్రజా భవతి, అథో యైః సన్నిగచ్ఛతి సర్వాంస్తానతిరోచతే. 9**

గార్గ్యుడు మళ్ళీ అన్నాడు– 'నేను ఈ అద్దంలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా భావించి ఉపాసన చేస్తాను' అని.

అందుకు అజాతశత్రువిట్లా అన్నాడు– 'కాదు, కాదు, ఆ విషయమై ఇక చర్చించకు. నేను అద్దంలో ఉండే పురుషుణ్ణి దీప్తివంతునిగా భావించి ఉపాసిస్తున్నాను. 'అని, ఇట్లా ఉపాసించినవాడు దీప్తిమంతుడౌతాడు. అతని సంతానం కూడా దీప్తిమంతంగా ఉంటుంది. అతనిఇ సంసర్గానికి వచ్చినవారి అందరికంటె అతడు కాంతి మంతుడై ప్రకాశిస్తాడు.

**మం॥ స హోవాచ గార్గ్యః, య ఏవాయం యన్తం పశ్చా చ్ఛబ్దో–నూ దేత్యే తమేవాహం బ్రహ్మోపాస ఇతి; స హోవాచాజాతశత్రుః. మా మైతస్మిన్సంవదిష్ఠాః, అసు రితి వా అహమేతముపాస ఇతి; స య ఏత మేవ ముపాస్తే సర్వం హైవాస్మింల్లోక ఆయురేతి, నైనం పురా కాలాత్ప్రాణో జహాతి. 10**

అప్పుడు గార్గ్యుడన్నాడు– "మనం నడిచేటప్పుడు వెనుకనుండి వచ్చే శబ్దాన్ని నేను బ్రహ్మగా భావించి ఉపాసిస్తాను." అని.

ఆ మాటకు ఆజాత శత్రువిలా అంటున్నాడు– "చాలు, ఇక చెప్పకు, ఆ విషయం నాకు తెలుసు. నేను ఆ శబ్దాన్ని వాయువుగా లేక ప్రాణంగా ఉపాసిస్తాను". ఈ విధంగా ఉపాసించేవాడు పూర్ణాయుర్ధాయాన్ని పొందుతాడు. నియమిత కాలానికి పూర్వం మధ్యలో మరణించడు.

**మం॥ స హోవాచ గార్గ్యః, య ఏవాయం దిక్షు పురుష ఏత మేవాహ బ్రహ్మోపాస ఇతి; స హక్షవాచాజాత శత్రుః, మా మైతస్మిన్సంవదిష్ఠాః, ద్వితీయోఽనపగ ఇతి వా అహమేతముపాస ఇతి; స య ఏతమేవ ముసాస్తే ద్వితీయవాన్ హ భవతి, నాస్మాద్గణ శ్ఛిద్యతే. 11**

గార్గ్యుడు– "నేను దిక్కులందు ఉండే పురుషుని బ్రహ్మగా ఉపాసిస్తున్నాను.' అజాత శత్రువు– "ఆ విషయం నాకు తెలుసు. నేనాపురుషుణ్ణి రెండవవాడు కలవానినిగా, అనపగతునిగా (వేరుచేయబడని వానినిగా) భావించి ఉపాసిస్తున్నాను.'

ఎవరైనాసరే ఈ విధంగా దిక్కులందుండే పురుషుణ్ణి ఉపాసిస్తే అతడు ద్వితీయుడు కలవాడౌతాడు. అనపగతుడౌతాడు– స్నేహితులు, అనుచరులు కలవాడౌతాడు. (దిక్కులందుండేది అశ్వనీదేవతల జంట. ఎన్నడూ వీడని జంట.)

**మం॥ సహోవాచ గార్గ్యః, య ఏ వాయం ఛాయామయః పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి, స హోవా చాజాతశత్రుః, మా మైతస్మిన్సంవదిష్ఠాః, మృత్యురితి వా అహమేత ముపాస ఇతి, స య ఏతమేవముపాస్తే సర్వం హైవాస్మింల్లోక ఆయురేతి, నైనం పురా కాలాన్మృత్యు రాగచ్ఛతి. 12**

గార్గ్యుడు– "నేను నీడలో ఉండే పురుషుణ్ణి బ్రహ్మగా తలచి ఉపాసిస్తాను."

అజాతశత్రువు– "అతని విషయం నాకు తెలుసు. ఆ ఛాయలో ఉండే పురుషుణ్ణి మృత్యువుగా గుర్తించి నేను ఉపాసిస్తున్నాను." ఈ విధంగా ఛాయలో ఉండే పురుషుణ్ణి మృత్యువుగా ఉపాసించేవాడు పూర్ణాయుర్దాయం కలవాడౌతాడు. ఆయుః ప్రమాణానికి ముందుగా మరణించడు.

**మం॥ స హోవాచ గార్గ్యః, య ఏవాయమాత్మని పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి; స హోనాచాజాత శత్రుః, మా మైతస్మిన్సంవదిష్ఠాః, ఆత్మన్వీతి వా అహ మే ముపాస ఇతి; స య ఏతమేవముపాస్త ఆత్మన్వీ హ బవతి, ఆత్మన్వినీ హాస్య ప్రజాభవతి; స హ తూష్ణీమాస గార్గ్యః, 13**

గార్గ్యుడు– 'ఈ బుద్ధిలో ఉన్న పురుషుణ్ణి నేను బ్రహ్మగా భావించి ఉపాసిస్తున్నాడు.

అజాతశత్రువు– "అతనిని గురించి చెప్పనక్కరలేదు. అతనిని నేను ఆత్మన్వీరూపంలో (ఆత్మకలవానినిగా) ఉపాసిస్తున్నాను." ఈ రూపంలో ఉపాసన చేసినవాడు నిస్సందేహంగా ఆత్మవంతుడౌతున్నాడు. అతని సంతతి కూడా బుద్ధిమంతులౌతున్నారు.

ఇక ఇంతటితో గార్గ్యుడు మౌనం వహించాడు. ఇంతకంటె మించి అతనికి బ్రహ్మజ్ఞానం లేదు కాబట్టి– తలవంచుకున్నాడు.

**మం॥ స హోవాచాజాశత్రుః, ఏతావన్నూ 3 ఇతి, ఏతావ ద్దీతి; నైతావతా విదితం భవతీతి; స హోవాచా గార్గ్యః, ఉప త్వా యానీతి. 14**

ఈ విధంగా తలవంచుకొని మౌనం వహించిన గార్గ్యుని చూచి ఆజాతశత్రువు – "నీకు తెలిసిన బ్రహ్మజ్ఞానం ఇంతవరకేనా ? లేక ఇంకేమైనా ఉందా?" అని అడిగాడు.

గార్గ్యుడు– "ఇంతే!" అని సమాధానమిచ్చాడు.

అప్పుడు అజాతశత్రువు– "ఈ మాత్రం తెలిసినంతనే ఎవరికైనా బ్రహ్మజ్ఞానం తెలిసినట్లుకాదు." (ఇంత మాత్రానికే నాకు బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశిస్తానని అన్నావుగదా !) అని అన్నాడు. అప్పుడు గార్గ్యుడు– "నేను మీ శరణుజొచ్చిన వాడిని ! శిష్యుణ్ణి ! నాకు బ్రహ్మోపదేశం చేయండి." అన్నాడు.

(గార్గ్యునికి సోపాధిక బ్రహ్మను గూర్చిన జ్ఞానం మాత్రమే ఉంది. ఈ సోపాధిక బ్రహ్మజ్ఞానంతో, అతనికంటె ఎక్కువగా (నిరుపాధిక బ్రహ్మతత్వాన్ని గూర్చి) విని ఉన్న అజాతశత్రువుకు, నిరుపాధిక బ్రహ్మను గూర్చి. ఉపదేశించటానికి పూనుకొని, పరాభూతుడైనాడు.)

**మం॥ స హోవాచాజాతశత్రుః, ప్రతిలోమం చైతద్య ద్బ్రాహ్మణః క్షత్రియముపేయాత్, బ్రహ్మమే వక్ష్య తీతి,వ్యేవ త్వాజ్ఞపయిష్యామీతి; తం పాణావాదా యో త్తస్థౌ తౌ హ పురుషం సుప్తమాజగ్మతుః, తమే తైర్నామభిరామ న్త్రయాంచక్రే, బ్రుహన్ పాణ్డర వాసః, సోమ రాజన్నితి; సనో త్తస్థౌ, తం పాణినా పేషం బోధయాం చకార, స హోత్తస్థౌ. 15**

ఆజాత శత్రువు ఈ విధంగా అన్నాడు– 'ఒక బ్రాహ్మణుడు క్షత్రియుని వద్దకు బ్రహ్మ విద్యోపదేశం పొందటానికి వెళ్ళటమనేది శ్రాస్త విరుద్ధమైన విషయం (ప్రతిలోమ విధి కాబట్టి శాస్త్రవిరుద్ధం) అయినప్పటికి నేను నీకు బ్రహ్మను గురించి తెలియజేస్తాను.'

ఇట్లా అని, అజాతశత్రుడు గార్గ్యుని చేతులు పట్టుకొని లేచాడు. ఇద్దరూ కలసి నిద్రపోతున్న ఒక మనిషి వద్దకు వచ్చారు. అక్కడకు వచ్చి 'ఓ బ్రాహ్మణుడా ! శ్రేష్ఠుడా ! ఓ పాండరవాసా ! (తెల్లని దస్తులు ధరించిన వాడా ! ఓ సోముడా ! (ప్రకాశవంతమైనవాడా!) రాజా ! అంటూ ఈ పేర్లతో పిలిచాడు. కాని ఆ నిద్రపోయే మనిషి మేల్కొనలేదు. పిమ్మట చేతుల్తో మాటిమాటికి అదుముతూ ఆ నిద్రపోయే వానిని మేల్కొలిపాడు. అతడు లేచి కూర్చున్నాడు.

**మం॥ స హోవాచాజాతశత్రుః; యత్రైష ఏతత్సుప్తోభూద్య ఏష విజ్ఞానమయః పురుషః, క్వైష తదాభూత్ కుత ఏతదాగాదితి, తదు హ న మేనే గార్గ్యః. 16**

ఆజాతశత్రువు సుషుప్తిలో విజ్ఞానమయుడుగా ఉన్న ఆత్మను గూర్చి ప్రశ్నిస్తున్నాడు–

ఈ విధంగా దేహంకంటె భిన్నమైన ఆత్మయొక్క ఆస్తిత్వాన్ని ప్రతిపాదించి గార్గ్యునితో ఆజాతశత్రువు అంటున్నాడు– "నేను చేతితో ఆదిమి, తట్టి లేపటానికి పూర్వం ఈ విజ్ఞానమయుడైన

పురుషుడు నిద్రపోతున్నాడు. అప్పుడాతడు ఎక్కడ ఉన్నాడు? ఇప్పుడు ఎక్కడ నుండి వచ్చాడు ?"

ఈ ప్రశ్నలకు గార్గ్యుడు సమాధానం చెప్పలేకపోయాడు.

**మం॥ స హోవాచాజాత శత్రుః, యత్రైష ఏతత్సుప్తో ఊద్య ఏష విజ్ఞాన మయః పురుషః త దేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ య ఏ షోన్తర్హృదయ ఆకాశ తస్మింఛేతే; తాని యదా గృహ్ణాత్యథ మైత త్పురుషః స్వపితి నామ; తద్ గృహీత ఏవ ప్రాణో భవతి, గృహీతా వాక్ గృహితం చక్షుః, గృహీతం శ్రోత్రం, గృహీతం మనః. 17**

అప్పుడు ఆజాతశత్రువు అంటున్నాడు–

ఈ జీవుడు విజ్ఞానమయుడై నిద్రపోతూ ఉండగా, ఇంద్రియాల యొక్క విషయాలనన్నింటిని అంటే, వాక్కు మొదలైన ప్రాణాల యొక్క విజ్ఞానాన్ని (తమ తమ విషయాలను ప్రకాశింపచేసే సామర్థ్యాన్ని గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశం పరమాత్మ ఉండే చోటు. ఆ స్థితిలో (నిద్రలో) ఆ పురుషుడు శరీరము, ఇంద్రియాలు, వీటి మీద తనకు గల ఆధిపత్యాన్ని వదిలేస్తున్నాడు. ఆ స్థితిలో అతడు 'స్వపితి' అని పిలవబడతాడు. అంటే ఇంద్రియాలన్నింటిని తనలో లీనం చేసుకుంటాడు. (స్వ + అపీతి = ఆత్మను పొందుట) అంటే ప్రాణాలన్నింటిని తనలోకి ఆకర్షించుకుంటాడు– వాగింద్రియాలన్ని, ఘ్రాణేంద్రియాన్ని, చక్షురింద్రియాన్ని, శ్రవణేంద్రియాన్ని, మనస్సునూ కూడా తనలోకి ఆకర్షించుకుంటాడు. ఈ స్థితిలో క్రియ ఉండదు. కారకము ఉండదు. క్రియాఫలం ఉండదు కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది.

**మం॥ స యత్రైత త్స్వప్నయా చరతి తే హాస్య లోకాః తదు తేవ మహారాజో భవతి, ఉతేవ మహాబ్రాహ్మణః, ఉతేవోచ్చావచం నిగచ్ఛతి; స యథా మహారాజో జనపదాన్ గృహీత్వా స్వేజనపదే యథాకామం పరి వర్తేత, ఏవ మేవైష ఏతత్ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథాకామం పరివర్తతే. 18**

ఈ మంత్రంలో స్వప్న వృత్తి యొక్క స్వరూపాన్ని గూర్చి చెపుతున్నారు.

ఈ ఆత్మయే స్వప్నస్థితిలో ఉన్నప్పుడు దాని కర్మఫలాలు ప్రారంభమౌతాయి. దాని (ఆత్మ యొక్క) మహత్కార్యాలు ఈ విధంగా ఉంటాయి. ఆ స్వప్నస్థితిలో మహారాజులాగా ఉంటుంది. గొప్ప బ్రాహ్మణునిలాగా కూడా ఉండవచ్చు– దేవత్వాది ఉచ్చస్థితులు పొందవచ్చు. నీచ దేవతలు అసురులు తిర్యగాదుల స్థితినీ పొందవచ్చు. మహారాజు, ప్రజలందరు తనకు లోబడి ఉండగా,

తన దేశంలో తాను స్వేచ్ఛగా సంచరించినట్లు. ఈ స్వప్న పురుషుడు కూడా కల్పితమైన ప్రాణాల్ని- ఇంద్రియాల్ని గ్రహించి తన దేహంలో యదేచ్ఛగా విహరిస్తాడు.

**మం॥ అథ యదా సుషుప్తో భవతి, యదా న కస్యచన వేద, హితా నామ నాడ్యో ద్వాస ప్తతిః సహస్రాణి హృదయా త్పురీతతమభిప్రతిష్ఠన్తే, తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే; స యథా కుమారో వా మహారాజో వా మహా బ్రాహ్మణో వాతిఘ్నీ మానన్దస్య గత్వా శయీత, ఏవమేవైష ఏతచ్ఛేతే. 19**

ఈ మంత్రంలో సుషుప్తి స్వభావాన్ని గురించి చెపుతున్నారు.

పిమ్మట ఆ ఆత్మ నిద్రపోయేటప్పుడు, అంటే ఏ విషయాన్ని తెలుసుకోనట్టి స్థితిలో ఉన్నప్పుడు, 72,000 నాడులతో గూడిన హిత అనే నాడి హృదయం నుండి బయలుదేరి శరీరమంతటా వ్యాపించి ఉంటుంది. ఆ సమయంలో ఒక బాలకునిలాగా, లేక ఒక మహారాజులాగా, లేదా ఒక సద్బ్రాహ్మణునిలాగా ఆనందంతో గూడిన స్థితిని పొంది ఉంటుంది- ఆ స్థితిలోనే ఆ విధంగా నిద్రిస్తుంది.

**మం॥ స యథోర్ణనాభిస్తన్తు నోచ్చరేత్, యథాగ్నే ? క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరన్తి, ఏవ మేవా స్మాదా త్మనః సర్వే ప్రాణాః సర్వే లోకాః, సర్వేదవాః, సర్వాణి భూతాని వ్యుచ్చరన్తి; తస్యోపనిషత్- సత్యస్య సత్యమితి; ప్రాణా వై సత్యమ్, తేషామేష సత్యం. 20**

సాలె పురుగు తన నుండి పుట్టిన దారాల పైకి ప్రాకుతున్నట్లుగా, ఒక అగ్ని నుంచి అనేక చిన్న చిన్న రవ్వలు పైకి లేచినట్లుగా ఈ ఆత్మ నుండే అన్ని ప్రాణాలు- ఇంద్రియాలు, అన్ని లోకాలు, దేవగణాలు, సమస్త భూతాలు అనేక విధాలుగా పుడుతున్నాయి. ఇది (ఈ విషయం) సత్యాలలోకెల్ల సత్యం. ఇదే ఆత్మకు సంబంధించిన విషయాన్ని విపులీకరించే రహస్యోపనిషత్తు. ప్రాణమే సత్యం ఈ ప్రపంచం అనేది ఆ సత్యానికి సత్యం- ఆ ప్రాణమనే సత్యానికి చెందినదే ఈ ప్రపంచం అనే సత్యం !

## రెండవ బ్రాహ్మణం

ఈ పైన చెప్పిన విషయాన్నే ఈ బ్రాహ్మణంలోను, తరువాతి బ్రాహ్మణంలోను విశదీకరిస్తారు. అంటే, ప్రాణమనేది సత్యం అన్నారు కాబట్టి, ఆ ప్రాణం అనేది ఏమిటి? అది ఎన్ని రకాలు? దానికున్న రహస్యమైన పేర్లు ఏమిటి ? ఈ విషయాలన్నే చర్చించబడతాయి.

**మం॥ యో హ వై శివుం సాధానం స ప్రత్యాధానం సస్థూణం సదామం వేద సప్త హ ద్విషతో**

**భ్రాతృ వ్యానవరుణద్ధి. అయం వావ శిశుర్యో యం మధ్యమః ప్రాణః, తస్యేమేవాధానం. ఇదం ప్రత్యాధానం, ప్రాణః స్థూణా, అన్నం దామ. 1**

ఆధానము (నివాసము) ప్రత్యాధానం (వస్తూ పోతూండే చోటు) దాని కట్టుకొయ్య, దాని పగ్గం (త్రాడు) తో సహా ఆ కోడెదూడను తెలుసుకున్నవాడు తన ఏడుగురు విరోధులైన జ్ఞాతులను వధించగలడు. శరీరంలో ఉండే ప్రాణమే కోడెదూడ (శిశువు). ఈ శరీరమే దాని నివాసము (కట్టి వేసి ఉంచే పాక). శిరస్సే ప్రత్యాధానము– తిరుగుతూ ఉండేచోటు. అన్నపానాదులు వల్ల కలిగే శక్తియే కట్టుకొయ్య. ఆహారం దాని పగ్గము– కట్టివేసే త్రాడు. జ్ఞాతులు రెండు విధాలుగా ఉంటారు– విరోధులు, హితులు. విరోధులైన ఏడుగురు జ్ఞాతులు– తలలో ఉండే ఇంద్రియాలు, రెండు చెవులు, రెండు కండ్లు, రెండు ముక్కు రంధ్రాలు. నోరు మొత్తం 7. ఇవన్నీ ఆత్మవైపుకుకాక విషయ వాసనలవైపుకు ఆకర్షిస్తాయి. కాబట్టి విరోధులు. జ్ఞాతులను వధించగలడు అంటే ఇంద్రియాలను నిగ్రహిస్తాడని భావం.

**మం॥ తమేతాః సప్తాక్షితయ ఉపతిష్ఠన్తే; తద్యా ఇమా అక్షన్ లోహిన్యో రాజయస్తాభిరేనం రుద్రో న్వా యత్తః, అథ యా అక్షనానపస్తాభిః, పర్జన్యః, యా కానీనకా తయాదిత్యః, యత్కృష్ణం తేనాగ్నిః, యచ్ఛుక్లం తేనేంద్రః, అథరయైనం వర్తాన్యా పృథి వ్యన్వాయత్తా, ద్యౌరుత్తరయా; నాస్యాన్నం క్షీయతే య ఏవం వేద. 2**

ప్రత్యాధామంలో– సంచరించే చోటులో ఉండే కోడెదూడ యొక్క కంటికి గల రహస్య పూర్ణమైన పేర్లను గురించి వివరిస్తున్నారు–

నేత్రంలో ఉండి ఎల్లప్పుడూ కాపాడే ఏడుగురు దేవతలు ఈ మధ్యమ ప్రాణమనే కోడెను ఎల్లప్పుడూ స్తుతిస్తూ ఉంటారు. కళ్ళల్లో ఉండే ఎఱ్ఱటి రేఖల (గీరలు) ద్వారా రుద్రుడు ఈ మధ్యమ ప్రాణాన్ని కాపాడుతూ ఉంటాడు. అట్లాగే పొగ మొదలైన కారణాల వల్ల కంటిలో కనిపించే నీటి ద్వారా పర్జన్యుడు (మేఘుడు) ఈ ప్రాణాన్ని అనుగమిస్తూ ఉంటాడు. నేత్రంలో ఉండే కనుపాపద్వారా ఆదిత్యుడు (సూర్యుడు) నల్ల గ్రుడ్డుద్వారా అగ్ని, తెల్ల గ్రుడ్డు ద్వారా ఇంద్రుడు ఈ ప్రాణాన్ని అనుగమిస్తూ ఉంటారు. కంటి క్రింద రెప్ప భూమిగాను, పై రెప్ప ద్యులోకంగాను కాపాడుతూంటాయి. ఈ విషయం (ఈ విధమైన ప్రాణాన్ని గురించి) తెలుసుక్నువానికి అన్న లోపం ఉండదు.

**మం॥ త దేష శ్లోకో భవతి. అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః, తస్మివ్యశో నిహితం విశ్వరూపం. తస్యాసత ఋషయః సప్త తీరే, వాగష్టమీ బ్రహ్మణా సంవిదానా॥ ఇతి 'అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః' ఇతీదం తచ్ఛిరః, ఏష హ్యర్వాగ్బిలశ్యమస ఊర్ధ్వబుధ్నః; 'తస్మిన్యశో నిహితం**

**విశ్వరూపం ఇతి ప్రాణా వై యశో విశ్వ రూపం, ప్రాణానేతదాహ, తస్యా సత ఋషయః సప్త తీరే' ఇతి ప్రాణా వా ఋషయః, ప్రాణానేత దాహ, 'వాగష్టమీ బ్రహ్మణా సంవిదానా' ఇతి వ్యాష్టమీ బ్రహ్మణా సంవిత్తే.** **3**

ఈ విషయాన్ని గురించే ఈ శ్లోకం వివరిస్తోంది.

ఒక గిన్నె ఉంది. దాని మూతి క్రిందికి తెరచి ఉంది. ఆ గిన్నె పై భాగం ఉబ్బెత్తుగా ఉంది. అనేక విధాలైన జ్ఞానాలు దానిలో ఉన్నాయి. అంటే, అనేక రకాలైన ఇంద్రియాలు ఉన్నాయి అని భావం. దాని ప్రక్కలనే ఏడుగురు ఋషులు, వేదాల ద్వారా సంవాదం చేసే ఎనిమిదవదైన వాక్కు ఉన్నాయి.

క్రిందికి రంధ్రం గల– మూతి తెరచి ఉండి, పైన ఉబ్బెత్తుగా ఉండే గిన్నె ఏది? అదే శిరస్సు. ఈ తలకు క్రింది భాగంలో తెరిచి ఉన్న నోరు, పైన ఉబ్బెత్తుగా ఉండే పుఱ్ఱె ఉన్నాయి గదా ! దానిలో నిహితమై ఉన్నది ఏమిటి? సోమ పాత్రలో సోమరసం నిండి ఉన్నట్లుగా ఈ శిరస్సు అనే గిన్నెలో అనేక విధాలైన జ్ఞానాలు నిండి ఉన్నాయి. అంటే, చెవులు మొదలైన ఏడు ఇంద్రియాలు, వాటిలో వ్యాప్తమై ఉన్న ప్రాణంతో సహా, ఆ గిన్నెలో ఉన్నాయి. ఈ విషయమే మంత్రంలో ఉంది. దాని ప్రక్కనే ఉన్న ఏడుగురు ఋషులు అంటే తలలో ఉన్న ప్రాణంతో కూడిన శ్రోత్రాది ఇంద్రియాలు ఏడు అని అర్థం (రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు ముక్కు రంధ్రాలు, నోరు) వాక్కు అనే ఇంద్రియం ఎనిమిదవది. వేదాల ద్వారా సంవాదం జరిపేది అదే ! (ఇక్కడ నోరు అనే దానిని రెండుగా భావించారు. ఒకటి రుచి చూచే ఇంద్రియంగాను, (ఇది పైన వచ్చింది) రెండవది మాట్లాడే ఇంద్రియంగాను, అందుచేత ఎనిమిది అయి నాయి)

**మం॥ ఇమావేవ గోతమభరద్వాజౌ, అయమేవ గోతమః, ఆయం భరద్వాజః, ఇమావేద విశ్వామిత్ర జమదగ్నీ, అయమేవ విశ్వామిత్ర, అయం జమదగ్నిః, ఇమావేవ వషిష్ఠకశ్యపౌ, అయమేవ వసిష్ఠః, అయం కశ్యపః, వాగేవాత్రిః, వాచాహ్యన్న మద్యతే, అత్తిర్హవై నామైతద్యదత్రిరితి, సర్వస్యాత్తా, భవతి, స్వరమస్యాన్నం భవతి య ఏవం వేద.** **4**

వెనుకటి మంత్రంలో ప్రాణమే అనేకంగా విభక్తమై వివిధములైన ఇంద్రియాలలో వ్యాప్తమై ఉన్నదని, దాని యశస్సు కీర్తించారు. ఆ ఇంద్రియాలు ఏడింటిని ఋషులుగా పేర్కొన్నారు. ఈ మంత్రంలో ఆ సప్తర్షులెవరో చెపుతున్నారు.

ఈ తలలో ఉన్న ఇంద్రియాలను సప్తర్షులుగా పేర్కొన్నారు కాబట్టి ఆ విషయాన్ని ఇంకా వివరిస్తున్నారు.

రెండు చెవులు గౌతమ భరద్వాజులు– కుడి చెవి గౌతముడు, ఎడమ చెవి భరద్వాజుడు. రెండు నేత్రాలు విశ్వామిత్ర జమదగ్నులు. దక్షిణ నేత్రం విశ్వామిత్రుడు, వామనేత్రం జమదగ్ని. నాసికా రంధ్రాలు వసిష్ఠ కశ్యపులు. కుడివైపునున్న నాసికా రంధ్రం వసిష్ఠుడు, ఎడమ నాసికా రంధ్రం కశ్యపుడు. వాక్కు అనేది అత్రి. వాగింద్రియం ద్వారానే అన్నభక్షణం చేస్తారు. కాబట్టి అది 'అత్తి'. (దేవతలు పరోక్షప్రియులు కాబట్టి 'అత్తిని' ని 'అత్రి' అన్నారు.) ఈ విధంగా ప్రాణం యొక్క యదార్థ స్వరూపాన్ని గ్రహించినవాడు అన్నిటిని భక్షించే వాడౌతాడు. అన్నీ అతనికి భోజ్య పదార్థాలౌతాయి. అతడు మాత్రం ఎన్నడు భోజ్యం కాడు. (ఇది ఉపాసనా ఫలం.)

## మూడవ బ్రాహ్మణం

మొదటి అధ్యాయంలో ప్రాణమే సత్యమని చెప్పారు. ప్రాణానికి ఉన్న రహస్యమైన పేర్లు కూడా చెప్పారు. దానిని సత్యమని ఎందుకన్నారో, అది (ప్రాణం) సత్యం ఎట్లా అయినదో ఈ విషయాలు చెప్పాలి. అందుకనే ఈ అధ్యాయంలో ఇంద్రియాలను– ఈ శరీరానికి కారణ భూతమైన పంచ భూతాలను –వీటినే సత్యం అంటారు. వీటిని గూర్చి చెపుతున్నారు. ఇది కాదు– ఇది కాదు (నేతి, నేతి) అని నిషేధించుకుంటూ పోతూ బ్రహ్మను నిర్వచించటానికి ప్రయత్నిస్తున్నారు. పంచ భూతాలతో కూడిన స్థూల సూక్ష్మ శరీరాలతో సంబంధం ఉన్న బ్రహ్మకు రెండు రూపాలు – స్థూలము– సూక్ష్మము. అట్లాగే మూర్తము– ఆమూర్తము. అశాశ్వతము, స్థూలము ఆయిన విషయాలన్నింటిని ఇది బ్రహ్మకాదు, ఇది బ్రహ్మ కాదు (న + ఇతి = నేతి = న + ఇతి) అని నిషేధించుకుంటూ బ్రహ్మను నిర్దేశించటాన్ని ఈ అధ్యాయం ప్రారంభిస్తోంది.

**మం॥ ద్వై వావ బ్రహ్మణో రూపేఽ మూర్తం చైవా మూర్తం చ, మర్త్యం చామృతం చ, స్థితం చ యచ్చ, సచ్చ త్యచ్చ. 1**

బ్రహ్మకు రెండు రూపాలున్నాయి. మూర్తము– అమూర్తము (స్థూలము– సూక్ష్మము) మర్త్యరూపం– అమృత రూపం. (చావు ఉన్నది. చావు లేనిది) స్థావరం – జంగమం (స్థిరంగా ఉండేది, కదిలేది) సత్తు– త్యత్తు (నిర్వచించటానికి వీలైనది; నిర్వచింప వీలుకానిది)

**మం॥ తదేతన్మూర్తం యదన్య ద్వాయోశ్చాన్తరిక్షాచ్చ; ఏతన్మర్త్యమ్, ఏతత్ స్థితమ్, ఏతత్సత్, తస్యై తస్య మూర్తస్య, ఏతస్య మర్త్యస్య, ఏతస్య స్థితస్య, ఏతస్య సత ఏష రసో య ఏష తపతి, సతో హ్యేష రసః 2**

వాయువు, ఆకాశము ఈ రెండూ కాకుండా పంచభూతాలలో మిగిలిన మూడూ– పృథివి, జలం, అగ్ని – ఈ మూడూ మూర్తములు– నశ్వరమైవి స్థూలమైనవి, స్థావరమైనవి. ఇవి మూడూ

చక్షురాది ఇంద్రియాలకు గోచరిస్తూ ఉన్నందున స్థూలమై, మూర్తమై, మర్త్యమై, పరిమితమై నిర్వచనీయమైన వీటి సారమే ఆకాశంలో ప్రకాశించే సూర్యుడు. ఈ సూర్యుడు, సద్రూపాలైన ఈ మూడు భూతాలయొక్క సారమే ! ఎందుచేతనంటే ఇవి ఈ సూర్యుని ద్వారానే విభాజితమై విభిన్నరూపాలు కలవి అవుతున్నాయి. ఈ మంత్రంలో బ్రహ్మ యొక్క మూర్తరూపాన్ని వర్ణించారు. తరువాతి మంత్రంలో అమూర్తాన్ని వర్ణిస్తున్నారు.

**మం॥ అథామూర్తమ్- వాయుశ్చాంతరిక్షం చ; ఏతద మృతమ్, ఏతద్యత్ ఏతత్త్యత్, తస్యైతస్యామూర్తస్య ఏతస్య యతః, ఏతస్య తస్యైష రసోయ ఏష ఏతస్మి న్మండలే పురుష, తస్య హ్యేష రసః- ఇత్యధి దైవతమ్. 3**

వాయువు, ఆకాశము, ఈ రెండూ అమూర్తాలు, అమృతములు, అస్థితములు, వేటితోను ఈ రెంటికి విరోధం లేదు. ఇవి అపరిచ్ఛిన్నమైనవి. ఇదే త్యత్- అనిర్వచనీయమైనవి. ఈ ఆమూర్తము, అమృతము, త్యత్ యొక్క సారమే సూర్యునిలో నున్న పురుషుడు (హిరణ్యా గర్భుడు- విశ్వ శరీరం) అతడే ఈ రెండు భూతముల యొక్క సారము. ఇదే అధిదైవత దర్శనము.

రాబోయే మంత్రంలో చెప్పేది అధ్యాత్మ (శరీర సంబంధమైన) విషయం.

**మం॥ అథాధ్యాత్మమ్- ఇదమేవ మూర్తం యదన్య త్ప్రాణాచ్ఛ, యశ్చాయ మంతరాత్మన్నా కాశః, ఏత న్మర్త్యం, ఏతత్ స్థితం ఏతత్సత్, తస్యై తస్య మూర్తస్య ఏతస్య మర్త్యస్య, ఏతస్య స్థితస్య, ఏతస్య సత ఏష రసో యచ్చక్షుః; సతో హ్యేష రసః 4**

ఇప్పుడు అధ్యాత్మంలో (దేహంలో) మూర్త, ఆమూర్త నిర్ణయం చేస్తున్నారు. ప్రాణం కంటె భిన్నమైనది. దేహంలో ఉన్న ఆకాశం కంటె భిన్నమైనది. ఈ శరీరంలోని మూర్తం- అంటే, ప్రాణము లేదా వాయువు, ఆకాశం ఈ రెండూ కాక, మిగతా మూడు భూతములు చేత నిర్మింపబడ్డ శరీరం అంతా మూర్తము, అదే మర్త్యము, అదే స్థావరం, అదే సత్. ఈ మూర్తానికి, ఈ మరణశీలమైన దానికి ఈ స్థావరానికి, ఈ ప్రతీయ మానమైన సత్‌కు, సారతమమైనది ఈ నేత్ర గోళకం; అంటే,కండ్లే పృథివి, జలం తేజస్సు, వీటిసారము అని భావం. (అధిదైన దర్శనంలో సూర్యునిలాగా)

**మం॥ అథామూర్తం- ప్రాణశ్చ యశ్చాయ మంతరాత్మ న్నాకాశః, ఏతదమృతమ్, ఏతద్యత్, ఏతత్త్యత్, తస్యైతస్యామూర్తస్య ఏతస్యామృతస్య, ఏతస్య యతః, ఏతస్య త్యస్యైష రసో యో యం దక్షిణే క్షన్పురుషః త్యస్య హ్యేష రసః 5**

ఇక అమూర్తాన్ని గూర్చి వర్ణిస్తున్నారు– అంటే సూక్ష్మాన్ని గూర్చి. ఈ ప్రాణాలు, శరీరంలో ఉన్న ఆకాశం ఈ రెండూ అమూర్తాలు– సూక్ష్మమైనవి, శాశ్వతమైనవి– నాశనం లేనివి. అనంతమైనట్టి అనిర్వచనీయమైన ఈ అమూర్తానికి కుడికంటిలో ఉన్నట్టి పురుషుడే సారభూతమైనవాడు ! (అది దైవ దర్శనంలో సూర్యునిలో ఉన్న పురుషునిలాగా)

**మం॥ తస్య హైతస్య పురుషస్య రూపం యథా మాహారజనం వాసః, యథా పాండ్వావికం, యథేంద్రగోపః, యథా గ్న్యర్చిః, యథా పుండరీకం, తథా సకృద్విద్యుత్తమ్, సకృద్విద్యుత్తేవ హ వా అస్య శ్రీర్భవతి య ఏవం వేద; అథాత ఆ దేశః– నేతి నేతి, న హ్యేతస్మాదితి; నేత్యన్యత్పరమస్తి; అథ నామధేయమ్– సత్యస్య సత్యమితి; ప్రాణావై సత్యం, తేషా మేష సత్యమ్. 6**

ఈ లింగ శరీర రూపమైన పురుషుని యొక్క వాసనామయ స్వరూపం పసుపులో ముంచిన వస్త్రం లాగా, తెల్లని ఉన్న గుడ్డలాగా, వర్షాకాలంలో కనిపించే ఎఱ్ఱని ఆర్ద్ర పురుగులాగా, అగ్ని జ్వాలలాగా, తెల్లని పద్మంలాగా, మెరుపు యొక్క కాంతిలాగా ఉంటుంది. ఈ విషయం తెలుసుకున్నవాని విభూతి (సంపద) విద్యుత్ప్రకాశం లాగా ఒక్కసారిగా అంతటా వ్యాపిస్తుంది. తరువాత నేతి నేతి (న + ఇతి = ఇది కాదు, ఇది కాదు) అంటూ బ్రహ్మను వర్ణిస్తున్నారు. ఇంతకంటె మించిన సరియైన వర్ణన (బ్రహ్మను గూర్చి) చేయటం కష్టం (న + ఇతి = ఇది కాదు – ఏది కాదు? – అంటే, విషయత్వ రూపంలో మనకు లభించే దానిని ఇది బ్రహ్మమేనా ? అని ప్రశ్నించుకుంటూ, ఒక్కొక్క విషయాన్నే నిషేధిస్తూ పోగా చివరకు మిగిలేదేదో అదే బ్రహ్మ ! ఇంత కంటె బ్రహ్మను గూర్చి బోధించటం కష్టం అని అభిప్రాయం. మనకు కనిపించే వస్తువులు, విషయాలు ఒక్కొక్క దానిని అసత్యాలని నిషేధిస్తూ పోతే మిగిలేది సత్యం!) ఈ బ్రహ్మమనే దాని పేరు– సత్యానికి సత్యం– ప్రాణసత్యం. ఈ బ్రహ్మమనేది. ఆ సత్యానికి సత్యం. ప్రాణానికి కూడా సత్యమైనది. ఈ బ్రహ్మ యొక్క సత్యత్వమే సమస్త ప్రపంచంతో తాదాత్మ్యం చెంది ప్రతీతమౌతోంది– గోచరిస్తోంది.

## నాల్గవ బ్రాహ్మణం

**మం॥ మైత్రేయీతి హోవాచ యాజ్ఞవల్క్యః; ఉద్యాస్యాన్వా అరే హమస్మా త్థానాదస్మి, హన్త తేఽ నయా కాత్యాయన్యాంతం కరవాణేతి. 1**

యాజ్ఞవల్క్యునికి మైత్రేయి, కాత్యాయని అని ఇరువురు భార్యలు. మైత్రేయి బ్రహ్మవిషయకమైన చర్చల్లో పాల్గొనే సామర్థ్యం కలది. కాత్యాయని సామాన్య గృహిణి– గృహకార్యకలాపాల్లో నేర్పరి.

యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో అంటున్నాడు– "ఓ మైత్రేయీ ! నేను ఈ గార్హస్థ్యానికి పై మెట్టు అయిన సన్యాస ఆశ్రమానికి పోవాలని అనుకుంటున్నాను. ఈ విషయంలో నీ అనుమతి కోరుతున్నాను. నా రెండవ భార్యయైన కాత్యాయనితో నీకు పంపకాలు చేసి వెడతాను. (మీ ఇరువురికి నా ద్వారా ఉన్న సంబంధాన్ని అంతం చేసి వెళ్ళిపోతాను– అంటే ఎవరికి రావలసినది వారికి పంచి యిచ్చేస్తాను అని భావం) ఇదే ప్రసంగం 4 అధ్యాయం 5వ బ్రాహ్మణంలో కూడా వస్తుంది.

**మం॥ సా హోవాచమైత్రేయీ, యన్ను మ ఇయం భగోః సర్వా పృథివీ విత్తేన పూర్ణా స్యాత్కథం తేనా మృతా స్యామితి; నేతి హోవాచ యాజ్ఞవల్క్యః, యథైవోపకరణవతాం జీవితం తథైవ తేజీవితం స్యాత్, అమృతత్వస్య తు నాశాస్తివిత్తేనేతి. 2**

అప్పుడు మైత్రేయీ ఈ విధంగా అంటోంది– "స్వామీ ! ఈ ప్రపంచంలో ఉన్న ధనధాన్యాది సమస్త సంపదలు పూర్తిగా నాకు లభిస్తే, అప్పుడు నాకు అమరత్వం (మృత్యువు లేకపోవటం) సిద్ధిస్తుందా?' అని. అందుకు సమాధానంగా యాజ్ఞవల్క్యుడు అంటున్నాడు– "లేదు; అమరత్వం సిద్ధించదు. ధనం వల్ల, సంపదల వల్ల మనం అమృతత్వాన్ని ఆశించలేము. దానివల్ల (సంపద వల్ల) మానవుని జీవితం విపులమైన భోగ సామగ్రితో కూడినది మాత్రమే అవుతుంది. అట్లాగే నీకైనా సంపద వల్ల భోగాలు మాత్రమే లభిస్తాయి. అంతేగాని, అమరత్వం సిద్ధించదు."

**మం॥ సా హోవాచ మైత్రేయీ; యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యాం ? యదేవ భగవాన్వేద తమేవ హే బ్రూహీతి. 3**

అప్పుడు మైత్రేయి అంది– 'నాకు అమరత్వాన్ని (మోక్షాన్ని) ప్రసాదించలేని ఈ ధనం వల్ల నాకేమిటి ప్రయోజనం? ఆ ధనం తీసికొని నేను ఏమిచేయను ? ఓ స్వామీ ! మోక్షానికి సాధనమేమిటో మీకు తెలుసు, ఆ విషయాన్ని నాకు కూడా ఉపదేశించండి' అని.

**మం॥ స హోవాచ యాజ్ఞవల్క్యః, ప్రియా బతారే నః సతీ ప్రియం భాషసే, ఏహ్యాస్స్వ వ్యాఖ్యాస్యామి తే, వ్యాచక్షాణస్య తు మే నిదిధ్యాస స్వేతి. 4.**

అది విని యాజ్ఞవల్క్యుడన్నాడు– "ఓ ప్రియురాలా ! నీవు నాకు ఇంతకు పూర్వం కూడా ప్రియమైన దానవే ! ఇప్పుడు కూడా అందుకు తగినట్లు మాట్లాడావు. బాగుంది. ఇక్కడ కూర్చో ! అమతర్వం సాధించటాన్ని గూర్చి చెపుతాను. తరువాత నేను చేసిన వ్యాఖ్యానాన్ని బాగా చింతనం చెయ్యి– మనన నిదిభ్యాస లాచరించు" అని.

**మం॥స హోవాచ, న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి. ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి, న నా ఆరే జాయైయై కామాయ జాయా ప్రియా భవతి. న వా అరే**

**పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్తి, ఆత్మనస్తు కామాయ పుత్రాః ప్రియ భవన్తి. న వా ఆరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి. న వా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి. న వా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి. న వా అరే లోకానాం కామాయ లోకాః ప్రియా భవన్తి, న వా అరే దేవానాం కామాయ దేవాః ప్రియా భవన్తి, ఆత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవన్తి. న వా అరే భూతానాం కామాయ భూతాని ప్రియాణి భవన్తి, ఆత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవన్తి. న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి. ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిది ధ్యాసితవ్యో మైత్రేయి, ఆత్మనో వా అఏ దర్శనేన శ్రణేన మత్యా విజ్ఞానేదం సర్వం విదితమ్. 5**

ఆత్మ ప్రయోజనం కోసమే అంతా ఒకరికొకరు ప్రియులౌతారు. ఇందులో సందేహం లేదు– యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో అంటున్నాడు– "ఓ మైత్రేయీ ! భర్త యొక్క ప్రయోజనం కోసం భార్యకు, భర్త ప్రియుడు అనటం లేదు; తన కోసమే భార్యకు భర్త ప్రియుడౌతున్నాడు– అంటే భార్య తన కోసమే భర్తను ప్రేమిస్తోంది. అట్లాగే, భార్యకోసం భర్త భార్యను ప్రేమించటం లేదు, తనకోసమే భార్యను ప్రేమిస్తున్నాడు. పుత్రుల కోసం మనం పుత్రుల్ని ప్రేమించటం లేదు, మన ప్రయోజనం కోసమే మనం పుత్రుల్ని ప్రేమిస్తున్నాము. ధనం యొక్క ప్రయోజనం కోసం మనం ధనాన్ని ప్రేమించటం లేదు, మన ప్రయోజనం కోసమే ధనాన్ని ప్రేమిస్తున్నాము. అట్లాగే బ్రాహ్మణుని ప్రయోజనం కోసం మనం బ్రాహ్మణుని ప్రేమించటం లేదు. ఆత్మ ప్రయోజనం కోసమే బ్రాహ్మణుడు ప్రేమాస్పదుడౌతున్నాడు. అట్లాగే మనం క్షత్రియుని ప్రయోజనం కోసం క్షత్రియుణ్ణి ప్రేమించటం లేదు, మన ప్రయోజనం కోసము క్షత్రియుణ్ణి ప్రేమిస్తున్నాము. అట్లాగే లోకాల యొక్క ప్రయోజనం కోసం మనం వాటిని (లోకాలను) ప్రేమించటం లేదు– ఆత్మ ప్రయోజనం కోసమే లోకాలను ప్రేమిస్తున్నాము. పంచ భూతాల ప్రయోజనం కోసం మనం వాటిని ప్రేమించటం లేదు, మనకోసమే మనం వాటిని ప్రేమిస్తున్నాము. ఇన్ని మాటలెందుకు? మనం ఎన్నింటిని ప్రేమించినా వాటి ప్రయోజనం కోసం ప్రేమించటం లేదు, మన ప్రయోజనం కోసం వాటిని మనం ప్రేమిస్తున్నాము– అంటే ఆత్మ ప్రయోజనం కోసం ! కాబట్టి ఓ మైత్రేయీ ! నిస్సందేహంగా ఈ ఆత్మ ఒక్కటే దర్శనీయమైనది– తెలుసుకో దగినది. ముందుగా దీనిని గురించి గురువు ద్వారా, శాస్త్రాల ద్వారా వినాలి, అట్లా విని తెలుసుకోవాలి. తరువాత విన్న దానిని తర్కం ద్వారా మననం చెయ్యాలి– నిది ధ్యాసం చెయ్యాలి. ఓ మైత్రేయీ ! ఆత్మతత్వాన్ని గూర్చిన దర్శనం, శ్రవణం. మననం., విజ్ఞానం ద్వారా అన్నీ తెలుస్తాయి. ఎందుచేతనంటే,

లోకంలో, త్రాడులో ఉన్నట్టి సర్పమనే భ్రాంతి, అది త్రాడు అనే జ్ఞానం కలగటంతోనే (ఆ భ్రాంతి) తొలగిపోతుంది గదా ! అందుచేత, విజ్ఞానం కలగగానే యథార్థమైన ఆత్మ స్వరూపం గోచరిస్తుంది.

**మం॥ బ్రహ్మ తం పరాదాద్యో న్యత్రాత్మనో బ్రహ్మవేద, క్షత్రం తం పరా దాద్యోన్యత్రాత్మనః క్షత్రం వేద లోకాస్తం పరాదుర్యో న్యత్రాత్మనో లోకాన్వేద, దేవాస్తం పరాదుర్యోఽన్య త్రాత్మనో దేవాన్వేద, భూతాని తం పరాదుర్యో న్యత్రాత్మనో భూతాని వేదసర్వం తం పరాదాద్యో న్యత్రాత్మనః స్వరం వేద, ఇదం బ్రహ్మ, ఇదం క్షత్రం, ఇమే లోకాః, ఇమే దేవాః, ఇమాని భూతాని, ఇదం సర్వం యదయ మాత్మా. 6**

బ్రాహ్మణ జాతిని ఎవరైనా ఆత్మకంటె భిన్నమైన దానినిగా భావిస్తే, వాళ్ళను బ్రాహ్మణ జాతి నిర్లక్ష్యం చేసి దూరంగా త్రోసి వేస్తుంది– పరాస్తం చేస్తుంది; అంటే పురుషార్థాల నుండి భ్రష్టుల్ని చేస్తుందని భావం. అట్లాగే క్షత్రియజాతిని ఎవరైనా ఆత్మకంటె భిన్నమైనదానినిగా తలిస్తే, అట్టి క్షత్రియజాతి పరాస్తం చేస్తుంది అట్లాగే దేవతలను ఎవరైనా ఆత్మ కంటె భిన్నంగా తలిస్తే వారిని దేవతలు తృణీకరిస్తారు. పంచ భూతాలను ఆత్మకంటె భిన్నంగా భావించిన వారిని, ఆ పంచభూతాలు పరాస్తం చేస్తాయి. ఇన్నిమాట లెందుకు? ఎవరిని ఆత్మకంటె భిన్నంగా చూచినా, వారందరు, అవన్నీ ఆ భేద దృష్టి గల వారిని పరాస్తం చేస్తాయి. కాబట్టి, బ్రాహ్మణజాతి, క్షత్రియజాతి, ఈ లోకాలు, ఈ దేవతలు, ఈ భూతాలు, ఈ కనిపించే సమస్తమూ ఆత్మతత్త్వమే ! ఎందుచేతనంటే, ఆది. మధ్య, అంతాల్లో, ఆత్మరూపంగా తప్ప వీటికి ఉపలబ్ధి లేనే లేదు– ఆత్మకంటె భిన్నమైనది ఏదీ లేదు– అన్నీ ఆత్మ నుండే పుట్టి, ఆత్మగానే ఉంటూ, ఆత్మలోనే లయమౌతున్నాయి.

**మం॥ స యథా దుందుభేర్హ న్యమానస్య న బాహ్యాన్ఛబ్దాన్ఛ క్నుయాద్గ్రహణాయ, దుందుభేస్తు గ్రహణేన దున్దుభ్యాఘాతస్యవా– శబ్దో గృహీతః. 7**

ఆత్మ యొక్క సర్వరూపకత్వానికి దృష్టాంతాలు చెపుతున్నారు. ఈ సమస్త ప్రపంచం చిదాత్మ కంటే భిన్నంకాదు అని చెపుతున్నారు.

ఏది లేకుండా ఒక వస్తువును మనం గ్రహించలేమో అది (గ్రహించటానికి వీలుకలిగించేది) దానియొక్క తత్త్వము, ధర్మము అవుతుందని లోకవ్యవహారం.

ఒక నగారాను కఱ్ఱతో మ్రోగించినపుడు దానినుండివచ్చే వివిధములైన ప్రత్యేక స్వరాలను (తార మంద్రాది స్వరాలను) నగారాయొక్క సామాన్య స్వరం కంటె భిన్నంగా గుర్తించలేము. ఆ ప్రత్యేక స్వరాలన్నీ నగారాయొక్క సామాన్య స్వరంలో కలసిపోతాయి. ఈ వివిధ స్వరాలన్నిటికి

నగారాయొక్క సామాన్య స్వరం (శ్రుతి) లేనిదే ఆస్థిత్వం లేక పోవటం మనం చూస్తూనే ఉన్నాము. ఎన్నిరకాలుగా కొట్టి, ఎన్నిరకాలైన శబ్దాలు పుట్టించినా అవన్నీ సామాన్య స్వరంలో కలసిపోతాయి– వాటికి ప్రత్యేకమైన ఆస్థిత్వం లేదుకాబట్టి, ముందు సామాన్య శబ్దం గ్రహింపబడి తరువాత తాళస్వరాదులతో కూడిన శబ్ద విశేషం పట్టుపడుతుంది. అట్లాగే ముందు చిదాత్మ గ్రహింపబడుతుంది. పిమ్మటనే దానిలో కల్పితమైన నామరూపాత్మకమైన జగత్తు పట్టుపడుతుంది. ముందు ప్రకాశాన్ని నేత్రం గ్రహించిన తరువాతనే నీలము మొదలైన రంగుల్ని, రూపాల్ని ఎవడైనా చూడగలుగుతాడు. అట్లాగే చిదాత్మను దర్శించిన తరువాతనే అందులో కల్పింపబడ్డ నామరూపాత్మకమైన జగత్తును చూడలుగుతాడు.

**మం॥ స యథా శంఖస్య ధ్మాయమానస్య న బాహ్యాన్ఛబ్దా న్ఛక్నుయా ద్గ్రహనాయ, శంఖస్య తు గ్రహణేన– శంఖధ్మస్య వా– శబ్దో గృహీతః 8**

రెండవ దృష్టాంతం– శంఖాన్ని ఊదినప్పుడు వెలువడిన ప్రత్యేకమైన శబ్దాల్ని ఎవరూ గ్రహించలేరు. కాని శంఖాన్నిగాని, శంఖాన్ని పూరించటాన్నిగాని పట్టుకొన్నప్పుడు ఆ శబ్దం దానంతట అదే పట్టుబడుతుంది. ప్రత్యేక శబ్దాలన్నీ శంఖం యొక్క సామాన్య శబ్దంలో కలసి ఉంటాయి. కాబట్టి ముందు సామాన్య శబ్దం పట్టుబడాలి.

**మం॥ స యథా వీణాయై వాద్యమానాయై న బాహ్యాన్ఛ బ్దాన్ఛక్ను యాద్గ్రహణాయ, వీణాయైతు గ్రహణేన– వీణావాదస్య వా– శబ్దోగృహీతః. 9**

అట్లాగే వీణను మ్రోగించినపుడు వెలువడే ప్రత్యేక శబ్దాలను ఎవరూ వీణయొక్క సామాన్య శబ్దానికి భిన్నంగా గ్రహించలేరు. వీణను, వీణయొక్క స్వరాన్ని గ్రహించటం వల్లనే (అంటే వీణయొక్క సామాన్య స్వరాన్ని గ్రహించటంవల్లనే ఆ ప్రత్యేక స్వరాలు పట్టుబడుతున్నాయి.

**మం॥ స యథార్ద్రైధాగ్నేరభ్యాహితా త్పృథగ్ధూమా విని శ్చరతి, ఏవం వా అరేఽస్య మహతో భూతాస్య నిశ్వసిత మేతద్యదృగ్వేదో యజుర్వేదః సావేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యను వ్యాఖ్యానాని వ్యాఖ్యానాని; అస్యైవైతాని నిశ్వసితాని. 10**

తడిసి ఉన్న కట్టెను రగుల్కొలిపినప్పుడు అగ్నిలో నుండి రకరకాలుగా పొగలువస్తాయి. తరువాత రవ్వలు వస్తాయి. ఓ మైత్రేయీ ! ఆ రవ్వలు అగ్నికంటె భిన్నమైనవి కావు. అట్లాగే (ఆ రవ్వలలాగా) ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, ఆథర్వణవేదం, ఇతిహాసాలు, పురాణాలు, కళలు, ఉపనిషత్తులు, మంత్రాలు, శ్లోకాలు, సూత్రాలు, మంత్రాల వివరణలు, అర్థవాదాలు,

ఇవన్నీ ఆ మహాద్భుతమైన పరమాత్మయొక్క నిశ్వాసాలు. ఉచ్ఛ్వాస విశ్వాసాల లాగా ప్రయత్నం లేకుండానే ఆ విజ్ఞానఘనునినుండి ఉత్పన్నమైనాయి. కాబట్టి ఇవన్నీ ఆ విజ్ఞాన ఘనుని కంటె భిన్నమైనవి కావు. పొగ, రవ్వలు, జ్వాలలు వీటన్నింటికి పూర్వం అన్నీ అగ్నిమయమే ! దీనివల్ల అగ్నియొక్క ఏకత్వం సిద్ధిస్తోంది– నామరూపాత్మకమైన వికృతిని పొందటానికి పూర్వం ఈ జగత్తు అంతా ఆ ప్రజ్ఞాన ఘనుడే !

**మం॥ స యథా సర్వాసామపాం సముద్ర ఏకాయతనమ్, ఏవం సర్వేషాం స్పర్శానాం త్వగేకాయతనమ్, ఏవం సర్వేషాం గంధానాం నాసికే ఏ కాయతనం, ఏవం సర్వేషాం రసానామ్ జిహ్వైకాయతనం, ఏవం సర్వే షాం రూపాణాం చక్షురేకాయతనమ్, ఏవం సర్వేషాం శబ్దానాం శ్రోత్రమేకాయతనం, ఏవం సర్వేషాం సంక ల్పానాం మన ఏకాయతనం, ఏవం సర్వేషాం విద్యానాం హృదయ మేకాయతనం, ఏవం సర్వేషాం కర్మానాం హస్తౌ వేకాయతనం, ఏవం సర్వేషా మా నందానా ముపస్థ ఏకాయతనం, ఏవం సర్వేషాం విసర్గాణాం పాయురేకాయతనం, ఏవం సర్వేషా మధ్వనాం పాదావేకాయతనం, ఏవం సర్వేషాం వేదానాం వాగేకాయతనం. 11**

ఆత్మ యొక్క సర్వాశ్రయత్వానికి దృష్టాంతం చెపుతున్నారు– అన్ని నదులకు, సరోవరాలకు సముద్రమే గమ్యస్థానం– ప్రళయస్థానం. దానిలోచేరి అవన్నీ తమ అస్థిత్వాన్ని కోల్పోతాయి. అంటే అభేదస్థితిని పొందుతాయి. అట్లాగే అన్నిరకాల స్పర్శలకు గమ్యస్థానం త్వక్కు. (చర్మం). అన్ని రకాల వాసనలకు ప్రళయస్థానం నాసిక. అన్ని రకాల రుచులకు ప్రళయస్థానం నాలుక. అన్ని శబ్దాలకు గమ్యస్థానం చెవులు. అన్ని ఆలోచనలకు గమ్యస్థానం మనస్సు. అన్ని విద్యలకు లయస్థానం హృదయం. అన్ని కర్మలకు గమ్యస్థానం చేతులు. అన్ని సుఖాలకు గమ్య స్థానం జననేంద్రియం. అన్ని విసర్జనలకు గమ్యస్థానం గుదము. అన్ని మార్గాల నడకలకు గమ్యస్థానము కాళ్ళు. అట్లాగే అన్ని వేదాలకు గమ్య స్థానం వాక్కు.

ఈ విధంగా విషయాలన్నింటికి గమ్యం (అవిభాగప్రాప్తిస్థలం) ఇంద్రియాలని తేలుతోంది– కార్యాలన్నీ కారణాల్లో కలసి ఇవన్నీ ఆ విజ్ఞానఘనునిలో చేరిపోతాయి.

**మం॥ స యథా సైంధవఖిల్య ఉదకే ప్రాప్త ఉదక మేవాను విలీయేత, న హాస్యోద్గ్రహణాయేవ స్యాత్, యతో యతస్త్వాదదీత లవణమేవ, ఏవం వా అర ఇదం, మహ ద్భూత మనంత మపారం విజ్ఞానఘన ఏవం. ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవాను వినశ్యతి, న ప్రేత్య సంజ్ఞాస్తీత్యరే బ్రవీమీతి హోవాచ యాజ్ఞ వల్క్యః. 12**

నీటిలో వేసిన ఉప్పుముద్ద ఆ నీళ్ళలో కరిగిపోతుంది. ఆ ఉప్పును వేరు చేయలేము. ఆ ఉప్పు కలిసిన నీటిని ఎక్కడనుండి తీసి రుచి చూసినా ఉప్పగానే ఉంటాయి. అంటే, ఉప్పు, నీరు అంతటా వ్యాప్తమై ఉంటుంది. అట్లాగే, ఓ మైత్రేయీ ! అద్భుత శక్తి సంపన్నుడైన పరమాత్మ అనంతుడు. అపారమైన విజ్ఞాన ఘనుడు. అతడు దేహాది ఉపాధులతోఖాటు సత్య శబ్దవాచ్యమైన భూతాలతో ప్రకటమై వాటి నాశనంతో పాటు నాశనమౌతున్నట్లు కనిపిస్తాడు. దేహేంద్రియ భావంతో ముక్తమైన పిమ్మట (విడివడిన తరువాత) విశేష సంజ్ఞలేవీ ఉండవు– నేను ఫలానా, నేను ఫలానా, నా పేరు ఫలానా, ఫలానావారి కొడుకును అని. ఈ విధంగా యాజ్ఞవల్క్యుడు భార్యయైన మైత్రేయితో పరమార్థ దృష్టిని నిరూపించి చెప్పాడు.

**మం॥ సాహోవాచ మైత్రేయీ, అత్రైవ మా భగవానమూ ముహత్, న ప్రేత్య సంజ్ఞాస్తీతి, సహోవాచ న వా అరే హం మోహం బ్రవీమి, అలం వా అర ఇదం విజ్ఞానాయ. 13**

ఇది విని మైత్రేయి అంటోంది– "దేహపాతమైన పిమ్మట (మరణించిన తరువాత) ఏ విధమైన సంజ్ఞలు ఉండవని చెప్పి, నన్ను మోహంలో పడేశారు– సంజ్ఞలు లేకుండా ఆ విజ్ఞాన ఘనుని సత్తను ఎట్లా ఒప్పుకోగలం?" అని.

యాజ్ఞవల్క్యుడు అన్నాడు– "మైత్రేయీ ! నేను నిన్ను మోహంలో పడేసేటందుకు ఉపదేశం చేయటంలేదు. కాని, ప్రియురాలా ! పరమాద్భుతమైన, ఆ పరమాత్మను గూర్చి తెలియజెప్పటానికి ఈ మాత్రం చాలు. ఆవిద్యాజన్యమైన ఉపాధివల్ల, ఆ విజ్ఞాన ఘనునికి ఖిల్యభావం ఉంది. ఆ ఖిల్యభావం (నాశనమవటం) దేహపాతం కాగానే పోతుంది– ఉపాధి ఉండదు కాబట్టి ఆ ఖిల్యభావమూ ఉండదు.

**మం॥ యత్ర హిద్వైతమివ భవతి తదితర ఇతరం జిఘ్రతి, తదితర ఇతరం పశ్యతి, తదితర ఇతరం శృణోతి, తదితర ఇతర మభివదతి, తదితర ఇతరం మనుతే, తదితర ఇతరం విజానాతి, యత్రవా అస్య సర్వమాత్మైవా భూత్తత్కేన కంజిఘ్రేత్, తత్కేన కం పశ్యేతే, తత్కేన కం శ్రుణుయాత్, తత్కేన కమభివదేత్, తత్కేన కం మన్వీత, తత్కేన కం విజానీయాత్ ? యే వేద సర్వం విజానాతి తం కేన విజానీయాత్ ? విజ్ఞా తారమరే కేన విజానీయాదితి. 14**

ఆవిద్యావస్థలో మాత్రమే ద్వైతభావం ఉంటుందని చెవుతున్నారు. అవిద్యావస్థలో ఉన్నప్పుడు అద్వయబ్రహ్మలోద్వైత భావం కనిపిస్తుంది. ఆ స్థితిలో –ద్వైతస్థితిలో ఒకడు ఇంకొక దానిని వాసన చూస్తాడు. వాసన చూస్తున్నట్లు కనిపిస్తాడు. ఒకడు ఇంకొకనిని చూస్తాడు. ఒకడు

మరియొకడు చెప్పింది వింటాడు. ఒకడు మరియొకనికి నమస్కరిస్తాడు. ఒకడు ఇంకొకనిని గూర్చి ఆలోచిస్తాడు. ఒకడు ఇంకొకని గూర్చి తెలుసుకుంటాడు.

కాని, ఇందుకు భిన్నంగా అంతా ఒకే ఆత్మ అయినపడు ద్వైతం నశించి, అద్వైతభావం కలిగినప్పుడు, ఎవడు ఎవనిని (దేనిని) వాసన చూస్తాడు ? (వాసన చూచేవాడు వాసన చూడబడేది ఒకటే అవుతుంది గదా !) ఎవడు ఎవరిని చూస్తాడు? ఎవడు ఎవడు చెప్పింది వింటాడు? ఎవడు ఎవరికి నమస్కరిస్తాడు? ఎవడు ఎవరిని గురించి ఆలోచిస్తాడు? ఎవడు ఎవరిని గురించి తెలుసుకుంటాడు? అంటే, వాసన చూచేవాడు, వాసన చూడబడేది, వినేవాడు వినబడేది. చూచేవాడు చూడబడూది. ఈ విధంగా ఇవన్నీ ఒకటే అయినప్పుడు భేదమే లేదుగదా ! వీటి అన్నింటిని దేనిచేత తెలుసుకుంటున్నామో అట్టిదానిని దేనిచేత తెలుసుకుంటాము కాబట్టి, మైత్రేయీ ! చెప్పు ! విజ్ఞాతను దేనిచేత తెలుసుకుంటాము. తెలుసుకొనేందుకు రెండవవాడు లేదుగదా ! అతడు అద్వితీయ విజ్ఞాత. అది అద్వితీయమైన ఆత్మస్థితి.

## ఐదవ బ్రాహ్మణం

వెనుకటి మైత్రేయీ సంవాదంలో కర్మలకు ఏ విధమైన సంబంధం లేని అమరత్వాన్ని గూర్చి చెప్పారు. వైరాగ్యం ద్వారా, ఆత్మజ్ఞానాన్ని గూర్చి చెప్పి, ఆత్మను తెలుసుకుంటే విశ్వాన్నంతను తెలుసుకున్నట్లేనని, అన్నిటికంటె ఆత్మయే ప్రేమాస్పదమైనదని, కాబట్టి దానిని తెలుసుకోవాలని చెప్పారు. ఆత్మజ్ఞానం కలిగినప్పుడు ద్వంద్వస్థితి ఉండదని, ఆ అద్వైత స్థితి, రెండవవాడంటు లేనట్టి స్థితి అని, విశదీకరించారు.

'ఈ ఉన్నదంతా ఆత్మే అని ఆత్మయే అందరిలోను సమానంగా ఉన్నదని, ఆత్మనుండే అన్నీపుట్టి, ఆత్మలోనే అన్నీ లయమౌతున్నాయని' చెప్పిన విషయాన్ని హేతుబద్ధంగా లేదని వాదించేవారి అభ్యంతరానికి సమాధానంగా ఈ అయిదవ బ్రాహ్మణం చెపుతున్నారు. ఈ పృథివి మొదలుగాగల సమస్త జగత్తు ఒకదానికొకటి ఉపకార్య ఉపకారక స్వభావాలు కలవని, లోకంలో ఒకదాని కొకటి ఉపకార్య ఉపకారక రూపంగా ఉండేవన్నీ ఒక కారణం కలవి, ఒకే చైతన్యను విద్ధమై ఒకే ప్రళయస్థానం కలవై ఉంటాయి. ఈ విషయాన్నే విశదీకరిస్తున్నారు.

**మం॥ ఇయం పృథివీ సర్వేషాం భూతానాం మధు, అస్యై, పృథివ్యై సర్వాణి భూతాని మధు, యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమయో మృతమయః పురుషః, యస్యాయ మధ్యాత్మం శారీర స్తేజోమయో మృత మః పురుషః, అయమేవ స యోయ మాత్మా, ఇదమమృతం, ఇదం బ్రహ్మ, ఇదం సర్వమ్. 1**

ఈ జగత్తు– బ్రహ్మ మొదలు స్తంభ పర్యంతరంగల సృష్టి– అన్ని భూతాలయొక్క మధువు– తేనెటీగలు అసంఖ్యాకంగాచేరి తేనె తుట్టెను నిర్మించినట్లు సమస్త భూతాలు చేరి, ఈ పృథివిని నిర్మించాయి. అట్లాగే సమస్త భూతాలకు ఈ భూమి మధువు అవుతుంది. తేనె తుట్టె, తేనెటీగలకు ఆహారం, ఆశ్రయం అయినట్లుగా, ఈ భూతాలన్నింటికి ఈ భూమి ఆశ్రయం, ఆహారం అవుతోంది కాబట్టి, దీనిని కూడా మధువు అన్నారు. ఈ పృథివిలో ఉన్న చిన్మాత్రుడు, ప్రకాశమయుడు, అమృతమయుడు అయిన పురుషుడే ఈ అధ్యాత్మ శరీరంలోని తేజోమయుడైనట్టి అమరణ ధర్ముడైనట్టి పురుషుడు కూడాను– ఇద్దరూ ఒకటే ! అదే ఆత్మ అంటే, ఆత్మతప్ప వేరొకదుకాదు. ఈ ఆత్మజ్ఞానమే అమృతత్వానికి సాధనం. ఈ అన్నింటిలోను ఉన్న ఏకత్వమే బ్రహ్మ. అదే సర్వరూపం. బ్రహ్మజ్ఞానమే, సమస్తము తాను అవటానికి సాధనం (పృథివి అనేది శరీరానికి ప్రతీక.)

**మం॥ ఇమా ఆపః సర్వేషాం భూతానాం మధు; ఆ సామపాం సర్వాణి భూతాని మధు; యశ్చాయమాస్వప్సు తేజో మయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం రైతస స్తేజోమయో మృతమయః పురుషః, అయ మే స యో యమాత్మా; ఇద మమృతమ్, ఇదం బ్రహ్మ, ఇదం సర్వం.** **2**

అట్లాగే, జలం, సమస్తభూతాలకు– ప్రాణులకు మధువు, సమస్తభూతాలు, జలానికి మధువు. జలాన్ని రేతస్సు అన్నారు– 'ఆపో రేతోభూత్వా' అనిశ్రుతి. జలంలో ఉన్న ప్రకాశమయుడు, అమృత స్వరూపుడే ఈ శరీరాల్లో బీజంగా ఉండే ప్రకాశమయుడు, అమృతమయుడూను– అదే ఆత్మ. ఈ ఆత్మజ్ఞానమే అమృతత్వానికి సాధనం. ఈ రెంటిలోను ఉన్న ఏకత్వమే బ్రహ్మ. ఈ బ్రహ్మజ్ఞానమే సర్వమూ తాను అవటానికి సాధనం. అంటే, ఆత్మయే అమృతం (చావులేనిది అదే సర్వరూపం.)

**మం॥ అయమగ్ని; సర్వేషాం భూతానాం మధు, అస్యాగ్నేః సర్వాణి భూతాని మధు, యశ్చాయ మస్మిన్నగ్నౌ తేజోమయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం వాఙ్మయస్తేజోమయో మృతమయః పురుషః, అయమేవ స యోయమాత్మా; ఇదమమృతం, ఇదం బ్రహ్మ ఇదం సర్వం.** **3**

జీవులన్నింటికి అగ్ని మధువులాంటిది. అట్లాగే అగ్నికి ఈ ప్రాణులన్నీ మధువు లాంటివి. అగ్నిలో ఉన్నట్టి తేజోమయుడు, అమరణధర్ముడు అయిన పురుషుడే ఈ శరీరాల్లో వాగ్రూపంలో ఉన్నట్టి తేజోమయుడు, అమరణధర్ముడూ అయిన పురుషుడు ఇద్దరూ ఒకటే ! ఇదే బ్రహ్మ. అదే అమృతము. అదే సర్వరూపమైనది. అగ్ని వాక్కుకు అభిమాన దేవత.

**మం॥ అయం వాయుః సర్వేషాం భూతానాం మధు, అస్య వాయోః సర్వాణి భూతాని మధు, యశ్చాయ మస్మి న్వాయౌ తేజోమయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం ప్రాణ స్తేజోమయో మృత మయః పురుషః, అయమేవ స యోయమాత్మా, ఇద మమృతం, ఇదం బ్రహ్మ ఇదం సర్వం. 4**

ఈ వాయువు జీవరాసులన్నింటికి మధువు వంటిది. అట్లాగే; ఈ జీవరాసులన్నీ వాయువుకు మధువు లాంటివి. ఈ వాయువులో ఉన్నట్టి తేజోమయుడు, అమృతమయుడు, ఈ అధ్యాత్మశరీరాల్లో ప్రాణరూపంలో ఉండే తేజోమయుడు, అమృతమయుడు ఇద్దరూ ఒకటే ! అదే ఆత్మ ! ఇదే అమృతం. అదే బ్రహ్మ; ఇదే సర్వరూపం గలది, వాయువే ప్రాణం. లేదా ప్రాణానికి ప్రతీక.

**మం॥ అయమాదిత్యః సర్వేషాం భూతానాం మధు, అస్యా దిత్యస్య సర్వాణి భూతాని మధు; యశ్చాయ మసుదీక్షు దిత్యే తేజోమయో మృతమయః పురుషః యశ్చాయ మధ్యాత్మం చాక్షుష స్తేజోమయో మృతమయః పురుషః, అయమేవ స యో యమాత్మా; ఇద మమృతం, ఇదం బ్రహ్మ, ఇదం సర్వం 5**

ఈ ఆదిత్యుడు– సూర్యుడు అన్ని భూతాలకు మధువు. అన్ని భూతాలు –జీవులు ఈ ఆదిత్యునికి మధువు లాంటివి. ఆ ఆదిత్యునిలో ఉన్నట్టి ప్రకాశమయుడు, అమరణధర్ముడు అయునపురుషుడే ఈ శరీరాల్లో ఉండే చాక్షుష (కన్నులలో ఉండే) తేజోమయుడు, అమృతస్వరూపుడూ అయిన పురుషుడు. వీరిద్దరు ఒకటే ! అదే ఆత్మ. అదే అమృతం అదే బ్రహ్మ అదే సర్వరూపం. ఆదిత్యుడు నేత్రాలకు అభిమాన దేవత.

**మం॥ ఇమా దిశః సర్వేషాం భూతానాం మధు, ఆసాం దిశాం సర్వాణి భూతాని మధు; యశ్చాయ మస్మిన్నా దిత్యే తేజోమయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం శ్రౌత్రః ప్రాతిశ్రుత్క స్తేజోమయో మృతమయః పురుషః అయమేవ స యో య మాత్మా; ఇద మమృతం, ఇద బ్రహ్మ, ఇదం సర్వం. 6**

ఈ దిక్కులన్నీ సమస్త భూతాలకు మధువువంటివి. అట్లాగే సమస్థ భూతాలూ ఈ దిక్కులన్నింటికి మధువువంటివి. ఈ దిక్కులలో ఉన్నట్టి తేజోమయుడు, అమృతమయుడు అయిన పురుషుడే ఈ శరీరంలో ఉండే శ్రౌత్ర పురుషుడు– ప్రాతిశ్రుత్కుడు (శ్రవణ సమయంలో ఉండే పురుషుడు) తేజోమయుడు అమృతమయుడు అయిన పురుషుడు కూడా అతడే ! అతడే ఆత్మ, అతడే అమరణ ధర్ముడు, అతడే బ్రాహ్మ. అతడే సర్వరూపుడు. (దిక్కులు శ్రోత్రాలకు ప్రతీకలు.)

**మం॥ అయం చంద్రః సర్వేషాం భూతానాం మధు, అస్య చంద్రస్య సర్వాణి భూతాని మధు; యశ్చాయ మస్మిం శ్చంద్రే తేజోమయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం మానస స్తేజోమయా మృత మయః పురుషః అయమేవ స యో యమాత్మా, ఇదమమృతమ్, ఇదం బ్రహ్మ, ఇదం సర్వం. 7**

ఈ చంద్రుడు సమస్తభూతాలకు– జీవులకు మధువు వంటివాడు. అట్లాగే సమస్త భూతాలూ చంద్రునికి మధుపులాంటివి. ఆ చంద్రునిలో ఉన్నట్టి తేజోమయుడు, అమృతమయుడు అయిన పురుషుడు, ఈ శరీరంలో ఉన్న మనస్సంబంధమైన చిన్మయుడైన అమృతమయుడు, తేజోమయుడు ఒకరే ! ఇదే ఆత్మ, ఇదే అమృతం, ఇదే బ్రహ్మ. ఇదే సర్వస్వరూపం. చంద్రుడు మనస్సుకు అభిమాన దేవత – చంద్రుడు మనస్సు అయి హృదయంలో ప్రవేశించాడు– చందమ్రామనోభూత్వా హృదయం ప్రవిశత్' అని శ్రుతి.

**మం॥ ఇయం విద్యుత్సర్వేషాం భూతానాం మధు, అస్యై విద్యుతః సర్వాణి భూతాని మధు, యశ్చాయమస్యాం విద్యుతి తేజోమయో మృతమయః పురుషః యశ్చాయమధ్యాత్మం తైజస స్తేజోమయో మృత మయః పురుషః అయమేవ స యో యమాతామ; ఇదమమృతమ్, ఇదం బ్రహ్మ, ఇంద సర్వం 8**

ఈ విద్యుత్తు సమస్త జీవకోటికి మధువు. అట్లాగే సమస్త జీవరాసులు ఈ విద్యుత్తుకు మధువు. విద్యుత్తులో ఉండే చిన్మయ ప్రకాశ స్వరూపుడు, అవినాశి అయిన పురుషుడు, ఈ శరీరాల్లో ఉండే తేజోమయ అమృతమయుడు ఒకటే !అతడే ఆత్మ. అతడే అమృతుడు. అతడే బ్రహ్మ. అతడే సర్వరూపుడు, చర్మగతమైనట్టి శరీరస్థమైన కాంతియే అధ్యాత్మతైజస పురుషుడు.

**మం॥ అయం స్తనయిత్నుః సర్వేషాం భూతానాం మధు, అస్య స్తనయిత్నోః సర్వాణి భూతాని మధు, యశ్చాయమస్మిన్స్తయిత్నౌ తేజోమయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం శాబ్దః సౌవ రస్తేజోమ యో మృతమయః పురుష, అయమేవ స యో యమాత్మా; ఇదమమృతం, ఇదం బ్రహ్మ ఇదం సర్వం 9**

ఈ సమస్త భూతాలకు మేఘం మధువు. అట్లాగే సమస్తభూతాలూ ఈ మేఘానికి మధువు. ఈ మేఘంలో ఉన్న తేజోమయుడు, అమృత మయుడు అయిన పురుషుడే ఈ శరీరంలో శబ్దము, స్వరము రూపాల్లో ఉండే తేజోమయుడు, అమృతమయుడూను. ఈ ఇరువురు ఒకటే! అదే ఆత్మ. అదే అమృతం, ఇది బ్రహ్మ, ఇదే సర్వమూను.

**మం॥ ఆయ మాకాశః సర్వేషాం భూతానాం మధు, అస్యా కాశస్య సర్వాణి భూతాని మధు, యశ్చాయ మస్మి న్నాకాశే తేజోమయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం**

**మృద్యాకాశస్తేజోమయో మృతమయః పురుషః, అయమేవ స యో య మాత్మా, ఇద మమృతం, ఇదం బ్రహ్మ, ఇదం సర్వమ్. 10**

ఈ ఆకాశం సమస్త భూతాలకు మధువు. అట్లాగే సమస్త జీవులు ఈ ఆకాశానికి మధువు. ఈ ఆకాశంలో ఉండే తేజోమయ, అమృత మయుడూ, ఈ శరీరాల్లో హృదయాకాశంలో ఉండే తేజోమయ, అమృత మయుడూ ఇద్దరూ ఒకటే ! అదే ఆత్మ. అది చావులేనిది. ఆది బ్రహ్మ. అదే సమస్తమూను.

**మం॥ ఆయం ధర్మః సర్వేషాం భూతానాం మధు, అస్య ధర్మస్య సర్వాణి భూతాని మధు, యశ్చాయ మస్మిన్ ధర్మతేజోమయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం ధార్మస్తేజోమయా మృతమయః పురుషః ఆయమేవ స యో య మాత్మా; ఇదమమృతం ఇదం బ్రహ్మ, ఇదం సర్వమ్. 11**

**మం॥ ఇదం సత్యం సర్వేషా భూతానాం మధు, అస్య సత్యస్య సర్వాణి భూతాని మధు, యశ్చాయ మస్మిన్ సత్యే తేజోమయో మృతమయః పురుషః, యశ్చాయ మధ్యాత్మం సాత్యస్తేజోమయో మృతమయః పురుషః, అయమేవ స యో యమాత్మా; ఇద మమృతం, ఇదం బ్రహ్మ, ఇదం సర్వమ్ 12**

ధర్మమనే పేరుతో వ్యవహరింపబడేది, మనం ఆచరింపదగినట్టిది అయిన ధర్మము ఈ భూతాలన్నింటికి మధువు. ఈ భూతాలన్నీ ఆ ధర్మానికి మధువు. ధర్మానికి మధువు. ధర్మమనేది పరోక్షంగా ఉండేదైనా, ప్రత్యక్షంగా ఉన్నట్లు చెప్పటంలో ఉద్దేశ్యం ఏమిటంటే, ఆ ధర్మంవల్ల కలిగే సుఖాదులు అంటే కార్యాలు ప్రతక్ష్యంగా ఉంటాయి కాబట్టి ! ఈ ధర్మంలో ఉండే తేజోమయుడు, అమృతమయుడు అయినవాడే ఈ శరీరంలో కూడా తేజోమయుడుగా అమృతమయుడుగా ఉన్నాడు, అతడే ఆత్మ అతడే అమృతుడు. అతడే బ్రహ్మ. అతడే సమస్తమూను.

(పైన చెప్పిన ధర్మమే అనుష్ఠింపబడేటప్పుడు– ఆచరణలో– సత్య శబ్దవాచ్య మౌతుంది.) ఈ సత్యమనేది సమస్త భూతాలకు మధువు. అట్లాగే సమస్త భూతాలు ఈ సత్యానికి మధువు. (ధర్మంలాగానే సత్యం కూడా ఆచరణలో రెండు రకాలుగా ఉంటుంది. అంటే, సామాన్య రూపంలో పృథివ్యాదులతో సంబంధించి ఉంటుంది. విశేష రూపంలో దేహసంఘాతంతో సంబంధించి వుంటుంది.) ఈ సత్యంలో ఉండే తేజోమయుడు, అమృతమయుడు, అయిన పురుషుడే శరీరాల్లో ఉండే తేజోమయ అమృతమయ పురుషుడు ! అతడేఆత్మ అతడే అమృతుడు, అతడే బ్రహ్మ. అతడే సర్వమూను.

**మం॥ ఇదం మానుషం సర్వేషాం బూతానాం మధు, అస్య మానుషస్య సర్వాణి భూతాని మధు, యశ్చాయ మస్మిన్ మానుషే తేజోమయో మృతమయః పురుషః యశ్చాయ మధ్యాత్మం మానుషస్తేజో మయో మృతమయః పురుషః అయమేవ స సో యమాత్మా; ఇదమమృతం, ఇదం బ్రహ్మ, ఇదం సర్వం. 13**

**మం॥ అయమాత్మా సర్వేషాం భూతానాం మధు, అస్యా త్మనః సర్వాణి భూతాని మధు; యశ్చాయ మస్మిన్నా త్మని తేజోమయో మృతమయః పురుషః, ఆయ మేవ స యో యమాత్మా, ఇద మమృతం, ఇదం బ్రహ్మ, ఇదం సర్వం 14**

ఈ మనుష్యాధి జాతులన్నీ ఈ భూతాలకు మధువు. ఈ భూతాలన్నీ మనుష్యాది జాతులకు మధువు. ఈ భూతాలలో ఉన్నట్టి తేజోమయుడు అమృతమయుడు అయిన పురుషుడే మనుష్యాదులలో ఆయా శరీరాలకు సంబంధించిన తేజోమయుడు, అమృతమయుడు అయిన పురుషుడు. అతడే ఆత్మ. అతడే అమృతుడు. అతడే బ్రహ్మ. అతడే సర్వమూ.

ఈ దేహం సమస్త భూతాలకు కార్యమైనందువల్ల వాటికి మధువు. అట్లాగే సమస్తభూతాలూ ఈ దేహానికి మధువు. ఈ భూతాలలో ఉన్న తేజోమయ, అమృతమయుడు, ఈ దేహంలో ఉన్నట్టి తేజోమయ అమృతమయుడు ఒకడే ! అతడే ఆత్మ. అతడే అమృతుడు. అతడే బ్రహ్మ. అతడే సర్వము.

**మం॥ స వా యఅమాత్మా సర్వేసాం భూతానా మధిపతిః, సర్వేషాం భూతానాం రాజా; తద్యథా రథనా భౌచ రథనేమౌ చారాః సర్వే సమర్పితాః, ఏవమేవాస్మి న్నాత్మని సర్వాణి, భూతాని, సర్వే దేవాః, సర్వే లోకాః, సర్వే ప్రాణాః సర్వ ఏత ఆత్మనః సమర్పితాః. 15**

ఈ విజ్ఞానమయుడైన ఆత్మయే సమస్త భూతాలకు అధిపతి. సమస్త భూతాలకు రాజు. దీనికి దృష్టాంతం చెప్పుకోవాలంటే, రథచక్రం యొక్క నాభిలోను, నేమిలోను అన్ని ఆకులు ఇమిడి ఉన్నట్లుగా పరమాత్మలో సమస్త భూతాలు. సమస్త దేవతలు, సమస్త లోకాలు, అన్ని ప్రాణులు, అవిద్యా కల్పితాలైన అన్ని జీవాత్మలు ఇమిడి ఉన్నాయి. నాభి నేమితో కూడిన రథచక్రం పరమాత్మ, అన్ని భూతాలు దేవతలు మొదలైనవన్నీ ఆకులు.

**మం॥ ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణో శ్విభ్యామువాచ త దేతదృష్టిః పశ్యన్న వోచత్. తద్వాం నరా సనయే దంస ఉగ్రమావిష్కృణోమి తన్యతుర్న వృష్టిమ్ దధ్యఙ్ హ యన్మధ్వాథర్మణో వామశ్వస్య శీర్ష్ణా ప్రయదీమువాచ. ఇతి. 16.**

దధ్యఙ్ఙాథర్వణుని ద్వారా అశ్వనీకుమారులకు మధువిద్య ఉపదేశింపబడిన విధానాన్ని గురించి వివరిస్తున్నారు.

ఈ మధు విజ్ఞానాన్ని దధ్యఙ్ఙాథర్వణ ఋషి (అథర్వణుని కుమారుడైన దధ్యఙ్ఙుడు) అశ్వనీ కుమారులకు చెప్పాడు. ఈ మధు విద్యనుచూస్తూనే మంత్రద్రష్టయౌన ఋషి అంటున్నాడు– "మానవాకారంలో ఉన్న ఓ అశ్వనీ కుమారులారా ! బ్రహ్మవిద్యా ప్రాప్తి కోసం– బ్రహ్మ విద్యా లాభం కోసం, దురాశతో మీరు చేసిన ఉగ్రదంస కర్మను (క్రూరమైన కర్మను) నేను అందరికి తెలిసేటట్లుగా మంత్రం రూపంలో ప్రకటిస్తాను– మేఘం వర్షించినంత స్పష్టంగా ప్రకటిస్తాను– ఆ మధు విజ్ఞానం మీకు బోధించటానికి దధ్యఙ్ఙాథర్వణ ఋషి, మీకు (ఆశ్వనీ కుమారులకు) గుఱ్ఱపు తలను అతికించటమనే ఉగ్రకర్మను ప్రతిపాదించాడు." (మేఘ గర్జనంతో సమానమైన ధ్వనితో మంత్రం, అశ్వనీ కుమారులు చేసిన ఉగ్రకర్మను ప్రకటించింది. ఈ కథ వైదిక ఇతిహాసంలో ప్రసిద్ధమే!)

శతపథ బ్రాహ్మణంలో ఈ కథ ఉంది– ఈ మధు విద్యను అథర్వణుని కుమారుడైన దధ్యఙ్ఙుడు ఆశ్వనీ కుమారులకు ఉపదేశించాడు. ఆ మధువిద్య మనం చెప్పుకొన్న 1 నుండి 15 మంత్రం వరకు ఉన్నది.

దధ్యఙ్ఙుడు ఈ మధు విద్యను ఆశ్వనీ కుమారులకు నేర్పుదామని అనుకున్నాడు. కాని ఇంద్రుడు ఈ విద్యను ఎవరికైనా చెపితే నీ తల సరికేస్తానని ప్రతిన పూనాడు. ఆ కారణం చేత అశ్వనీకుమారులను శిష్యులుగా గ్రహించి ఈ విద్యను చెప్పటానికి భయపడుతున్నానని వారితో దధ్యఙ్ఙుడు అన్నాడు. అప్పుడు అశ్వనీకుమారులు ఈ విధంగా అన్నారు– 'మేము మీ తల నరికి గుఱ్ఱపుతలను ఆ మొండెమునకు అతికిస్తాము. మీరు మధు విద్య నుపదేశిస్తే ఇంద్రుడు ఆ తలను (గుఱ్ఱపుతలను) నరుకుతాడు. తరువాత మేము మీ నిజమైన తలను అతికిస్తాము" అని. అందుకు దధ్యఙ్ఙుడు అంగీకరించి, గుఱ్ఱపుతలతోనే మధువిద్యను ఉపదేశించాడు. అప్పుడింద్రుడు తన ప్రతిజ్ఞ ప్రకారం అతని తలను నరికాడు. అప్పుడు అశ్వనీదేవతలు దధ్యఙ్ఙుని అసలైన తలను తెచ్చి మళ్ళీ అతికించారు. దధ్యఙ్ఙుడు ఈ క్రూర కర్మకు అంగీకరించిన విషయం, పై మంత్రంలో ప్రస్తావించారు.

ఈ ఉగ్రకర్మ ఎందుకు చేశారు? దురాశతో ! ప్రపంచంలో ఇటువంటి ఉగ్రకర్మలు దురాశా ప్రేరితులై చేస్తారు. ఈ ఉగ్రకర్మను మంత్ర ద్రష్ట ప్రకటించారు. ఈ మధు విద్య యొక్క ప్రాశస్త్యం. గొప్పతనం చాటటానికే ఇదంతా చెప్పారు అని గ్రహించాలి.

**మం॥ ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణో శ్విభ్యామువాచ. తదేతదృషిః పశ్యన్నవోచత్. ఆథర్వణాయాశ్వినా దధీచే శ్వ్యం శిరః ప్రత్యైర యతం. స వాం మధు ప్రవోచ దృతాయన్ త్వాష్ట్రం యద్దస్రావపి కక్ష్యం వామ్ ఇతి. 17**

ఈ మధువిజ్ఞానాన్ని దధ్యఙ్ఙుడు అశ్వనీకుమారులకు బోధించటం చూచిన మంత్రద్రష్టయైన ఋషి అంటున్నాడు– 'ఓ అశ్వనీ కుమారులారా ! మీరిద్దరు దధ్యఙ్ఙ అధర్వణుని కోసం గుఱ్ఱపుతల తెచ్చారు. ఆ ఋషి కూడా తన సత్యవచనాన్ని నిలుపుకోవటం కోసం మీకు సూర్య సంబంధమైన ఈ మధు విజ్ఞానాన్ని బోధించాడు. ఓ శత్రు హింసకులారా ! ఆ ఋషి మీకు అత్యంత రహస్యపూర్ణమైన మధు విజ్ఞానాన్ని బోధించాడు.'

**మం॥ ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణో శ్విభ్యామువాచ. తదేతదృష్టిః పశ్యన్న వోచత్. పురశ్చక్రే ద్విపదః పురశ్చక్రే చతుష్పదః పురః స పక్షీ భూత్వా పురః పురుష ఆ విశత్. ఇతి స వా అయం పురుషః సర్వాసు పూర్షు పురిశయః; నైనేన కించనానావృతమ్; నైనేన కించనాసం వృతమ్. 18**

ఈ మధు విజ్ఞానాన్ని అశ్వనీకుమారులకు బోధించటం చూచిన మంత్రద్రష్టమైన ఋషి అంటున్నాడు– పరమాత్మ రెండు కాళ్ళు, నాలుగు కాళ్ళు ఉన్న శరీరాల్ని సృష్టించాడు. ముందుగా ఆ పురుషుడు పక్షిలాగా (లింగ శరీరంతో) ఈ స్థూల శరీరాల్లో ప్రవేశించాడు. అన్ని శరీరాల్లోను నివసిస్తూ ఉన్నందువల్లనే ఆ పరమేశ్వరుణ్ణి 'పురుషుడు' అన్నారు. ఆ పురుషుని చేత ఆచ్ఛాదింపబడనిది, అతడు ప్రవేశించనిది, ఈ సృష్టిలో ఏదీ లేదు." దీనివల్ల పరమాత్మ యొక్క సర్వవ్యాపకత్వం తెలుస్తోంది.

**మం॥ ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణో శ్విభ్యామువాచ. తదేతదృష్టి; పశ్యన్ననోచత్. రూపం రూపం ప్రతిరూపో బభూవ, తదస్య రూపం ప్రతిచక్షణాయ, ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే, యుక్తా హ్యస్య హరయః శతా దశ. ఇతి అయం వై హరయః, అయం వై దశ చ సహస్రాణి, బహూని చానన్తాని చ; తదేత ద్బ్రహ్మాపూర్వమన పరమనంతరమ బాహ్యం, అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః, ఇత్యనుశాసనం. 19**

మంత్రద్రష్టయైన ఋషి అంటున్నాడు– ఆ పరమాత్మ ప్రతి ఒక్క రూపానికి ప్రతిరూపమైనాడు– తన ఆ రూపాన్ని అభివ్యక్తం చేయటానికే, ఆ పరమేశ్వరుడే, మాయ వల్ల, అనేక రూపాలు కలవాడుగా కన్పిస్తున్నాడు. శరీరమనే ఈ రథంలో ఇంద్రియాలనే గుఱ్ఱాలు వంద పది ఉన్నాయి. అట్లాగే ఈ పరమాత్మ శరీరంలో ఉన్న ఇంద్రియాశ్వాలు కూడా వందల వేల కొలది ఉన్నాయి. అని భావం ఈ ఇంద్రియ రూపంలో ఉండే గుఱ్ఱాలు కూడా ఆ పరమాత్మయే! అవి అనేక పదులు, వేలు, అనేకం అనంతంగా ఉన్నాయి. ఈ బ్రహ్మ కారణరహితుడు, కార్య రహితుడు, సంసర్గ శూన్యుడు, అబాహ్యుడు, అనభ్యంతరుడు. (కార్యకారణాలు రెండూ లేనివాడు, దేనిని అంటనివాడు, బయట, లోపల అనేది లేనివాడు) అన్ని విషయాలను అనుభవించేది ఈ ఆత్మే ! ఇదే సమస్త వేదాంత బోధ !

## ఆరవ బ్రాహ్మణం

ఈ మధువిద్య యొక్క సంప్రదాయ పరంపరమ చెపుతున్నారు.

**మం॥ అథవంశః పౌతిమాష్యో గౌపవానాత్, గౌపవనః పౌతి మాష్యాత్, పౌతి మాష్యో గౌపవనాత్, గౌపవనః కౌశికాత్, కౌశికః కౌండిన్యాత్, కౌండిన్యః శాండి ల్యాత్, శాండిల్యః కౌశికాచ్చ, గౌతమాచ్చ, గౌతమః–** **1**

(బ్రహ్మ విద్యా స్తుతి కోసం మధుకాండ యొక్క వంశాన్ని చెపుతున్నారు. ఈ మంత్రం స్వాధ్యాయానికి జపానికి ఉద్దేశింపబడ్డది.) ఈ మధు విద్యను – పౌతిమాష్యుడు గౌపవనుని నుండి, గౌపవనుడు పౌతిమాష్యుని నుండి. (ఒకే పేరు వచ్చినపుడు ఉదా ॥ గౌపవనుడు– మరియొక గౌపవనుడు అని గ్రహించాలి) సౌతిమాష్యుడు గౌపవనుని నుండి, గౌపవనుడు కౌశికుని నుండి, కౌశికుడు కౌండిన్యుని నుండి, కౌండిన్యుడు శాండిల్యుని నుండి, శాండిల్యుడు కౌశికుని నుండి, గౌతముని నుండి, గౌతముడు–

**మం॥ అగ్ని వేశ్యాత్, అగ్ని వేశ్యః శాండిల్యాచ్చానభిమ్లా తాచ్చ, ఆనభిమ్లాత ఆనభిమ్లాతాత్, ఆనభిమ్లాత అనభిమ్లాతాత్, అసభిమ్లాతో గౌతమాత్, గౌతమః సైతవ ప్రాచీన యోగాభ్యామ్, సైతవ ప్రాచీన యోగ్యౌ పారా శర్యాత్, పారాశర్యోభారద్వాజాత్, భారద్వాజో భారద్వాజాచ్చ గౌత మాచ్చ, గౌతమో భారద్వాజాత్. భారద్వాజః పారాశర్యాత్, పారా శర్యో బైజవాపాయనాత్, బైజవాపాయనః కౌశికా యనేః, కౌశికాయనిః.** **2**

అగ్ని వేశుని నుండి, అగ్ని వేశ్యుడు శాండిల్యుని నుండి, ఆనభిమ్లాతుని నుండి, ఆనభిమ్లాతుడు ఆనభ్లిమాతుని నుండి, ఆనభిమ్లాతుడు గౌతముని నుండి, గౌతముడు సైతవ, ప్రాచీన యోగ్యులు, పారాశర్యుని నుండి, పారాశర్యుడు భారద్వాజుని నుండి, భారద్వాజుడు భారద్వాజ గౌతముల నుండి, గౌతముడు భారద్వజుని నుండి, భారద్వాజుడు పారాశర్యుని నుండి, పారాశర్యుడు బైజవాపాయను నుండి, బైజపాయనుడు కౌశికాయను నుండి, కౌశికాయని–

**మం॥ ఘృతకౌశికాత్, ఘృతకౌశికః పారాశర్యాయణాత్, పారాశర్యాయణః పారాశర్యాత్; పారాశర్యో జాతూ కర్ణ్యాత్, జాతూకర్ణ్య ఆసురాయణాచ్చ యస్కాచ్చ, ఆసురాయణస్త్రైవణేః, త్రైవణిరౌపజంధనేః, ఓపజం ధనిరాసురేః, అసురి ర్భారద్వాజాత్, భారద్వాజ ఆత్రేయాత్, ఆత్రేయోమాణ్టేః, మాణ్టిర్గౌతమాత్, గౌతమో గౌతమాత్, గౌతమోవాత్స్యాత్, వాత్స్యః శాండిల్యాత్, శాండిల్యః కైశోర్యాత్కా ప్యాత్, కైశోర్యః కాప్యః కుమారహారితాత్, కుమారహారితో గాలవాత్, గాలవో విదర్భీకౌండి న్యాత్, విదర్భీకౌండిన్యో**

**వత్సనపాతోబాభ్రవాత్, వత్సనపాద్బాభ్రవః పతః సౌభవరాత్, పన్థాః సౌభరో యాస్యాదాంగి రసాత్, అయాస్య ఆంగిరస ఆభూతేస్త్వాష్ట్రాత్, ఆభూతిస్త్రాష్ట్రో విశ్వరూప స్త్వాష్ట్రాత్, విశ్వరూపస్త్వాష్ట్రో శ్విభ్యామ్, అశ్వినౌ దధీచ ఆథర్మణాత్, దధ్యఙ్గాథర్వణో థర్వణో దైవాత్, అథర్వాదేవో మృత్యోః ప్రధ్వంసనాత్, మృత్యుః ప్రాంధ్వంసనః ప్రాధ్వంసనాత్, ప్రాధ్వంసన ఏకర్షేః, ఏకర్షిర్విప్రచిత్తేః, విప్రచిత్తి ర్వ్యష్టేః, వ్యష్టిః సనారోః, సనారుః సనాతనాత్, సనాతనః సనగాత్, సనగః పరమేష్ఠినః, పరమేష్ఠీ బ్రహ్మణః, బ్రహ్మ స్వయంభు, 'బ్రహ్మణే నమః.** **3**

ఘృతకౌశికుని నుండి, ఘతకౌశికుడు పారాశర్యాయణుని నుండి..... సనాతనుడు సనకుని నుండి, సనకుడు విరాట్ట్ నుండి, విరాట్ట్ హిరణ్య గర్భుని నుండి ఈ మధు విద్యను పొందారు. బ్రహ్మ స్వయంభువు– ఆ బ్రహ్మకు నమస్కారములు.

ఇది మధువిద్యకు గురుపరంపర. వంశమంటే వెదురు అని అర్థం ఉంది. వెదురుగడ కణుపులుగా విభజింపబడ్డ విధంగా ఈ పరంపర కూడ కొన్ని భాగాలుగా విభజించటం ఇందులోని సామ్యం. ఈ శిష్యగురుపరంపర పై నుండి క్రిందకు– చివర నుండి మూలానికి చెప్పబడ్డది కాబట్టి బ్రహ్మతో హిరణ్యగర్భునితో అగిపోయింది.

పునర్విమర్శనము : ఈ రెండు అధ్యాయాలు మధుకాండ అనే పేరుతో ప్రసిద్ధి చెందాయని చెప్పుకున్నాము. ఈ మధువిద్యను కూడా మనం బ్రహ్మవిద్యగానే భావించాలి. ఎందుచేతనంటే దీనిని హిరణ్యగర్భుడు ప్రజాపతికి ఉపదేశించాడు. దీని సారాంశమేమంటే, పృథివి మొదలుగా గల సమస్త జగత్తు ఒకదానికొకటి ఉపకార్య ఉపకారకాలుగా ఉంటాయి– ఒకదానికొకటి మధువు. దానితో పాటు లోకంలోని అన్ని జీవులు ఒకే కారణం కలిగి, ఒకే చైతన్యం చేత అనువిద్ధమై (పూసలు దారం చేత గుచ్ఛబడినట్లుగా) ఒకే ప్రళయస్థానం కలవై ఉన్నాయి. పృథివి, సమస్త భూతాలు, పార్థివ రూపంలో ఉండే పురుషుడు, శరీరం ఈ నాలుగు ఒకదానికొకటి మధువు. ఈ పృథివి సమస్త భూతాలకు కార్యం. అందుచేత దీనిలో (ఒకే కారణం చేత ఉత్పన్నమవటం) ఏక కారణకత్వం కనిపిస్తోంది. ఆ కారణ మేది?– పరబ్రహ్మ ! ఆ జ్ఞానం వల్ల సమస్త జగత్తు బ్రహ్మమే ! ఈ విధంగా మధుచతుష్టయం చెప్పబడ్డది. దీని పర్యవసానం బ్రహ్మమే ! బ్రహ్మను బోధించింది కాబట్టి ఈ ప్రకరణం కూడా ఉపనిషత్తే అవుతోంది.

# మూడవ అధ్యాయం

## మొదటి బ్రాహ్మణం

**మం॥ ఓం జనకో హ వై దేహో బహుదక్షిణేన యజ్ఞేనేజే తత్ర హ కురు పంచాలానాం బ్రాహ్మణా అభిసమేతా బభూవుః; తస్స హ జనకస్య వైదేహస్య విజిజ్ఞాసా బభూవ, కః స్విదేషాం బ్రాహ్మణానామనూచానతమ ఇతి; స హ గవాం సహస్ర మవరురోధ; దశ దశ పాదా ఏకైకస్యాః శృంగయోరాబద్ధా బభూవు. 1**

సర్వశ్రేష్ఠుడైన బ్రహ్మవేత్త ఎవరో తెలుసుకోవాలని జనకమహారాజు మనస్సులో అనుకోవటం–

విదేహ దేశానికి సార్వభౌముడైన జనకుడు ఒక గొప్ప యాగం చేశాడు. ఆ యాగంలో భూరిదక్షిణలివ్వటం ఒక ప్రధాన లక్షణం (అది అశ్వమేధమే కావచ్చు) ఆ యజ్ఞానికి కొందరు ఆహ్వానింపబడి, మరికొందరు ఆహ్వానం లేకపోయినా తమంతట తాముగా (భగవత్కార్యం కాబట్టి, పుణ్యకర్మ కాబట్టి) విద్వాంసులైన బ్రాహ్మణులు చాలామంది వచ్చారు. యజ్ఞాలలో యజమానుడు, చక్రవర్తి అయిన జనకుడు– "ఈ వచ్చిన వారిలో ప్రవచనంలో (వ్యాఖ్యానించటంలో) అందరిని మించిన ప్రవక్త ఎవరో తెలుసుకోవాలి" అని అనుకున్నాడు అందుకు గాను, ఒక వేయి ఆవుల్ని గోశాలలో నిలిపి ఉంచాడు. అట్లా ఉంచిన ప్రతి ఆవు కొమ్ముల మీద, పదేసి బంగారు నాణాలు (పాదాలు) ఉంచాడు. ఒక్కొక్క కొమ్ముకు ఐదేశి బంగారు నాణాలు కట్టాడన్నమాట.

**మం॥ తాన్ హో వాచ, బ్రాహ్మణా భగవన్తః యో వో బ్రహ్మిష్ఠః స ఏతాగా ఉదజతామితి. తేహ బ్రాహ్మణా న దధృషుః; అథ హ యాజ్ఞవల్క్యః స్వమేవ బ్రహ్మ చారినమువాచ, ఏతాః సోమ్యోదజ సామశ్రవా 3 క్రూధుః, కథం నో బ్రహ్మిష్ఠో బ్రువీతేతి; అథ హ జనకస్య వైదేహస్య హోతాశ్వలో బభూవ; స హైనం పప్రచ్ఛ, త్వం ను ఖలు నో యాజ్ఞవల్క్య బ్రహ్మి ష్ఠో సీ 3 ఇతి; స హోవాచ, నమో వయం బ్రహ్మి ష్ఠాయ కుర్మః, గోకామా ఏవ వయం స్మ ఇతి; తం హ తత ఏవ ప్రష్టుం దధ్రే హోతాశ్వలః, 2**

జనకుడు బ్రాహ్మణులు నందరిని ఉద్దేశించి ఇట్లా అన్నాడు– "పూజనీయులైన బ్రాహ్మణులారా ! మీలో అందరికంటె గొప్ప బ్రహ్మవేత్త అయినవాడు ఆ ఆవుల్ని తీసికొని పోవచ్చు!" అని.

అక్కడ ఉన్న బ్రాహ్మణులలో ఎవరికీ ధైర్యం చాలలేదు. బ్రాహ్మణులెవ్వరూ సాహసించలేకపోవటం చూచి, యాజ్ఞవల్క్యుడు తన శిష్యుడైన ఒక బ్రహ్మచారితో –"ఓ సామశ్రవసుడా ! ఈ ఆవుల్ని మన యింటికి తోలుకొనిపో !' అన్నాడు. (సామశ్రమసుడంటే, సామవేదం పఠించటం తెలిసినవాడు. లేక సామవిధిని శ్రవణం చేసినవాడు) ఆ బ్రహ్మచారి ఆ విధంగానే ఆవుల్ని తోలుకొని వెళ్ళాడు. ఇది చూచిన బ్రాహ్మణులంతా క్రుద్ధులైనారు– 'ఈ యాజ్ఞవల్క్యుడు మన అందరి కంటె తాను ఏ విధంగా బ్రహ్మనిష్ఠుడని అనుకుంటున్నాడు?' అని. ఇట్లా అనుకున్నవారిలో జనకుని యాగంలో హోతగా వ్యవహరించిన అశ్వలుడు కూడా ఉన్నాడు. (యజ్ఞంలో, ఋగ్వేదమంత్రాలు చదివి, దేవతలను ఆవాహన చేయటం హోత యొక్క విధి) అశ్వలుడు యాజ్ఞవల్క్యానితో అన్నాడు– 'యాజ్ఞవల్క్యా ! మా అందరికంటె నీవే గొప్ప బ్రహ్మవేత్తవనే విషయం నిజమేనా?" అని.

అప్పుడు యాజ్ఞవల్క్యుడన్నాడు– "బ్రహ్మనిష్ఠునికి నేను నమస్కరిస్తాను. ప్రస్తుతం నాకు ఆవులు కావాలి." అని. ఇది విన్న ఆశ్వలుడు యాజ్ఞవల్క్యుని ప్రశ్నించాలని నిశ్చయించుకున్నాడు. (యాజ్ఞవల్క్యుడు యజుశ్శాఖాధ్యాపకుడైనా నాల్గువేదాలు చదివినవాడనే విషయం, అతని శిష్యుని సంబోధించిన తీరు వల్ల తెలుస్తుంది– ఆ శిష్యుడు సామవేద శ్రవుడు అవటం వల్ల)

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, యదిదం సర్వం మృత్యు నాప్తం, సర్వం మృతునాభిపన్నం, కేన యజమానో మృత్యోరాప్తిమతి ముచ్యత ఇతి; హోత్రర్త్విజాగ్నినా వాచా; వాగ్వై యజ్ఞస్య హోతా, తద్యేయం వాక్ సో యమగ్నిః, సహోతా, సముక్తిః, సాతిముక్తిః, 3**

అశ్వలుడు అడుగుతున్నాడు– 'ఓ యాజ్ఞవల్క్యుడా ! ఇదంతా (ఈ యజ్ఞానికి సాధనభూతాలైన హోత, అధ్వర్యుడు, అగ్ని మొదలైనవి) మృత్యువు చేత ఆచ్ఛాదింపబడినదే గదా ! – మృత్యువుకు లోబడినవే గదా ! ఈ విధమైన మృత్యువు యొక్క వ్యాప్తిని యజమానుడు ఏ విధంగా తరించగలుగుతాడు?– యజ్ఞసాధనాలన్నీ మృత్యువుకు లోబడినవి. ఆ సాధనాలతో యజమాని మృత్యువును ఎట్లా దాటి అమృతుడౌతాడు? అని భావం.

అందుకు యాజ్ఞవల్క్యుడు ఈ విధంగా అన్నాడు– 'అగ్ని ద్వారా' అని. అగ్నియే యదార్థంగా 'హోత' అనే పేరుతో పిలువబడే ఋత్విక్కు. వాక్కు ద్వారా మృత్యువును తరించగలుగుతాడు– వాక్కే యజ్ఞంలో హోత. ఈ వాక్కు అనేదే అధిదైవతమైన అగ్ని. ఆ హోత రూపంలో ఉండే అగ్నే ముక్తి. అంటే, హోతను అగ్ని రూపంలో చూడటమే మృత్యువు నుండి ముక్తుడవటం– అగ్నియే ముక్తి; ఇదే అతి ముక్తి– అజ్ఞానపాశం నుండి విముక్తి పొందటం అతిముక్తి– అదే ముక్తికి సాధనం.

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, యదిదం సర్వమహో రాత్రాభ్యామాప్తం, సర్వమ హోరాత్రాభ్యామభి పన్నం, కేన యజమానో హోరాత్రయోరాప్తిమతి ముచ్యత ఇతి అధ్వర్యుణ ర్త్విజా చక్షుషాది త్యేన; చక్షుర్వై యజ్ఞస్యాధ్వర్యుః, తద్య దిదం చక్షుః సో సా వాదిత్యః, సో ధ్వర్యుః, సముక్తిః, సాతిముక్తిః. 4**

అశ్వలుడు అడుగుతున్నాడు– ఓ యాజ్ఞవల్క్యుడా ! ఈ కనిపించే జగత్తు అంతా రాత్రింబవళ్ళ చేత వ్యాప్తమై ంది. కాబట్టి, అన్నీ రాత్రింబవళ్ళకు లోబడే ఉన్నాయి గదా ! అటువంటప్పుడు ఏ సాధనం వల్ల యజమానుడు ఈ అహోరాత్రాల పట్టు నుండి తప్పించుకోగలుగుతాడు?" అని.

అందుకు యాజ్ఞవల్క్యుడు సమాధానమిస్తున్నాడు– "అధ్వర్యుడనే ఋత్విక్కు ద్వారా అహోరాత్రాల పట్టునుండి తప్పించుకోగలడు. అంటే, నేత్రం ద్వారా లేదా సూర్యుని ద్వారా ఈ అధిభూత పరిచ్ఛేదాన్ని దాటగలుగుతాడు. ఎందుచేతనంటే, యజ్ఞంలో అధ్వర్యుడు నేత్రము. నేత్రమే ఆదిత్యుడు. కాబట్టి సూర్యుడే అధ్వర్యుడు – సూర్యుడే ముక్తి. అంటే అధ్వర్యుని ఆదిత్య రూపంలో ఉపాసిస్తే, ఆ విధంగా ఉపాసింపబడే అధ్వర్యుడే ముక్తి. అతడే అతిముక్తి కూడ– అజ్ఞాన బంధనాల నుండి కూడా ముక్తి కలిగిస్తాడు.

(యజ్ఞంలో యజుర్వేద మంత్రాల ద్వారా దేవతల నుద్దేశించి హోమం చేయించే ఋత్విక్కును అధ్వర్యుడంటారు. రాత్రింబవళ్ళ మార్పు వల్లనే పుట్టటం, పెరగటం, చావటం మొదలైన మార్పులన్నీ జరుగుతున్నాయి. కాబట్టి కాలం యొక్క బంధనాల నుండి విడివడటం అతిముక్తిగా చెప్పారు.)

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, యదిదం సర్వం పూర్వ పక్షాపరపక్షాభ్యామా ప్తమ్, సర్వం పూర్వపక్షాపర పక్షాభ్యామభిపన్నమ్, కేన యజమానః పూర్వపక్షా పరపక్షయోరాప్తిమతి ముచ్యత ఇతి. ఉద్గాత్రర్త్విజా వాయునా ప్రాణేన; ప్రాణో వై యజ్ఞ స్యోద్గాతా; తద్యో యం ప్రాణః స వాయుః, స ఉద్గాతా, స ముక్తిః, సాతి ముక్తిః. 5**

అశ్వలుడు మళ్ళీ అడుగుతున్నాడు– 'ఓ యాజ్ఞవల్క్యుడా ! ఈ ప్రపంచమంతా చంద్రుని వల్లనైన కృష్ణపక్ష, శుక్ల చేత పరివ్యాప్తమై ఉంది గదా ! ఈ శుక్లపక్షం, కృష్ణపక్షం (పూర్వం పక్షం, అపరపక్షం) ల వ్యాప్తిని ఏ సాధనం ద్వారా యజమాని దాటగలుగుతాడు? – వీటి నుండి ఏ ఉపాయం ద్వారా విడివడ గలుగుతాడు !" అని.

యాజ్ఞవల్క్యుడు సమాధానమిస్తున్నాడు– "ప్రాణం ద్వారా ! వాయువు ద్వారా తరించగలుగుతాడు. ఈ ప్రాణమే (వాయువే) నిజానికి ఉద్గాత (యజ్ఞంలో సామవేదాన్ని

పఠించేవాడు.) యజ్ఞం చేసే యజమానికి ప్రాణం ఉద్గాతయే ! ప్రాణం అంటే వాయువు. ప్రాణము. వాయువు అంటే ఉద్గాత. కాబట్టి ఈ ప్రాణమే ముక్తి. ఈ విమోచనమే, బంధ విముక్తి కూడాను- అదే అతిముక్తి." (వాయు రూపాన్ని పొందినవాడు తిథులతో గూడిన కాలాన్ని అతిక్రమించగలుగు తాడు- చంద్రుని వృద్ధి క్షయాలకు కారణం వాయువే కాబట్టి.)

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, యదిదమన్తరిక్షమనార మ్బనమివ, కేనాక్రమేణ యజమానః స్వర్గంలోక మాక్రమత ఇతి; బ్రహ్మణ ర్త్విజా మనసా చంద్రేణ మనో వై యజ్ఞస్య బ్రహ్మా; తద్యదిదం మనః సో సౌ చంద్రః, స బ్రహ్మా, స ముక్తిః, సాతిముక్తిః- ఇత్యతిమోక్షః; అథ సంపదః.** **6**

అశ్వలుడు అడుగుతున్నాడు- 'ఓ యాజ్ఞవల్క్యుడా ! ఈ ఆకాశం ఆధారం లేకుండా ఉంది గదా ! అటువంటప్పుడు యజమాని ఏ ఆధారంతో స్వర్గలోకానికి పోగలుగుతాడు?' అని.

యాజ్ఞవల్క్యుడు అంటున్నాడు- "బ్రహ్మ అనే ఋత్విక్కు ద్వారా స్వర్గానికి పోగలుగుతాడు. (యాగ పర్యవేక్షకుని బ్రహ్మ అంటారు.) మనస్సు రూపంలో ఉండే చంద్రుని ద్వారా స్వర్గ లోకంలో అరూఢుడౌతాడు. మనస్సే యజ్ఞంలో బ్రహ్మ. మనస్సే చంద్రుడు. ఆ చంద్రుడే బ్రహ్మ రూపంలో ఉండే ఋత్విక్కు. బ్రహ్మ అనే ఋత్విక్కు ద్వారా- మనస్సు అనే చంద్రుని ద్వారా కర్మ ఫల స్వరూపమైన స్వర్గలోకాన్ని పొందుతాడు- అంటే అతిముక్తుడౌతాడు" అని. ఈ విధంగా అతిముక్తులను గూర్చి ఉపాయాలతో సహా వర్ణించారు. తరువాత సంపదలను వర్ణిస్తున్నాడు. (భావన ద్వారా అన్యవస్తువునందు అన్యదృష్టిని ఆరోపించటం సంపద అంటారు. బాగా డబ్బు ఉన్న వాళ్ళు మాత్రమే చేయటానికి సాధ్యమయ్యే రాజసూయం మొదలైన యజ్ఞాలవల్ల కలిగే ఫలం డబ్బు లేని వాడు కూడా ఈ సంపదల వల్ల పొందవచ్చు. అందుచేత సంపదలను గూర్చి వివరిస్తున్నారు.)

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, కతిభిరయమద్య ఋగ్భి ర్హోతాస్మిన్యజ్ఞే కరిష్యతీతి; తిసృభిరితి; కతమాస్తాస్తిస్ర ఇతి; పురోనువాక్యా చ యాజ్యా చ శస్యైవ తృతీయ, కిం తాభిర్జయతీతి; యత్కించేదం ప్రాణ భృదితి.** **7**

అశ్వలుడు అడుగుతున్నాడు- "ఓ యాజ్ఞవల్క్యుడా ! ఈనాడు యజ్ఞంలో హోత తనవంతుగా ఎన్ని ఋక్కులు పఠించి తనవంతును నిర్వర్తిసాడు ?"

యాజ్ఞవల్క్యుడు- 'మూడు విధాలైన ఋక్కులతో."

అశ్వలుడు– “అవి ఏవి?”

యాజ్ఞవల్క్యుడీ విధంగా వివరించాడు– “యజ్ఞానికి ముందు ప్రయుక్తమయ్యే ఋక్కులు ‘పురోనువాక్యాలు.’ యాగ సమయంలో ప్రయుక్తమయ్యే ఋక్కులు ‘యాజ్యాలు’, శంసనం కోసం (దేవతలను ప్రశంసించటం కోసం స్తుతిరూపమైన ఋక్కులు) ప్రయోగించే ఋక్కులు ‘శస్యా’ అని వ్యవహరింపబడతాయి.”

అశ్వలుడు మళ్ళీ అడిగాడు– ‘ఈ మూడు విధాలైన ఋక్కుల ద్వారా యజమానుడు వేటిని జయించగలుగుతాడు?

యాజ్ఞవల్క్యుడు సమాధానమిస్తున్నాడు– “సంఖ్యలో సమానత్వం ఉండటం వల్ల, జీవులతో గూడిన మూడు లోకాలను (భూలోక, భువర్లోక, సువర్లోకాలు) సమస్త ప్రాణులతో సహా జయిస్తాడు– సమస్త ఫల సమూహాన్ని సంపాదించగలుగుతాడు. (పురోనువాక్యాలు, యాజ్యాలు, శస్యాలు ఇవి మూడు. లోకాలు మూడు. ఈ ఋక్కులను లోకదృష్టితో, లోకాలందు ఆరోపించటం వల్ల ముల్లోకాలను జయిస్తాడని భావం)

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, కత్యయమద్యాధ్వర్యు రస్మిన్యజ్ఞ ఆహుతీ ర్హోష్యతీతి; తిస్ర ఇతి; కతమాస్తా స్తిస్ర ఇతి; యా హుతా అధిశేర తే, కిం తాభిర్జయ తీతి; యా హుతా ఉజ్జ్వలన్తి, దేవలోకమేవ తాభిర్జయతి, దీప్యత ఇవ హి దేవలోకః, యా హుతా అతినేదన్తే, పితృలోకమేవ తాభిర్జయతి, అతీవ హి పితృలోకః, యా హుతా అతి శేరతే, మనుష్య లోక మేవ తాభిర్జయతి, అధ ఇవ హి మనుష్యలోకః. 8**

అశ్వలుడు అడుగుతున్నాడు– ‘యాజ్ఞవల్క్యుడా ! ఈ రోజున యజ్ఞంలో అధ్వర్యుడు ఎన్ని విధాలైన ఆహుతుల్ని హవనం చేస్తాడు?’ (వెనుకటి మంత్రంలో ఎన్ని విధాలైన ఋక్కులు ఉపయోగిస్తాడు ? అని అడిగాడు)

యాజ్ఞవల్క్యుడు– ‘మూడు విధాలైన ఆహుతులు ఇస్తాడు’.

అశ్వలుడు– ‘అవి ఏవి?’

యాజ్ఞవల్క్యుడు – (1) ‘నేయి, సమిధలు ఆహుతులుగా ఇచ్చినప్పుడు అవి బాగా ప్రజ్వలిస్తాయి. ఆ ఆహుతులవల్ల యజమానుడు దేవలోకాన్ని పొందుతాడు. ఇవి ప్రజ్వలితాహుతులు. దేవలోకం దేదీప్యమానంగా ఉంటుంది. ఈ ఆహుతులవల్ల వచ్చే కాంతికూడా అట్లాగే ఉంటుంది.

(2) వెనుకటిలాగే నేయి, సమిధలు హోమం చేసినపుడు పెద్ద శబ్దాలు వస్తాయి. అవి 'నాదమయి' ఆహుతులు. ఈ ఆహుతులవల్ల యజమాని పితృలోకాన్ని పొందుతాడు. (పితృలోకంలో –సంయమనీ పురంలో యమునిచేత బాధింపబడే జీవరాసుల హాహాకారాలు, ఆర్తనాదాలు వస్తాయి కాబట్టి)

(3) పాలు, సోమరసం ఆహుతులిచ్చినపుడు అగ్నిజ్వాలలు పృథివిలో లీనమౌతాయి. ఇవి నిమ్నస్థానీయాహుతులు. వీటివల్ల యజమానుడు మనుష్యలోకాన్ని జయిస్తాడు– మనుష్యలోకం అధోవర్తి కాబట్టి.'

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, కతిభిరయమద్య బ్రహ్మా యజ్ఞం దక్షిణతో దేవతాభిర్గోపాయతీతి; ఏకయేతి; కతమా సైకేతి; మన ఏవేతి; అనన్తం వై మనః; అనన్తా విశ్వేదేవాః, అనన్తమేవ స తేన లోకం జయతి. 9**

అశ్వలుడు మళ్ళీ ఈ విధంగా అడిగాడు– 'ఓ యాజ్ఞవల్క్యుడా! ఈ బ్రహ్మ అనే పేరుగల ఈ ఋత్విక్కు దక్షిణదిక్కున నియమితమైన ఆసనం మీద కూర్చుండి ఎంతమంది దేవతల ద్వారా ఈ యాగాన్ని రక్షిస్తున్నాడు?'

యాజ్ఞవల్క్యుడు– 'ఒకే దేవతద్వారా!'

అశ్వలుడు– 'ఆ దేవత ఎవరు?'

యాజ్ఞవల్క్యుడు– 'మనస్సే ఆ దేవత, నిజంగా మనస్సు అనేది అనంతమైనది. విశ్వేదేవతలు కూడా అనంత సంఖ్యలోనే ఉంటారు'. (కాబట్టి ఒక్క మనస్సు ద్వారా అని చెప్పటం వల్ల అసంఖ్యాకమైన విశ్వేదేవతల వల్ల రక్షిస్తున్నాడని భావం.) ఈ విధంగా ఉపాసన చేసిన యజమాని, అనంతత్వ సామ్యం వల్ల (అనంతము, అసంఖ్యాకము వీటి పోలికవల్ల) అనంతమైన లోకాల్ని జయిస్తాడు.

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, కత్యయమద్యోద్గాతా స్మిన్యజ్ఞేస్తోత్రియాః స్తోష్యతీతి; తిస్ర ఇతి; కతమాస్తాస్తిస్ర మితి; పురోనువాక్యా చ యాజ్యా శస్యైన తృతీయా; కతమాస్తా యా అధ్యాత్మమితి; ప్రాణ ఏవ పురోనువాక్యా అపానో యాజ్యా, వ్యానః శస్మా కిం తాభిర్జయతీతి; పృథివీలోకమేన పురోనువాక్యయా జయతి, అన్తరిక్షలోకం యాజ్యయా, ద్యులోకం శస్యయా; తతో హ హోతాశ్వల ఉపరారమ. 10**

అశ్వలుడు మళ్ళీ ఈ విధంగా అడిగాడు– 'యాజ్ఞల్క్యా ! ఈనాడు యజ్ఞంలో ఉద్గాత ఎన్ని రకాల స్తోత్రియా ఋక్కులను వల్లిస్తాడు ?

యాజ్ఞవల్క్యుడు : మూడు రకాలుగా, (ప్రగీత ఋక్కులను స్తోత్రాలని లేక స్తోత్రియాలని, అప్రగీత ఋక్కులను శస్త్రాలని, వీటినే శస్యాలని కూడా అంటారు. అనియత సంఖ్య కలిగి గీతి విశిష్టమైన ఋక్కులు స్తోత్రియాలు. ఈ స్తోత్రియాలైనా, శస్యాలైనా మూడు విధాలుగా ఉంటాయి).

అశ్వలుడు : 'ఆ మూడు విధాలు ఏవి?'

యాజ్ఞవల్క్యుడు : 'పురోనువాక్యాలు, యాజ్యాలు, శస్యాలు (ఈ బ్రాహ్మణంలోనే 7వ మంత్రం చూడండి)

అశ్వలుడు : వీటికి ఉన్నట్టి ఆధ్యాత్మిక విశిష్టత ఏమిటి. (వీటికి శరీరంతో గల సంభంధం ఏమిటి?)

యాజ్ఞవల్క్యుడు – ఈ శరీరంలో ఉండే ప్రాణమే పురోనువాక్యం. 'ప' కారం ఈ రెంటిలోను సమానంగా ఉంది ('ప' అనే అక్షరం రెంటికి కూడా మొదట్లో ఉంది. అట్లాగే ప్రాణం కూడా మొదటిది; అపానం రెండవదిగదా !) అపానం యాజ్య (రెండవదిగా ఉండటం రెంటిలోను సమానం) వ్యానం శస్యా అవుతుంది ! (ఊర్ధత్వం రెంటిలోను సమానం)

అశ్వలుడు : 'వీటి ద్వారా యజమాని ఏ లోకాలను జయిస్తాడు?'

యాజ్ఞవల్క్యుడు – ప్రధమత్వ సామ్యం వల్ల పురోను వాక్యం ద్వారా ఈ భూలోకాన్ని జయిస్తాడు మధ్యమత్వం సమానంగా ఉండటం వల్ల యాజ్య ద్వారా అంతరిక్షాన్ని, ఊర్ధ్వత్వ సామ్యం వల్ల శస్యా ద్వారా ద్యులోకాన్ని జయిస్తాడు.'

'యాజ్ఞవల్క్యుడు ఇక మనకు లొంగడు' అని అనుకొని అశ్వలుడు మౌనం వహించాడు.

## రెండవ బ్రాహ్మణం

బంధనాలు ఏవో, ఎటువంటివో తెలిస్తే తప్ప. వాటి నుండి విముక్తి పొందేందుకు ప్రయత్నం చేయటం కుదరదు. అందుచేత ఈ బ్రాహ్మణంలో బంధనాల్ని గురించి, వాటి స్వభావాల్ని గురించి వివరిస్తున్నారు.

**మం॥ అథ హైనం జారత్కారవ ఆర్తభాగః పప్రచ్ఛ; యాజ్ఞవల్క్యేతి హోవాచ, కతి గ్రహాః కత్యతి గ్రహా ఇతి. అష్టౌ గ్రహాః, అష్టావతి గ్రహా ఇతి; యే తే ష్టౌ గ్రహా; అష్టావతి గ్రహాః, కతమేత ఇతి.** **1**

పిమ్మట, జరత్కారు వంశానికి చెందినట్టి, ఋతభాగుని పుత్రుడైనట్టి, అర్తభాగుడు యాజ్ఞవల్క్యునితో అంటున్నాడు– 'యాజ్ఞవల్క్యా ! గ్రహాలు ఎన్ని ? అతి గ్రహాలు ఎన్ని ?

సమాధానంగా యాజ్ఞవల్క్యుడన్నాడు– 'గ్రహాలు ఎనిమిది. అతి గ్రహాలు ఎనిమిది'. అని.

ఆర్తభాగుడు– 'అవి ఏవి? – గ్రహాలు ఏవి ? అతి గ్రహాలు ఏవి ?'

(పట్టుబడటం ఉన్నప్పుడే దాని నుండి విడిపించుకోవటం అనేది ఉంటుంది – అంటే ముక్తి అని, అతిముక్తి అని ఉంటుంది. కాబట్టి గ్రహాలు, అతి గ్రహాలను పొందటం కూడా సామాన్య పద్ధతిలోనే ఉంటుంది. అందుచేత వాటికి సంబంధించిన ప్రశ్నలు, వాటి సంఖ్యలకు సంబంధించిన జిజ్ఞాస సహజం. గ్రహమనే పదానికి సామాన్య అర్థం గ్రహించ లేక తెలుసుకొనేది అని చెప్పుకుంటే దాని వల్ల గ్రహాలంటే ఇంద్రియాలే అని మనకు అర్థమౌతుంది– విషయాలను గ్రహించేవి కాబట్టి గ్రహాలు. అతి గ్రహము అంటే గ్రహము కంటె పెద్దది, గొప్పది. కాబట్టి విషయాలను అతిగ్రహాలుగా చెప్పవచ్చు. తరువాతి మంత్రాల్లో వీటి వివరణం ఇస్తున్నారు.)

**మం॥ ప్రాణో వ గ్రహః, సో పానే నాతి గ్రాహేణ, గృహీతః । అపానేన హి గంధాన్జిఘ్రతి. 2**

**మం ॥ వాచా హి నామాన్యభివదతి.**

**జిహ్వా నై గ్రహః, స ర సేనాతి గ్రాహేణ గృహీతః, 3**

**మం॥ జిహ్వా వై గ్రహః, స ర సేనాతి గ్రాహేణ గృహీతః, జిహ్వయా హి రసాన్విజానాతి. 4**

**మం॥ చక్షుర్వై గ్రహః, స రూపేణాతి గ్రాహేణ గృహీతః; చక్షుషా హి రూపాణి పశ్యతి. 5**

**మం॥ శ్రోత్రం వై గ్రహః, స శబ్దేనాతిగ్రాహేణ గృహీతః,శ్రోత్రేణ హి శబ్దాన్ శ్రుణోతి. 6**

**మం॥ మనో వై గ్రహః, స కామేనాతి గ్రాహేణ గృహీతః,మనసా హి కామాన్కామయతే. 7**

**మం॥ హస్తౌవైగ్రహః, స కర్మణాతి గ్రాహేణ గృహీతః, హస్తాభ్యాం హి కర్మ కరోతి.**

**మం॥ త్వగ్వై గ్రహః, స స్పర్శేనాతిగ్రాహేణ గృహీతః,**

**త్వచా హి స్పర్శన్వేదయతే – ఇత్యేతే– ష్టౌ గ్రహాః, అష్టావతి గ్రహాః. 9**

యాజ్ఞవల్క్యుడు గ్రహాలను అతిగ్రహాలు వివరించి సమాధానమిస్తున్నాడు. – ప్రాణమే (ముక్కు) గ్రహము. అది (ప్రాణము) గంధము (వాసన) అనే అతి గ్రహం యొక్క అధికారంలో ఉంటుంది. గంధములేక వాసన అనేది అపానము. అపానం ద్వారానే లోకంలో అంతా వాసన చూస్తారు. అంటే, మనం పీల్చే గాలి ద్వారా మనకు వాసన తెలుస్తోంది. కాబట్టి ప్రాణము గ్రహము. అపానము అతి గ్రహం.

అట్లాగే, వాగింద్రియం గ్రహం. నామము అనేది అతిగ్రహం. వాక్కు అనే గ్రహం (వాగింద్రియం) నామము అనే అతిగ్రహం అధీనంలో ఉంటుంది. కారణమేమంటే, మనం ఏ నామాన్నైనా వాగింద్రియం ద్వారానే ఉచ్చరించాలి.

నాలుక అనేది గ్రహం. రుచి అనేది అతిగ్రహం. ఈ నాలుక అనే గ్రహాన్ని రుచి అనే అతిగ్రహం అదుపులో ఉంచుకుంటుంది. అంటే ఎవరైనాసరే, జిహ్వద్వారానే వేరు వేరు రుచుల్ని గ్రహిస్తారు కాబట్టి రుచి అనేది అతిగ్రహం. దాని అధీనంలో ఉండే నాలుక గ్రహం.

కన్ను అనే ఇంద్రియం గ్రహం. రంగు అనే అతిగ్రహం ద్వారా కన్ను పాలింపబడుతూ ఉంటుంది. కంటిద్వారా మాత్రమే రంగుల్ని తెలుసుకోగలుగుతాము. రంగును గుర్తించటానికి కన్నుసాధనం కాబట్టి కన్ను ఎల్లప్పుడు రూపానికి లోబడి పనిచేస్తుంది.

చెవి గ్రహం. అది శబ్దము అనే అతిగ్రహం యొక్క అధికారానికి లోబడి ఉంటుంది. అంటే శబ్దాన్ని వినటానికి చెవి సాధనంగా ఉపయోగిస్తోంది. కాబట్టి చెవి అనే గ్రహానికి శబ్దమనేది అతిగ్రహం.

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, యదిదం సర్వం మృత్యో రన్నం, కాస్విత్సా దేవతా యస్యామృత్యురన్నమితి; అగ్నిర్వై మృత్యుః, సో పామన్నం, అప పున నృృత్యుం జయతి. 10**

ఆర్తభాగుడు మళ్ళీ అడిగాడు– 'ఓ యాజ్ఞవల్క్యా ! ఈ వ్యాకృత జగత్తు (కనిపించే కార్యాత్మకమైన ప్రపంచం) అంతా మృత్యువుకు అన్నం గదా మరి మృత్యువు ఏ దేవతలకు అన్నమౌతోందో చెప్పు:'

యాజ్ఞవల్క్యుడన్నాడు– 'అగ్నే మృత్యువు. ఆ అగ్నిరూపంలో ఉండే మృత్యువు జలానికి అన్నం. అంటే జలము, మృత్యువుకు (అగ్నికి) కూడా మృత్యువు. ఈ విధమైన విజ్ఞానంతో పురుషుడు పునర్మృత్యువును జయిస్తాడు.'

ఈ విధంగా అడగటంలో ఉద్దేశ్యమేమిటంటే, మృత్యువుకు కూడా మృత్యువు ఉన్నదని అంటే, అనవస్థాదోషం కలుగుతుంది– అనంతత్వ తిరస్కారానికి త్రోవ తీస్తుంది. మృత్యువుకు మృత్యువు లేదని అంటే, గ్రహ అతిగ్రహ శృంఖలాలనుండి విముక్తి లేదన్నట్లవుతుంది. ఈ గ్రహాతి గ్రహాలు నాశనమైతే తప్ప– మృత్యువు వీటిని మ్రింగితే తప్ప మోక్షం లేదాయె.

యాజ్ఞవల్క్యుడు మృతుడైన అగ్ని జలానికి అన్నమన్నాడు. జలం అగ్నిని మ్రింగేస్తుంది– జలం అగ్నికి మృత్యువు. కాబట్టి మృత్యువైన దానికి మృత్యువు కనిపిస్తోంది. దీనివల్ల గ్రహ

అతిగ్రహాల నుండి ముక్తి వుంది. అన్నిటికి మృత్యుడైన దానికి మరొక మృత్యువనేది ఉండదు కాబట్టి అనవస్థాదోషం రాదు. గ్రహాతి గ్రహ బంధనాల నుండి విముక్తి ఉంది కాబట్టి మోక్షానికి అవకాశం ఉంది.)

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాయం పురుషో మ్రియత ఉదస్మాత్ప్రాణాః క్రామన్త్యాహో 3 వేతి; నేతి హోవాచ యాజ్ఞవల్క్యః, అత్రైవ సమవనీయన్తే స ఉచ్ఛ్వయతి, ఆధ్మాయతి, ఆధ్మాతో మృతః శేతే. 11**

ఆర్తభాగుడు మళ్ళీ ఈ విధంగా అడిగాడు– "ఓ యాజ్ఞవల్క్యా, మానవులు చనిపోయినప్పుడు, ఆ చనిపోయిన బ్రహ్మవేత్త యొక్క వాక్కు మొదలైన ఇంద్రియాలు (ప్రాణాలు) అతనినుండి పైకి లేచి పోతాయా ? పోవా ?

యాజ్ఞవల్క్యుడన్నాడు– లేదు ! అట్లా ఎన్నడూ జరుగదు. తత్వజ్ఞాని యొక్క ప్రాణాలు అతనిలోనే– ఆ పరమాత్మలోనే లయమైపోతాయి– ఏకీభావం చెందుతాయి– సముద్రంలో అలలలాగా. సామాన్య ప్రాణుల లాగానే తత్వజ్ఞాని కూడా మరణించినప్పటికి అతనికి పునర్జన్మ ఉండదు– అందుచేతనే ! సామాన్యుడు చచ్చినప్పుడు లాగానే అతని శరీరం కూడా ఉబ్బుతుంది. కొలిమితిత్తిలాగా గాలితో నిండి పోతుంది– ఆ స్థితిలో చచ్చిపడి ఉంటుంది.

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాయం పురుషో మ్రియతే కిమేనం న జహాతీతి; నామేతి; అనన్తం వై నామ, అనన్తా విశ్వేదేవాః, అనంతమేవ స తేన లోకం జయతి. 12**

ఆర్తభాగుడు అడుగుతున్నాడు– 'ఓ యాజ్ఞవల్క్యుడా ! పురుషుడు చనిపోయినప్పుడు అతనిని వదలకుండా ఉండేది ఏది?'

యాజ్ఞవల్క్యుడు సమాధానం మిచ్చాడు– 'పేరు, నామం వదలి పెట్టదు. అన్నీ లీనమై పోయినా జాతి సంసర్గం కారణంగా నామం మాత్రం లీనంకాదు. నామమనేది నిత్యము, అనంతమూను. నామాని కున్న నిత్యత్వమే అనంతత్వం కూడా, నామం అనంతం కాబట్టి, దాని నాశ్రయించు కొన్న విశ్వేదేవులు కూడా అనంతంగానే వున్నారు. ఈ విధంగా అనంతత్వానికి అధికారులైన విశ్వేదేవుల్ని ఆత్మ భావంతో ఉపాసించి (దర్శించి) పురుషుడు అనంతలోకాల్ని పొందుతాడు.

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ, యత్రాస్య పురుషస్య మృతస్యాగ్ని వాగప్యేతి, వాతం ప్రాణః చక్షురా దిత్యం, మనశ్చంద్రం, దిశః శ్రోత్రమ్, పృథివీగ్ం శరీరం, ఆకాశమాత్మా, ఓషధీర్లోమాని, వనస్పతీ న్కేశాః, అప్సులోహితం చరేతశ్చ నిధీయతే, క్వాయం తదా**

**పురుషో భవతీతి; ఆహర సోన్య హస్తమా ర్తభాగ, ఆవామేవైతస్య వేదిష్యావః, న నావేతత్ సజన ఇతి తౌ హో(త్రమ్య మన్త్రయాం చక్రాతే తౌ హ యదూచతుః కర్మహైవ తద చతుః , అథ యత్రశంసతుః కర్మహైవ తత్ప్రశశం సతుః, పుణ్యోవై పుణ్యేన కర్మణా భవతి, పాపః పాపేనేతి తతో హ జారత్కారవ ఆర్తభాగ ఉపర రామ. 13**

ఆర్తభాగుడీ విధంగా అడిగాడు– 'ఓ యాజ్ఞవల్క్యుడా ! ఎప్పుడైతే చనిపోయిన పురుషునియొక్క వాక్కు అగ్నిలో లీనమైపోతుందో, ప్రాణం వాయువులో లీనమవుతుందో, నేత్రాలు ఆదిత్యునిలో లీనమైపోతాయో, మనస్సు చంద్రునిలో లీనమైపోతుందో, శ్రోత్రాలు దిక్కులలో లీనమైపోతాయో, శరీరం భూమిలో లీనమైపోతుందో, హృదయాకాశం భూతాకాశంలో లీనమై పోతుందో, లోమాలు ఓషధులలోను, కేశాలు వనస్పతులలోను లీనమైపోతాయో, శుక్రశోణితాలు జలంలో కలసిపోతాయో అప్పుడా పురుషుడు ఎక్కడ ఉంటాడు?"

యాజ్ఞవల్క్యుడు సమాధానమిచ్చాడు– 'ఓ ప్రియదర్శనుడా ! ఆర్తభాగుడా ! నీచేతిని పట్టుకోవటానికి ఇయ్యి ! ఈ ప్రశ్నకు సమాధానం మన ఇద్దరికి తెలుస్తుంది. ఇది జన సమూహంలో నిర్ణయించాల్సిన ప్రశ్నకాదు.' అని ఇద్దరూ లేచి ఏకాంత ప్రదేశానికి వెళ్ళారు– చర్చించారు. వాళ్ళు ఆలోచించింది. నిర్ణయించింది కర్మను గూర్చి. వాళ్ళు ప్రశంసించిందీ కర్మనే ! వాళ్లు చెప్పిన దాని సారాంశం అంతా కర్మయే ! కాలము, కర్మ, దైవం మొదలైన కారణాలలోకూడా వారు కర్మనే ప్రశంసించారు. అంటే, కర్మనే మాటమాటికి భోక్తకు ఆశ్రయమని, కార్యకరణాలకు ఉపాధాన హేతువని తలచారు. అదేమిటంటే, పురుషుడు పుణ్యకర్మలవల్ల పుణ్యాత్ముడౌతాడు. పాపకర్మలవల్ల పాపాత్ముడౌతాడు. ఈ విధంగా తన ప్రశ్నకు సమాధానం రాగానే ఆర్తభాగుడు ఇక ఏమీ మాట్లాడలేకపోయాడు.

ఆర్తభాగుడు అడిగింది– "ఇంద్రియాలన్నీ ఆ విధంగా వాటి వాటి కారణాల్లో లీనం అయిపోగా మిగిలి ఉన్న ఆ పురుషుడు ఏమౌతాడు. అతనికి ఆధారం ఏమిటి? దేని ఆధారంగా అతడు మళ్ళీ శరీరాన్ని, ఇంద్రియాల్ని ధరిస్తాడు? ఇది అతని ప్రశ్నయొక్క సారాంశం.

దానికి సమాధానం– లోగడ చెప్పుకొన్న కారణాలు ప్రకృతి, యదృచ్ఛ, కాలము, కర్మ మొదలైన జగత్కారణా లన్నింటిని ఒక్కొక్కటిగా విమర్శించి వాటిలో కర్మయే ఆ మిగిలి ఉన్న జీవాత్మకు ఆధారమని, ఆ కర్మను బట్టే మరొక శరీరం, ఇంద్రియాలు లభిస్తాయని సమాధానం వచ్చింది.

**పునరాలోచనము :** గ్రహాలు (ఇంద్రియాలు) అతిగ్రహాలు (వాటి విషయాలు) అనే బంధనాలను గూర్చి వివరించారు. ఆ బంధనాలే పునర్జన్మకు కారణమౌతాయి. – కాబట్టి వాటి

నుండి (మృత్యువు నుండి ) తప్పించుకోవటమే ముక్తి, మృత్యువుకు కూడా మృత్యువు ఉంది కాబట్టి అది సాధ్యమౌతోంది. (అగ్ని మృత్యువు అయితే దానికి జలం మృత్యువు) ఇట్లా విముక్తి పొందినవాడి (చనిపోయినవాడి) ఇంద్రియాలు, విషయాలు ఆయా భూతాల్లో కలసిపోయినా నామం మాత్రం ఉంటుందన్నారు. జీవుడు కర్మను ఆశ్రయించి ఉంటాడని, ఆ కర్మ ఆధారంగా- దాని మంచి చెడుల ఆధారంగా మళ్ళీ జన్మ వస్తుందని తేలింది.

## మూడవ బ్రాహ్మణం

**మం॥ అథ హైనం భుజ్యుర్లాహ్యాయనిః పప్రచ్ఛ; యాజ్ఞ వల్క్యేతి హోవాచ మద్రేషు చరకాః పర్యవ్రజామ, తే పతఞ్చలస్య కాప్యస్య గృహానైమః, తస్యాసీ ద్దుహితా గంధర్వ గృహీతా, తమపృచ్ఛామకో సీతి; సో బ్రవీత్సుధన్వాంగిరస తి, తం యదా లోకానా మంతానపృచ్ఛామ, అథైనమబ్రూమ, క్వ పారిక్షితా అభవన్నితి; క్వ పారిక్షితా అభవన్, స త్వా పృచ్ఛామియాజ్ఞవల్క్య, క్వ పారిక్షితా అభవన్నితి. 1**

(కర్మలవల్ల మోక్షం సిద్ధించదనే విషయాన్ని నిర్ధారించారు. ఇక కర్మఫలాల యొక్క సాంసారికత్వాన్ని చూపించటానికి ఈ బ్రాహ్మణం చెపుతున్నారు.)

పిమ్మట లహ్యాని మనుమడైన భుజ్యుడు అడుగుతున్నాడు- 'ఓ యాజ్ఞవల్క్యుడా ! మేము అధ్యయనం కోసం, బ్రహ్మచర్య వ్రతాచరణం చేస్తూ. మద్రదేశంలో తిరుగుతూ, కపిగోత్రోద్భవుడైన పతఞ్చలుడనే వాని యింటికి వెళ్ళాము. అతని పుత్రిక ఒక గంధర్వునిచేత ఆవహింపబడి ఉంది. (గంధర్వుడామెను అవహించి (పూనకం) ఉన్నాడు.) అతనిని మేము 'నీవు ఎవరవు? నీ పేరేమిటి ? నీ స్వరూప మేమిటి?' అని అడిగాము.

అందుకతడు 'నేను అంగిరస గోత్రానికి చెందినవాడిని. నా పేరు సుధన్వుడు' అన్నాడు.

మేము అతనిని, ఈ భువనాలను గూర్చి వాటి అంతాన్ని గూర్చి, వాటి వ్యాప్తిని గూర్చి, హద్దులను గూర్చి అడిగి, పరీక్షిత్తు వంశజులు ఎక్కడ ఉన్నారు?' అని కూడా అడిగాము.

ఆ గంధర్వుడు మాకు అన్నీ చెప్పాడు. ఓ యాజ్ఞవల్క్యుడా ! నిన్ను అడుగుతున్నాను. నీవు చెప్పు ! పరీక్షిత్తు వంశజులు ఎక్కడ ఉన్నారు?" అని భుజ్యుడు యాజ్ఞవల్క్యుని పరీక్షించటానికి అడిగాడు.

**మం॥ స హోవాచ, ఉవాచ వై సః అగచ్ఛన్వై తే తద్య ఆశ్వమేధయాజినో గచ్ఛన్తీతి; క్వ న్వశ్వమేదయా జినో గచ్ఛన్తీతి; ద్వాత్రిశతం వై దేవరథాహ్న్యే వ్యయం లోకః, తం సమన్తం**

**పృథివీ ద్విస్తావత్ప ర్యేతి, తాం సమన్తం పృథివీం ద్విస్తావత్సముద్రః పర్యేతి; తద్యావతీ క్షురస్య ధారా, యావద్వా మక్షికాయా; పత్రమ్, తావానన్తరేణాకాశః, తానిన్ద్ర సుపర్ణో భూత్వా వాయవే ప్రాయచ్ఛత్, తాన్వాయురాత్మని ధిత్వా తత్రాగమయద్య త్రాశ్వ మేధయాజినో భవన్నితి; ఏవమివ వై స వాయుమేవ ప్రశశంస, తస్మా ద్వాయురేవ వ్యష్టి, వాయుః సమిష్టిః; అపపున ర్మృత్యుం జయతి య ఏవం వేద తతో హ భుజ్యుర్లా హ్యాయ నిరుపరరామ. 2**

యాజ్ఞవల్క్యుడీ విధంగా సమాధాన మిచ్చాడు– 'మీ కా గంధర్వుడు నిస్సందేహంగా అశ్వమేధయాగం చేసినవారు ఏ చోటుకు వెడతారో పరీక్షిత్తులంతా కూడా అక్కడికే వెళ్ళారు" అని చెప్పి ఉంటాడు.

భుజ్యుడు మళ్ళా అడిగాడు– 'అశ్వమేధయాగం చేసినవారంతా ఎచ్చటికి పోతారు?' అని.

ఆ ప్రశ్నకు సమాధానంగా యాజ్ఞవల్క్యుడు ఈ భువన కోశాన్ని, బ్రహ్మాండాన్ని ఈ విధంగా వర్ణిస్తున్నాడు– "సూర్యునిరథం ఒక రోజులో 32 సార్లు తిరిగితే బ్రహ్మాండం విస్తీర్ణమౌతుంది. దీనికి రెట్టింపు ఈ భూమి ఉంది. దీనిచుట్టూ ఈ భూమికి రెట్టింపు విస్తీర్ణం సముద్రమే (జలం) ఉంది. ఈ లోకం 32 దేవరథాహ్న్యాలు ఉంది. దేవరథాహ్న్యము అంటే సూర్యుని రథం యొక్క గతిని (నడకను) బట్టి కొలిస్తే ఒక రోజులో కొలిచే విస్తీర్ణం రథాహ్న్యం అవుతుంది, దేవరథము అంటే సూర్యుని రథం.

(లోకాలోక పర్వతం నుండి నాల్గువైపుల ఆవరించి ఉన్నట్టి, సముద్రంతో కూడి ఉన్నట్టి ఈ లోకం 32 దేవరథాహ్న్యాలు ఉంది. ప్రాణులు కర్మఫలాన్ని అనుభవించేది ఈ విరాట్పురుష రూపంలో ఉండే ఈ లోకంలోనే ! దీనిపైన ప్రాణులులేనట్టి నిరాలోకం ఉంది. ఆ లోకానికి నాలుగు వైపుల, ఆ లోకవిస్తీర్ణానికి రెట్టింపు భూమి వ్యాపించి వుంది. మళ్లీ ఈ పృథివీలోకం లాగానే దీనికి రెట్టింపు నీటితో చుట్టబడి ఉంది. దీనినే పౌరాణికులు 'ఘనోద' మంటారు. సంక్షిప్తంగా చెప్పుకోవాలంటే బ్రహ్మాండం రెండు సగాలుగా ఉంది. దిగువన ఉన్న సగం విరాట్పురుష శరీరం. దీనినే ఈ లోకం అంటాము. దీనిలోనే జీవులు తమ కర్మఫలాన్ని అనుభవిస్తాయి. ఈ లోకానికి పైన అలోకం ఉంది. అది కేవలం వర్షపునీటితో నిండినది. ప్రాణులు ఉండవు. దీనినే నిరాలోకం అంటాము. ఈ రెండు లోకాలు కలిస్తే బ్రహ్మాండం.

ఈ బ్రహ్మాండం యొక్క రెండు సగభాగాల మధ్య ఒక సూక్ష్మమైన ఛిద్రం ఉంది– (రంధ్రం) ఒక పదునైన కత్తివాదరలాగా (పదునులాగా) చిన్న ఈగరెక్కలాగా మిక్కిలి సూక్ష్మంగా ఉండే రంధ్రం. ఆ రంధ్రంలో నుండే పరమేశ్వరుడు రెక్కలతో ఉన్న పక్షిరూపంలో ఆ పరీక్షితులను

వాయువుకు ఇవ్వగా, ఆ వాయువున వారిని తన స్వరూపంలో వాయుభూతంగా చేసి ఆ కన్నంలో నుండి అశ్వమేధయాగం చేసేవారు వెళ్ళేచోటుకు పంపాడు. ఈ విధంగా ఆ గంధర్వుడు గతిరూపంలో ఉన్న వాయువును స్తుతించాడన్న మాట. అధ్యాత్మభావంతో చూస్తే (వ్యష్టిశరీరం భావంతో) వాయువు మనకు ప్రాణ, అపాన, వ్యానాలుగా, (లేదా) కదులుతూ స్థిరంగా, శరీరానికి బయట కూడా కనిపిస్తుంది. ఇది వ్యష్టిరూపం– ఆ వాయువే సూత్రరూపంలో (హిరణ్యగర్భ రూపంలో) చూస్తే సమిష్టి వాయువు అవుతుంది. ఈ విషయాన్ని తెలుసుకున్నవాడు– ఈ విధంగా వాయువును ఉపాసించేవాడికి మళ్ళీ మృత్యువనేది ఉండదు– ఇక జన్మ ఉండదు.

ఈ సమాధానం విని భుజ్యుడు మౌనం వహించాడు– తన ఓటమికి సూచనగా.

## నాల్గవ బ్రాహ్మణం

**మం॥ అథ హైనముష స్తశ్చాక్రాయణః పప్రచ్ఛ; యాజ్ఞ వల్క్యేతి హోవాచ, యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ, య ఆత్మా సర్వాంతరః తం మే వ్యాచక్షస్వ ఇతి; ఏష త ఆత్మా సర్వాన్తరః కతమో యాజ్ఞవల్క్య సర్వాంతరః? యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాంతర, యో పానేనాపానీతి సత ఆత్మా సర్వాన్తరః, యోవ్యానేన వ్యానీతి స త ఆత్మా సర్వాన్తర, య ఉదానేనోదానితి స త ఆత్మా సర్వాంతరః, ఏష త ఆత్మా సర్వాంతరంః 1**

(గ్రహాలకు, అతి గ్రహాలకు లోబడి జన్మలెత్తుతూ ఉండే తత్త్వము అసలు ఉన్నదా ? లేదా ? ఉంటే, దాని లక్షణాలేమిటి? ఈ విధంగా ఆనాత్మయైనట్టి దేహాదికం కాకుండా, ఆత్మకు సంబంధించిన వివేకాన్ని కలిగించటానికి ఈ దిగువ గ్రంథం ఆరంభిస్తున్నారు. యదార్థమైన ఆత్మజ్ఞానం కలిగితే బంధవిముక్తి కలుగుతుంది కదా!)

తరువాత చక్రుని పుత్రుడైన ఉషస్తుడనే వాడు యాజ్ఞవల్క్యుని అడిగాడు "ఓయాజ్ఞవల్క్యా ! ఆపరోక్షంగా ఉండే బ్రహ్మ (ప్రత్యక్షంగా ఉండే) అందరి అంతరాత్మగాను ఉండే బ్రహ్మను గూర్చి నాకు వ్యాఖ్యానించి చెప్పు" అని.

యాజ్ఞవల్క్యుడన్నాడు– "ఈ కార్యాకారణ సంఘాతం లోపల (శరీరంలో) ఉన్న నీ ఆత్మయే సర్వాంతర్వర్తియైన (అందరిలోనూ ఉన్న) బ్రహ్మస్వరూపం" అని.

ఉషస్తుడంటున్నాడు– "యాజ్ఞవల్క్యుడా ! సర్వాంతర్వర్తి ఎటువంటివాడు? కార్యకారణ సంఘాతంలోపల ఉన్న (శరీరంలో ఉన్న) దేనిని సర్వాంతరాత్మ అని అంటున్నావు? విశదంగా చెప్పు. "భుజ్యుని ఉద్దేశ్యం ఏమని అంటే, పై నున్న స్థూలదేహం, దానిలోపలనున్న లింగశరీరం, మూడవదాని విషయం సందేహం. వీటిలో దేనిని సర్వాంతర్వర్తి అని అంటున్నావు?" అని.

యాజ్ఞవల్క్యుడు విపులీకరిస్తున్నాడు– "నీ నోటితోను, ముక్కుతోను (ప్రాణనక్రియ) ఊపిరిపీల్చేవాడు ఎవడో, ఆ విజ్ఞానమయుడైన ఆత్మయే సర్వాంతర్వర్తి, అపానతో అపాన క్రియను (వాయువు క్రిందికి పోవుట) ఆచరించేవాడెవడో అట్టి ఆత్మయే సర్వాంతర్వర్తి. వ్యానం ద్వారా వ్యానక్రియను ఆచరించేవాడు (శరీరమంతటా ప్రాణావాయువు వ్యాపించటం) ఎవడో వాడే సర్వాంతర్వర్తి. శరీరంలో ఉంటూ ఉదానం ద్వారా ఉదానక్రియను (బయటకు గాలిని వదలివేయటం) ఆచరించే ఆత్మయే సర్వాంతర్వర్తి. సారంశమేమంటే, నీ ఆత్మయే కార్యకారణ సంఘాతం కంటె (శరీరం కంటే) భిన్నమైనట్టి విలక్షణమైనట్టి సర్వాంతర్వర్తి (అన్నిటిలోను ఉన్నది)" అని యాజ్ఞవల్క్యుడు విపులీకరించాడు.

**మం॥ స హోవాచోషస్తశ్చాక్రాయణః, యథా నిబ్రూ యాత్, అసౌ గా; అసావశ్వ ఇతి, ఏవమేవైతద్వ్యప దిష్టం భవతి; య దేవ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ, య ఆత్మా సర్వాంతరః, తం మే వ్యాచక్ష్వేతి; ఏష త ఆత్మా సర్వాంతరః; కతమో యాజ్ఞవల్క్య సర్వాన్తరః? న దృష్టేర్ద్రష్టారం పశ్యేః, న శ్రుతేః శ్రోతారం శ్రుణుయాత్, న మ తేర్మన్తారం మన్వీథాః, స విజ్ఞాతే విజ్ఞాతారం విజానీయాః. ఏష త ఆత్మా సర్వాంతరః, అతో న్యదార్తమ్ తతో హోషస్త శ్చాక్రాయణ ఉపరరామ. 2**

అంతట చక్రుని కొడుకైన ఉషస్తుదు యాజ్ఞవల్క్యునితో అన్నాడు– "ఓయాజ్ఞవల్క్యా! నీవు మొదట ప్రత్యక్షంగా చూపిస్తానని అన్నదానికి విరుద్ధంగా చెప్పటం బాగుండదు. (తప్పించుకోవటానికి ప్రయత్నించవద్దు) కొన్ని గుర్తులు చెప్పి నడిచేది ఆవు అని, పరుగెత్తేది గుఱ్ఱమని చెప్పినట్లుగా, ఊపిరి పీల్చేది ఆత్మ అని, ఈ విధంగా అపాననాది క్రియలాచరించేది ఆత్మ అని కొన్ని గుర్తులద్వారా, లక్షణాలద్వారా బ్రహ్మ వ్యపదేశం చేస్తున్నావు– సూచిస్తున్నావు. నాకు ఆపరోక్ష బ్రహ్మను, సర్వాంతరాత్మను స్పష్టంగా తెలియజెప్పు."

యాజ్ఞవల్క్యుడన్నాడు– "నీ ఆత్మయే సాక్షాత్తు ఆపరోక్ష బ్రహ్మ" అని.

ఉషస్తుడన్నాడు– "యాజ్ఞవల్క్యుడా ! ఆ సర్వాంతరు దెవరు? ఘటాదులలాగా (కుండలు మొదలైనవి) ఆత్మను కూడా స్పష్టమయ్యే విధంగా చెప్పు."

యాజ్ఞవల్క్యుడ్యడన్నాడు– "నీ దృష్టికి కూడా దృష్టియైనవాడు– సాక్షియైనవాడు. అయినట్టి ఆత్మను నీవు ఇంద్రియ దృష్టితో, మామూలు కండ్లతో ఘటాదులను చూచినట్లు చూడలేవు. అట్లాగే శ్రోతానికి శ్రోత్రమును గూర్చి వినలేవు. మనస్సుకు సాక్షియైనవానిని గూర్చి ఆలోచించలేవు. బుద్ధికి– విజ్ఞానానికి వేత్తయైనవానిని గూర్చి నీవు తెలుసుకోలేవు నీ ఆత్మయే సర్వాంతర్వర్తి, ఆత్మకాకుండా ఉన్న ఈ కార్యకారణ శరీరం నాశనమైపోతుంది." ఇది విని ఉషస్తుడిక మాట్లాడలేదు.

## ఐదవ బ్రాహ్మణం

**శ్లో॥ అథ హైనం కహోలః కౌషీత కేయః పప్రచ్ఛ; యాజ్ఞ వల్క్యేతి హోవాచ, యదేవ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః, తం మే వ్యాచక్ష్వేతి; ఏష త ఆత్మా సర్వాంతరః , కతమో యాజ్ఞవల్క్య సర్వాంతరః? యో శనాయా పిపాసే శోకం మోహం జరాం మృత్యు మత్యేతి. ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణః పుత్రైషణాయాశ్చ విత్తైషణయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి; యా హ్యేవ పుత్రైషణా సా విత్తైషణా, యా విత్తైషణా సా లోకైషణా, ఉభేహ్యేతే ఏషణే ఏవ భవతః తస్మా ద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్, బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథ ముని, అమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః; స బ్రాహ్మణః కేనస్యాత్? యేన స్యాత్తేనే దృశ ఏవ, అతో న్యా దార్తం తతో హ కహోలః కౌషీతకేయ ఉపర రామ. 1**

(ఉద్దీపకాలైన కారణాలతో కూడిన బంధాల్ని) గూర్చి చెప్పారు. ఆ విధంగా బద్ధమై ఉన్న సత్తమ గూర్చి, శరీరానికి భిన్నమైన దానిని ఉనికిని గూర్చి చెప్పారు. ఇప్పుడు సన్న్యాసంతో గూడిన జ్ఞానంద్వారా ఆ బంధనాల నుండి ఏ విధంగా విముక్తి పొందవచ్చునో చెపుతున్నారు).

కుషీతకుని పుత్రుడైన కహోలుడు యాజ్ఞవల్క్యుని ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు. –'ఓ యాజ్ఞవల్క్యుడా ! అపరోక్ష బ్రహ్మను గూర్చి, సర్వాంతరాత్మను గూర్చి నాకు సవిస్తరంగా వ్యాఖ్యానించు." అని.

యాజ్ఞవల్క్యుడన్నాడు– 'నీ ఆత్మయే సర్వాంతర్వర్తియైన బ్రహ్మము' అని.

(వెనుకటి బ్రహ్మణంలో ఉషస్తుడు అడిగినదానికి, ఈ కహోలుడు అడిగినదానికి భేదం పైకి కనిపించదు. రెండుప్రశ్నలు ఒకే విధంగా ఉన్నట్లు ఉంటాయి. రెండు ప్రశ్నలు ఒకటే అయితే చెప్పిందే చెప్పినట్లు (పునరుక్తి) అవుతుంది కాబట్టి ఉషస్తుడు అడిగింది వ్యక్తి ఆత్మను గురించి. ఈ కహోలుడు అడిగింది సృష్టి ఆత్మను గూర్చి. సమాధానాలు కూడా వీటికి తగినట్లే ఉంటాయి.)

అప్పుడు కహోలుడు మళ్ళీ అన్నాడు– 'ఓ యాజ్ఞవల్క్యుడా ! ఆ సర్వాంతర్వర్తి ఎవరు?'

యాజ్ఞవల్క్యుడు– "ఆకలి, దప్పిక, దుఃఖము, మోహము, ముసలితనం, మరణం వీటికి అతీతమైనది ఆ సర్వాంతర్వర్తి (అన్నింటిలోను ఉన్నది). అటువంటి ఈ ఆత్మనే అపరోక్షరూపంలో సాక్షాత్కరించుకొని (తెలుసుకొని) బ్రాహ్మణులు పుత్రైషణ. ధనైషణ, లోకైషణలకు దూరులై భిక్షాచర్య చేస్తూ ఉంటారు. (ఏషణ అంటే కోరిక, ఈ ఏషణ త్రయం ఒక బంధహేతువు) పుత్రైషణయే

ధనైషణ. (పుత్రుని మీది మమకారం, కోరిక ఇవన్నీ ధనం మీద కోరికకు కారణాలు) ఆ ధనైషణయే లోకైషణ (ధనం మీది కోరికయే ఈ లోకంలో కోరే కోరికలన్నిటికి కారణం.) సాధ్య సాధన భేదాలవల్ల ఇవన్నీ ఏషణలే ! అందుచేత బ్రాహ్మణుడైనవాడు పూర్తిగా ఆత్మజ్ఞానాన్ని సంపాదించి, ఆ ఆత్మజ్ఞాన బలంతో స్థిరంగాను, దృఢంగాను ఉండటానికి యత్నించాలి. (అజ్ఞానులు, విషయవాసనల వల్ల కామ్యకర్మలు వాటి ఫలితాలవల్ల వచ్చిన బలంతో జీవిస్తే జ్ఞానియైనవాడు జ్ఞానంవల్ల కలిగిన వైరాగ్యబలంతో జీవిస్తాడు. వారిది ఇంద్రియబలం. వీరిది ఆత్మబలం.) పూర్తి జ్ఞానాన్ని పొంది, కోరికలను వదలిపెట్టి, ధ్యానయుక్తుడై, మనన శీలియై, బ్రాహ్మణత్వాన్ని పొంది, కృతకృత్యుడౌతాడు."

కహోలుడు అడిగాడు– "ఆ లక్షణాలు కలవాడు ఏ విధంగా ఉంటాడు. అతడు ఏ విధంగా ప్రవర్తిస్తాడు?" అని.

యాజ్ఞవల్క్యుడు అన్నాడు– 'అతడు ఎట్లా ప్రవర్తించినా పై లక్షణాలు కలిగి ఉంటాడు. ఇంతకు భిన్నమైనదంతా మాయ, స్వప్నం, అసారం, ఎండమావుల వంటివి ! ఆత్మ మాత్రమే నిత్యమైనది."

ఇదివిని కహోలుడు ఇక మాట్లాడలేదు.

## ఆరవ బ్రాహ్మణం

**మం॥ అథ హైనం గార్గీ వాచక్నవీ పప్రచ్ఛ; యాజ్ఞ వల్క్యేతి హోవాచ, యదిదం సర్వ మప్స్వోతం చ ప్రోతం చ, కస్మిన్ను ఖల్వాప ఓతాశ్చ ప్రోతాశ్చేతి; వాయౌ గార్గీతి; కస్మిన్ను ఖలు వాయురోతశ్చ ప్రోతశ్చేతి, అంతరిక్షలోకేషు గార్గీతి; కస్మిన్ను ఖలు గంధర్వలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి; ఆదిత్యలోకేషు గార్గీతి; కస్మిన్నుఖల్వాదిత్యలోకా ఓతాశ్చ ప్రోతా శ్చేతి; చంద్రలోకేషు గార్గీతి, కస్మిన్ను ఖలు చంద్ర లోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి; నక్షత్రలోకేషు గార్గీతి; కస్మిన్ను ఖలు నక్షత్రలోకా క్షతాశ్చ ప్రోతాశ్చేతి; దేవలోకేషు గార్గీతి; కస్మిన్ను ఖలు దేవలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి; ఇంద్రలోకేషు గార్గీతి; కస్మిన్ను ఖల్వింద్రలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి; ప్రజాపతి లోకేషు గార్గీతి; కస్మిన్ను ఖలు ప్రజాపతిలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి; బ్రహ్మలోకేషు గార్గీతి; కస్మిన్ను ఖలు బ్రహ్మలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి; సహో వాచ, గార్గి మాతిప్రాక్షీః, మా తే మూర్ధా వ్యపప్తత్, అనతి ప్రశ్న్యాం వై దేవతామతిపృచ్ఛసి గార్గి ః మాతి ప్రాక్షీరితి; తతో హ గార్గి వాచక్నవ్యు పరరామ. 1**

పిమ్మట వీచక్నుని కొమార్తె అయిన గార్గి యాజ్ఞవల్క్యునితో అన్నది– “ఓ యాజ్ఞవల్క్యుడా ! ఈ కనిపించే పార్థివమైన ధాతు సముదాయమంతా జలంలో ఓతప్రోతమై ఉన్నది గదా ! మరి జలం దేనిచేత వ్యాప్తమై ఉన్నది?”) ఈ భూమి నీటి చేత క్రింద, మీద, లోపల, బయట కూడా వ్యాప్తమై ఉన్నది; ఓతప్రోతమై ఉన్నది– వస్త్రంలో దారాలు పడుగు పేకల్లాగా.)

యాజ్ఞవల్క్యుడు– “వాయువులో!”

(భూమి నీటిలో ఓతప్రోతమై యున్నట్లే నీరు తన తరువాతిదైన అగ్నిలో ఓతప్రోతమైనదని సమాధానం ఇవ్వాలి. కాని, జలం యొక్క గాని పార్థిక ధాతువు యొక్క గాని ఆశ్రయం లేకుండా అగ్ని యొక్క స్వరూపం స్పష్టం కాదు. అందుచేత అగ్నిలో ఓతప్రోతమైనదని చెప్పకుండా తరువాతిదైన వాయువులో ఓతప్రోతమై ఉన్నదని చెప్పాడు.)

గార్గి : ‘వాయువు దేనిలో వ్యాప్తమై ఉన్నది?’

యాజ్ఞవల్క్యుడు : ‘అంతరిక్ష లోకం’

గార్గి: ‘అంతరిక్షలోకం దేనిలో వ్యాప్తమై ఉన్నది?’

యాజ్ఞవల్క్యుడు : ‘గంధర్వ లోకంలో !’

గార్గి : ‘గంధర్వ లోకం దేనిలో ఓతప్రోతమై ఉన్నది?

యాజ్ఞ : ‘ఆదిత్య లోకంలో !’

గార్గి : ‘ఆదిత్య లోకం దేనిలో ఓతప్రోతమై ఉన్నది?’

యాజ్ఞ : ‘చంద్ర లోకంలో !’

గార్గి : చంద్రలోకం దేనిలో ఓతప్రోతమై ఉన్నది? ’

యాజ్ఞ : ‘నక్షత్ర లోకంలో !’

గార్గి : ‘నక్షత్ర లోకం దేనిలో వ్యాప్తమై ఉన్నది?’

యాజ్ఞ : ‘దేవలోకంలో!’

గార్గి : ‘దేవలోకం దేనిలో వ్యాప్తమై ఉన్నది?’

యాజ్ఞ : ‘ప్రజాపతిలోకంలో !’ (విరాట్ లోకం)

గార్గి : ‘ప్రజాపతిలోకం దేనిలో వ్యాప్తమై ఉన్నది?’

యాజ్ఞ : ‘బ్రహ్మలోకంలో !’

(భూత సంఘమంతా అంతరిక్ష లోకం అనే శబ్దంలోను, విరాట్ శరీరం యొక్క ఆరంభకభూతాన్ని బ్రహ్మలోక శబ్దంను, చెప్పారు. ఈ అన్ని లోకాల్లోనూ, సూక్ష్మతా భేదం వల్ల జీవుల యొక్క అనుభవానికి ఆశ్రయమైన దేహం యొక్క ఆకారంలో, రూపంలో పంచభూతాలే పరస్పరం కలుస్తాయి. అందుచేత అన్ని చోట్ల బహువచన ప్రయోగం చేశారు.)

గార్గి: 'అయితే బ్రహ్మలోకం దేనిలో ఓతప్రోతమై ఉన్నది?'

యాజ్ఞ : 'గార్గీ ! అతి ప్రశ్నలు (న్యాయ విరుద్ధమైన ప్రశ్నలు) అడగవద్దు, కేవలం ఊహించి, అనుమానంతో, శాస్త్రగమ్యుడైన పరమాత్మ విషయంలో ప్రశ్నించవద్దు. ఆ విధంగా ప్రశ్నిస్తే నీ తల క్రిందకు రాలిపడుతుంది. ఊహించి తెలుసుకో! వాటినిక వీలు లేని పరమాత్మను గూర్చి నీవు అతి ప్రశ్నలు వేస్తున్నావు.'

అంతటితో గార్గి నిరుత్తరురాలై మాట్లాడ లేకపోయింది !

## ఏడవ బ్రాహ్మణం

**మం॥ అథ హైన ముద్దాలక ఆరుణిః పప్రచ్ఛ; యాజ్ఞ వల్క్యేతి హోవాచ, మద్రే తస్యాసీ ద్భార్యా గంధర్వ గృహీతా, తమపృచ్ఛామకో సీతి; సో బ్రవీత్కాబంధ ఆథర్వణ ఇతి; సో బ్రవీత్పతం చలం కాప్యం యాజ్ఞి కాంశ్చ, వేత్థ ను త్వం కాప్య తత్సూత్రం యేనాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సందృబ్ధాని భవన్తీతి; సో బ్రవీ త్పతంచలః కాప్య, నాహం తద్భగవన్వేదేతి, సో బ్రవీత్పతంచలం కాస్యం యాజ్ఞికాంశ్చ, వేత్థ ను త్వం కాప్య తమ న్తర్యామిణం య ఇమం చ లోకం పరం చ లోకం సర్వాణీ చ భూతాని యో న్తరో యమయ తీతి; సో బ్రవీత్పతంచలః, కాప్యః, నాహం తం భగ నన్వేదేతి; సో బ్రవీత్పతంచలం కాప్యం యాజ్ఞి కాంశ్చ, యో వై తత్కాప్య సూత్రం విద్యాత్తం చాన్తర్యామిణమితి స బ్రహ్మవిత్, స లోకవిత్, స దేవవిత్, స వేదవిత్, స భూతవిత్, స ఆత్మవిత్, స సర్వవిదితి; తేభ్యో బ్రవీత్, తదహం వేద, తచ్చేత్త్వం యాజ్ఞవల్క్య సూత్రమవిద్వాంస్తం చాన్తర్యామిణం బ్రహ్మగవీరుదజసే, మూర్ధా తే విపతిష్యతీతి; వేద వా అహం గౌతమ తత్సూత్రం తం చాన్తర్యామిణమితి; యో వా ఇదం కశ్చిద్బ్రూయాద్వేద వేదేతి, యథా వేత్థ తథా బ్రూహీతి. 1**

పిమ్మట అరుణుని కుమారుడైన ఉద్దాలకుడు ఇట్లా అన్నాడు– "ఓ యాజ్ఞవల్క్యుడా! మేము మద్ర దేశంలో యజ్ఞశాస్త్రాలను అధ్యయనం చేస్తే కపిగోత్రంలో పుట్టినట్టి సతంచలుని ఇంట్లో ఉండేవాళ్ళం. ఆ సమయంలో అతని (పతంచలుని) భార్యను ఒక గంధర్వుడు

అవహించాడు. మేము ఆ గంధర్వుని "నీవు ఎవరవు?" అని అడిగాము. అందుకాతడు "నేను అధర్వుని పుత్రుణ్ణి. కబంధుడనేవాడిని" అన్నాడు. ఆ గంధర్వుడు పతంచల కాప్యుణ్ణి, యాజ్ఞికులైన అతని శిష్యుల్ని అడిగాడు– 'ఓ కాప్యుడా ! ఈజన్మ, దీని తరువాతి జన్మలు, బ్రహ్మ మొదలు స్తంభం పర్యంతం సమస్త భూతాలు ఏ సూత్రం ద్వారా గ్రుచ్చబడి ఉన్నాయో ఆ సూత్రాన్ని ఎరుగుదువా?' అని.

అందుకు పతంచల కాప్యుడన్నాడు– 'ఓ మహానుభావా ! నేను ఆ సూత్రాన్ని ఎరుగను' అని.

అప్పుడా గంధర్వుడు పతంచల కాప్యునితో ఇలా అన్నాడు– 'ఓ కాప్యుడా ! ఈ లోకాన్ని పరలోకాన్ని, సమస్త భూతాల్ని వాటిలోపల ఉంటూనే కాష్ఠయంత్రంగా తగిన పనులు చేయిస్తూ ఉండే అంతర్యామిని ఎరుగుదువా ?'

కాప్యుడన్నాడు– 'మహానుభావా ! ఎరుగను'.

గంధర్వుడు మళ్ళీ కాప్యుణ్ణి, శిష్యుల్ని అడిగాడు– 'మీలో ఎవరైనా ఆ సూత్రాన్ని, అంతర్యామిని, పైన చెప్పిన విధంగా తెలుసుకొని ఉంటే, వాడు బ్రహ్మను నిజంగా తెలుసుకున్నవాడన్నమాట. వాడే భూతాది లోకాలను తెలుసుకున్నవాడు. వాడే వేదవేత్త, వాడే భూతవత్త, వాడే ఆత్మవేత్త, వాడే సర్వవేత్త' అని.

పిమ్మట గంధర్వుడు కాప్యుడు మొదలైనవారికి సూత్రుని గురించి, అంతర్యామిని గురించి తెలియజేశాడు. ఈ విధంగా గంధర్వుని వలన ఉపదేశింపబడినందున దానిని గురించి (అంతర్యామియైన సూత్రుని గురించి) నేను (ఉద్దాలకుడు) ఎరుగుదును. కాబట్టి, ఓ యాజ్ఞవల్క్యుడా ! ఆ సూత్రాత్మను. అంతర్యామిని తెలియకుండానే బ్రహ్మజ్ఞానుల సంపద అయిన (బ్రహ్మజ్ఞానుల కోసం ఉద్దేశింపబడ్డ) ఆవుల్ని తోలుకొనిపోతే నా శాపం వల్ల నీతల తెగిపడుతుంది.'

ఇది విని యాజ్ఞవల్క్యుడన్నాడు– 'ఓ గౌతముడా ! ఉద్దాలకుడా ! నేను ఆ సూత్రాత్మను. అంతర్యామిని ఎరుగుదును.'.

ఉద్దాలకుడు– 'ఈ విధంగా ప్రతివాడూ తన గొప్పదనం కోసం నాకు తెలుసునని అనవచ్చు ! నిజంగా నీకు తెలిస్తే, వాటిని గురించిన జ్ఞానం ఉంటే, నీకు ఏమి తెలుసునో విశదీకరించు'.

**మం॥ స హోవాచ, వాయుర్వై గౌతమ తత్సూత్రమ్; వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోక సర్వాని చ భూతాని సందృబ్ధాని భవంతి తస్మాద్వై గౌతమ పురుషం ప్రేతమాహుర్వ్య స్రంసిషతా స్యాంగానీతి; వాయునా హి గౌతను సూత్రేణ సందృబ్ధాని భవంతీతి; ఏవమేవైతద్యాజ్ఞ వల్క్య, అంతర్యామిణం బ్రూహీతి. 2**

అప్పుడు యాజ్ఞవల్క్యుడు అన్నాడు– 'ఓ గౌతముడా ! ఉద్దాలకుడా ! ఈ విధంగా అన్నిటిని బంధించి ఉంచిన సూత్రం వాయువు తప్ప ఇంకేమీ కాదు. ఈ వాయురూపమైన సూత్రం ద్వారానే ఈ లోకం. పరలోకం సమస్త భూతాలు గ్రుచ్చబడి ఉన్నాయి– కలపబడి ఉన్నాయి. ( ఈవాయువు ఆకాశం లాగా సూక్ష్మతత్వం కలది. ఇదే పృథివ్యాధి భూతాలను ధరిస్తుంది. ఈ వాయువు నుండే కర్మవాసనలతో గూడిన 17 అవయవాలు కలిగినట్టి లింగదేహం పుట్టింది; (పంచ ప్రాణాలు, 10 ఇంద్రియాలు, మనస్సు, జ్ఞానం (లేక) 5 భూతాలు 10 ఇంద్రియాలు, ప్రాణం, మనస్సు), సమిష్టి వ్యష్టి రూపాలు కలిగి ఉన్నది. సముద్రపు అలలాగా ఉండే 49 మరుద్గణాలను కలిగి ఉన్నది. అటువంటి ఈ వాయువే అన్నిటిలోను ఉండే సూత్రం– పూసలలో దారాలలాగా) ఈ వాయురూపమైన సూత్రంతోనే ఈ లోకం. పరలోకం. సమస్త భూతాలు గ్రుచ్చబడి ఉన్నాయి గదా ! ఎవరైనా మరణించిన వానిని చూచి వాని అవయవాలు శిథిలమై పోయాయి అంటాము. ఎందుచేత? అంతవరకు అవి వాయువు చేత గ్రుచ్చబడి ఉన్నాయి.' (ఆ వాయువు పోగానే దారం తెగిపడిపోయిన పూసల్లాగా చెదిరిపోతాయి.)

ఉద్దాలకుడు– 'ఓ యాజ్ఞవల్క్యుడా ! నీవు చెప్పింది నిజమే ! ఇక నీవు అంతర్వర్తి– అంతర్యామిగా ఉండే నియామకుని విషయం చెప్పు.'

**మం॥ యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరః, యం పృథివీ న వేద, యస్య పృథీవీ శరీరం, యః పృథివీ మన్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్మామ్యమృతః. 3**

'ఎవడు భూమి మీద ఉంటూ ఉంటాడో, ఎవడు భూమి లోపల ఉంటాడో, తన లోపల ఉన్నప్పటికి ఎవనిని భూమి ఎరుగదో, ఎవని శరీరమే భూమియో, లోపల ఉంటూనే ఎవడు భూమిని నియమిస్తూ ఉంటాడో అతడే నీ ఆత్మ– అతడే అంతర్యామి, అతడే అమృతుడు.'

(ప్రాణులు భూమి మీద ఉంటాయి. పృథివితో తాదాత్మ్యం చెప్పబడిన దేవత లోపల ఉంటూ నియమిస్తాడు– ప్రతివాడి శరీరమూ పృథివియే ! ప్రతివాని అవయవాలు పృథివియే ! కాని, తనలో నున్నవానిని ఈ శరీరము, అవయవాలు ఎరుగవు. ఈ శరీరాన్ని అవయవాలకు లోపల ఉండి నియమించేది ఆత్మ)

**మం॥ యో ప్సు తిష్ఠన్నద్భ్యో న్తరః, యమాపోన విదుః, యస్యాపః శరీరం, యో పో న్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్య మృతః. 4**

నీటిలో నివసించేవాడు, నీటిలో ఉంటున్నప్పటికి నీరు అతనిని ఎరుగదు. జలమే అతని శరీరం. జలంలో ఉంటూ అతడు జలాన్ని నియమిస్తూ ఉంటాడు. అతడే నీ అంతర్యామి అయిన ఆత్మ. అతడే అమృత్యుడు.

**మం॥ యో గ్నౌ తిష్ఠన్న గ్నేర న్తరః, యమగ్నిర్న వేద, యస్యాగ్నిః శరీరం, యో గ్నిమన్తరో యనుయతి ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః. 5**

అతడు అగ్నిలో నివసించేవాడు; అగ్నిలో ఉంటున్నప్పటికి అగ్ని అతనిని ఎరుగదు. అతని శరీరమే అగ్ని. అగ్నిలో ఉంటూనే అగ్నిని శాసిస్తూ ఉంటాడు. అతడే నీలో ఉన్న అంతర్యామియైన ఆత్మ–అతడు లోపల ఉంటూనే నియమనం చేస్తాడు. అతడు అమృతుడు.

**మం॥ యో న్తరిక్షే తిష్ఠన్నంతరిక్షాదంతరః, యమంతరిక్షం న వేద, యస్యాన్తరిక్షం శరీరం, యో న్తరిక్షమన్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః. 6**

అతడు అంతరిక్షంలో నివసిస్తాడు. అంతరిక్షం లోపల ఉన్నా అతనిని అంతరిక్షం ఎరుగదు. అతని శరీరమే అంతరిక్షం. అతడు అంతరిక్షంలో ఉంటూనే అంతరిక్షాన్ని శాసిస్తూ నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడు అమృతుడు.

**మం॥ యో వాయౌ తిష్ఠన్వాయోరన్తరః, యం వాయుర్న వేద, యస్యవాయుః శరీరమ్, యో వాయుమన్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్య మృతః. 7**

వాయువు అతని నివాస స్థానం. వాయువు లోపల ఉంటున్నా వాయువు అతనిని ఎరుగదు. వాయువే అతని శరీరం. వాయువు లోపల ఉంటూనే అతడు వాయువును శాసిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ. అతడే నీ అంతర్యామి. అతడు అమృతుడు.

**మం॥ యో దివి తిష్ఠన్దివో న్తరః, యం ద్యౌర్న వేద' యస్య ద్యౌః శరీరం, యో దివమన్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః. 8**

ఆ ద్యులోకం అతని వివాసం, ద్యులోకంలో ఉంటున్నా ద్యులోకం అతనిని ఎరుగదు. అతని శరీరమే ద్యులోకం, ద్యులోకం, ఉంటూనే అతడు ఆ లోకాన్ని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ అతడే నీ అంతర్యామి, అతడు అమృతుడు.

**మం॥ య ఆదిత్యే తిష్ఠన్నాదిత్యాదన్తరః, యమాదిత్యో న వేద, యస్యాదిత్యః శరీరం, య ఆదిత్యమన్తరో యమ యతి, ఏష త ఆత్మాన్తర్యామ్య మృతః. 9**

అతడు ఆదిత్య లోకంలో ఉంటూ ఉంటాడు. ఆదిత్య లోకంలో ఉంటూ ఉన్నా ఆదిత్యలోకం అతనిని ఎరుగదు. ఆదిత్యుడే అతని శరీరం. ఆదిత్యుని లోపల ఉంటూనే ఆదిత్యుని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ. అతడే నీలోని అంతర్యామి. అతడు అమృతుడు.

**మం॥ యో దిక్షు తిష్ఠన్దిగ్భ్యో న్తరః, యం దిశో న విదుః, యస్య దిశః శరీరం, యోదిశో న్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః. 10**

అతడు దిగంతరాళాల్లో నివసిస్తూ ఉంటాడు. దిక్కులలో ఉంటున్నా దిక్కులు అతనిని ఎరుగవు. దిక్కులే అతని శరీరం. అతడు దిక్కులలో ఉంటూనే వాటిని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ. అతడే నీ అంతర్యామి. అతడే అమృతుడు.

**మం॥ యశ్చంద్రతారకే తిష్ఠంశ్చంద్రతార కాదంతరః, యం చంద్రతారకం న వేద, యస్య చంద్రతారకం శరీరం, యశ్చంద్రతారకమంతరో యమయతి, ఏష త ఆత్మాన్త ర్యామ్యమృతః. 11**

అతడు చంద్రునిలో నక్షత్రాలలో ఉంటాడు. అట్లా చంద్రునిలోను నక్షత్రాలలోను ఉన్నా, ఆ చంద్ర తారకలు అతనిని ఎరుగవు. చంద్రతారకలే అతని శరీరం. చంద్రతారకల్లో ఉంటూనే వాటిని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ. అతడే నీ అంతర్యామి. అతడు అమృతుడు.

**మం॥ య ఆకాశే తిష్ఠన్నాకాశాదన్తరః, యమాకాశో న వేద, యస్యాకాశః శరీరం, య ఆకాశమంతరో యమ యతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః. 12**

అతడు ఆకాశం నివాస స్థానంగా కలవాడు. ఆకాశంలో అతడు ఉంటున్నా, ఆకాశం అతనిని ఎరుగదు. ఆకాశమే అతని శరీరం. ఆకాశం లోపల ఉంటూనే ఆకాశాన్ని తన చెప్పు చేతల్లో ఉంచుకుంటాడు. అతడే నీ ఆత్మ. అతడే నీలోని అంతర్యామి. అతడు అమృతుడు (లోపల ఉంటూనే నియమనం చేసేవాడు. అంతర్యామి.)

**మం॥ యస్తమసి తిష్ఠం సమస్తమసో న్తరః, యం తమో న వేద, యస్య తమః శరీరం, యస్తమో న్తరో యమ యతి, ఏషత ఆత్మాన్తర్యామ్య మృతః. 13**

అతని వాసస్థానం అంధకారం. అంధకారంలో ఉంటున్నా అంధకారానికి అతడు అపరిచితుడు– అంధకారం అతనిని ఎరుగదు. అతని శరీరమే అంధకారం. అంధకారం లోపల ఉంటూనే అతడు అంధకారాన్ని తన చెప్పుచేతల్లో ఉంచుకుంటూ శాసిస్తాడు. అతడే నీ ఆత్మ. అతడే నీ అంతర్యామి. అతడు అమృతుడు.

**మం॥ యస్తేజసి తిష్ఠం స్తేజసో న్తరః, యం తేజో న వేద, యస్య తేజః శరీరం, యస్తేజో న్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః – ఇత్యధిదైవతం; అథాధి భూతమ్. 14**

అతడు తేజస్సులో ఉంటాడు. తేజస్సులో ఉంటున్నా తేజస్సు అతనిని ఎరుగదు. తేజస్సే అతని శరీరం. తేజస్సులో ఉంటూనే తేజస్సును నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ, అతడే నీ అంతర్యామి. అతడు అమృతుడు.

ఇంతరకు చెప్పినదంతా దేవతలలో అంతర్గతుడై ఉంటూ దర్శనమిచ్చే అంతర్యామిని గూర్చిన విషయం ఇక బ్రహ్మాది స్తంభ పర్యంతం (హిరణ్య గర్భుని నుండి తృణం వరకు) సమస్త భూతాల్లోను (జీవులలోను) ఉన్న అంతర్యామి యొక్క దర్శనాన్ని గురించి చెప్పబోతున్నారు.

**మం॥ యః సర్వేషు భూతేషు తిష్ఠన్ సర్వేభ్యో భూతేభ్యో న్తరః, యం సర్వాణి భూతాని న విదుః, యస్య సర్వాణి భూతాని శరీరం, యః సర్వాణి భూతాన్యన్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః ఇత్యధి భూతం; అథాధ్యాత్మమ్. 15**

అతడు సమస్త భూతాల్లోను– జీవుల్లోను ఉండేవాడు, అతడు అన్ని జీవుల్లోను ఉన్నా జీవులు ఏవీ అతనిని ఎరుగవు. అతడు అన్ని భూతాల్లోను ఉంటూనే అన్నిటిని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ. అతడే నీ సర్వాంతర్యామి. అమృతుడు. ఇంతవరకు సర్వాత్మయొక్క అధిభూత దర్శనం. ఇక అధ్యాత్మ దర్శనాన్ని గురించి–

**మం॥ యః ప్రాణే తిష్ఠన్ ప్రాణాదన్తరః, యం ప్రాణో న వేద, యస్య ప్రాణః శరీరమ్, యః ప్రాణమన్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః. 16**

అతడు నాసిక (ముక్కు) లో ఉంటాడు– ముక్కు అంటే ప్రాణం అని భావం. అతడు ప్రాణంలో ఉంటున్నా ప్రాణం అతనిని ఎరుగదు. అతని శరీరమే ప్రాణం. అతడు ప్రాణంలో ఉంటూనే ప్రాణాన్ని నియంత్రిస్తాడు. అతడే నీ యాత్మ. అతడే నీ అంతర్యామి– అమృతుడు.

**మం॥ యో వాచి తిష్ఠన్ వాచోన్తరః, యం వాఙ్నవేద, యస్య వాక్ శరీరమ్, యో వాచామన్తరో యమ యతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః. 17**

అతడు వాగింద్రియంలో ఉంటాడు. అతడు వాగింద్రియంలో ఉంటున్నా. వాక్కు అతనిని ఎరగదు. వాగింద్రియమే అతని శరీరం. అతడు వాక్కులో ఉంటూనే వాగింద్రియాన్ని శాసిస్తూ నియంత్రిస్తూ ఉంటాడు. అతడు నీ ఆత్మ. అతడే నీ అంతరాత్మ, అమృతుడు.

**మం॥ యశ్చక్షుషి తిష్ఠంశ్చకుషో న్తరః, యం చక్షుర్న వేద యస్య చక్షుః శరీరం, యశ్చక్షురంతరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృత. 18**

అతడు చక్షురింద్రియంలో నివసిస్తాడు. కాని చక్షురింద్రియంలో ఉంటున్నా నేత్రాలు అతనిని ఎరుగవు. నేత్రమే అతని శరీరం. నేత్రంలో ఉంటూనే అతడు చక్షురింద్రియాన్ని నియంత్రిస్తాడు. అతడే నీ యాత్మ అతడే అంతర్యామి, అమృతుడు.

**మం॥ యః శ్రోత్రే తిష్ఠన్ శ్రోతాద్రన్తర, యం శ్రోత్రం న వేద, యస్య శ్రోత్రం న వేద, యస్య శ్రోత్రం శరీరం యః శ్రోత్రమన్తరో యమ యతి, ఏష త ఆత్మాన్తర్యామ్య మృతః. 19**

అతడు శ్రోత్రేంద్రియంలో ఉంటాడు. కాని శ్రోత్రేంద్రియంలో ఉంటున్నా ఆ శ్రోత్రానికి అతనిని గురించి తెలియదు. శ్రోత్రమే అతని శరీరం. అతడు శ్రోత్రంలో ఉంటూనే దానిని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ అతడు అంతర్యామి. లోపల ఉంటూనే శాసించేవాడు. అమృతుడు.

**మం॥ యో మనసి తిష్ఠన్మనసో న్తరః, యం మనో న వేద' యస్య మనః శరీరం, యో మనో న్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్య మృతః. 20**

అతడు మనస్సులో ఉంటాడు. మనస్సులో ఉంటున్నా మనస్సు అతనిని ఎరుగదు. అతని శరీరమే మనస్సు, మనస్సులో ఉంటూనే అతడు మనస్సును అదుపు చేస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ– నీ లోపల ఉండి శాసిస్తూ ఉంటాడు (అంతర్యామి.) అమృతుడు.

**మం॥ యస్త్వచి తిష్ఠం స్త్వచో న్తరః, యం త్వక్ న వేద, యస్య త్వక్ శరీరం, యస్త్వ చమన్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః. 21**

అతడు త్వగింద్రియంలో ఉంటాడు. త్వగింద్రియంలో (చర్మంలో) ఉన్నా ఆ యింద్రియం అతనిని ఎరుగదు. ఆ త్వగింద్రియమే అతని శరీరం. ఆ త్వక్కులో ఉంటూనే అతడు దానిని అదుపులో ఉంచుకుంటాడు. అతడే నీ ఆత్మ. అతడే లోపల ఉంటూ శాసించేవాడు– అమృతుడు.

**మం॥ యో విజ్ఞానే తిష్ఠన్విజ్ఞానాదన్తరః, యం విజ్ఞానం న వేద, యస్య విజ్ఞానం శరీరం, యో విజ్ఞాన మంతరో యమయతి, స ఏష త ఆత్మాన్తర్యామ్య మృతః. 22**

అతడు బుద్ధిలో ఉంటూ ఉంటాడు. బుద్ధిలో ఉంటున్నా బుద్ధి అతనిని ఎరుగదు. అతని శరీరమే బుద్ధి (విజ్ఞానం). అతడు బుద్ధిలో ఉంటూనే ఆ బుద్దిని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ. అతడే లోపల ఉంటూ శాసించే అంతర్యామి. అమృతుడు.

**మం॥ యో రేతసి తిష్ఠన్ రేతసో న్తరః, యం రేతోన వేద యస్య రేతః శరీరం యోరోతో న్తరో యమయతి, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః అదృష్టో ద్రష్టా, అశ్రుతః శ్రోతా, అమతో మన్తా, అవిజ్ఞాతో విజ్ఞాతా; నాన్యో తో స్తిద్రష్టా, నాన్యో తో స్తిశ్రోతా, నాన్యొ తో స్తిమన్తా, నాన్యో తో స్తి విజ్ఞాతా, ఏష త ఆత్మాన్తర్యామ్యమృతః, ఆతో న్యదార్తమ్; తతో హోద్దాలక ఆరుణిరుపరరామ. 23**

అతడు ప్రజననేంద్రియంలో నివసిస్తాడు. ప్రజననేంద్రియంలో ఉంటున్నా ఆ ఇంద్రియానికి అతనిని గురించి ఏమీ తెలియందు. వీర్యమే అతని శరీరం. అతడు వీర్యంలో ఉంటూనే ఆ వీర్యాన్ని నియంత్రిస్తూ ఉంటాడు. అతడే నీ ఆత్మ నీ లోపల ఉంటూనే శాసించేవాడు. అమృతుడు.

అతడు కనిపించడు; కాని చూస్తాడు. అతడు వినిపించడు– కాని, వింటాడు. మననానికి (ఆలోచనకు అతడు విషయం కాడు. కాని, అతడు మంత (మననం చేసేవాడు). అతడు సామాన్యంగా తెలియబడడు– అర్థం కాడు. కాని, అతనికి అన్నీ తెలుసు. అతడే నీ ఆత్మ నీ అంతర్యామి. అతడే శాశ్వతుడు, అతడు తప్ప అన్నీ నాశనమయ్యేవే ! ఈ విషయాలు విని అరుణియైన ఉద్దాలకుడు ఓటమిని అంగీకరించినట్లుగా మౌనం వహించాడు.

## ఎనిమిదవ బ్రాహ్మణం

ఆకలి మొదలైనవి లేనట్టి, శరీరం లేనట్టి, సన్నిహితమైనట్టి, అపరోక్షమైనట్టి, సర్వాంతర్యామి యైనట్టి అక్షర బ్రహ్మను గూర్చి చెప్పబోతున్నారు.

**మం॥ అథ హ వాచక్నవ్యువాచ, బ్రాహ్మణా భగవన్తో హన్తాహమిమంద్వౌ ప్రశ్నౌ ప్రక్ష్యామి, తౌ చేన్మే వక్ష్యతి, న వై జాతు యుష్మాకమిమం కశ్చిద్బ్రహ్మోద్యం జేతేతి; పృచ్ఛ గార్గీతి. 1**

పిమ్మట వాచక్నుని పుత్రికయైన గార్గి అన్నది– 'ఓ బ్రాహ్మణులారా ! మీరందరు అనుమతి ఇస్తే నేను ఈ యాజ్ఞవల్క్యుని రెండు ప్రశ్నలు ఆడగుతాను. నా ప్రశ్నలకు గనుక అతడు సమాధానం ఇవ్వగలిగితే మీలో ఎవ్వరూ అతనిని వాద వివాదాల్లో జయించలేరన్న మాటే !' ఇది విని బ్రాహ్మణులంతా 'గార్గీ ! అట్లాగే అడుగు' అని అనుమతించారు.

**మం॥ సా హోవాచ, అహం వై త్వా యాజ్ఞవల్క్య యథా కాశ్యో వా వైదేహో వోగ్రపుత్ర ఉజ్జ్యం ధనుర ధిజ్యం కృత్వా ద్వౌ బాణవన్తౌ సపత్నాతివ్యాధినౌ హస్తే కృత్వోపోత్తిష్ఠేత్, ఏవమేవాహం త్వా ద్వాభ్యాం ప్రశ్నాభ్యాముపోదస్థామ్, తౌ మే బ్రూహీతి; పృచ్ఛ గార్గీతి. 2**

గార్గి అంటున్నది– ఓ యాజ్ఞవల్క్యుడా ! కాశీలో గాని, విదేహాలో గాని, వీర వంశంలో పుట్టినరాజు, అంతవరకు ఎక్కుదించి ఉన్న తన ధనుస్సును మళ్ళీ ఎక్కుపెట్టి, చాలా సమీపానికి వచ్చి, శత్రువును బాగా పీడించేటటువంటి, వెదురు పిడులు గల రెండు బాణాలను పట్టుకొని నిలబడ్డట్లుగా, నేను రెండు కష్టతరమైన ప్రశ్నలతో నిన్ను ఓడించటానికి నీ ఎదుట నిలబడి ఉన్నాను. నీవు బ్రహ్మజ్ఞానివైతే వాటికి సమాధానం ఇవ్వు !

అది విని యాజ్ఞవల్క్యుడన్నాడు– 'గార్గీ ! సరే ! అట్లాగే అడుగు !'

(గార్గి లోగడ ఒకసారి ప్రశ్నించి ఊరుకున్నది– ధనుస్సు ఎక్కుదించినది ఇప్పుడు మళ్ళీ ప్రశ్నించటానికి పూనుకున్నది– ధనుస్సు మళ్ళీ ఎక్కుపెడుతోంది. కాశీ విదేహ ఈ రెండు రాజ్యాలు పరాక్రమానికి వలెనే, బ్రహ్మవిద్యకు ప్రశస్తికెక్కినవి. కాశిరాజు అయిన అజాత శత్రుని విషయం,

విదేహరాజైన జనకుని విషయం ప్రసిద్ధమే ! తాను బ్రహ్మ విద్యలో గొప్పదాననని (పరాక్రమవంతురాలనని) తాను అడగబోయే రెండు కష్టమైన ప్రశ్నలూ, శత్రువులను పీడించే రెండు బాణాలని, ఉపమానాలుగా చెపుతోంది.)

**మం॥ సా హోవాచ, యదూర్ధ్వం యాజ్ఞవల్క్య దివః, యదవాక్ పృథివ్యాః యదన్తరా ద్యావాపృథివీ ఇమే, యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షతే, కస్మిం స్తదోతం చ ప్రోతం చేతి. 3**

గార్గి ఈ విధంగా అడుగుతోంది– 'ఓ యాజ్ఞవల్క్యుడా ! ద్యులోకానికి పైన (ద్యులోకరూపమైన అండకపాలానికి పైన) ఈ భూలోకానికి క్రింద (పృథివీరూపమై అండకపాలానికి క్రింద), ఈ ద్యావాపృథివీ రూపమైన బ్రహ్మాండం యొక్క మధ్యలోను ఉన్నట్టి, భూత వర్తమాన భవిష్యత్తులుగా (గడచిపోయినది, జరుగుతున్నది, జరుగబోయేది) శాస్త్రాల్లో పేర్కొనబడుతూ ఉన్నట్టి, ఈ ద్వంద్వాలతో కూడిన (ద్వైత భావంతో కనిపించే) ఈ ప్రపంచమంతా దేనిలో ఓతప్రోతమై ఉన్నది ? (ఏకీభావం చెంది ఉన్నది?) ఈ ద్వంద్వాలన్నింటికి సూత్రంగా ఉన్నది ఏది? ' అని.

**మం॥ స హోవాచ, యదూర్ధ్వం గార్గి దివః యదవాక్ పృథివ్యాః. యదన్తరా ద్యావాపృథివీ ఇమే, యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చే త్యాచక్షతే, ఆకాశే తదోతం చ ప్రోతం చేతి. 4**

యాజ్ఞవల్క్యుడిలా అన్నాడు –'ఓ గార్గీ ! ద్యులోకానికి పైన, ఈ భూలోకానికి క్రింద, ఈ ద్యావా పృథివీలోకాలకు మధ్య, భూత వర్తమాన భవిష్యత్తులనే పేరుతో పేర్కొనబడేవి ఇవన్నీ రూపంలేని (అవ్యాకృతమైన) ఆకాశంలో ఓతప్రోతమై ఉన్నాయి. ఈ స్థూల స్వరూపంలో ఉండే విశ్వానికంతకు సూక్ష్మరూపంలో ఉండే ఆకాశం అనేది సూత్రం అని భావం.

**మం॥ సా హోవాచ నమస్తే స్తు యజ్ఞావల్క్య యో మ ఏతం వ్యవోచః. అపరస్మై ధారయస్వేతి, పృచ్ఛ గార్గీతి. 5**

గార్గి అన్నది – "ఓ యాజ్ఞవల్క్యుడా ! నీకు నమస్కారము. మీరు నా ప్రశ్నకు సమాధానం ఇచ్చేశారు. ఇక రెండవ ప్రశ్నకు సిద్ధంగా ఉండండి."

యాజ్ఞవల్క్యుడన్నాడు– 'సరే ! గార్గీ ! అడుగు!'

**మం॥ సా హోవాచ, యదూర్ధ్వం యాజ్ఞవల్క్య దివః, యద వాక్ పృథివ్యాః యదన్తరా ద్యావాపృథివీ ఇమే, యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షతే, కస్మిం స్తదోతం చ ప్రోతం చేతి. 6**

**మం॥స హోవాచ, యదూర్ధ్వం గార్గీ దివః, యదవాక్ పృథివ్యాః, యదన్తరా ద్యా వాపృథివీ**

**ఇమే, యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షతే, ఆకాశ ఏవ తదోతం చ ప్రోతం చేతి, కస్మిన్ను ఖల్వా కాశ ఓతశ్చ ప్రోతశ్చేతి. 7**

లోగడ గార్గి అడిగిన ప్రశ్నను, ఆ ప్రశ్నకు యాజ్ఞవల్క్యుడిచ్చిన సమాధానాన్ని మళ్ళీ చెప్పారు– విషయానికి ఇంకా పుష్టిని చేకూర్చేందుకు. అందుచేత 7వ మంత్రానికి చివరలో గార్గి అడిగిన ప్రశ్నను చూద్దాము.

గార్గి అడిగింది– ఆకాశం దేనిలో ఓతప్రోతమై ఉన్నది?' అని. (ఆకాశతత్త్వాన్ని చెప్పటమే చాలా కష్టం. అటువంటిది ఆకాశం దేనిలో ఓతప్రోతమై ఉన్నదో దానిని విశదీకరించటం చాలా కష్టం. ఆకాశమే సూక్ష్మమైనది, అవ్యాకృతమైనది. అటువంటి ఆకాశం ఇంకా సూక్ష్మమైన దానిలో దేనిలోనో ఓతప్రోతమై ఉండాలి. అటువంటి దానిని నిర్ధారించి చెప్పటం కష్టం కాబట్టి యాజ్ఞవల్క్యుడు తప్పక ఓడిపోతాడని గార్గి భావించింది.)

**మం॥ స హోవాచ, ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి, అస్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహమచ్ఛాయమతమో వాయ్వనాకాశ మసంగ మరస మగంధ మచక్షుష్క మశ్రోత్రమవాగ మనో తేజస్కమప్రాణ మముఖ మమాత్ర మనన్తరమ బాహ్యమ్, న తదశ్నాతి కించన, న తదశ్నాతి కశ్చన. 8**

యాజ్ఞవల్క్యుడిలా అన్నాడు– "ఓ గార్గీ ! ఆకాశానికి ఓతప్రోత స్థానమైనట్టి తత్త్వాన్ని బ్రహ్మవేత్తలైనవారు 'అక్షర పురుషుడు' అని అంటారు. (మార్పు, నాశనం లేనివాడు) అంటే ఆ అక్షర పురుషునిలో నీవు అడిగినట్టి ఆకాశం ఓతప్రోతమై ఉంటుంది. బ్రహ్మవేత్తలు ఆ అక్షర పురుషుణ్ణి ఈ విధంగా చెపుతారు– 'ఆ అక్షర పురుషుడు స్థూల రూపుడూ కాడు. సూక్ష్మరూపుడూ కాడు. చిన్నవాడూ కాడు, పెద్దవాడూ కాడు. ఎఱ్ఱగానూ ఉండడు (రంగు లేనివాడు) జలానికి గుణమైన ద్రవత్వం కలవాడూ కాడు, నీడ కాడు. అంధకారమూ కాడు. వాయువూ కాడు. ఆకాశమూ కాడు. లక్కలాగా అంటుకొనే స్వభావమూ లేదు (అసంగుడు) రసమూ కాడు. గంధమూ కాడు. నేత్రాలు కలవాడు కాడు. శ్రోత్రాలు కలవాడూ కాడు. మనస్సు కలవాడూ కాడు. తేజస్సే లేనివాడు. ప్రాణం లేనివాడు, నోరు లేనివాడు, కొలత లేనివాడు, అతనికి లోపల, బయట అనేది లేదు. (బాహ్యాభ్యంతరాలు లేవు– అని వస్తువుకే ఉంటాయి) అతడేమీ తినడు. అతనిని తినేది ఏదీ లేదు. అంటే, అతనికి విశేషంగా చెప్పదగినది ఏదీ లేదు– అతడు విశేష్యం కాడు కాబట్టి ! సమస్త విశేషణాలకు అతీతుడైనట్టి, అద్వితీయుడైనట్టి తత్త్వం !" అని.

**మం॥ ఏతస్య వా అక్షరస్య ప్రశాసననే గార్గి సూర్యచాంద్ర మసౌ విధృతౌ తిష్ఠతః, ఏతస్య వా అక్షరస్య ప్రశా సనే గార్గి ద్యావాపృథివ్యౌ విధృతే తిష్ఠతః, ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే**

**గార్గి నిమేషా ముహూర్త అహోత్రాణ్య ర్ధమాసా మాసా ఋతవః సంవత్సరా ఇతి విధృతా స్తిష్ఠన్తి; ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ప్రాచ్యో న్యా నద్యః స్యన్దన్తే శ్వేతేభ్యః పర్వతేభ్యః ప్రతీచ్యో న్యాః, యాం యాం చ దిశ మను; ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి దదతో మనుష్యాః ప్రశంసన్తి, యజమానం దేవాః, దర్వీం పితరో న్వాయత్తాః. 9**

అనుమాన ప్రమాణంతో అక్షరతత్త్వాన్ని వర్ణిస్తున్నారు– యాజ్ఞవల్క్యుడంటున్నాడు– 'ఓ గార్గీ ! ఈ అక్షరుని ప్రశాసనంలోనే (పరిపాలనలోనే) సూర్యచంద్రులు విశిష్టమైన రూపాన్ని ధరించి స్థిరంగా ఉన్నారు. ఈ అక్షరుని ప్రశాసనంలోనే, నిమేషాలు, ముహూర్తాలు, (48 నిముషాలు) దినాలు, (పగళ్ళు, రాత్రులు), పక్షాలు, మాసాలు, ఋతువులు, సంవత్సరాలు, విశిష్టమైన రూపాలు ధరించి శాసింపబడుతూ ఉన్నాయి. ఓ గార్గీ ! ఈ అక్షర పురుషుని ప్రశాసనంలోనే తూర్పుకు ప్రవహించే నదులు శ్వేతపర్వతం (హిమాలయం) నుండి ప్రవహిస్తున్నాయి. అట్లాగే, ఓ గార్గీ ! పడమర దిక్కుకు ప్రవహించే నదులు, ఇంకా ఇతరమైనవి, ఏఏ దిశలకు ప్రవహించాలో ఆ వైపుకు అనుప్రవృత్తమై ఈ నాటికి ఆయా దిక్కులను అనుసరిస్తూనే ఉన్నాయి. ఆ అక్షరుని శాసనం వల్లనే సువర్ణాది దానాలు తీసుకొనే ప్రమాణజ్ఞులు దాతలను పొగడుతున్నారు. అట్లాగే, ఓ గార్గి ! ఆ అక్షర పురుషుని శాసనం వల్లనే దేవతలు యజమానుణ్ణి వారిచ్చే హోమాలకోసం ప్రశంసిస్తున్నారు. అట్లాగే పితృ దేవతలు. దర్వీ హోమాల మీద (పితృదేవతల నుద్దేశించి చేసే హోమం) ఆధారపడి ఉన్నారు. (అంటే, సూర్యచంద్రాదులు, కాలము, ప్రకృతితో పాటు, అత్యంత శక్తివంతులైన దేవతలు సైతం, కృపణులై యజమానులిచ్చే చరు పురోడాశాదుల కోసం నికృష్ట వృత్తిని ఆశ్రయిస్తున్నారని, పితృదేవతలు కూడా అట్లాగే దర్వీ హోమాల మీద ఆధారపడి ఉన్నారని, దీనికంతకు కారణం ఆ అక్షరుని ప్రశాసనాన్ని వీరెవరూ ఉల్లంఘించలేక పోవటమే ! అని భావం.)

**మం॥ యో వా ఏతదక్షరం గార్గ్య విదిత్వాస్మింల్లోకే జుహోతి యజతే తప స్తప్యతే బహూని వర్షసహస్రాణి, అన్తవదేవాస్య తద్భవతి, యో వా ఏతదక్షరం గార్గ్య విదిత్వా స్మాల్లోకాత్ప్రైతి స కృపణః; అథ య ఏత దక్షరం గార్గి విదిత్వాస్మాల్లోకాత్ప్రైతి స బ్రాహ్మణః. 10**

యాజ్ఞవల్క్యుడింకా ఇట్లా అంటున్నాడు– 'ఓ గార్గీ ! ఈ లోకంలో ఎవరైనా అక్షర పురుషుణ్ణి తెలుసుకోకుండానే– ఆత్మతయా తెలుసుకోకుండానే– హోమాలు, యాజ్ఞలు వేలకొలది సంవత్సరాల పాటు చేసినప్పటికి, అదంతా నశించిపోయేదే ! వ్యర్థమే ! ఎందుచేతనంటే, భోగాల వెంటనే వాటి వినాశనం కూడా ఉంటుంది. అందుచేత ఎవరైనా ఈ అక్షరుణ్ణి తెలుసుకోకుండానే– ఆత్మభావంతో తెలుసుకోకుండానే, ఈ లోకం నుండి చనిపోయి వెళ్ళిపోతే, మళ్ళీ పుట్టి, మళ్ళీ చనిపోతూ సంసార చక్రంలో చిక్కుకుంటాడు. ఒకవేళ ఎవరైనా దేవలోకాదులకు పోయినప్పటికీ,

అక్కడ క్రీతదాసుని లాగానే (డబ్బు పెట్టి కొన్న బానిసలాగా) ఉంటాడు. అంటే, బానిస భాగ్యవంతుని యింట్లో ఉన్నా, ఆ భాగ్యం, సంపద వానిది కాదు కాబట్టి వాడు నిష్ప్రయోజనమైన బ్రతుకు బ్రతుకుతాడు. కాని, ఓ గార్గీ ! ఈ అక్షరుని ఆత్మభావంతో తెలుసుకొని, మరణించి, ఈ లోకం నుండి నిష్క్రమించేవాడు సంసార బంధనాల నుండి ముక్తుడై బ్రాహ్మణుడౌతాడు. – బ్రహ్మను తెలుసుకున్నవాడౌతాడు.

**మం॥ తద్వా ఏతదక్షరం గార్గ్యదృష్టం ద్రష్టృ, అశ్రుతం శ్రోతృ, అమతం మన్తృ, అవిజ్ఞాతం విజ్ఞాతృ; ఏత స్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి. 11**

ఓ గార్గీ ! ఈ అక్షరతత్త్వం, దేనికీ , ఎవరికీ దృష్టి విషయం కాదు– కండ్లకు కనిపించేది కాదు– రూపం లేదు కాబట్టి ! అయినప్పటికి, ఆ అక్షరుడే దృష్టి స్వరూపమైనందున ద్రష్ట (చూచేవాడు). అట్లాగే శ్రోత్రానికి అతడు విషయం (శబ్దం) కాకపోయినా, తాను శ్రుతి రూపమైనందున శ్రోత, అతడు మననాకిఇ (ఆలోచను) విషయం కాకపోయనా మతిరూపమై యున్నందున అతడు మంత. అట్లాగే ఆ అక్షరుడు బుద్ధికి విషయం కాకపోయినా, అవిజ్ఞాతుడైనప్పటికి, విజ్ఞాన స్వరూపుడైనందున విజ్ఞాత అవుతున్నాడు. అక్షరుడు తప్ప ద్రష్ట. శ్రోతమంత, విజ్ఞాత ఎవరూ లేరు. అందుచేతనే, ఓ గార్గీ ! నిస్సందేహంగా ఈ అక్షరునిలోనే ఆకాశం ఓతప్రోతమై ఉన్నది (గార్గి అడిగిన రెండవ ప్రశ్నకు కూడా సమాధానం పూర్తి అయినది)

**మం॥ స హోవాచ, బ్రాహ్మణా భగవన్తస్తదేవ బహు మన్యేధ్వం యదస్మాన్న మస్కారేణ ముచ్యేధ్వమ్, న వై జాతు యుష్మాకమిమం కశ్చిద్బ్ర హ్మోద్యం జేతేతి; తతో హ వాచక్నవ్యు పరరాదు. 12**

అంతట గార్గి ఈ విధంగా అన్నది– 'ఓ పూజనీయులైన బ్రాహ్మణులారా ! మిమ్మల్ని మీరు అదృష్టవంతులుగా భావించుకోండి. ఈ యాజ్ఞవల్క్యునికి నమస్కరించి విముక్తులుకండి. మీలో ఎవరూ ఈ యాజ్ఞవల్క్యుని బ్రహ్మవాదంలో జయించలేరు. బ్రహ్మను గూర్చి విపులీకరించి చెప్పటంలో– వ్యాఖ్యానించటంలో ఈతనిని మించిన వారెవరూ లేదు. ఇది నా నిశ్చయం.' ఈ విధంగా అని గార్గి మౌనం వహించింది.

## తొమ్మిదవ బ్రాహ్మణం

**మం॥ అథ హైనం విదగ్ధః శాకల్యః పప్రచ్ఛ, కతి దేవా యాజ్ఞవల్క్యేతి సహైతయైవ ని విదా ప్రతిపేదే, యావన్తోవైశ్వదేవస్య నివిద్యుచ్యన్తే– త్రయచ్ఛత్రీ చశతా, త్రయశ్చ త్రీచ సహస్రేతి; ఓమితి మక్షవాచ, కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి, త్రయస్త్రింశదితి, ఓమితి హోవాచ, కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి, షడితి, ఓమితి మోవాచ, కత్యేన దేవా యజ్ఞా వల్క్యేతి, త్రయ ఇతి, ఓమితి**

**హోవాచ, కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి ద్వావితి, ఓమితి హోవాచ, కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి, అధ్యర్థ ఇతి, ఓమితి హోవాచ, కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి, ఏక ఇతి, ఓమితి హోవాచ, కతమే త్రయశ్చ త్రీచ శతా, త్రయశ్చ త్రీచ సహస్రేతి. 1**

పిమ్మట శకలుని పుత్రుడైన శాకల్య విదుగ్ధుడు, యాజ్ఞవల్క్యుని ఈ విధంగా అడిగాడు– 'దేవత లెంతమంది?' అని.

యాజ్ఞవల్క్యుడు– 'ఈ దేవతల సంఖ్యకు సంబంధించిన మంత్రాల సంఖ్య వల్లనే ఆ దేవతల సంఖ్య చెప్పబడ్డది. ఉత్తర వైశ్వదేవమంత్రాలను నివిదం అంటారు. ఈ మంత్రాలలో విశ్వేదేవతలను స్తుతించారు. ఈ నివిదాన్ని బట్టి దేవతల సంఖ్య మూడు వందలమూడు + మూడు వేల మూడు = 3306 (303 + 3003 = 3306)

(అనుమానాస్పదమైన ఈ దేవతల సంఖ్య విని శాకల్యుడు మళ్ళీ అడుగుతున్నాడు– 'సరే ! యాజ్ఞవల్క్యుడా ! దేవత లెంతమంది ?

యాజ్ఞవల్క్యుడు : "ముప్పది ముగ్గురు."

శాకల్యుని అనుమానం మళ్ళీ పెరిగి మళ్ళీ అడుగుతున్నాడు– దేవతల లెంతమంది?' అని.

యాజ్ఞవల్క్యుడు : 'ఆరుగురు.'

శాకల్కుడు : 'సరే ! దేవత లెంతమంది ?'

యాజ్ఞవల్క్యుడు : 'ముగ్గురు'

శాకల్యుడు : 'దేవత లెందరు?'

యాజ్ఞవల్క్యుడు : 'ఇద్దరు.'

శాకల్యుడు : 'సరే ! దేవత లెందరు?'

యాజ్ఞవల్క్యుడు : 'ఒకటిన్నర.'

శాకల్యుడు : 'సరే ! దేవత లెందరు?'

యాజ్ఞవల్క్యుడు : 'ఒకడు!'

శాకల్యుడు 'సరే ! అని, సంఖ్యేయమైన విషయాన్ని గూర్చి అడిగాడు– "ఆ మూడు వేల మూడు వందల ఆరుగురు ఎవరు?' అని.

**మం॥ స హోవాచ, మహిమాన ఏవషామేతే, త్రయ స్త్రింశత్తేవవ దేవా ఇతి; కతమే తేత్రయ స్త్రింశ దితి; అష్టా వసవః, ఏకాదశ రుద్రాః, ద్వాదశాదిత్యాః తే ఏకత్రింశత్, ఇంద్రశ్చైవ ప్రజాపతిశ్చ త్రయ స్త్రింశావితి. 2**

యాజ్ఞవల్క్యుడు ఈ విధంగా అన్నాడు– 'ఈ 3306 అనే సంఖ్య వారి మహిమలకు చెందినది. అంటే, దేవ విభూతులు. యదార్థానికి దేవతలు, ముప్పది ముగ్గురే!'.

శాకల్యుడు : 'ఆ ముప్పది ముగ్గురు ఎవరు?'

యాజ్ఞవల్క్యుడు : 'అష్ట వసువులు (8) ఏకాదశ రుద్రులు (11) ద్వాదశాదిత్యులు (12) మొత్తం 31 మంది. వీరితో పాటు ఇంద్రుడు, ప్రజాపతి, కలసి ముప్పది ముగ్గురు అవుతారు.'

**మం॥ కతమే వసవ ఇతి; అగ్నిశ్చ పృథివీ చ వాయుశ్చాంత రిక్షం చాదిత్యశ్చ ద్యౌశ్చ చంద్రమాశ్చ నక్షత్రాణి చైతే వసవః; ఏ తేషు హీదం సర్వం హితమితి తస్మా ద్వసవ ఇతి. 3**

శాకల్యుడు అడిగాడు– 'అష్ట వసుపులు ఎవరు?' అని.

యాజ్ఞవల్క్యుడు– "అగ్ని. పృథివి, వాయువు, అంతరిక్షం, అదిత్యుడు. ద్యులోకము, చంద్రుడు, నక్షత్రాలు, ఇవి అష్టవసువులు, ప్రాణులయొక్క కర్మ ఫలానికి ఆశ్రయమై దేహాది సంఘాత రూపంగా పరిణమించి జగత్తు అంతటా వసిస్తున్నందునను, వీటిలోనే ఈ జగత్తు వసిస్తున్నందువల్లనూ ఇవి వసువులు.

**మం॥ కతమే రుద్రా ఇతి; దశేమే పురుషే ప్రాణాః, ఆత్మై కాదశః, తే యదాస్మాచ్ఛరీరాన్మర్త్యా దుత్క్రా మన్త్యథ రోదయన్తి; తద్యద్రోయన్తి తస్మాద్రుద్ర ఇతి. 4**

శాకల్యుడు– రుద్రులు ఎవరు?

యాజ్ఞవల్క్యుడు– పురుషునిలో ఉన్న కర్మేంద్రియాలు అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు, మొత్తం పది ఇది దశ ప్రాణాలు. ఈ పదీ కాక మనస్సు ఒకటి, మొత్తం పదకొండు. ప్రాణుల యొక్క ప్రారబ్ధ కర్మ పరిసమాప్తి చెందినవుడు ఈ ఏకాదశ రుద్రులు మరణశీలమైన ఈ శరీరం నుండి ఉత్క్రమిస్తారు. ఈ విధంగా శరీరాన్ని వదిలి వెళ్ళటం ద్వారా చనిపోయిన వారి బంధువులను విడిపిస్తున్నాయి. ఈ విధంగా ప్రాణుల రోదవానికీ కారణభూత మవుతున్నాయి కాబట్టి ఇవి రుద్రశబ్దం చేత పిలవబడుతున్నాయి.

**మం॥ కతమ ఆదిత్యా ఇతి; ద్వాదశ వైమాసాః సంవత్సరస్య; ఏత ఆదిత్యాః ఏతే హీదం సర్వమాదదానా యన్తి; తే యదిదం సర్వమాదదానా యన్తి తస్మాదా దిత్యా ఇతి. 5**

శాకల్యుడు అడిగాడు– 'అదిత్యులు ఎవరు?'

యాజ్ఞమల్క్యుడు– 'పంద్రెండు నెలతో కూడిన సంవత్సర రూపమైన కాలమే ఆదిత్యుడు. ఎందుచేత నంటే మాటిమాటికీ మార్పు చెందుతూ, ఈ మాసాభిమానియైన దేవతయే ప్రాణు

యొక్క ఆయుద్దాయాన్ని, కర్మఫలాన్ని 'ఆదదానా' అంటే, గ్రహిస్తూ నడుస్తున్నాయి. అందుచేతనే ఇవి ఆదిత్య సంజ్ఞను పొందినాయి.

**మం॥ కతమ ఇంద్రః, కతమః ప్రజాపతిరితి; స్తయిత్నురే వేంద్రః, యజ్ఞః ప్రజాపతిరితి; కతమః స్తనయిత్ను రితి; ఆశనిరితి; కతమో యజ్ఞ ఇతి;పశవ ఇతి. 6**

శాకల్యుడు– ఇంద్రుడెవరు? ప్రజాపతి ఎవరు?

యాజ్ఞవల్క్యుడు– మేఘమే ఇంద్రుడు, లేక మేఘనాదాభిమానియైన దేవతయే ఇంద్రుడు అంటే విద్యుత్తు, యజ్ఞమే ప్రజాపతి.

శాకల్యుడు– విద్యుత్తు అంటే ఎవరు?

యాజ్ఞవల్క్యుడు– 'అశని !' – ప్రాణులను హింసించేది– అదే శక్తి, ఈ జలము. ఇది ఇంద్రుని క్రూర కర్మ.

శాకల్యుడు– యజ్ఞ మంటే ఏది ?

యాజ్ఞవల్క్యుడు– యజ్ఞానికి సాధనమైనందున పశుగణమే యజ్ఞం. (యజ్ఞానికి రూపమంటూ లేదు కాబట్టి !)

**మం॥ కతమే షడితి, అగ్నిశ్చ పృథివీచ వాయుశ్చాంతరిక్షం చాదిత్యశ్చ ద్యౌశ్చ. ఏతే హీదం సర్వం షడితి. 7**

శాకల్యుడు– 'ఆరుగురు దేవతలు ఎవరు?'

యాజ్ఞవల్క్యుడు– అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షం, అదిత్యుడు, ద్యులోకం– వీరే ఆరుగురు దేవతలు. (లోగడ చెప్పిన ఎనిమిది మంది వసువులు నుండి చంద్రుడు, నక్షత్రాలను మినహాయిస్తే మిగిలిన ఆరు ఇవి.) పసువులు మొదలుగా గల 33 మంది దేవతా రూపాల్లోను ఈ అగ్ని మొదలైన ఆరూ దేవగణంలోనివే ! ఈ ఆరింటి విస్తారమే మిగతా దేవతలు– మిగతా దేవతల రూపాలన్నీ ఈ ఆరింటిలో అంతర్భావం చెందుతాయని భావం.

**మం॥ కతమే తే త్రయో దేవా ఇతి; ఇమ ఏవ త్రయో లోకాః, ఏషు హీమే సర్వే దేవా ఇతి; కతమౌ తౌ ద్వౌ దేవా వితి; అన్నం చైవ ప్రాణశ్చేతి; కతమో ధ్యర్థ ఇతి; యో యం సవత ఇతి. 8**

శాకల్యుడు– ముగ్గురు దేవతలు ఎవరు ?

యాజ్ఞవల్క్యుడు– ఈ మూడు లోకాలే ముగ్గురు దేవతలు. అంటే, పృథివి, అగ్ని ఈ రెండు కలిసి ఒక దేవత. అంతరిక్షం, వాయువు కలసి ఒక దేవత. ద్యులోకము ఆదిత్యుడు కలసి ఒక దేవత. ఈ మూడింటిలోనే సమస్త దేవగణాలు అంతర్భూతమై ఉన్నాయి.

శాకల్యుడు– ఆ ఇద్దరు దేవతలు ఎవరు?

యాజ్ఞవల్క్యుడు– అన్నము, ప్రాణము, ఈ రెంటిలోనే వెనుక చెప్పిన సమస్త దేవతలు అంతర్భావం చెందుతారు. ఇక్కడ ప్రాణము అనేది విశ్వప్రాణం –హిరణ్యగర్భుడు.

శాకల్యుడు– ఒకటిన్నర దేవుడెవరు?

యాజ్ఞవల్క్యుడు– ఈ వీచే వాయువు ! ఇదే ఒకటిన్నర దేవత !

**మం॥ తదాహుః యదయమేక ఇవైవ పవతే, అథ కథ మధ్యర్థ ఇతి; యదస్మిన్నిదం సర్వమధ్యార్ధ్నోత్ తేనా ధ్యర్థ ఇతి; కతమ ఏకో దేవ ఇతి; ప్రాణ ఇతి; స బ్రహ్మ త్యదిత్యాచక్షతే. 9**

శాకల్యుడు– ఈ వాయువు ఒకటిగానే ఉండి వీస్తోంది గదా ! అటువంటప్పుడు అది 'అధ్యర్థం' ఒకటిన్నర ఎట్లా అయింది?

యాజ్ఞవల్క్యుడు– ఈ వాయువతోనే సమస్త జగత్తు 'అధిబుద్ధి'ని పొందుతోంది– అతిశయమైన కీర్తిని పొందుతోంది. అంటే, వాయువు వల్ల జగత్తుకు వృద్ధి లభిస్తోంది– అందుచేత అధ్యర్థమైంది. వాయువు ఒకటి, దానివల్ల జగత్తుకు లభించే వృద్ధి సగం.

శాకల్యుడు – ఒక దేవుడెవరు?

యాజ్ఞవల్క్యుడు– ప్రాణం ! ఈ ప్రాణమే బ్రహ్మస్వరూపం. ఈ బ్రహ్మనే పరోక్షవాచకమైన 'త్యత్' అనే పదంతో సూచిస్తారు. (ఈ మంత్రంలో దేవతల యొక్క ఏకత్వం, నానాత్వం కూడా సూచింపబడ్డది. నివిదంలో చెప్పిన 3306 మంది దేవతలకు సంక్షిప్తం చేసుకుంటూ రాగా చివరకు ప్రాణం అనే ఒక దేవతల వద్దకు వచ్చారు. ఈ ప్రాణమే– విశ్వప్రాణమే బహుధా విస్తరించి వేరు వేరు దేవతలుగా భాసిస్తున్నారు. సంక్షేపిస్తూ వస్తే ఒకే ప్రాణ బ్రహ్మగా భాసిస్తుంది.)

**మం॥ పృథివ్యేవ యస్యాయతనం అగ్నిర్లోకః, మనోజ్యోతిః, యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణమ్, స వై వేదితా స్యాద్యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ, య ఏవాయం శరీరః పురుషః స ఏషః, వదైవ శాకల్య; తస్య కా దేవతేతి; అమృతమితి హోవాచ. 10**

శాకల్యుడు– యాజ్ఞవల్క్యుడా ! ఏ దేవతకు పృథివి ఆశ్రయమో, ఏ దేవతలకు అగ్ని లోకమో (దృష్టి సాధనమో) ఏ దేవతలకు మనస్సే సంకల్ప వికల్ప సాధనమో అటువంటి ఆ పురుషుణ్ణి, ఈసమస్త ఆధ్యాత్మిక కార్యకరణ సంఘాతానికి అంతకు ఆశ్రయంగా, (త్వక్, మాంస, రుధిర, అస్థి, మజ్జా, వీర్య రూపమైన కార్యముగా, సూక్ష్మ శరీరానికి పరమ ఆశ్రయముగా) ఎవడు తెలుసుకుంటాడో వాడే పండితుడు. ఓ యాజ్ఞవల్క్యుడా ! నీ వాతనిని తెలుసుకోకుండాఏ గర్విస్తున్నావు.'

యాజ్ఞవల్క్యుడు– 'నిస్సందేహంగా నేనాతనిని ఎరుగుదును. నీవు ఎవరిని ఈ సమస్త ఆద్యాత్మిక కార్యకరణ సంఘాతానికి ఆశ్రయమైన వాడని అన్నావో ఆతనిని నేను ఎరుగుదను. ఈ శరీరంతో అభిన్నుడైన (వేరు చేయబడకుండా ఉన్న) పురుషుడే అతడు. శాకల్యుడా ! ఈ విషయమై మళ్ళీ ఒకసారి అడుగు !

శాకల్యుడు– ఈ శరీర పురుషునిలోని దేవత ఎవరు?

యాజ్ఞవల్క్యుడు– అతడు అమృతుడు. (శుక్ర శోణితములు వల్ల కలిగిన పార్థివ శరీరాన్ని 'శరీర పురుషుడు' అన్నారు. అంటే, అన్న రసంతో వచ్చినవాడు.)

**మం॥ కామ ఏవ యస్యాయతనం, హృదయం లోకః, మనో జ్యోతి, యో వై తం పురుషం విద్యాత్సర్వష్యాత్మనః పరాయణం, స వై వేదితా ప్యాద్యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ; య ఏవాయం కామయయః పురుషః స ఏషః, వదైవ శాకల్య, తస్య కా దేవతేతి; స్త్రియ ఇతి హోవాచ. 11**

కర్మాధికారి, ఆజ్ఞాని అయినవాని ఆత్మ అన్ని జీవరాసులకు భోగ్యవస్తువు అవుతుంది. అతడు చేసే హోమంవల్ల, యజ్ఞంవల్ల అతడు దేవతలకు భోగ్యం అవుతాడు. అతడు చదివే వేదంవల్ల ఋషులకు భోగ్యం అవుతాడు. అతడుచేసే పిండప్రదానం వల్ల పితృదేవతలకు భోగ్యం అవుతాడు. ఆశ్రయము, భోజనము ఇవ్వటం వల్ల మానవులకు, గడ్డి; నీరు ఇవ్వటం వల్ల పశువులకు భోగ్యం అవుతాడు. అట్లాగే ఈ ముముక్షువు ఇంటిలో ఉండే పిల్లులు కుక్కలు మొదలైన జంతువులు, చీమలు మొదలైన జీవులన్ని, ఆ ఉపాసకుని ఆశ్రయించుకొనే బ్రతుకుతున్నాయి.

అందుచేత అతడు వాటికి భోగ్యం అందుచేత అతడు వాటికి భోగ్యం అవుతున్నాడు. తనది నాశనం కాకూడదని ప్రతివాడూ ఎట్లా కోరుకుంటాడో అట్లాగే ఈ దేవ, ఋషి, పితృ, మనుస్య, జీవజంతువులన్నీ తమకు భోగ్యమైన ఈ ఉపాసకుని క్షేమాన్ని కోరుతూ ఉంటాయి.

ఈ దేవ పితృయజ్ఞాలన్నీ అవశ్యం ఆచరణీయాలని పంచమహాయజ్ఞ ప్రకరణంలో చెప్పబడ్డది. అవధాన ప్రకరణంలో వ్యాఖ్యానింపబడ్డది. పైన చెప్పిన గృహస్థులాంటి వాళ్ళు తమకు భోగ్యాలు కాబట్టి, వారు ఆత్మతత్వాన్ని తెలుసుకొని కర్మపరిత్యాగం చేసి మోక్షాన్ని పొందటం దేవతలకు మొదలైనవారికి ఇష్టం ఉండదని భావం. తమకు సేవచేసేవారు ఉండరు కాబట్టి !

శాకల్యుడు– 'దాంపత్య సుఖాభిలాషకు రూపమూన కామమే ఎవనికి ఆశ్రయమో, హృదయస్థమైన బుద్ధియే ఎవనికి దృష్టియో (బుద్ధితో చేస్తాడు కాబట్టి) మనస్సే ఎవనికి జ్యోతియో అటువంటి వాడిని, ఈ సంపూర్ణ ఆధ్యాత్మిక కార్యకరణ జాతానికి (శరీరానికి, ఇంద్రియాలకు) ఆశ్రయంగా ఎవడు తెలుసుకుంటాడో అతడే నిజమైన జ్ఞాని. ఓ యాజ్ఞవల్క్యుడా ! నీవు అతనిని తెలుసుకోకుండానే పండితుణ్ణని గర్విస్తున్నావు.'

యాజ్ఞవల్క్యుడు– "శాకల్యా ! ఈ సంపూర్ణ ఆధ్యాత్మిక కార్యకరణ జాతానికి (శరీరానికి, ఇంద్రియాలకు) ఆశ్రయమని నీవు చెప్పే వానిని నేను ఎరుగుదును. కామయుడైన పురుషుడే అతడు. అతడే ఆ దేవత. ఈ విషయమై ఇంకేమైనా అడగాలనుకుంటే అడుగు.'

శాకల్యుడు– 'అటువంటి కామమయుడైన వానికి దేవత ఎవరు?'

యాజ్ఞవల్క్యుడు– స్త్రీలు ! స్త్రీ వ్లలనే పైన చెప్పిన కామానికి ఉద్ధీపనం కలుగుతోంది కాబట్టి!)

**మం॥ రూపాణ్యేవ యస్యాయతనమ్, చక్షుర్లోకః, మనో జ్యోతిః, యో వైతం పురుషం విద్యాత్సర్వ స్యాత్మనః పరాయణం, స వై వేదితా స్యాద్యాజ్ఞవల్క్య. వేదా వా అహం తం పురుషం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ, య ఏవాసావాదిత్యే పురుషః స ఏషః, వదైవ శాకల్య; తస్య కా దేవేతి; సత్యమితి హోవాచ. 12**

శాకల్యుడు– 'శుక్లాది వర్ణాలే (తెలుపు మొదలైన రంగులే) ఎవనికి నివాసమో ఎవనికి కన్ను దృశ్యసాధనమో (లోకమో) మనస్సే ఎవనికి జ్యోతియో, అటువంటి ఆ పురుషుని సంపూర్ణ ఆధ్యాత్మిక కార్యకరణ సంఘాతానికి (శరీరానికి ఇంద్రియాలకు ఆశ్రయంగా తెలుసుకున్నవాడే నిజమైన జ్ఞాని. ఓ యాజ్ఞవల్క్యుడా ! నీవు ఆ పురుషుని తెలుసుకోకుండానే జ్ఞానినని గర్విస్తున్నావు.'

యాజ్ఞవల్క్యుడు– 'ఓ శాకల్యుడా ! ఈ సంపూర్ణ ఆధ్యాత్మిక కార్యకరణ జాతానికి ఆశ్రయమని నీవు ఎవరిని చెపుతున్నారో అతనిని నేను ఎరుగుదును. ఆదిత్యుడనే పురుషుడే అతడు. ఈ విషయమై ఇంకా కావాలంటే అడుగు.'

శాకల్యుడు– మరి ఆ పురుషుని దేవత ఎవరు?

యాజ్ఞవల్క్యుడు– 'సత్యము ! (సత్యం అంటే చక్షువు అనే చెప్పవచ్చు. ఎందుచేతనంటే, శారీరకమైన చక్షువులద్వారానే అధిదైవతమైన ఆదిత్య రూపం నిష్పన్నమౌతోంది కాబట్టి)

**మం॥ ఆకాశ ఏవ యస్యాయతనమ్, శ్రోత్రం లోకః, మనోజ్యోతిః, యో వైతం పురుషం విద్యాత్సర్వస్యాత్మవః పరాయణం, స వై వేదితా స్యాద్యాజ్ఞ్యవల్క్య, వేద వా అహం తం పురుషం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ; య ఏవాయం శ్రౌత్రః ప్రాతిశ్రుల్కిః పురుషః స ఏషః, వదైవ శాకల్య; తస్య కా దేవ తేతి; దిశ ఇతి హోవాచ. 13**

శాకల్యుడు– 'ఆకాశమే నివాస స్థానంగా కలిగినట్టి, శ్రోత్రమే లోకమైనట్టి (దృశ్య స్థానమైనట్టి) మనస్సే జ్యోతి అయినట్టి, ఆ పురుషుని సమస్త ఆధ్యాత్మిక కార్యకరణ సంఘాతానికి ఆశ్రమమైనట్టి వానినిగా తెలుసుకున్నవాడే పండితుడు. యాజ్ఞవల్క్యుడా ! నీవు అతనిని తెలుసుకోకుండానే పండితుడనని గర్విస్తున్నావు.'

యాజ్ఞవల్క్యుడు– సమాధానమిస్తున్నాడు. 'నీవు సమస్త ఆధ్యాత్మిక కార్యకరణ సంఘాతానికి ఆశ్రయమని చెప్పినట్టి ఆ పురుషుని నేను ఎరుగుదును. అతడు శ్రోత్రంలో ఉండేవాడు. అతడు ప్రాతిశ్రుత్కుడు. (అంటే, మనం వినేటప్పుడు శ్రవణానికి అభేద రూపంలో– తాదాత్మ్యంగా –వ్యక్తమయ్యే పురుషుడు అతడే ! (ఇంకా ఈ విషయమై కావాలంటే అడుగు !'

శాకల్యుడు – 'అతనికి దేవత ఎవరు?'

యాజ్ఞవల్క్యుడు– 'దిక్కులు ! ఎందుచేతనంటే, దిక్కుల నుండే ఈ శరీరంలో ఉండే ప్రాతిశ్రుత్కుడు పుడుతున్నాడు.'

**మం॥ తమ ఏవ యస్యాయతనం, హృదయలోకః, మనోజ్యోతిః. యో వై తం పురుషం విద్యాత్సత్సర్వస్మాత్మనః పరాయణమ్, స వై వేదితా స్యాద్యాజ్ఞవల్క్య, వేదా వా అహం తం పురుషం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ; య ఏవాయం ఛాయామయః పురుష; స ఏషః, వదైవ శాకల్యః, తస్య కా దేవతేతి; మృత్యు రితి హోవాచ. 14**

శాకల్యుడు– 'అంధకారమే ఆశ్రయమైనట్టివాడు, హృదయమే లోకమైనవాడు (దృశ్య సాధనమైనవాడు), మనస్సు జ్యోతియైన వాడు, ఈ శరీరానికి, ఇంద్రియ సమూహానికి పరమ ఆశ్రయమైనట్టి పురుషుని తెలుసుకున్నవాడే జ్ఞాని. ఓ యాజ్ఞవల్క్యుడా ! నీవు ఆ పురుషుని తెలుసుకోకుండానే జ్ఞానినని గర్విస్తున్నావు.'

యాజ్ఞవల్క్యుడు– 'శాకల్యుడా ! నేనాతనిని ఎరుగుదును. ఛాయామయుడైన పురుషుడే అతడు– (ఛాయ అంటే అజ్ఞానము) శాకల్యుడా ! ఇంకా ఈ విషయంలో ఏమైనా కావాలంటే అడుగు.

శాకల్యుడు– "అతని దేవత ఎవరు?"

యాజ్ఞవల్క్యుడు– 'అవ్యాకృతుడైనట్టి ఈశ్వర స్వరూపమైనట్టి మృత్యువు అతని (ఆ ఛాయా పురుషుని) దేవత.'

**మం॥ రూపాణ్యేవ యస్యాయతనమ్, చక్షుర్లోకః, మనోజ్యోతిః, యో వైతం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణమ్ నవై వేదితా సాద్యాజ్ఞవల్క్యః. వేద వా అహం తం పురుషం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ, య ఏవాయమాదర్శే పురుషః స ఏషః, వదైవ శాకల్య, తస్య కా దేవతేతి; అసురితి హోవాచ. 15**

శాకల్యుడు– 'ప్రకాశక రూపమే ఆశ్రయమైనట్టి, నేత్రమే లోకమైనట్టి, మనస్సే జ్యోతి అయినట్టి, సమస్త శారీరక, ఇంద్రియ సమూహానికంతకు పరమ ఆశ్రయమైనట్టి పురుషుణ్ణి తెలిసికొన్నవాడే పండితుడు.'

యాజ్ఞవల్క్యుడు– 'శాకల్యా ! నీవు చెప్పినట్టి ఆ సమస్త అధ్యాత్మిక కార్యకరణ సంఘాతానికి పరమ ఆశ్రయమైన వానిని నేను ఎరుగుదను. అతడు ప్రతిబింబానికి ఆశ్రయమైనట్టి అద్దంలో ఉండే పురుషుడు. అతన్ని గురించి ఇంకేమన్నా కావాలంటే అడుగు."

శాకల్యుడు– అతనికి దేవత ఎవరు?"

యాజ్ఞవల్క్యుడు– 'ప్రాణమే అతని దేవత ! ఎందుచేతనంటే, ప్రతిబింబం అనే ఆ పురుషుని రూపం ప్రాణం వల్లనే (దర్పణంలో రాపిడి శక్తి వల్లనే) పుడుతోంది కాబట్టి.

**మం॥ ఆప ఏవ యస్యాయతనమ్ హృదయం లోకః మనో జ్యోతిః, యోవై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణం, స వై వేదితా స్యాద్యాజ్ఞవల్క్య, వేద వా అహం తం పురుషం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ; య ఏవాయమప్సు పురుషః స ఏషః, వదైవ యాజ్ఞ్యవల్క్య; తస్య కా దేవతేతి; వరుణ ఇతి హోవాచ. 16**

శాకల్యుడు– 'సర్వసాధారణమైన జలమే ఆశ్రయమైనట్టి, హృదయమే లోకమైనట్టి (చూచే సాధనం) మనస్సే జ్యోతి అయినట్టి, శరీరానికి సమస్త ఇంద్రియాలకు పరమ ఆశ్రయమైనట్టి ఆ పురుషుని తెలుసుకున్నవాడే పండితుడు. నీవు అతనిని తెలుసుకోకుండానే జ్ఞానినని గర్విస్తున్నావు.'

యాజ్ఞవల్క్యుడు– 'శాకల్యా ! నేను పురుషుని ఎరుగుదును. సమస్త ఇంద్రియాలకు, శరీరానికి పరమ ఆశ్రయమైనట్టి పురుషుడు తటాకాదులలోని జలంలో విశేష రూపంలో ఉండే పురుషుడు. ఇంకేమైనా అడగాలంటే అడుగు !

శాకల్యుడు– 'అతని దేవత ఎవరు?'

యజ్ఞావల్క్యుడు– 'వరుణుడు. ఈ వరుణుని ద్వారానే ఈ సంఘాత కర్త అయిన ఆధ్యాత్మిక జలమే, స్థూలజలం కలగటానికి కారణం. అంటే త్రాగుతూ ఉండటం వల్ల ఉపయోగపడ్డ జలమే స్థూలజలానికి (తటాకదులకు– వాటిని త్రవ్వే మానవుల ద్వారా) కారణమౌతోంది.

**మం॥ రేత ఏవ యస్యాయతనం, హృదయం లోకః, మనో జ్యోతిః, యో వైతం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణం స వై వేదితా స్యాదాజ్ఞవల్క్యః వేద వా అహం తే పురుషం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ; య ఏవాయం పుత్రమయః పురుషః సః ఏషః, వదైన శాకల్య, తస్య కా దేవతేతి; ప్రజాపతిరితి హోవాచ. 17**

శాకల్యుడు– 'వీర్యమే ఆశ్రయమైనట్టి, హృదయమే లోకమైనట్టి మనస్సే జ్యోతియైనట్టి. ఈ శారీరక ఇంద్రియ సమూహానికంతకు పరమ ఆశ్రయమైనట్టి పురుషుని తెలుసుకొన్నవాడే పండితుడు.'

యాజ్ఞవల్క్యుడు– 'నీవు చెప్పిన ఆ ఆధ్యాత్మిక కార్యకరణ సంఘాతానికి ఆశ్రయమైనట్టి పురుషుని నేను ఎరుగుదును. అతడు పుత్ర రూపంలో ఉంటాడు.'

శాకల్యుడు– 'అతనికి దేవత ఎవరు?'

యాజ్ఞవల్క్యుడు– 'ప్రజాపతి, తండ్రి రూపంలో ఉండే ప్రజాపతి ద్వారా పుత్రోత్పత్తి జరుగుతోంది కాబట్టి.'

**మం॥ శాకల్యేతి హోవాచ యాజ్ఞవల్క్యః తాం స్విదిమే**
**బ్రాహ్మణా అఙ్గారావక్షయణమక్రతా 3 ఇతి 18**

యాజ్ఞవల్క్యుడు– 'ఓ శాకల్యుడా ! ఈ వేద విద్వాంసులైనట్టి బ్రాహ్మణు లంతా నిన్ను నిప్పు బొగ్గుల్ని తీసే పటకారులాగా ఉపయోగించారు– బొగ్గుల వేడి పటకారుకు తగులుతుంది. పట్టుకున్నవాడికి వేడి తగలదు. అట్లాగే నా వల్ల నీకు తాపం కలుగుతోంది కాని ఈ బ్రాహ్మణులకు కాదు. నీకా విషయం తెలియటం లేదు.'

**మం॥ యాజ్ఞవల్క్యేతి హోవాచ శాకల్యః యదిదం కురు పాంచాలానాం బ్రాహ్మణానత్యనాదీః, కిం బ్రహ్మ విద్వానితి, దిశో వేద సదేవాః స ప్రతిష్ఠా ఇతి; యద్దిశో వేత్థ స వేదాః స ప్రతిష్ఠాః. 19**

శాకల్యుడు– 'ఓ యాజ్ఞవల్క్యా ! నీవు ఈ కురుపాంచాల దేశ బ్రాహ్మణులను ఎగతాళి చేస్తున్నావు– నిజంగా నీవు బ్రహ్మజ్ఞాని వేనా?' (బ్రహ్మ జ్ఞాని ననుకొని వీరిని తిరస్కరిస్తున్నావు– తృణీకరిస్తున్నావు)

యాజ్ఞవల్క్యుడు– 'నేను దేవతలను, ఆశ్రయసహితమైన దిక్కులను గూర్చి ఎరుగుదును.'

శాకల్యుడు– 'నీకు దిక్కులను గూర్చి, వాటి దేవతలను గురించి, వారి వారి ఆశ్రయాలను గురించి తెలిస్తే (అంటే, వీటిని గూర్చిన ఉపాసన, తత్ఫలితాలను గూర్చి తెలిస్తే) చెప్పు చూద్దాం.'

**మం॥ కిం దేవతో స్యాం ప్రాచ్యాం దిశ్యసీతి; ఆదిత్య దేవత ఇతి స ఆదిత్యః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి; చక్షుషీతి, కస్మిన్ను చక్షుః ప్రతిష్ఠితమతి; రూపేష్వితి, చక్షుషా హి రూపాణి పశ్యతి, కస్మిన్ను రూపాణి ప్రతిష్ఠితానీతి హృదయ ఇతి హోవాచ హృదయేన హి రూపాణి జానాతి, హృదయే హ్యేవ రూపాణి ప్రతిష్ఠితాని భవ న్తీతి; ఏవమేవైతద్యాజ్ఞవల్క్య 20**

శాకల్యుడు– 'ఓ యాజ్ఞవల్క్యా ! నీవు తూర్పు దిక్కునందు ఏ దేవతతో తాదాత్మ్యం చెంది (అభేదాన్ని పొంది) ఉంటున్నావు?'

యాజ్ఞవల్క్యుడు– 'అక్కడ నేను సూర్యునితో తాదాత్మ్యం చెంది ఉంటున్నాను.'

శాకల్యుడు– సూర్యుడు దేనియందు ప్రతిష్ఠితుడై ఉన్నాడు ?– దేనిని ఆశ్రయించి ఉన్నాడు?

యాజ్ఞవల్క్యుడు– నేత్ర మందు ప్రతిష్ఠితుడై ఉన్నాడు.

శాకల్యుడు– నేత్రం దేనియందు ప్రతిష్ఠితమై ఉంది?

యాజ్ఞవల్క్యుడు– రూపమందు, నేత్రం ద్వారానే పురుషుడు నీలము మొదలైన రూపాల్ని చూస్తున్నాడు.

శాకల్యుడు– రూపం దేని మీద ఆధారపడి ఉంది?

యాజ్ఞవల్క్యుడు– హృదయం మీద. పురుషుడు హృదయం ద్వారానే వాసనాత్మకమైన రూపాన్ని స్మరిస్తున్నాడు. అందుచేత రూపమనేది హృదయం మీద ఆధారపడి ఉంది.

శాకల్యుడు – సరే ! బాగానే ఉంది.

**మం॥కిం దేవతో స్యాం దక్షిణాయాం దిశ్యసీతి; యమదేవత ఇతి; స యమః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి; కస్మిన్ను యజ్ఞః ప్రతిష్ఠిత ఇతి; దక్షిణాయామితి; కస్మిన్ను దక్షిణా ప్రతిష్ఠి తేతి; శ్రద్ధాయా మితి; యదా హ్యేవ శ్రద్ధ థ దక్షిణాం దదాతి, శ్రద్ధాయాం హ్యేవ దక్షిణా ప్రతిష్ఠి తేతి; కస్మిన్ను**

**శ్రద్ధా ప్రతిష్ఠితేతి; హృదయ ఇతి హోవాచ, హృదయేనహిశ్రద్ధాం జానాతి, హృదయే హ్యేవ శ్రద్ధా ప్రతిష్ఠితా భవతీతి; ఏవమేవైత ద్యాజ్ఞవల్క్య.** **21**

శాకల్యుడు– దక్షిణ దిక్కులో నీవు ఏ దేవతతో కలసి ఉంటున్నావు?

యాజ్ఞవల్క్యుడు – యమునితో !

శాకల్యుడు– యముడు దేని మీద ఆధారపడి ఉన్నాడు?

యాజ్ఞవల్క్యుడు– యజ్ఞం మీద.

శాకల్యుడు – యజ్ఞం దేని యందు ప్రతిష్ఠితమై ఉంది?

యాజ్ఞవల్క్యుడు– దక్షిణ మీద ఆధారపడి ఉంది. (ఋత్విక్కులకు ఇచ్చే ధనం దక్షిణ) ఋత్విక్కులు దక్షిణ చేత కొనబడుతూ ఉంటారు కాబట్టి.

శాకల్యుడు– దక్షిణ దేనియందు ప్రతిష్ఠితమై ఉంది ?

యాజ్ఞవల్క్యుడు– భక్తితో కూడి ఆస్తేక్య బుద్ధిరూపమైన శ్రద్ధ యందు. శ్రద్ధ (విశ్వాసం) ఉన్నప్పుడే దక్షిణ ఈయగలుగుతాడు. కాబట్టి దక్షిణ అనేది శ్రద్ధ మీద ఆధారపడి ఉంది.

శాకల్యుడు– శ్రద్ధ అనేది దేనిమీద ఆధారపడి ఉంది ?

యాజ్ఞవల్క్యుడు– హృదయం మీద. హృదయంతోనే పురుషుడు శ్రద్ధను తెలుసుకోగలుగుతాడు.

శాకల్యుడు – యాజ్ఞవల్క్యుడా ! అవును ! అంతే !

**మం॥కిం దేవతో స్యాం ప్రతీచ్యాం దిశ్యసీతి; వరుణ దేవత ఇతి; స వరుణః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి; అప్స్వితి; కస్మిన్నాపః ప్రతిష్ఠితా ఇతి; రేతసీతి, కస్మిన్ను రేతః ప్రతిష్ఠిత మితి; హృదయ ఇతి, తస్మాదసి ప్రతిరూపం జాతమాహుః, హృదయాదివ సృప్తః, హృదయా దివ నిర్మిత ఇతి; హృదయే హ్యేవ రేతః ప్రతిష్ఠితం భవ తీతి; ఏవమేవైతద్యాజ్ఞవల్క్య.** **22**

శాకల్యుడు– ఓ యాజ్ఞవల్క్యుడా ! నీవు పశ్చిమ దిశ యందు ఏ దేవతతో తాదాత్మ్యం చెంది ఉన్నావు?

యాజ్ఞవల్క్యుడు – వరుణునితో (వర్షదేవత).

శాకల్యుడు– వరుణుడు దేని మీద ఆధారపడి ఉన్నాడు ?

యాజ్ఞవల్క్యుడు– జలం మీద.

శాకల్యుడు– జలం దేనీమీద ఆధారపడి ఉంది?

యాజ్ఞవల్క్యుడు– వీర్యం మీద. ఎందుచేతనంటే, వీర్యం నుండి జలం పుట్టింపబడ్డది.

శాకల్యుడు– వీర్యం దేనిమీద ఆధారపడి ఉంది ?

యాజ్ఞవల్క్యుడు– హృదయం మీద. అందుచేతనే పుత్రుని చూచిన లోకులు 'వీడు తండ్రి హృదయం నుండి ఊడిపడ్డాడు' అని అంటారు. కాబట్టి వీర్యమనేది హృదయంలోనే ప్రతిష్ఠితమై ఉంది !

శాకల్యుడు – యాజ్ఞవల్క్యా! అవును అది నిజమే! అంతే!

**మం॥ కిం దేవతో స్యాముదీచ్యాం దిశ్యసీతి; సోమదేవత ఇతి; స సోమః కస్మిన్ప్రతిష్ఠితల ఇతి; దీక్షాయామితి; కస్మిన్ను దీక్షా ప్రతిష్ఠితేతి; సత్య ఇతి; తస్మాదపి దీక్షితమాహుః సత్యం వదేతి, సత్యే హ్యేవ దీక్షా ప్రతిష్ఠి తేతి; కస్మిన్ను సత్యం ప్రతిష్ఠితమితి; హృదయ ఇతి మోవాచ, హృదయేన హి సత్యం జానాతి, హృదయే హ్యేవ సత్యం ప్రతిష్ఠితం భవతీతి; ఏవమే వైతద్యాజ్ఞవల్క్య. 23**

శాకల్యుడు– ఉత్తర దిక్కున నీవు ఏ దేవతతో తాదాత్మ్యం చెంది ఉన్నావు ?

యాజ్ఞవల్క్యుడు– సోమదేవతతో (సోమము అనే శబ్దంలో సోమలత, సోమదేవత రెంటిని వర్ణించారు.)

శాకల్యుడు– సోమదేవత దేనిపై ఆధారపడి ఉంది ?

యాజ్ఞవల్క్యుడు– దీక్ష మీద. (ఎందుచేతనంటే, దీక్షితుడైన యజమానే సోమలతనుకొని, సోమంతో యజ్ఞం చేసి, సోమదేవతాధిష్ఠితమైనట్టి ఉత్తర దిశను పొందుతాడు)

శాకల్యుడు– దీక్ష దేనిమీద ఆధారపడి ఉంది ?

యాజ్ఞవల్క్యుడు– సత్యం మీద. అందుచేతనే దీక్ష వహించిన వానితో 'సత్యం పలుకు' అని చెపుతారు– సత్యం మీదనే దీక్ష ఆధారపడి ఉంది కాబట్టి సత్యం లేకపోతే దీక్షా కార్యం పాడైపోతుంది.

శాకల్యుడు– సత్యం దేనియందు ప్రతిష్ఠితమై ఉంది ?

యాజ్ఞవల్క్యుడు– హృదయంలో, ఎందుచేతనంటే హృదయం ద్వారానే పురుషుడు సత్యాన్ని తెలుసుకుంటాడు.

శాకల్యుడు– సరే ! నీవు చెప్పింది భాగానే ఉంది.

**మం॥ కిందేవతో స్యాం ధృవాయాం దిశ్యసీతి; అగ్ని దేవత ఇతి; సో గ్నిః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి; వాచీతి; కస్మిన్నువాక్ ప్రతిష్ఠి తేతి; హృదయ ఇతి; కస్మిన్ను హృదయం ప్రతిష్ఠితమితి. 24**

శాకల్యుడు– ధృవ దిక్కు (ఊర్ధ్వ దిక్కు) నందు నీవు ఏ దేవతతో తాదాత్మ్యం చెంది ఉంటావు?

యాజ్ఞవల్క్యుడు– అగ్ని దేవతతో– ఎందుచేతనంటే, ఊర్ధ్వదిశ యందు ప్రకాశం ఎక్కువగా ఉంటుంది– కాంతియే అగ్ని కాబట్టి.

శాకల్యుడు– అగ్ని దేని మీద ఆధారపడి ఉంది ?

యాజ్ఞవల్క్యుడు – వాక్కు మీద

శాకల్యుడు– వాక్కు దేని మీద ఆధారపడి ఉంది ?

యాజ్ఞవల్క్యుడు– హృదయం మీద. (సమస్త దిశలందు వ్యాప్తమై ఉన్న హృదయం ద్వారా యాజ్ఞవల్క్యుడు ఆయా దిక్కులతో ఆత్మభావాన్ని పొందాడు.)

శాకల్యుడు– హృదయం చెందినట్టి దేని మీద ఆధారపడి ఉంది? (ఇక్కడ హృదయం అంటే, సమస్త విశ్వానికి చెందినట్టి విశ్వహృదయాన్ని గూర్చి శాకల్యుడు అడిగాడు– అంతేగాని యాజ్ఞవల్క్యుని యొక్క వ్యష్టి హృదయాన్ని గూర్చి కాదు)–

**మం॥ అహల్లి కేతి హోవాచ యాజ్ఞవల్క్యః, యత్రైతదన్య త్రాస్మన్మన్యాసై యద్ధ్యేతదన్య త్రాస్మత్స్యాత్, శ్వానో వై నదద్యు, వయాంసి వైనద్విమథ్నీరన్నితి. 25**

శాకల్యుని 'ఓ ప్రేతా!' అని సంబోధించి యాజ్ఞవల్క్యుడన్నాడు– 'నీవు ఈ దేహాన్ని హృదయరూపంలో ఉన్న నా కంటె భిన్నమైనదానినిగా తలచినపుడు– ఈ శరీరంలోకాక, హృదయమనేది ఎక్కడో ఉన్నదని అనుకున్నప్పుడు, నిజంగానే ఈ దేహం నా నుండి వేరైపోతుంది– చచ్చిపోతుంది. అప్పుడు దానిని కుక్కలు తింటాయి. పక్షులు ముక్కులతో పొడిచి ముక్కలు ముక్కలు చేస్తాయి. అంటే, ఈ శరీరం, నామరూపాలు, కర్మమయమైనందున హృదయరూపమున ఆత్మయందే ప్రతిష్ఠితమై ఉంటాయి. (హృదయమనేది ఈ శరీరంలోనే ఉన్నదని, ఈ కర్మ వల్ల లభించినట్టి, నామరూపాత్మకమైన శరీరం హృదయరూపమైన ఆత్మ మీద ఆధారపడి ఉందని భావం)

**మం॥కస్మిన్న త్వం చాత్మాచ ప్రతిష్ఠితౌ స్థ ఇతి, ప్రాణ ఇతి; కస్మిన్న ప్రాణః ప్రతిష్ఠిత ఇతి; అపాన ఇతి; కస్మిన్న పానః ప్రతిష్ఠిత ఇతి; వ్యాన ఇతి; కస్మిన్ను వ్యానః ప్రతిష్ఠిత ఇతి, ఉదాన**

**ఇతి; కస్మిన్నూదాన ప్రతిష్ఠిత ఇతి; సమాన ఇతి; స ఏష నేతి నేత్యాత్మా, అగృహ్యో నహి గృహ్యతే, అశీర్యో నహి శీర్యతే, అసంగో నహి సజ్యతే అసితో న వ్యథతే న రిష్యతి, ఏతాన్యాష్టానాయతనాని, అష్టౌ లోకాః, అష్టౌ దేవాః, అష్టౌ పురుషాః, స యస్తాన్పురుషాన్ని రుహ్యా ప్రత్యు హ్యాత్యక్రామత్, తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి; తం చేన్మే న వివక్ష్యసి, మూర్ధా తే విప తిష్యతీతి తం హ న మేనే శాకల్యః, తస్య హ మూర్ధా విపపాత, అపి హాస్య పరిమోషిణో స్తీన్యప జహ్రు రన్యన్మన్యమానాః 26**

శాకల్యుడు : నీవు, నీ ఆత్మ దేని యందు ప్రతిష్ఠితమై ఉన్నారు.

యాజ్ఞవల్క్యుడు– దేహము, ఆత్మా ఈ రెండూ కూడా ప్రాణ వృత్తిమీద ఆధారపడి ఉన్నాయి.

శాకల్యుడు– ప్రాణం దేనిమీద ఆధారపడి ఉంది?

యాజ్ఞవల్క్యుడు– వ్యానం మీద

శాకల్యుడు– వ్యానం దేనిమీద ఆధారపడి ఉంది?

యాజ్ఞవల్క్యుడు– ఉదానం మీద.

శాకల్యుడు– ఉదానం దేనిమీద ఆధారపడి ఉంది?

యాజ్ఞవల్క్యుడు– సమానం మీద. (అపానం గనక ప్రాణవృత్తిని అడ్డగించకపోతే ప్రాణం పై నుండి బయటకు పోతుంది. అట్లాగే మధ్యస్థమైన వ్యానం చేత అపానవృత్తి నిరోధింపబడకపోయినా, ఈ ప్రాణ అపాన, వ్యానాలు ఉదానం చేత; ప్రాణ, అపాన, వ్యాన, ఉదానాలు సమానం చేత నిరోధింపబడకపోతే అన్ని దిక్కులు చెదిరిపోతాయి. ఇవన్నీ వరుసగా ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉన్నాయి) ఈ ఆత్మ అనేది మధుకాండలో 'నేతి– నేతి' 'ఇదికాదు– ఇదికాదు' అని నిరూపింపబడ్డదే ! ఆత్మ అనేది అగ్రాహ్యం, – పట్టుకోవటానికి వీలుకానిది. అశీర్యం– నష్టం పొందనది. అసంగం దేనితోను అంటనిది. అమూర్తం– రూపం లేనిది. కాబట్టే అది బంధింపబడదు– వ్యథితం కాదు– హింసింపబడదు. పైన చెప్పబడిన (10 నుండి 17 మంత్రాల వరకు) ఎనిమిది ఆశ్రయాలు, ఎనిమిది లోకాలు, ఎనిమిది దేవతలు, ఎనిమిది మంది పురుషులు కలది ఈ ఆత్మ. పైన చెప్పిన శరీరాది ఎనిమిది మంది పురుషులను నిశ్చయంగా తెలుసుకొని వాటిని తన హృదయంలో ఉపసంహరించి శారీరకమైన ఆకలి దప్పికలను అతిక్రమించాలి. నేను ఉపనిషత్తులలో చెప్పబడిన అటువంటి పురుషుని గురించి అడుగుతున్నాను. నీవు స్పష్టంగా చెప్పలేకపోతే నీ తల తెగి క్రింద పడుతుంది.'

ఆ ఉపనిషత్తులలో చెప్పబడిన పురుషుని శాకల్యుడు నిజంగానే ఎరుగడు. అందుచేత అతని తల క్రింద పడిపోయింది. అంతలో దోపిడి దొంగలు వచ్చి (ధనాధికంగా తలచి) అతని ఎముకల్ని అతని శిష్యులు నుండి లాక్కొనిపోయారు.

**మం॥ అథ హోవాచ, బ్రామ్మణా భగవంతో యో వః కామయతే స మా పృచ్ఛతు, సర్వే వా మా పృచ్ఛత, యో వః కామయతే తం వ ః పృచ్ఛామి, సర్వాన్వా వః పృచ్ఛామీతి; తే హ బ్రాహ్మణా న దధృషుః. 27**

బ్రాహ్మణులంతా మౌనంగా ఉండటం చూచి, యాజ్ఞవల్క్యుడు అన్నాడు– 'పూజనీయులైన బ్రాహ్మణులారా ! మీలో ఎవరికైనా నన్ను ప్రశ్నిద్దామని ఉంటే, విడి విడిగాగాని, అంతా కలసిగాని ఎదుర్కొనేందుకు బ్రాహ్మణులెవరూ సాహసించలేదు.

**మం॥ తాన్ హైతైః శ్లోకైః పప్రచ్ఛ– యథా వృక్షో మనస్పతి స్తథైవ పురుషో మృషా.**

**తస్య లోమాని పర్ణాని, త్వ గస్యోత్పాటికా బహిః. 1**
**త్వచ ఏవాస్య రుధిరం ప్రస్యంది, త్వచ ఉత్పటః**

**తస్మాత్తదా తృష్ణాత్ప్రైతి రసో వృక్షాదివాహతాత్. 2**
**మాంసాన్యస్య శకరాణి, కినాటం స్నావ, తత్స్థిరం**

**అస్థీన్యన్తరతో దారుని, మజ్జా మజ్జోపమా కృతా. 3**
**యద్వృక్షో వృక్ణః రోహితి మూలాన్నవతరః పునః**

**మర్త్యః స్విన్మృత్యునా వృక్ణః కస్మాన్మూలా త్ప్రరోహతి 4**
**రేతస ఇతి మా వోచత, జీవత స్తత్ప్రజాయతే**

**ధానారుహ ఇవ వై వృక్షో జ్ఞసా ప్రేత్య సంభవః. 5**
**యత్సమూలమావృ హేయుర్వృక్షం న పునరాభవేత్**

**మర్త్యః స్విన్మృత్యునా వృక్ణః కస్మాన్మూలాత్ప్ర రోహతి. 6**
**జాత ఏవ; న, జాయతే, కోన్వేనం జనయేత్పునః**

**విజ్ఞాన మానందం బ్రహ్మ, రాతిర్దాతుః పరాయణం,**
**తిష్ఠమానస్య తద్విద ఇతి. 7 28**

యాజ్ఞవల్క్యుడు ఈ శ్లోకాల ద్వారా బ్రాహ్మణులను అడిగాడు– చెట్లు ఏ ధర్మాలను కలిగి ఉంటాయో జీవునియొక్క శరీరరూపమైన పురుషుడు కూడా అట్లాగే ఉంటాడు. (చెట్లకు పురుషునికి పోలిక ఉంది) ఇది యదార్థం. వృక్షానికి ఆకులు ఉంటాయి. శరీరానికి రోమాలు ఉంటాయి. వృక్షానికి బయట బెరడు ఉంటుంది. శరీరానికి బాహ్యచర్మం ఉంటుంది. (1)

పురుషుని చర్మం నుండే రక్తం కారుతుంది. అట్లాగే చెట్టు బెరడు నుండి రసం కారుతుంది. ఈ విధంగా వృక్షానికి పురుషుని శరీరానికి పోలిక ఉంది. గాయం తగిలిన శరీరం నుండి రక్తం కారినట్లే దెబ్బ తగిలిన చెట్టు నుండి రసం కారుతుంది. (2)

పురుషుడు శరీరంలో మాంసం ఉంది. అట్లాగే వృక్షం యొక్క లోపలి బెరడు వృక్షానికి మాంసం లాంటిది. అన్నిటికంటె లోపల ఉండే బెరడు యొక్క పొరనరాలు, రెండూ దృఢంగానే ఉంటాయి. శరీరం లోపల ఎముకలున్నట్లే చెట్లు లోపలి భాగంలో కట్టచేవ ఉంటుంది. పురుషుని శరీరంలో మజ్జ (ఎముక మధ్యలోని మూలుగు) ఉన్నట్లే చెట్టు యొక్క చేవ మధ్యలో దవ్వ ఉంటుంది. (మెత్తటి భాగం). (3)

చెట్టును మనం నరికితే అది మళ్ళీ మళ్ళీ నూతనంగా చిగుర్చుతూ వస్తుంది గదా ! అట్లాగే మృత్యువు మానవశరీరాన్ని నరికినప్పుడు మళ్ళీ ఏ మూలం నుండి శరీరం ఉత్పన్నమౌతోంది? అంటే, మానవుని ఉత్పత్తి ఎక్క డ నుండి జరుగుతోంది? (4)

అది వీర్యం నుండి ఉత్పన్న మౌతోందని మీరు అనవచ్చు. కాని అది సరికాదు. ఎందుచేతనంటే, వీర్యమనేది జీవించి ఉన్న పురుషుని నుండి ఉత్పన్నమౌతుంది. చనిపోయిన వానినుండి పుట్టదు గదా ! వృక్షం కూడా దాని కాండం నుండే కాక విత్తనం నుండి కూడా పుట్టవచ్చు నరకబడినప్పుడు మళ్ళీ చిగర్చటం చూస్తున్నాము. (5)

కాని మనం వృక్షాన్ని సమూలంగా (వ్రేళ్ళతో సహా) పీకి పారేస్తే, మళ్ళీ ఏ విధంగానూ చిగర్చట మనేది ఉండదు. మృత్యువు మనుష్యుని నరికివేస్తే మళ్ళీ ఆ శరీరం ఏ మూలం నుండి పుడుతోంది? (6)

పురుషుడనేవాడు పుట్టనే పుట్టాడు- ఇక మళ్ళీ పుట్టడు అనటానికి వీలులేదు. ఎందుచేతనంటే, చచ్చి పునర్జన్మ పొందుతున్నాడు. అటువంటప్పుడు మృత్యువు తరువాత మళ్ళీ జన్మ అనేది దేనివల్ల జరుగుతోంది ? (దీనికి సమాధానం బ్రాహ్మణులు చెప్పలేనప్పుడు శ్రుతి చెపుతోంది) దీనికి సమాధానం బ్రాహ్మణులు చెప్పలేకపోయారు కాబట్టి ఓడిపోయారు. యాజ్ఞవల్క్యుడీ విధంగా బ్రాహ్మణులకు ఓడించి గోవుల్ని తోలుకొని పోయాడు. అంతటితో కథ ముగిసింది.

కాని ఈ ప్రశ్నకు సమాధానం ఎవరు చెపుతారు? ఇక ఈ విశ్వానికి మూలం ఏది? అనే విషయాన్ని శృతి (వేదం) చెపుతుంది- విజ్ఞానం అని, బ్రహ్మ విజ్ఞాన స్వరూపుడు, ఆనంద స్వరూపుడు, అతడే సంపద ఇచ్చేవాడు. అతడే కర్మలు ఆచరించే యజమానికి పరమగతి, అతడే బ్రహ్మ జ్ఞానికి కూడా ఆశ్రయమైనవాడు. (7) 28

# నాల్గవ అధ్యాయం

## మొదటి బ్రాహ్మణం

**మం॥ ఓం. జనకో హ వై దేహ ఆసాంచక్రే, అథ హ యాజ్ఞ వల్క్య ఆవవ్రాజ. తం హోవాచ, యాజ్ఞవల్క్య కిమర్థమచారీః, పశూనిచ్ఛన్, అణ్వాన్తానితి. ఉభయ మేవ సమ్రాడితి హోవాచ. 1**

గొప్ప విద్వాంసుడు, విదేహరాజ్యాధిపతి, అయిన జనకమహారాజు ప్రసన్నచిత్తంతో తన సింహాసనం మీద ఆసీనుడై ఉండగా యాజ్ఞవల్క్యు మహర్షి ఆయనవద్దకు వచ్చాడు. యాజ్ఞవల్క్యుని చూచి జనకుడు అన్నాడు 'ఓ యాజ్ఞవల్క్యా ! మీరు ఏ ప్రయోజనం కోరి యిచ్చటికి వచ్చారు ? పశురూపమైన ధనాన్ని కోరి వచ్చారా ? లేక సూక్ష్మాతిసూక్ష్మము, అత్యంత రహస్య పూర్ణములైన ప్రశ్నల్ని విందామని వచ్చారా ? (అనేక మంది గురువుల వద్ద మేము విని ఉన్న జ్ఞానానికి ప్రామాణికతను ప్రసాదించటానికి వచ్చారా?) అని.

యాజ్ఞవల్క్యుడన్నాడు– 'ఓ సార్వభౌమా ! రెండు పనులకోసమూ వచ్చాను.' అని.

**మం॥ యత్తేకశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేతి; అబ్రవీన్మే జిత్వా శైలినిః; వాగ్వై బ్రహ్మేతి; యథా మాతృమాన్పి తృమానాచార్యవాన్ బ్రూయాత్, తథా తచ్ఛైలిని రబ్రవీద్వాగ్వై బ్రహ్మేతి, అవదతో హి కిం స్యాదితి; అబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠామ్ ? న మే బ్రవీ దితి; ఏక పాద్వా ఏతత్సమ్రాడితి; స వై నో బ్రూహి యజ్ఞావల్క్య. వాగేవాయతనం, ఆకాశః ప్రతిష్ఠా ప్రజ్ఞేత్యేనదుపాసీత; కా ప్రజ్ఞతా యాజ్ఞవల్క్య? వాగేన సమ్రాడితి హోవాచ. వాచా వై సమ్రా ద్బంధుః ప్రజ్ఞాయతే, ఋగ్వేదో యజుర్వేదః సామ వేదదో థర్వాంగి రస ఇతిహాసః పురాణం విద్యా ఉప నిషదః శ్లోకాః సూత్రాణ్యమవ్యాఖ్యా నానివ్యాఖ్యా నా నీష్టం హుత మాశితం పాయితం, అయ చ లోకః, పరశ్చలోకః, సర్వాణి చ భూతాని వాచైన సమ్రాట్ ప్రజ్ఞాయన్తే; వాగ్వైసమ్రాట్ పరమం బ్రహ్మ, నైనం వాగ్జహాతి, సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి, దేవో భూత్వా దేవాన ప్యేతి, య ఏవం విద్వానేతదుపాస్తే. హస్త్యృషభం సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః. స హోవాచ యాజ్ఞవల్క్యః, పితా మే మన్యత నానను శిష్య హరేతేతి. 2**

యాజ్ఞవల్క్యుడు జనకునితో అన్నాడు– 'ఓ మహారాజా ! మీకు ఎవరైనా గురువులు చెప్పిన విషయాలేవైనా ఉంటే, వాటిని వినాలని అనుకుంటున్నాను.

అప్పుడు జనకుడు అన్నాడు– 'శిలిన పుత్రుడైన జిత్వా అనునతడు నాతో వాక్కే (వాగ్దేవతయే– అగ్నియే) నిస్సందేహంగా బ్రహ్మము అని అన్నాడు.'

యాజ్ఞవల్క్యుడన్నాడు– శైలిని చెప్పింది నిజమే ! అతడు సరిగానే చెప్పాడు. తల్లి, తండ్రి, ఆచార్యుని ద్వారా సుశిక్షితుడైనవాడు తన శిష్యునికి ఉపదేశించే విధంగానే అతడు మీకు చెప్పాడు. నిస్సందేహంగా వాక్కు బ్రహ్మే ! ఎందుచేతనంటే, వాక్కులేని మూగవాని వల్ల ప్రజలకు ప్రయోజనం లేదు గదా ! అయితే, అతడు, ఆ వాక్కుకు ఆయతనాన్ని గురించి– ప్రతిష్ఠను గురించి కూడా చెప్పాడా ?

జనకుడు– 'ఆ విషయం నాకు చెప్పలేదు'.

యాజ్ఞవల్క్యుడు– 'అయితే, ఓ రాజా ! మీకు అతడు నాలుగో వంతు మాత్రమే ఉపదేశించాడు.

జనకుడు– 'ఓ యాజ్ఞవల్క్యా ! దయచేసి మీరు నాకు ఆ మిగిలి ఉన్న తత్త్వాన్ని గూర్చి తెలియచేయండి.'

**మం॥ యదేవ తేకశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేతి; అబ్రవీన్మ ఉదంకః శౌల్బ్యా యనః ప్రాణోవై బ్రహ్మేతిః యథా మాతృమాన్పితృమానాచార్య వాన్బ్రూయాత్, తథా తచ్ఛౌల్బ్యాయనో బ్రవీత్ప్రాణో వై బ్రహ్మేతి అప్రాణతో హి కిం స్యాదితి; అబ్రవీత్తు తే తస్యా యతనం ప్రతిష్ఠామ్ ? న మే బ్రవీతితి; ఏక పాద్వా ఏతత్సమ్రాడితి; స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య, ప్రాణ ఏవాయతనం, ఆకాశః ప్రతిష్ఠా, ప్రియమిత్యేన దుపాసీత; కా ప్రియతా యాజ్ఞవల్క్య? ప్రాణఏవ సమ్రాడితి హోవాచ, ప్రాణస్య వై సమ్రాట్ కామాయాయాజ్యం యాజయతి, అప్రతిగృహ్యస్య ప్రతిగృహ్ణాత్యపి, తత్రవధాశంకం భవతి యాం దిశ మేతి ప్రాణస్యైవ సమ్రాట్ కామాయ; ప్రాణోవై సమ్రాట్ పరమం బ్రహ్మ; నైనం ప్రాణో సమ్రాట్ కామాయ; ప్రాణోనై సమ్రాట్ పరమం బ్రహ్మ; నైనం ప్రాణో జహాతి, సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి, దేవో భూత్వా దేవానప్యేతి, యం ఏవం విద్వానేతదుపాస్తే, హస్త్యృషభం సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః, స హోవాచ యాజ్ఞవల్క్య, పితా మే మన్యత నా ననుశిష్య హరేతేతి. 3**

యాజ్ఞవల్క్యుడు– 'ఓరాజా ! ఇంకెవరైనా మీకు ఏమైనా చెప్పి ఉంటే వినాలని ఉంది చెప్పండి !

జనకుడు– "ఓ యాజ్ఞవల్క్యా ! శుల్బ ఋషికుమారుడైన ఉదంకుడు నాతో 'ప్రాణమే బ్రహ్మ' అని అన్నాడు." (ఇక్కడ ప్రాణము అంటే వాయువు).

యాజ్ఞవల్క్యుడు– 'శౌల్బ్యాయనుడు సరిగానే చెప్పాడు. తల్లి, తండ్రి గురువు ఈ ముగ్గురిచేత ఉపదేశింపబడినవాడు తన శిష్యునికి ఉపదేశించినట్లే సరిగానే చెప్పాడు. నిజంగా ప్రాణమే బ్రహ్మ. ఎందుచేతనంటే, ప్రాణంలేని వానివల్ల లోకానికి కలిగే మేలు ఏముంటుంది? అయితే ఉద్దాలకుడు ప్రాణరూపమైన బ్రహ్మకు ఆయతనాన్ని, ప్రతిష్ఠను కూడా చెప్పాడా? (ఆయతనం = నివాసం, శరీరం; ప్రతిష్ఠ= ఆధారం)

జనకుడు – 'లేదు'.

యాజ్ఞవల్క్యుడు– 'అయితే, ప్రాణబ్రహ్మను గూర్చి నీకు నాలుగోవంతు మాత్రమే చెప్పాడు.'

జనకుడు : 'దయచేసి మిగిలి ఉన్న తత్త్వాన్ని నాకు చెప్పండి. ప్రాణరూపమైన బ్రహ్మకు ఆయతనము, ప్రతిష్ఠ ఏవి?

యాజ్ఞవల్క్యుడు– ప్రాణమే దానిని ఆయతనం. ఆకాశమే ప్రతిష్ఠ, దానిని (ప్రాణబ్రహ్మను 'ప్రియ' రూపంలో ఉపాసించాలి. ఈ 'ప్రియమే' (ప్రేమాస్పదమైనది అనటమే) దాని నాల్గవ భాగం.

జనకుడు– 'ప్రియత్వము అంటే ఏమిటి?'

యాజ్ఞవల్క్యుడు– 'మహారాజా ! ప్రాణమే ప్రియత్వం. ఎందుచేతనంటే, ప్రాణం, కోసమే అధికారం లేనివారిచేత కూడా యజ్ఞం చేయిస్తున్నారు. ప్రతి గ్రహానికి (దానం తీసుకోవటానికి) అయోగ్యుడైన వాని వల్ల కూడా దానం తీసుకుంటున్నారు. ఏ దేశం పోయినా, అక్కడ దొంగలచేత వధింపబడతామేమో అని శంకిస్తున్నాడు. ఇదంతా ప్రాణం కోసమే గదా ! అందుచేత ఓ రాజా ! నిజంగా ప్రాణమే పరబ్రహ్మరూపం. ఈ విధంగా తెలుసుకొని ఉపాసన చేసేవానిని ప్రాణం వదలి పెట్టదు. అన్ని భూతాలు అతనిని అనుసరిస్తాయి. అతడు దేవతలలో కలుస్తాడు.'

జనకుడు– 'ఓ యాజ్ఞవల్క్యా! ఈ నీ ఉపదేశానికి బదులుగా ఏనుగులాంటి ఆంబోతుతో సహా వేయి ఆవుల్ని యిస్తాను.'

యాజ్ఞవల్క్యుడు– 'శిష్యుని పూర్తిగా కృతార్థుని చేస్తేనే తప్ప పూర్తిగా బోధిస్తే తప్ప. దక్షిణ తీసుకోరాదని మా నాయన గారి ఆదేశం.'

**మం॥ య దేవ తే కశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేతి; అబ్రవీన్మే బర్కు ర్వార్ష్ణ చక్షుర్వైబ్రహ్మేతి; యథా మాతృ మాన్పితృమానాచార్యవాన్ బ్రూయాత్, తథా తద్వార్ష్ణో బ్రవీచ్చక్షుర్వై బ్రహ్మేతి; అపశ్యతో హి కిం స్యాదితి, అబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం? న మే బ్రవీదితి; ఏక**

**పాద్వా ఏతత్సమ్రాడితి; స వై నో బ్రూహి యజ్ఞా వల్క్యః, చక్షురేవాయతనం, ఆకాశః ప్రతిష్ఠా, సత్యమిత్యేనదుపాసీత; కా సత్యతా యాజ్ఞవల్క్య? చక్షురేవ సమ్రాడితి హోవాచ, చక్షుషా వై సమ్రాట్ పశ్యంతమహుర ద్రాక్షీరితి, స ఆహాద్రాక్షమతి, తత్సత్యం భవతి; చక్షుర్వై సమ్రాట్ పరమం బ్రహ్మ; నైనం చక్షుర్జహాతి, సర్వా ణ్యేనం భూతాన్యభిక్షరన్తి, దేవో భూత్వా దేవాన ప్యేతి, య ఏవం విద్వానేతదుపాస్తే; హస్త్యృషభం సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః; స హోవాచ యాజ్ఞవల్క్యః, పితా మే మన్యత నాననుశిష్య హరేతేతి.** 4

యాజ్ఞవల్క్యుడు అన్నాడు– 'ఓ రాజా ! ఇంకెవరైనా ఆచార్యుడు మీకు ఏదైనా చెప్పి ఉంటే దానిని వినాలని ఉంది.'

జనకుడీ విధంగా అన్నాడు– 'యాజ్ఞవల్క్యుడా! వృష్ణ ఋషిపుత్రుడైన బర్కుడు నాతో 'నేత్రమే బ్రహ్మ' అన్నాడు.'

యాజ్ఞవల్క్యుడు– 'వృష్ణపుత్రుడు సరిగానే చెప్పాడు. తల్లి, తండ్రి, గురువు ద్వారా శిక్షణ పొందిన ఆచార్యుడే విధంగా చెప్పాలో అట్లాగే చెప్పాడు. నిజంగా నేత్రమే బ్రహ్మ. కండ్లు లేనివానివల్ల, చూడలేనివానివల్ల ప్రయోజన మేముంటుంది? అయితే ఆ నేత్రబ్రహ్మకు ఆయతనము ప్రతిష్ఠను గూర్చి కూడా తెలియజేశాడా?'

జనకుడు– 'లేదు. మీరే దయముంచి ఆ మిగిలిన ఆయతన ప్రతిష్ఠలను గురించి వివరించండి.'

యాజ్ఞవల్క్యుడంటున్నాడు– 'నేత్రమే ఆయతనం. ఆకాశం ప్రతిష్ఠ. దీనిని 'సత్య' రూపంలో (సత్యంగా భావించి) ఉపాసించాలి.

జనకుడు– 'సత్యత్వం అంటే ఏమిటి?

యాజ్ఞవల్క్యుడు– 'నేత్రమే సత్యత్వం. ఎందుచేతనంటే కళ్ళు ఉన్నవానిని 'నీవు ఏనుగును చూశావా? అని అడిగాము. అప్పుడతడు 'అవును చూచాను' అంటాడు. అప్పుడాతడు చెప్పినది (ఏనుగును చూచిన విషయం) సత్యం అవుతుంది. కాబట్టి నేత్రమే బ్రహ్మ. ఈ విషయం తెలుసుకొని నేత్రాన్ని సత్యరూపంలో అభేదాన్ని కల్పించుకొని ఉపాసించిన వానిని నేత్ర (నేత్ర బ్రహ్మ) వదలదు. ప్రాణులన్నీ ఆ ఉపాసకుని అనుసరిస్తాయి. అతడు దేవత అయి దేవతలను పొందుతాడు.'

జనకుడు– ఓ యాజ్ఞవల్క్యుడా ! మీరు చేసిన ఈ ఉపదేశానికి బదులుగా ఏనుగులాంటి వృషభంతో సహా వేయి ఆవులు దక్షిణగా ఇస్తాను.'

యజ్ఞావల్క్యుడు– 'ఓ రాజా ! నా తండ్రి సిద్ధాంతం ప్రకారం శిష్యుని పూర్తిగా కృతార్థుని చేస్తే తప్ప గురుదక్షిణ తీసికోకూడదు.'

**మం॥ యదేవ తే కశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేతి; అబ్రవీన్మే గర్దభీవిపీతో భారద్వాజః, శ్రోత్రం వై బ్రహ్మేతి; యథామాతృమాన్పితృమానాచార్య వాన్బ్రూయాత్, తథా తద్భార ద్వాజో బ్రవీచ్ఛ్రోత్రం వై బ్రహ్మేతి, అశృణ్వతో హి కిం స్యాదితి; అబ్రవీత్తు తే తస్యా యతనం ప్రతిష్ఠామ్ న మే బ్రవీదితి; ఏక పాద్వా ఏతత్సమ్రాడితి; స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య; శ్రోత్రమేవాయతనం, ఆకాశః ప్రతిష్ఠా, అనంత ఇత్యేన దుపాసీత; కాన న్తతా యాజ్ఞవల్క్య? దిశ ఏవ సమ్రాడితి హోవాచ, తస్మాద్వై సమ్రాడపి యాం కాం చ దిశం గచ్ఛతి నైవాస్యా అన్తం గచ్ఛతి, అనంతాహి దిశ; దిశో వై సమ్రాట్ శ్రోత్రం, శ్రోతం వై సమ్రాట్ పరమం బ్రహ్మ; నైనం శ్రోత్రం జహాతి, సర్వాణ్యేవం భూతాన్యభిక్షరన్తి, దేవో భూత్వా దేవానప్యేతి, య ఏవం విద్వానేత దుపాస్తే; హస్త్యృషభం సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః, స హోవాచ యాజ్ఞ వల్క్యః, పితా మే మన్యత నాననుశిష్య హరేతేతి 5**

యాజ్ఞవల్క్యుడీ విధంగా అన్నాడు– 'ఓ మహారాజా ! నీతో ఎవరైనా ఆచార్యుడు ఏదైనా చెప్పి ఉంటే ఆ విషయం వినాలని ఉంది.'

జనకుడు– 'ఓ యాజ్ఞావల్క్యా ! భరద్వాజ గోత్రంలో పుట్టిన గర్దభీ విపీతుడనే ఋషి 'శ్రోతమే బ్రహ్మ' అని నాతో అన్నాడు.'

యాజ్ఞవల్క్యుడు– అతడు సరిగానే చెప్పాడు. తల్లిదండ్రుల యొక్క గురువు యొక్క శిక్షణలో సుశిక్షితుడైనవాడు తన శిష్యునికి చెప్పే విధంగానే చెప్పాడు. నిజంగా శ్రోత్రమే బ్రహ్మ. ఎందుచేతనంటే, వినని వాడు– బధిరుడైన వాని వల్ల లోకానికి ఏమి మేలు జరుగుతుంది? కాని, నీకు ఆ శ్రోత్రానికి ఆయతానాన్ని గురించి, ప్రతిష్ఠను గురించి కూడా చెప్పాడా?

జనకుడు– లేదు.

యాజ్ఞవల్క్యుడు– అయితే శ్రోత్ర బ్రహ్మను గూర్చి నాల్గోవంతు మాత్రమే నీకు చెప్పాడు.

జనకుడు– 'మిగిలిన తత్వాన్ని మీరు నాకు ఉపదేశించండి.'

యాజ్ఞవల్క్యుడు– 'శ్రోత్రమే ఈ బ్రహ్మకు ఆయనతనం. ఆకాశమే దీనిని ప్రతిష్ఠ. ఈ శ్రోత్రబ్రహ్మను అనంతరూపంలో ఉపాసించాలి. ఎందుచేతనంటే అనంతత్వమే దీని నాల్గవ భాగం.'

జనకుడు– 'ఓ యాజ్ఞవల్క్యా ! అనంతత్వమంటే ఏమిటి?'

యాజ్ఞవల్క్యుడు– రాజా ! దిక్కులే అనంతమైనవి. ఎవడైనా ఏ దిక్కుకైనా ఎంత దూరం వెళ్ళినా దాని అంతు చూడలేడు– ఎందుచేత? దిక్కులు అనంతమైనవి కాబట్టి ! ఓ రాజా ! దిక్కులే శ్రోతాలు. శ్రోత్రమే పరబ్రహ్మ ! ఈ విధంగా భావించి ఉపాసన చేసినవానిని శ్రోత్రం ఎన్నడూ వదలిపెట్టదు. అన్ని భూతాలు కానుకలు తీసికొని అతనిని అనుసరిస్తాయి. అతడు దేవత అయి, దేవతలను అనుసరిస్తాడు.'

ఈ నిగూఢమైన విషయాన్ని విని జనకుడన్నాడు– 'ఓ యాజ్ఞవల్క్యా ! నీవు చేసిన ఈ ఉపదేశానికి బదులుగా నీకు ఏనుగులాంటి ఆబోతుతోసహా వేయి ఆవుల్ని దక్షిణగా యిస్తాను.'

యాజ్ఞవల్క్యుడు:– 'శిష్యుని పూర్తిగా కృతార్థుని చేస్తే తప్ప గురు దక్షిణ తీసుకొనరాదని నా తండ్రిగారి సిద్ధాంతం!!

**మం॥ యదేవ తే కశ్చిదబ్రవీత్త చ్ఛృణవామేతి; అబ్రవీన్మే సత్యకామో జాబాలః మనోవై బ్రహ్మేతి; యథా మాతృమాన్పితృమానాచార్యవాన్బ్రూయాత, తథా తజ్జాబాలో బ్రవీన్మనో వై బ్రహ్మేతి, అమనసో హి కిం స్యాదితి; అబ్రవీత్తు తే తస్యాయనతనం ప్రతిష్ఠాం? నమే బ్రవీదితి; ఏక పాద్వా ఏతత్సమ్రాడితి; స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య; మన ఏవాయతనం, ఆకాశః ప్రతిష్ఠా ఆనంద ఇత్యేవదుపాసీత; కానన్దతా యాజ్ఞవల్క్య? మన ఏవ సమ్రాడితి హోవాచ, మనసా వై సమ్రాట్ స్త్రి యమభిహార్య తే, తస్యాం ప్రతిరూపః పుత్రో జాయతే, స ఆనందః, మనో వై సమ్రాట్ పరమం బ్రహ్మ; నైనం మనో జహాతి, సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి, దేవో భూత్వా దేవాన ప్యేతి, య ఏవం విద్వానేతదుపాస్తే; హస్త్యృషభం సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః, స హోవాచ యాజ్ఞవల్క్యః; పితా మే మన్యత నామశిష్య హరేతేతి. 6**

**మం॥ య దేవ తే కశ్చిదబ్రవీత్తచ్ఛృణవాహేతి; అబ్రవీన్మే విదగ్ధః శాకల్యః హృదయం వై బ్రహ్మేతి; యథా మాతృమాన్పితృమానాచార్య వాన్బ్రూయాత్, తథా తచ్ఛాకల్యో బ్రవీద్ధృదంయం వై బ్రహ్మేతి, అహృద యస్య హి కిం స్యాదితి; అబ్రవీత్త తే తస్యాయతనం ప్రతిష్ఠాం ? న మే బ్రవీదితి; ఏకపాద్వా ఏతత్సమ్రా డితి? స వైనో బ్రూహి యాజ్ఞవల్క్య; హృదయమే వాయతనం, ఆకాశః ప్రతిష్ఠా, స్థితి రిత్యేనదుపాసీత; కా స్థితతా యాజ్ఞవల్క్య ? హృదయమేవ సమ్రాడితి హోవాచ, హృదయం వై సమ్రాట్ సర్వేషాం భూతానామాయతనం, హృదయం వై సమ్రాట్ సర్వే షాం భూతానాం ప్రతిష్ఠా హృదయే హ్యేవ సమ్రాట్ సర్వాణి భూతాని ప్రతిష్ఠితాని భవన్తి; హృదయం వై సమ్రాట్ పరమం బ్రహ్మ; ననైనం హృదయం జహాతి, సర్వాణ్యేనం భూతాన్యభిక్షరన్తి, దేవో భూత్వా దేవానప్యేతి, య ఏవం**

**విద్వానేదుపాస్తే; హస్త్యృషభం సహస్రం దదామీతి; హోవాచ జనకో వైదేహః, స హోవాచ యాజ్ఞవల్క్యః, పితా మే మన్యత వాననుశిష్య హరేతేతి.** **7**

యాజ్ఞవల్క్యుడు– 'ఓ సార్వభౌమా ! నీ కింకెవరైనా ఏమైనా చెప్పి వుంటే వినాలని ఉంది, చెప్పు?'

జనకుడు– 'ఓయాజ్ఞవల్క్యా! శకలపుత్రుడు (శాకల్యుడు) విదగ్ధుడనే ఆయన 'హృదయమే బ్రహ్మ' అని ఆయన చెప్పాడు.

యాజ్ఞవల్క్యుడు– 'శాకల్యుడు చెప్పింది నిజమే! తల్లిదండ్రుల చేత గురువుచేత సుశిక్షితుడైనవాడు తన శిష్యునికి చెప్పినట్లే చెప్పాడు. నిస్సందేహంగా హృదయమే బ్రహ్మ. హృదయం లేనివానివల్ల ప్రయోజనమేముంటుంది? అయితే ఆ బ్రహ్మకు ఆయతనం, ప్రతిష్ఠలగూర్చి కూడా చెప్పాడా?

జనకుడు– 'లేదు'

యాజ్ఞవల్క్యుడు– అయితే బ్రహ్మను గూర్చి నాల్గోవంతు మాత్రమే చెప్పాడు.

జనకుడు– 'మిగిలిన విషయాలను మీరు చెప్పండి.'

యాజ్ఞవల్క్యుడు– 'ఆబ్రహ్మకు హృదయమే ఆయతనం, ఆకాశమే ప్రతిష్ఠ, హృదయ బ్రహ్మోపాసన 'స్థితి' రూపంలో చేయాలి.

జనకుడు– 'స్థితి అంటే ఏమిటి?'

యాజ్ఞవల్క్యుడు– 'ఓ సార్వభౌముడా? హృదయమే స్థితి. హృదయమే సమస్త భూతాలకు ఆయతనం. హృదయమే అన్నిటికి ఆశ్రయం. సమస్త భూతాలు హృదయంలో ఉన్నాయి కాబట్టి. ఆ విధంగా ఉండటమే స్థితి– స్థిరత్వం. హృదయమే పరబ్రహ్మ. ఈ విధంగా భావించి హృదయ బ్రహ్మను ఉపాసించేవానిని ఆ హృదయబ్రహ్మ ఎన్నడూ వదలిపెట్టడు. (హృదయాధిదేవత ప్రజాపతి ఏక హిరణ్యగర్భుడు) సమస్త ప్రాణులు అతని వద్దకే వెడతాయి అతడు (ఉపాసకుడు) దేవత అయి దేవతలనే పొందుతాడు.'

జనకుడు– 'ఓ యాజ్ఞవల్క్యా! నీవు చేసిన ఉపదేశానికి ఏనుగు వంటి ఆంబోతుతో సహా వేయి ఆవుల్ని దక్షిణగా యిస్తాను.'

యాజ్ఞవల్క్యుడు– శిష్యునికి పూర్తిగా బోధిస్తేనే తప్ప గురు దక్షిణ స్వీకరింపరాదని మా తండ్రి గారి ఆదేశం.'

సారాంశము :

| చెప్పిన ఋషి : | బ్రహ్మ స్వరూపం: | ఆయతనం (నివాసం లేక శరీరం) | ప్రతిష్ఠ (ఆధారం) | ఉపాసనా రూపం |
|---|---|---|---|---|
| జిత్వా | వాక్ | వాక్కు | ఆకాశం | ప్రజ్ఞత |
| ఉదంకుడు | ప్రాణం | ప్రాణం | ఆకాశం | ప్రియత్వం |
| బర్కుడు | నేత్రం | నేత్రం | ఆకాశం | సత్యత్వం |
| గర్దభీవిపీతుడు | శ్రోత్రం | శ్రోత్రం | ఆకాశం | అనంతత్వం |
| సత్యకాముడు | మనస్సు | మనస్సు | ఆకాశం | ఆనందం |
| శాకల్యుడు | హృదయం | హృదయం | ఆకాశం | స్థితి |

## రెండవ బ్రాహ్మణం

**మం॥జనకో హ వైదేహః కూర్చాదుపావసర్పన్ను వాచ, నమస్తే స్తు యాజ్ఞవల్క్య, అను మా శాధీతి; స హోవాచ, యథా వై సమ్రాణ్మహాన్త మధ్వాన మేష్యన్ రథం వా నావం వా సమాదదీత, ఏవమేవై తాభిరుపనిషద్భిః సమాహితాత్మాసి; ఏవం వృన్దారక ఆఢ్యః సన్నధీత వేద ఉక్తోపనిషత్క ఇతో విముచ్య మానః క్వ గమిష్యసీతి; నాహం తద్భగవన్వేద యత్ర గమిష్యామీతి; అథ వై తేహం తద్వక్ష్యామి యత్ర గమిష్యసీతి; బ్రవీతు భగవానితి.** **1**

విదేహాధిపతియైన జనకుడు రాజసింహాసనం నుండి లేచి యాజ్ఞవల్క్యుని సమీపించి అన్నాడు:– 'ఓ యాజ్ఞవల్క్యా! నమస్కారములు మీరు నాకు ఉపదేశం చేయండి' అని.

తాను జ్ఞానిననే అభిమానాన్ని వదలి శిష్యభావంతో వచ్చి, వినయంగా అడిగిన జనకునితో యాజ్ఞవల్క్యుడీ విధంగా అన్నాడు:– 'ఓ రాజా ! చాలా దూరం ఒక మార్గంలో వెళ్ళాల్సినవాడు నేలమీద అయితే రథాన్ని, నీళ్ళమీద అయితే నావను ఆశ్రయించాలి గదా ! నేను నీకు వెనుక చెప్పిన ఉపాసన వల్ల సమాహితచిత్తుడవైనావు. దానికి తోడు. నీవు పూజనీయుడువు. ధనవంతుడువు. వేదాలు, ఉపనిషత్తులు చదివిన వాడవు. ఉపాసనాపరుడవు. ఇవన్నీ ఉన్నప్పటికి– ఇన్ని విధాల సాధన సంపత్తులతో కూడి ఉన్నప్పటికి, నీవు ఈ దేహాన్ని విడిచిపెట్టిన తరువాత ఎచటికి పోతావో చెప్పు!'

జనకుడు:– 'ఓ మహాత్మా ! నాకు తెలియదు. ఎచటికి పోతానో చెప్పలేను.'

యాజ్ఞవల్క్యుడు : నీవు ఎక్కడికి పోతావో ఆ తత్వాన్ని గూర్చి నీకు చెపుతాను.

జనకుడు : మహాత్మా ? నా పై కరుణించి, నాయెడ ప్రసన్నుడవై నాకా విషయం తప్పకుండా చెప్పండి.

**మం॥ఇన్ధో హ వై నామైష యో యం దక్షిణే క్ష న్పురుషః, తం వా ఏతమిన్ధం సంతమింద్ర ఇత్యాచ క్షతే పరోక్షేణైవ; పరోక్షప్రియా ఇవ హి దేవా; ప్రత్యక్షద్విషః. 2**

యాజ్ఞవల్క్యుడీ విధంగా చెపుతున్నాడు– 'ఈ దక్షిణ నేత్రంలో (కుడికంటిలో ఉండే పురుషునికి 'ఇన్ధు' దని పేరు. ఈ ఇంధుడనే పేరు గల సత్యపురుషుని 'ఇంద్రు' డనే పరోక్ష నామంతో పిలుస్తారు. ఎందుచేతనంటే, దేవతలు సామాన్యంగా పరోక్షప్రియులై ఉంటారు– ప్రత్యక్షంగా పిలవబడటం, కనిపించటం వారికి ఇష్టం ఉండదు. ఈ విధంగా నీవు వైశ్వానరాత్మను పొందావు. (వైశ్వానరుడు ఈ స్థూలశరీరాభిమాని.)

**మం ॥అథేతద్వామే క్షణి పురుషరూపమేషాన్య పత్నీ విరాట్; తయో రేష సంస్తావో య ఏషో న్తర్హృదయ ఆకాశః; అథైన యోరేతదన్నం య ఏషోన్తర్హృదయే లోహితపిండః; అథైవయో రేతత్ర్పావరణం యదేత దన్తర్హృదయే జాలకమివ; అథైన యో రేషా సృతి; సంచరణీ యైషా హృదయాదూర్ధ్వా నాడ్యుచ్చరతి; యథా కేశః సహస్రధా భిన్న ఏవం; అస్యైతా హితా నామ నాడ్యో న్తర్హృదయే ప్రతిష్ఠితా భవన్తి, ఏతాభి ర్వా ఏతదాస్రవ దాస్రవతి; తస్మా దేష ప్రవివిక్తాహారతర ఇవైవ భవత్యస్మాచ్ఛారీరా దాత్మనః. 3**

యాజ్ఞవల్క్యుడంటున్నాడు– 'ఈ ఎడమకంటిలోనున్న పురుషుడు వెనుక చెప్పిన దక్షిణ నేత్రంలోని పురుషునికి భార్య– పేరు విరాట్. హృదయం లోపల ఉన్న ఆకాశమే (ఖాళీ ప్రదేశం) ఈ భార్యభర్తలిద్దరు కలుసుకొనే చోటు. హృదయంలో ఉండే ఎఱ్ఱని మాంసపు ముద్దయే వీరిద్దరికి అన్నం– ఆహారం. ఈ హృదయం మీద కప్పబడి ఉండే వలలాంటి సన్నని పొరయే ఆచ్ఛాదనం– కప్పుకొనే వస్త్రం ఈ హృదయం నుండి పైకి వ్యాపించి ఉండే నాడియే వీరిద్దరు (ఇంద్రుడు– ఇంద్రాణి) నడిచే మార్గం. వేలకొలదిగా విభజింపబడి ఉండే అత్యంత సూక్ష్మమైనవి, కేశాలలాగా ఉండే 'హితా' అనే పేరుగల నాడులు ఈ హృదయ ప్రదేశంలో ఉన్నాయి. ఈ నాడుల ద్వారానే అన్నం సూక్ష్మమైన రసరూపంలో శరీరమంతటా వ్యాపిస్తుంది. అందుచేతనే ఈ స్థూల శరీరాభియానియైన వైశ్వానరాత్మకంటె తై జసాత్మ సూక్ష్మమైన ఆహారం గ్రహించేదిగా ఉంటుంది.

(మనం తిన్న ఆహారం రెండు విధాలుగా జీర్ణమై స్థూలాంశం బయటకు విసర్జింప బడుతోంది. సూక్ష్మాంశం రస రూపంలో– రక్తాదుల రూపంలో పాంచ భౌతిక శరీరానికి చేరుతోంది. ఈ సూక్ష్మభాగం నుండి అత్యంత సూక్ష్మతరమైన రసం సూక్ష్మమైన నాడులద్వారా హృదయంలో ఉండే లోహితపిండంగా మారుతోంది. ఇదే లింగశరీరాభి మానియైన ఇంద్రుని ఆహారం– ఈ

ఆహారం హితా అనే నాడులద్వారా ఇంద్ర ఇంద్రాణులకు ఆహారంగా అందుతోంది. లింగశరీరాభిమానియైన ఇంద్రుడే తైజసుడు.)

వైశ్వానరాత్మకంటె తైజసాత్మ మిక్కిలి సూక్ష్మమైన ఆహారాన్ని గ్రహించేదిగా ఉంటుంది. ఆత్మ జాగ్రదవస్థలో వైశ్వానరుడుగా, స్వప్నావస్థలో తైజసుడుగా ఉంటుంది.

**మం॥ తస్య ప్రాచీ దిక్ ప్రాఞ్చః ప్రాణాః, దక్షిణా దిగ్దక్షిణే ప్రాణః, ప్రతీచీ దిక్ ప్రత్యఞ్చః ప్రాణాః , ఉదీచీ దిగు ద0ఞ్చః ప్రాణాః ఊర్ధ్వా దిగూర్ధ్వాః ప్రాణాః, అవాచీ దిగవాఞ్చః ప్రాణాః, సర్వా దిశః సర్వే ప్రాణాః స ఏష నేతి నేత్యాత్మా; అగృహ్యో నహి గృహ్యతే, ఆశీర్యో నహి శీర్యతే, అసంగో నహి సజ్యతే, అసితో న వ్యథతే న ఋష్యతి; అభయం వై జనక ప్రాప్తో సీతి హోవాచ యాజ్ఞవల్క్యః, స హోవాచ జనకో వైదేహః, అభయం త్వాగచ్ఛతాద్యాజ్ఞవల్క్య యో నో భగవన్నభయం వేదయసే; నమసే స్తు ఇమే విదేహాః, అయమహమస్మి. 4**

ఈ విశ్వానికి అభిన్నమైన వైశ్వానర రూపం నుండి, సూత్రాభిన్నమైన తైజసరూపాన్ని- తద్వారా హృదయాత్మను, దాని నుండి ప్రాణాత్మను పొందిన (ప్రాజ్ఞునికి) విద్వాంసునికి, ఋషికి తూర్పు దిక్కుననుండే ప్రాణం పూర్వప్రాణం. దక్షిణదిక్కున నుండే ప్రాణం దక్షిణప్రాణం. అట్లాగే పశ్చిమ దిశ పశ్చిమ ప్రాణం.

ఉత్తరదిశ ఉత్తరప్రాణం. ఊర్ధ్వ దిశ ఊర్ధ్వప్రాణం. అదోధిశ నిమ్నప్రాణం. సమస్త దిక్కులు. దేవతలు సమస్తప్రాణాలు ! ఆ ఈ 'నేతి నేతి' 'ఇదికాదు. ఇదికాదు' అనే ఉపనిషత్తులలోని మహావాక్యం ద్వారా నిర్ధారింపబడిన ఆత్మభావాన్ని- తురీయాత్మభావాన్ని పొందుతాడు. ఎందుచేతంటే ఆ ఆత్మ అగ్రహ్యామైనంది- గ్రహించటానికి వీలుకానిది. ఆశర్యీం- నాశనంకానిది. అసంగము- దేనితోను సంపర్కంలేనిది. బంధనరహితమైనది. అది పీడింపబడదు.- హింసింపబడదు.'

యాజ్ఞవల్క్యుడింకా యిలా అన్నాడు- 'ఓ జనకుడా ! నిజంగా నీవు అభయపదాన్ని (భయం లేని స్థితిని) పొందావు.'

అప్పుడు జనకుడిలా అన్నాడు- 'ఓ మహాత్మా ! మీరు నాకు అభయ స్థితిని భోధించారు. అటువంటి ఈ సద్గురుదేవునికి కూడా అభయస్థితి ప్రాప్తించుగాక ! (ఇటువంటి ఉపదేశానికి మూల్యం లేదుగదా !) అందుచేత మీకు నమస్కారములు. ఈ విదేహరాజ్యం, నేనూ కూడా మీ అధీనంలో ఉన్నాము. దయయుంచి మీ యిష్టం వచ్చినట్లు నన్ను, నాదేశాన్ని ఉపయోగించండి- ఈ రెంటికి తగిన ఉపదేశ మివ్వండి' అని.

## మూడవ బ్రాహ్మణం

సూక్ష్మ ఆహారాన్ని గ్రహించే 'ఇంధ' అనే పేరుగల వైశ్వానరాత్మను, అంతకంటె సూక్ష్మమైన ఆహారాన్ని తీసుకొనే హృదయస్థుడైన లింగాత్మను (తైజసుని) అంతకంటె సూక్ష్మమైన ఆహారాన్ని గ్రహించే ప్రాణమే ఉపాధిగా గల విశ్వాత్మను –ప్రాజ్ఞుని– గురించి తెలుసుకున్నాము. 'నేతి నేతి' అనే వాక్యంద్వారా సర్వాంతర బ్రహ్మను, చెప్పారు; అంటే, తురీయాన్ని చెప్పారు. అట్లాగే జాగ్రత్, స్వప్న, సుషుప్తులను తురీయాన్ని వ్యాఖ్యానించారు. ఇదంతా శ్రుతి ప్రమాణంగా వివరించాడు. ఇక, ఇప్పుడు, జాగ్రత్త, స్వప్నాలద్వారానే, తర్కం ద్వారా ఆ తురీయాన్ని నిశ్చయించి అభయప్రాప్తి కలిగించటం కోసం తరువాతి గ్రంథం ఆరంభిస్తున్నారు.

**మం॥ జనకం హ వైదేహం యాజ్ఞవల్క్యోజాగామ; స మే న వదిష్య ఇతి; అథ హ యజ్జనకశ్చ వై దేహో యాజ్ఞవల్క్యశ్చాగ్నిహోత్రే సముదాతే, తస్మై హ యాజ్ఞవల్క్యో వరం దదౌ; సహ కామప్రశ్న మేవ వవ్రే; తం హాస్మై దదౌ; తం హ సమ్రాడేవ పూర్వం పప్రచ్ఛ. 1**

**జనకుడు మళ్ళీ ఈ విధంగా అడిగాడుః 'ఓ యాజ్ఞవల్క్యా ! సూర్య చంద్రులు అస్తమించి, అగ్నికూడా**

**మం॥ యాజ్ఞావల్క్య కింజ్యోతిరియం పురుష ఇతి. ఆదిత్య జ్యోతిః సమ్రాడితి హోవాచ, ఆదిత్యేనైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేయేతి; ఏవమేవైతద్యాజ్ఞ వల్క్య. 2**

జనకుడు– అడుగుతున్నాడు. ఓ యాజ్ఞవల్క్యా ! మానవునికి జ్యోతిలాగా ఉపయోగించేది ఏది? (నిత్యకృత్యంలో దీపంలాగా మానవుడికి ఉపయోగపడేది ఏది? అని.)

యాజ్ఞవల్క్యుడు : 'ఓ రాజా .! సూర్యుడే జ్యోతి. ఎందుచేతనంటే, సూర్యకాంతి సహాయంతోనే అతడు కూర్చుంటున్నాడు. అన్ని వైపులకు వెడుతున్నాడు. అన్ని పనులు చేస్తున్నాడు. చేయవలసిన పనులన్నీ చేసి యథాస్థానానికి వస్తున్నాడు.'

జనకుడు – 'అవును ! ఇది నిజమే !'

**మం॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య కింజ్యోతిరేవాయం పురుష ఇతి; చంద్రమా ఏవాస్య జ్యోతిర్భవతీతి, చంద్రమసైనాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీతి; ఏవమేవైతద్యాజ్ఞవల్క్య. 3**

జనకుడు– మళ్ళీ అడుగుతున్నాడు. 'ఓ యాజ్ఞవల్క్యా ! సూర్యుడు అస్తమించినపుడు పురుషునికీ జ్యోతి ఏది? అంటే ఏ జ్యోతి సహాయంతో వెనుక చెప్పిన పనులన్నీ చేస్తాడు?'

యాజ్ఞవల్క్యుడు– ఓ మహారాజు ! సూర్యుడు అస్తమించిన తరువాత పురుషునికి చంద్రుడే జ్యోతి (దీపం.) అతని కాంతితోనే అతడు కూర్చుంటాడు. బయటకువెళ్ళ గలుగుతాడు. పనులచేసి మళ్ళీ తన పూర్వపుచోటుకు తాను తిరిగివస్తాడు.'

జనకుడు– 'యాజ్ఞవల్క్యా! మీరు చెప్పింది నిజమే!'

**మం॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య, చంద్రమస్యస్తమితే, కింజ్యోతి రేవాయం పురుష ఇతి; అగ్ని రేవాస్య జ్యోతి ర్భవతీతి, అగ్నినైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మకురుతే విపత్యేతీతి, ఏవమేవైద్యాజ్ఞవల్క్య. 4**

జనకుడు– 'యాజ్ఞవల్క్యా ! సూర్యచంద్రు లిద్దరూ అస్తమించినపుడు పురుషునికి జ్యోతి ఏది?'

యాజ్ఞవల్క్యుడు– 'ఓ రాజా ! సూర్యచంద్రులిందరువురూ ఆసంగతులైనప్పుడు పురుషునికి అగ్నియే జ్యోతిగా కలవాడౌతాడు. ఆ అగ్ని అనే దీపంతోనే వెనుక చెప్పిన పనులన్నీ చేస్తాడు. ఆ కర్మలన్నీ చేసి నియమిత స్థానానికి వస్తున్నాడు.'

జనకుడు:– 'అవును, నిజమే!'

**మం॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య, చంద్రమస్యస్తమితే, శాంతే గ్నౌ కింజ్యోతి రేవాయం పురుష ఇతి; వాగే వాస్య జ్యోతిర్భవతీతి, వాచైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మకురేతే విపల్యేతేతీతి; తస్మాద్వై సమ్రాడపి యత్ర స్వః పాణిర్న వినిర్జ్ఞాయతే, అథ యత్ర వాగుచ్చరతి, ఉపైవ తత్ర న్యేతీతి; ఏవమేవైత ద్యాజ్ఞవల్క్య. 5**

జనకుడు మళ్ళీ ఈ విధంగా అడిగాడు : 'ఓ యాజ్ఞవల్క్యా ! సూర్య చంద్రులు అస్తమించి, అగ్నికూడా శాంతించినపుడు (ఆరిపోయినప్పుడు) పురుషునికి జ్యోతిలాగా ఉపయోగపడేది ఏది?'

యాజ్ఞవల్క్యుడు :'ఓ రాజా ! అటువంటి సమయంలో (సూర్య చంద్రాగ్నులు అస్తమించినవుడు) పురుషునికి వాక్కే జోతిలాగా ఉపయోగపడుతుంది. వర్షాకాలంలో రాత్రివేళ నిబిడాంధకారంలో, తన చెయ్యి కూడా తనకు కనిపించనంతటి కటిక చీకటిలో పురుషుడు శబ్దాన్నిబట్టి ఆ దిక్కుకు వెడతాడు. అచట చేయాల్సిన పనులు చేసి తిరిగివస్తాడు. కాబట్టి ఓ రాజా ! సూర్యచంద్రాగ్నులు మూడూ లేనప్పుడు పురుషునికి వాక్కే జ్యోతిలాగా ఉపయోగపడుతుంది.'

జనకుడు:– అవును ! నిజమే !'

**మం॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య, చంద్రమస్యస్తమితే, శాన్తే గ్నౌ, శాన్తాయం వాచి కిం జ్యోతిరేవాయం పురుషష ఇతి; ఆత్మైవాస్య జ్యోతిర్భవతీతి, ఆత్మవై వాయం జ్యోతిషాస్తే కర్మ కురుతే విసత్యేతీతి** **6**

జనకుడు అడుగుతున్నాడు:– 'ఓ యాజ్ఞవల్క్యా ! సూర్యచంద్రాగ్నులు అస్తమించి. వాక్కు ఆగిపోయినపుడు మానవునికి జ్యోతిలాగా ఉపయోగించేది ఏది?

యాజ్ఞవల్క్యుడు : 'రాజా ! సూర్యచంద్రాగ్నులు ఉపశమింపగా, వాక్కు నిలిచిపోగా పురుషునికి ఆత్మయే జ్యోతిలాగా ఉపయోగపడుతుంది. ఆ ఆత్మ జ్యోతి సహాయంతోనే పురుషుడు అన్ని వైపులకు వెడతాడు. పనులు చేస్తాడు. చేయవలసిన పనులు చేసి తిరిగి తన నియమిత స్థానానికి వస్తాడు.'

జనకుడు : 'అవును ! నిజమే!'

**మం॥ కతతమ ఆత్మేతి; యో యం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః, స సమానః సన్నభౌ లోకా వనుసంచరతి, ధ్యాయతీవ లేలాయతీవ; సహి స్వప్నో భూత్వేమం లోకమతిక్రామతి మృత్యో రూపాణి** **7**

జనకుడు అడుగుతున్నాడు:– 'ఆత్మ అంటే ఏది? మీరు చెప్పిన శరీరం, ఇంద్రియాలు, మనస్సు, ప్రాణాలు వీటిలో ఆత్మ ఏది? ఆ జ్యోతి ఏది?'

యాజ్ఞవల్క్యుడంటున్నాడు– ప్రాణుల్లో, బుద్ధి వృత్తులలో ఉండే విజ్ఞాన జ్యోతి స్వరూపమైన పురుషుడే ఆత్మ! ఇంద్రియాలమధ్య, స్వయం ప్రకాశమైనట్టి, హృదయంలో ఉండే పురుషుడే ఆత్మ. ఆది బుద్ధివృత్తిలాగా చింతన చేస్తూనే ఈ లోకంలోను, పరలోకంలోను సంచరిస్తుంది. ప్రాణవృత్తిలాగా ఉంటూ చేష్టలు (కదులుతూన్నట్లు) సాగిస్తూ కనిపిస్తుంది. స్వప్నంలాగా ఉంటూ ఈ దేహేంద్రియ సంఘాతరూపమైన మృత్యువును (అజ్ఞానాన్ని) కూడి దాటిపోతుంది. ఈ విషయాలనే దిగువ మంత్రాలలో విపులీకరిస్తున్నారు–

**మం॥ స వా అయంపురుషో జాయమానః– శరీరమభి సంపద్యమానః పాప్మభిః సంసృజ్యతే; స ఉత్క్రామన్ –మ్రియమాణః– పాప్మనో విజహాతి.** **8**

ఈ ఆత్మయే (వ్యక్తిగతాత్మ) జన్మ ఎత్తేటప్పుడు శరీరంలో ఆత్మ భావాన్ని పొంది దేహేంద్రియ రూపమైన పాపంతో కలుస్తుంది. చనిపోయేటప్పుడు ఆ పాపాన్ని వదలిపెడుతుంది.

**మం॥ తస్య వా ఏతస్య పురుషస్య ద్వే ఏవ స్థానే భవతః ఇదం చ పరలోకస్థానం చ; సంధ్యాం తృతయం స్వప్నస్థానం, తస్మిన్మధ్యే స్థానం తిష్ఠన్నేతే ఉభే స్థానే పశ్యతి– ఇదం చ**

**పరలోకస్థానం చ. అథ యథా క్రమో యం పరలోకస్థానే భవతి తమాక్రమ మాక్రమ్యోభయాన్పాప్మన ఆనందాంశ్చ పశ్యతి; స యత్ర ప్రస్వపితి, అస్య లోకస్య పర్వావతో మాత్రా మపాదాయ స్వయం విహత్య, స్వయం విహత్య, స్వయం నిర్మాయ, స్వేన జ్యోతిషా ప్రస్వపితి; అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి. 9**

ఈ ఆత్మపురుషునికి, ఈ లోకము, పరలోకము అని రెండు స్థానాలున్నాయి. ఈ రెంటికి మధ్యచోటుగా స్వప్నజగత్తు అనేది ఉంది. ఇది మూడవస్థానం. ఈ లోకం (జాగ్రత్త) పరలోకం (సుషుప్తి) ఈ రెంటి మధ్య స్వప్నావస్థ ఈ సంధి స్థానమైన స్వప్నంలో ఉంటూ ఈ లోకాన్ని, పరలోకాన్ని కూడా చూస్తాడు. పరలోక స్థానానికి ఏఏ సాధనాలు అవసరమో ఆయా సాధనాలను ఆశ్రయించి, పాప ఫలరూపమైన దుఃఖాన్ని, పుణ్య ఫలరూపమైన సుఖాన్ని రెంటినీ చూస్తాడు. ఈ ఆత్మ పురుషుడు నిద్రించేటప్పుడు (స్వప్నంలో) ఈ సమస్తలోకాల్లోని తన పూర్వానుభవాలను తీసికొని, ఈ స్థూలశరీరాన్ని చేతనా శూన్యంచేసి, స్వయంగా వాసనామయమైన స్వప్న శరీరాన్ని రచించుకొని తన ఆత్మజ్యోతి రూపమైన ప్రకాశంతో స్వప్నం చూస్తాడు. ఈ స్థితిలో అతడు స్వప్నద్రష్టయైన పురుషుడుగా ఉంటాడు. ఈ స్వప్నద్రష్టయైన పురుషుని తైజసుడు అని అంటారు.

**మం॥ న తత్ర రథాన రథయోగా న పన్థానో భవన్తి, అథ రథాన్ రథయోగాన్పథః సృజతే; న తత్రానన్దా ముదః ప్రముదో భవన్తి, అథానన్దాన్ ముదః ప్రముదః సృజతే; న తత్రత వేశాన్తాః పుష్కరిణ్యః స్రవన్త్యో భవన్తి, అథవేశాన్తాన్ పుష్కరిణీ స్రవన్తీః సృజతే; సహికర్తా 10**

ఆ స్వప్నావస్థలో రథాలు మొదలైన విషయాలు ఉండవు. రథానికి కట్టే గుఱ్ఱాలు ఉండవు. రథం నడవటానికి మార్గాలూ వుండవు. ఆ రథాలను, వాటికి కట్టే గుఱ్ఱాలను, అవి నడిచే మార్గాలను పూర్వ వాసనల ద్వారా తానే (ఆ స్వప్న పురుషుడే) సృష్టించుకుంటాడు. ఆ సమయంలో ఆనందం, మోదం ప్రమోదం మొదలైన వృత్తులు కూడా ఉండవు. వాటిని కూడా (ఆనందం, ప్రమోదాది వృత్తుల్ని) అతడే కల్పించుకుంటాడు. ఆ స్వప్నస్థితిలో జలాశయాలు, తటాకాలు, నదులు ఇవన్నీ ఉండవు. కాని వీటినన్నింటిని ఆ పురుషుడే (స్వప్న పురుషుడు) సృష్టించుకుంటాడు. అందుచేతనే వీటి అన్నింటికి కర్తయైన వాడిని 'స్వప్నద్రష్టయైన పురుషుడు' అని అంటారు.

(మనము కోరుకున్నది లభించినప్పుడు కలిగే సంతోషం 'మోదము' ఈ 'మోదమే' అధికంగా కలిగితే 'ప్రమోదము'. ఈ ప్రమోదము కంటె ఎక్కువైన సంతోషం 'ఆనందం')

**మం॥ తదేతే శ్లోకా భవన్తి స్వప్నేన శారీర మభిప్రహత్యా- సుప్తః సుప్తానభిచాకశీతి. శుక్రమాదాయ పునరైతి స్థానం హిరణ్మయః పురుష ఏక హంసః. 11**

ఈ విషయానికి సంబంధించినవే ఈ మం త్రాలు–

స్వప్నావస్థలో ఈ ఆత్మ, స్వప్నంద్వారా ఈ దేహాన్ని చేష్టలు లేని దానినిగా (కదలికలు లేనిదానినిగా) చేసి, తాను (స్వప్న ద్రష్ట) నిద్రపోకుండా, నిద్రపోయే వాటి నన్నింటిని (వ్యవహార దృష్టితో నిద్రపోతున్న శరీరము ఇంద్రియాలన్నింటి ని) అన్నివైపులనుండి ప్రకాశింప జేస్తుంది– చూస్తుంది. మళ్ళీ పూర్తిగా ఇంద్రియ సహితమైన రూపాన్ని ధరించి జాగ్రదవస్థలోనికి వస్తుంది. కాబట్టి, ఈ స్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మ రెండు అవస్థలలోను– ఇహలోక పరలోకాలలో ఒంటరిగానే వెదుతూ వస్తూ ఉంటుంది.

**మం॥ ప్రాణేన రక్షన్నవరం కులాయం బమిష్కులాయాదమృతశ్చరిత్వా. స ఈయతే మృతో యత్ర కామం హిరణ్మయః పురుష ఏక హంసః 12**

ఈ నికృష్ణమైన శరీరాన్ని రక్షించే భారం ప్రాణానికి ఒప్పగించి (స్వప్నావస్థలో ప్రాణం ఈ శరీరాన్ని కాపాడుతూ ఉంటుంది. లేకపోతే మరణమేగదా!) ఈ అవినాశియైన ఆత్మ, శరీరానికి బయట యిష్టం వచ్చినట్లుగా విహరిస్తుంది. ఆ హిరణ్మయుడు, అమరుడు అయిన ఆ పురుషుడు అట్లా ఒంటరిగా ఎక్కడికి పోవాలని అనుకుంటే అక్కడికి పోయి విహరిస్తాడు. ఏ విసయాలమీద వాసన (కోరిక) ఉంటే ఆ విషయాలమీదకు పోయి విహరిస్తాడు. శరీరంలో ఉంటూ స్వప్నం చూస్తూన్నా శరీరంతో అతనికి సంబంధం ఉండదు.

**మం॥ స్వప్నాంత ఉచ్చావచమీయమానో రూపాణి దేవః కురుతే బహూని ఉతేవ స్త్రీభిః సహ మోదమానో జక్షదుతేవాపి భయాని పశ్యన్. 13**

స్వప్నావస్థలో ఈ ఆత్మపురుషుడు ఉచ్చ, నీచ భావాలను పొందుతూ అనేకమైన వాసనలతో కూడిన రూపాలను కల్పించుకుంటాడు. ఆ రూపాలతో స్త్రీలతో కలసి సంతోషిస్తాడు. మిత్రులతో కలసి నవ్వుతాడు. పెద్ద పులులు మొదలైన క్రూరమృగాలను చూచి భయపడతాడు. ఈ విధమైన అనుభవాలతో కూడినవాడై స్వప్నావస్థలో చరిస్తాడు.

**మం॥ ఆరామ మస్య పశ్యన్తి, న తం పశ్యతి కశ్చన, ఇతి తం నాయతం బోధయేదిత్యాహుః. దుర్భిషజ్యం హాస్మై భవతి యమేష న ప్రతిపద్యతే, అథో ఖల్యా హుః, జాగరితదేశ ఏవాస్యైష ఇతి; యాని హ్యేవ జాగ్రత్పశ్యతి తాని సుప్త ఇతి; యత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి; సో హం భగవతే సహస్రం దదామి, అత ఊర్ధ్వం విమోక్షాయ బ్రూహీతి. 14**

**మం॥ స వా ఏష ఏతస్మిన్సంప్రసాదే రత్వా చరిత్వా, దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ, పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి స్వప్నాయైవ; స యత్తత్ర కించి త్పశ్య త్యనన్వాగతస్తేన**

**భవతి; అసంగో హ్యయం పురుష ఇతి; ఏవమేవైతద్యాజ్ఞవల్క్య, సో హం భగ వతే సహస్రం దదామి, అత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి. 15**

సుషుప్తి విషయాలలో కూడా ఆత్మ అసంగంగానే ఉంటుందని చెబుతున్నారు.

ఈ స్వయంజ్యోతియైన ఆత్మ, ఈ సుషుప్తి కాలంలో రమిస్తూ విహరిస్తూ పుణ్యపాపాలను చూచిన పిమ్మట, మళ్ళీ స్వప్నస్థానం నుండి, ఏ విధంగా వచ్చిందో, ఆ స్వప్నస్థానానికే తిరిగి వస్తుంది. అదే విధంగా అయితే అక్కడ తాను చూచినవాటిచేత బంధింపబడదు. ఎందుచేత ? పురుషుడు అసంగుడు కాబట్టి ! ఈ పురుషుడు గాఢనిద్రలో (ఈ స్థితినే సంప్రసాదము అంటారు.) ప్రశాంత స్థితిని అనుభవించి. మళ్ళీ స్వప్నాస్థానానికి తిరిగి వస్తుంది. ఆ స్వప్నావస్థలో చూచిన మంచి చెడ్డలేవీ దానికి అంటవు.

(సుషుప్తిలో ఉండే పురుషుణ్ణి శ్రుతులు ఈ విధంగా వర్ణించాయి. సుషుప్తిలో అతడు అన్ని దుఃఖాలను అధిగమిస్తాడు– దాటుతాడు. నీరులాగా స్వచ్ఛంగా, విజాతీయ భేదం లేకుండా ఏ విధమైన భేదం లేకుండా, కూటస్థజ్యోతియై ద్రష్టగా ఉంటాడు.)

జనకుడు:– 'ఓ యాజ్ఞవల్క్యా ! మీరు చెప్పినది నిజమే ! నాకు మోక్షానికి అవసరమైన యదార్థతత్వాన్ని ఉపదేశించండి'.

**మం॥ స వా ఏష ఏతస్మిన్స్వప్నే రత్వా చరిత్వా, దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ, పునః ప్రతిన్యాయం ప్రతి యోన్యాద్రవతి బుద్ధాన్తాయైవ; స యత్తత్ర కించి త్పశ్యత్యనన్వాగతస్తేన భవతి, అసంగో హ్యయం పురుష ఇతి; ఏవమేవైతద్యాజ్ఞవల్క్య, సో హం భగవతే సహస్రం దామి, అత ఊర్ధ్వం విమోక్షాయైన బ్రూహీతి. 16**

**మం॥ స వా ఏష ఏస్మిన్బుద్ధాన్తేరత్వా చరిత్వా, దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతి యోన్యాద్రవతి స్వప్నాన్తాయైవ. 17**

**మం॥ స యో మనుష్యాణాం రాద్ధః సమృద్ధో భవతి, అన్యేషామధిపతిః, సర్వైర్మాను ష్యకైర్భోగై, సంపన్నతమః స మనుష్యాణాం పర్మ ఆనందః; అథ యే శతం మనుష్యాణా మానన్దాః స ఏకః పితృణాం జితలోకానామానందః; అథ యే శతం పితృణాం జితలోకానా మానందాః స ఏకో గంధర్వలోక ఆనందః; అథ యే శతం గర్వలోక ఆనందాః స ఏకః కర్మదేవానా మానందః– యే కర్మణా దేవత్వ మభిసంపద్యన్తేః అథ యే శతం కర్మదేవానా మానందాః ఏ ఏక ఆజాన దేవానామానందః, యశ్చ శ్రోత్రియో వృజివో కామహతో థ యే శత మాజాన దేవానామానన్దాః స ఏకః ప్రజాపతిలోక ఆనంద; యశ్చ శ్రోతియో వృజినో**

**కామహః; అథ యే శతం ప్రజాపతి లోక ఆనందాః స ఏకో బ్రహ్మలోక ఆనందః, యశ్చ్రశ్రోత్రియో వృజినో కామహతః; అథైష ఏవ పరమ ఆనందః, ఏష బ్రహ్మ లోకః సమ్రాడితి హోవాచ యాజ్ఞవల్క్యః; సో హం భగవతే సహస్రం దదామి, అథ ఊర్థ్వం విమోక్షా యైన బ్రూహీతి; అత్ర హ యాజ్ఞ వల్క్యోబిభయాం చకార, మేధావీ రాజా సర్వేభ్యో మా న్తేభ్య ఉదరౌత్సీదితి. 33**

(మానవులు మొదలు బ్రహ్మవరకు అనుభవించే ఆనందం యొక్క తారతమ్యాన్ని వర్ణిస్తూ పరిమానంద స్వరూపాన్ని నిర్ణయించటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఇదే విధమైన అనందమీమాంస తైత్తిరీయ ఆనందవల్లిలో కూడా చేయబడ్డది.)

మానవులలో మంచి అవయవసౌష్టనవం కలిగి, సమస్త లభోగ సామగ్రి కలిగి ఉండి, స్వతంత్రుడై, ఇతరులను పాలించేవాడై ఉండి, మానవోపభోగమైన సమస్త సామగ్రి కలిగి ఉండి, అందరిని మించినట్టి వానికి కలిగే ఆనందాన్ని మానుషానందము అంటారు. అంటే, మానవలోకంలో ఇటువంటివాని ఆనందం అన్నిటకింటె ఎక్కువది.

ఇటువంటి మానుషానందం వందరెట్లు అయితే, పిత్రులోకాన్ని జయించిన పితృగణానికి ఒక ఆనందం అవుతుంది– అంటే, పితృదేవానందం అవుతుంది.

ఇటువంటి పితృదేవతల యొక్క ఆనందానికి వందరెట్లు అధికమైన ఆనందం గంధర్వలోకంలో ఉండేవారి ఆనందమౌతుంది. అటువంటి గంధర్వలో కానందానికి నందరెట్లు అధికమైన ఆనందం అయితే, అగ్ని హోత్రాది కర్మల ద్వారా దేవత్వాన్ని పొందిన కర్మదేవతల ఆనందమౌతుంది.

ఇటువంటి కర్మదేవతల ఆనందానికి వందరెట్లు అధికమైన ఆనందం ఆజానదేవతల అనందమౌతుంది (ఆజానదేవతలు అంటే పుట్టుకతోనే దేవతలుగా పుట్టినవారు) ఈ ఆజానదేవతల ఆనందానికి వందరెట్లు అధికమైన ఆనందం. ప్రజాపతియొక్క ఆనందమౌతుంది.

పాపరహితుడు, కోరికలు లేనివాడు, శ్రోత్రియుడు, విద్వాంసుడు అయినవాని ఆనందం కూడా ఇదే ! ఈ ప్రాజపతియొక్క ఆనందానికి వంద రెట్లు అధికమైన ఆనందం హిరణ్యగర్భుని యొక్క ఆనందం అవుతుంది. అట్లాగే ఆప్తకాముడు, శ్రోత్రియుడు, కోరికలు లేనివాడు, విద్వాంసుడు అయినవాని ఆనందం కూడా ఇటువంటి కర్మదేవతల ఆనందానికి వందరెట్లు అధికమైన ఆనందం ఆజునదేవతల ఆనందమౌతుంది (ఆజానదేవతలు అంటే పుట్టుకతోనే దేవతలుగా పుట్టినవారు) ఈ జానదేవతల ఆనందనాకి ఇవందరెట్లుఇటువంటిదే ! (బ్రహ్మానందం వంటిదే) ఇది పరమోత్కృష్టమైన ఆనందం. ఓ రాజా ! 'ఇదే బ్రహ్మలోకం. అని అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

ఇది విని జనకుడిట్లా అన్నాడు– 'మీ ఈ ఉపదేశానికి మారుగా మీకు వెయ్యి ఆవుల్ని యిస్తున్నాను. ఇకముందు కూడా తాము నాకు బంధ విముక్తుడనయ్యేందుకు కావలసిన ఉపదేశమే చేయండి.'

ఈ మాటలు విని యాజ్ఞవల్క్యుడు భయభీతుడైనాడు– 'ఈ రాజు తెలివిగలగాడు. మోక్షానికి సాధనభూతమైన సమస్త ప్రశ్నలకు నిర్ణయాలు ఇచ్చేందుకుగాను నన్ను ఈ విధంగా బంధిస్తున్నాడు.' అని అనుకున్నాడు. అంటే, ఈ రాజు నేను చెప్పినదంతా విని మళ్లీ ప్రతిసారి క్రొత్త ప్రశ్నను అడుగుతూనే ఉన్నాడు. ఈ విధంగా యాజ్ఞవల్క్యునికున్న సంపూర్ణ జ్ఞానాన్ని అతడు పొందాలని అనుకుంటున్నాడు. అతనికిచ్చిన వరం దీనికి తోడైంది. యాజ్ఞవల్క్యుని భయకారణం ఇదే ! అంతేగాని, జనకుని ప్రశ్నలకు సమాధానం చెప్పలేనని కాదు.

**మం॥ స వా ఏ ష ఏతస్మిన్స్వప్నాన్తే రత్వా చరిత్వా, దృష్ట్వైన పుణ్యం చ పాపం చ, పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాన్తాయైన. 34**

జాగ్రదవస్థనుండి స్వప్నానికి, స్వప్నం నుండి సుషుప్తికి పోయిన పురుషుడు, స్వప్నాంతంలో సుషుప్తిలో రమిస్తూ, విహరించి, పుణ్య పాపాలను తనకేమీ అంటకుండా, కేవలం చూచి వెళ్ళిన మార్గాన్నే తిరిగి తన నియమిత స్థానానికి (జాగ్రదవస్థలోనికి) వస్తున్నాడు.

**మం॥ తద్యథా నః సు సమాహిత ముత్సర్జద్యాయాత్, ఏవమేవాయం శరీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢ ఉత్సర్జన్యాతి యత్రైత దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి. 35**

ఇక్కడ నుండి పునర్జన్మను గురించి చెపుతున్నారు.

ఈ శరీరం నుండి వేరొక శరీరానికి వెళ్ళాలి కాబట్టే, జీవాత్మ, సుషుప్తి నుండి మళ్ళీ జాగ్రదవస్థకు వచ్చినట్లు చెవుతూ, ఈ ప్రపంచం నుండి నిష్క్రమించటాన్ని సోదాహరణంగా వివరిస్తున్నారు.

బాగా బరువుతో నింపబడ్డ బండి కిఱ్ఱుమని చప్పుడు చేస్తూ పోతూ ఉండటం మనం చూస్తూనే ఉన్నాం. అట్లాగే ఈ శరీరంలోని ఆత్మ స్వయం ప్రకాశమానుడైన పరమాత్మచేత ప్రకాశితుడై శబ్దం చేస్తూ వెడతాడు– ఊర్ధ్వ శ్వాసతో ఈ లింగశరీరంలోని మర్మస్థానాలను వదలి వెళ్ళిపోతాడు.

**మం॥ స యత్రాయ మణిమాసం న్యేతి– జరయా వోపత పతా వాణిమానం నిగచ్ఛతి– తద్యథామ్రం వోదు మ్బరం వా పిప్పలం వా బాన్ధనాత్ప్ర ముచ్యతే, ఏవ మేవాయం పురుషం ఏభ్యోం గేభ్యః సంప్రముచ్య పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి ప్రాణాయైన 36**

ఊర్ధ్వ శ్వాసకు కారణ చెపుతున్నారు.

హస్తసాదాది అవయవాలతోకూడినట్టి, అవిద్యాజన్యమైనట్టి, ఈ దేహం, వృద్ధాస్యం మొదలైన కారణాలవల్ల కృశించిపోతుంది. అప్పుడు మామిడిపండులాగా, అత్తిపండులాగా, రావిపండులాగా కొమ్మకు గల సంబంధాన్ని వదిలించుకొని క్రింద పడ్డట్లుగా, ఈ శరీరంతో ఉన్న పురుషుడు కూడా న ఈ శరీరావయవాల నుండి వదిలించుకొని– తన కర్మ ననుసరించి– ఏ మార్గం నుండి వచ్చాడో ఆ మర్గానే మరొక యయోనిలో (జన్మ స్థానం) ప్రాణంలో కూడిన అవయవాలతో ప్రకటమవటం కోసం వెళ్ళి పోతాడు. (ప్రాణాది అవయావాలు ఉంటేనే గాని

కర్మఫలాన్ని అనుభవించటానికి వీలులేదు కాబట్టి. ఆ విధమైన శరీరం కోసం వెతుక్కుంటూ పోతాడు.

**మం॥ తద్యథా రాజాన మాయాన్త ముగ్రా ప్రత్యేనః సూతగ్రామణో న్నై పానైరావసథైః ప్రతికల్పిన్తే, అయమాయాతి, అయమాగచ్ఛతీతి, ఏవం మైవం విదం సర్వాణి భూతాని ప్రతికల్పన్తే, ఇదం బ్రహ్మే యాతి, ఇద మాగ చ్ఛతీతి. 37**

పట్టాభిషిక్తుడైన రాజు ఈన రాజ్యంలోకి వెళ్ళేటప్పుడు రాజుయొక్క సేవకులైన ఉగ్రులు (చోరులు మొదలైనవారిని శిక్షించే క్రూర కర్మలు చేసేవారు) పాపకర్మలు చేయటానికి నియుక్తులైన సూతులు (సంకర జాతి వారు) ఇతర గ్రామాఇకారులు భోజన భాజనాదులు, నివాస వసతులు సిద్ధ పరచుకొని 'ఇదిగో ! వస్తున్నారు. ఇదిగో రాజుగారు వస్తున్నారు!' అనుకుంటూ, రాజుకోసం ఎదురుచూస్తూ ఉన్నట్లుగా, ఒక శరీరాన్ని వదలి, వేరొక శరీరాన్ని పొందటానికి వచ్చే ఆత్మను చూచి, సమస్త భూతాలు 'ఇదిగో పరమాత్మ, పరబ్రహ్మ వస్తున్నాడు. ఇదిగో పరమాత్మ వస్తున్నాడు' అనుకుంటూ ఎదురుచూస్తూ ఉంటాయి.

**మం॥ తద్యథా రాజానం ప్రయియాసన్తముగ్రాః ప్రత్యేనస సూత్గ్రఆమణ్యో భి సమాయన్తి, ఏవన్టేమ మాత్మాని మన్తకాలే సర్వే ప్రాణా అభినమాయన్తి యత్రైత దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి. 38**

పైన చెప్పినట్లు, ఈ విధంగా వచ్చే రాజుగారి ముందు నడుస్తూ వెళ్ళే ఉగ్రులు, సూతులు, ఇతర గ్రామాధికారులలాగా, ఊర్ధ్వ శ్వాస తీసుకోవటం ప్రారంభించగానే, అంత్యకాలంలో– సమస్త ప్రాణాలు చక్షురాది ఇంద్రియాలన్నీ – ఈ జీవాత్మకు ముందుగా నడుస్తూపోతాయి.

## మూడవ బ్రాహ్మణం

సూక్ష్మ ఆహారాన్ని గ్రహించే 'ఇంధ' అనే పేరుగల వైశ్వానరాత్మను, అంతకంటె సూక్ష్మమైన ఆహారాన్ని తీసుకొనే హృదయస్థుడైన లింగాత్మను (తైజసుని) అంతకంటె సూక్ష్మమైన ఆహారాన్ని గ్రహించే ప్రాణమే ఉపాధిగా గల విశ్వాత్మను –ప్రాజ్ఞుని– గురించి తెలుసుకున్నాము. 'నేతి నేతి' అనే వాక్యంద్వారా సర్వాంతర బ్రహ్మను, చెప్పారు; అంటే, తురీయాన్ని చెప్పారు. అట్లాగే జాగ్రత్, స్వప్న, సుషుప్తులను తురీయాన్ని వ్యాఖ్యానించారు. ఇదంతా శ్రుతి ప్రమాణంగా వివరించాడు. ఇక, ఇప్పుడు, జాగ్రత్త, స్వప్నాలద్వారానే, తర్కం ద్వారా ఆ తురీయాన్ని నిశ్చయించి అభయప్రాప్తి కలిగించటం కోసం తరువాతి గ్రంథం ఆరంభిస్తున్నారు.

**మం॥ జనకం హ వేదేహం యాజ్ఞవల్క్యోజాగామ; స మే న వదిష్య ఇతి; అథ హ యజ్ఞనకశ్చ వై దేహో యాజ్ఞవల్క్యశ్చాగ్నిహోత్రే సముదాతే, తస్మై హ యాజ్ఞవల్క్యో వరం దదౌ; సహ కామప్రశ్న మేవ వవ్రే; తం హాస్మై దదౌ; తం హ సమ్రాడేవ పూర్వం పప్రచ్ఛ. 1**

**జనకుడు మళ్ళీ ఈ విధంగా అడిగాడుః 'ఓ యాజ్ఞవల్క్యా ! సూర్య చంద్రులు అస్తమించి, అగ్నికూడా**

**మం॥ యాజ్ఞావల్క్య కింజ్యోతిరియం పురుష ఇతి. ఆదిత్య జ్యోతిః సమ్రాడితి హోవాచ, ఆదిత్యానైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతే పవిప్యతేయేతి; ఏవమేవైతద్యాజ్ఞవల్క్య. 2**

జనకుడు– అడుగుతున్నాడు. ఓ యాజ్ఞవల్క్యా ! మానవునికి జ్యోతిలాగా ఉపయోగించేది ఏది? (నిత్యకృత్యంలో దీపంలాగా మానవుడికి ఉపయోగపడేది ఏది? అని.)

యాజ్ఞవల్క్యుడు : 'ఓ రాజా ! సూర్యుడే జ్యోతి. ఎందుచేతనంటే, సూర్యకాంతి సహాయంతోనే అతడు కూర్చుంటున్నాడు. అన్ని వైపులకు వెడుతున్నాడు. అన్ని పనులు చేస్తున్నాడు. చేయవలసిన పనులన్నీ చేసి యథాస్థానానికి వస్తున్నాడు.'

జనకుడు – 'అవును ! ఇది నిజమే !'

**మం॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య కింజ్యోతిరేవాయం పురుష ఇతి; చంద్రమా ఏవాస్య జ్యోతిర్భవతీతి, చంద్రమసైనాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీతి; ఏవమేవైతద్యాజ్ఞవల్క్య. 3**

జనకుడు– మళ్ళీ అడుగుతున్నాడు. 'ఓ యాజ్ఞవల్క్యా ! సూర్యుడు అస్తమించినవుడు పురుషునికీ జ్యోతి ఏది? అంటే ఏ జ్యోతి సహాయంతో వెనుక చెప్పిన పనులన్నీ చేస్తాడు?'

యాజ్ఞవల్క్యుడు– ఓ మహారాజు ! సూర్యుడు అస్తమించిన తరువాత పురుషునికి చంద్రుడే జ్యోతి (దీపం.) అతని కాంతితోనే అతడు కూర్చుంటాడు. బయటకువెళ్ళ గలుగుతాడు.పనులచేసి మళ్ళీ తన పూర్వపుచోటుకు తాను తిరిగివస్తాడు.'

జనకుడు– 'యాజ్ఞవల్క్యా! మీరు చెప్పింది నిజమే!'

**మం॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య, చంద్రమస్యస్తమితే, కింజ్యోతి రేవాయం పురుష ఇతి; అగ్ని రేవాస్య జ్యోతి ర్భవతీతి, అగ్నినైవాయం జ్యోతిషాస్తే పల్యయతే కర్మకురుతే విపత్యేతీతి, ఏవమేవైద్యాజ్ఞవల్క్య. 4**

జనకుడు– 'యాజ్ఞవల్క్యా ! సూర్యచంద్రు లిద్దరూ అస్తమించినపదు పురుషునికి జ్యోతి ఏది?'

యాజ్ఞవల్క్యుడు– 'ఓ రాజా ! సూర్యచంద్రులిందరువురూ ఆసంగతులైనప్పుడు పురుషునికి అగ్నియే జ్యోతిగా కలవాడౌతాడు. ఆ అగ్ని అనే దీపంతోనే వెనుక చెప్పిన పనులన్నీ చేస్తాడు. ఆ కర్మలన్నీ చేసి నియమిత స్థానానికి వస్తున్నాడు.'

జనకుడు:– 'అవును, నిజమే!'

**మం॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య, చంద్రమస్యస్తమితే, శాంతే గ్నౌ కింజ్యోతి రేవాయం పురుష ఇతి; వాగే వాస్య జ్యోతిర్భవతీతి, వాచైవాయం జ్యోతిషాస్తే సల్యయతే కర్మకురేతే విపత్యేతేతీతి; తస్మాద్వై సమ్రాడపి యత్ర స్వః పాణిర్న వినిర్జ్ఞాయతే, అథ యత్ర వాగుచ్ఛరతి, ఉపైవ తత్ర న్యేతీతి; ఏవమేవైత ద్యాజ్ఞవల్క్య. 5**

జనకుడు మళ్ళీ ఈ విధంగా అడిగాడు : 'ఓ యాజ్ఞవల్క్యా ! సూర్య చంద్రులు అస్తమించి, అగ్నికూడా శాంతించినపుడు (ఆరిపోయినప్పుడు) పురుషునికి జ్యోతిలాగా ఉపయోగపడేది ఏది?'

యాజ్ఞవల్క్యుడు :'ఓ రాజా ! అటువంటి సమయంలో (సూర్య చంద్రాగ్నులు అస్తమించినవుడు) పురుషునికి వాక్కే జోతిలాగా ఉపయోగపడుతుంది. వర్షాకాలంలో రాత్రివేళ నిబిడాంధకారంలో, తన చెయ్యి కూడా తనకు కనిపించనంతటి కటిక చీకటిలో పురుషుడు శబ్దాన్నిబట్టి ఆ దిక్కుకు వెడతాడు. అచట చేయాల్సిన పనులు చేసి తిరిగివస్తాడు. కాబట్టి ఓ రాజా ! సూర్యచంద్రాగ్నులు మూడూ లేనప్పుడు పురుషునికి వాక్కే జ్యోతిలాగా ఉపయోగపడుతుంది.'

జనకుడు:– అవును ! నిజమే !'

**మం॥ అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య, చంద్రమస్యస్తమితే, శాన్తే గ్నౌ, శాన్తాయం వాచి కిం జ్యోతిరేవాయం పురుషష ఇతి; ఆత్మైవాస్య జ్యోతిర్భవతీతి, ఆత్మవై వాయం జ్యోతిషాస్తే కర్మ కురుతే విసత్యేతీతి 6**

జనకుడు అడుగుతున్నాడు:– 'ఓ యాజ్ఞవల్క్యా ! సూర్యచంద్రాగ్నులు అస్తమించి. వాక్కు ఆగిపోయినపుడు మానవునికి జ్యోతిలాగా ఉపయోగించేది ఏది?

యాజ్ఞవల్క్యుడు : 'రాజా ! సూర్యచంద్రాగ్నులు ఉపశమింపగా, నావాక్కు నిలిచిపోగా పురుషునికి ఆత్మయే జ్యోతిలాగా ఉపయోగపడుతుంది. ఆ ఆత్మ జ్యోతి సహాయంతోనే పురుషుడు అన్ని వైపులకు వెడతాడు. పనులు చేస్తాడు. చేయవలసిన పనులు చేసి తిరిగి తన నియమిత స్థానానికి వస్తాడు.'

జనకుడు : 'అవును ! నిజమే!'

**మం॥ కతతమ ఆత్మేతి; యో యం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః, స సమానః సన్నభౌ లోకా వనుసంచరతి, ధ్యాయతీవ లేలాయతీవ; సహి స్వప్నో భూత్వేమం లోకమతిక్రామతి మృత్యో రూపాణి 7**

జనకుడు అడుగుతున్నాడు:– 'ఆత్మ అంటే ఏది? మీరు చెప్పిన శరీరం, ఇంద్రియాలు, మనస్సు, ప్రాణాలు వీటిలో ఆత్మ ఏది? ఆ జ్యోతి ఏది?'

యాజ్ఞవల్క్యుడంటున్నాడు– ప్రాణల్లో, బుద్ధి వృత్తులలో ఉండే విజ్ఞాన జ్యోతి స్వరూపమైన పరుషుడే ఆత్మ! ఇంద్రియాలమధ్య, స్వయం ప్రకాశమైనట్టి, హృయదంలో ఉండే పురుషుడే ఆత్మ. ఆది బుద్ధివృత్తిలాగా చింతన చేస్తూనే ఈ లోకంలోను, పరలోకంలోను సంచరిస్తుంది. ప్రాణవృత్తిలాగా ఉంటూ చేష్టలు (కదులుతూన్నట్లు) సాగిస్తూ కనిపిస్తుంది. స్వప్నంలాగా ఉంటూ ఈ దేహేంద్రియ సంఘాతరూపమైన మృత్యువును (అజ్ఞానాన్ని) కూడి దాటిపోతుంది. ఈ విషయాలనే దిగువ మంత్రాలలో విపులీకరిస్తున్నారు–

**మం॥ స వా అయంపురుషో జాయమానః– శరీరమభి సంపద్యమానః పాప్మభిః సంసృజ్యతే; స ఉత్క్రామన్ –మ్రియమాణః– పాప్మనో విజహాతి. 8**

ఈ ఆత్మయే (వ్యక్తిగతాత్మ) జన్మ ఎత్తేటప్పుడు శరీరంలో ఆత్మ భావాన్ని పొంది దేహేంద్రియ రూపమైన పాపంతో కలుస్తుంది. చనిపోయేటప్పుడు ఆ పాపాన్ని వదలిపెడుతుంది.

**మం॥ తస్య వా ఏతస్య పురుషస్య ద్వే ఏవ స్థానే భవతః ఇదం చ పరలోకస్థానం చ; సంధ్యాం తీఋుతయం స్వప్నస్థానం, తస్మిన్మధ్యే స్థానం తిష్ఠన్నేతే ఉభే స్థానే పశ్యతి– ఇదం చ పరలోకస్థానం చ. అథ యథా క్రమో యం పరలోకస్థానే భవతి తమాక్రమ మాక్రమ్యోభయాన్పాప్మన ఆనందాంశ్చ పశ్యతి; స యత్ర ప్రస్వపితి, అస్య లోకస్య పర్వావతో మాత్రా మపాదాయ స్వయం విహత్య, స్వయం విహత్య, స్వయం నిర్మాయ, స్వేన జ్యోతిషా ప్రస్వపితి; అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి. 9**

ఈ ఆత్మపురుషునికి, ఈ లోకము, పరలోకము అని రెండు స్థానాలున్నాయి. ఈ రెంటికి మధ్యచోటుగా స్వప్నజగత్తు అనేది ఉంది. ఇది మూడవస్థానం. ఈ లోకం (జాగ్రత్త) పరలోకం (సుషుప్తి) ఈ రెంటి మధ్య స్వప్నావస్త ఈ సంధి స్థానమైన స్వప్నంలో ఉంటూ ఈ లోకాన్ని, పరలోకాన్ని కూడా చూస్తాడు. పరలోక స్థానికి ఏఏ సాధనాలు అవసరమో ఆయా సాధనాలను ఆశ్రయించి, పాప ఫలరూపమైన దుఃఖాన్ని, పుణ్య ఫలరూపమైన సుఖాన్ని రెంటినీ చూస్తాడు. ఈ ఆత్మ పురుషుడు నిద్రించేటప్పుడు (స్వప్నంలో) ఈ సమస్తలోకాలోని తన పూర్వానుభవాలను తీసికొని, ఈ స్థూలశరీరాన్ని చేతనా శూన్యంచేసి, స్వయంగా వాసనామయమైన స్వప్న శరీరాన్ని రచించుకొని తన ఆత్మజ్యోతి రూపమైన ప్రకాశంతో స్వప్నం చూస్తాడు. ఈ స్థితిలో అతడు స్వప్నద్రష్టయైన పురుషుడుగా ఉంటాడు. ఈ స్వప్నద్రష్టయైన పురుషుని తైజసుడు అని అంటారు.

**మం॥ న తత్ర రథాన రథయోగా న పన్థానో భవన్తి, అథ రథాన్ రథయోగాన్పథః సృజతే; న తత్రానన్దా ముదః ప్రముదో భన్తి, అథానన్దాన్ ముదః ప్రముదః సీజతే; న్తత వేశాన్తాః పుష్కరిణ్యః స్రవన్త్యో భవన్తి, అథవేశాన్తాన్ పుష్కరిణీ స్రవన్తీః సృజతే; సహికర్తా 10**

ఆ స్వప్నావస్థలో రథాలు మొదలైన విషయాలు ఉండవు. రథానికి కట్టే గుఱ్ఱాలు ఉండవు. రథం నడవటానికి మార్గాలూ వుండవు. ఆ రథాలను, వాటికి కట్టే గుఱ్ఱాలను, అవి నడిచే మార్గాలను పూర్వ వాసనల ద్వారా తానే (ఆ స్వప్న పురుషుడే) సృష్టించుకుంటాడు. ఆ సమయంలో ఆనందం, మోదం, (ప్రమోదం పురుషుడే) సృష్టించుకుంటాడు. ఆ సమయంలో ఆనందం, మోదం ప్రమోదం మొదలైన వృత్తులు కూడా ఉండవు. వాటిని కూడా (ఆనందం, ప్రమోదాది వృత్తుల్ని) అతడే కల్పించుకుంటాడు. ఆ స్వప్నస్థితిలో జలాశయాలు, తటాకాలు, నదులు ఇవన్నీ ఉండవు. కాని వీటినన్నింటిని ఆ పురుషుడే (స్వప్న పురుషుడు) సృష్టించుకుంటాడు. అందుచేతనే వీటి అన్నింటికి కర్తయైన వాడిని 'స్వప్నద్రష్టయైన పురుషుడు' అని అంటారు.

(మనము కోరుకున్నది లభించినప్పుడు కలిగే సంతోషం 'మోదము' ఈ 'మోదమే' అధికంగా కలిగితే 'ప్రమోదము'. ఈ ప్రమోదము కంటె ఎక్కువైన సంతోషం 'ఆనందం')

**మం॥ తదేతే శ్లోకా భన్తి స్వప్నేన శారీర మభిప్రహత్యా- సుప్తః సుప్తానభిచాకశీతి. శుక్రమాదాయ పునైరతి స్థానం హిరణ్మయః పురుష ఏక హంసః. 11**

ఈ విషయానికి సంబంధించినవే ఈ మం త్రాలు-

స్వప్నావస్థలో ఈ ఆత్మ, స్వప్నంద్వారా ఈ దేహాన్ని చేష్టలు లేని దానినిగా (కదలికలు లేనిదానినిగా) చేసి, తాను (స్వప్న ద్రష్ట) నిద్రపోకుండా, నిద్రపోయే వాటి నన్నింటిని (వ్యవహార దృష్టితో నిద్రపోతున్న శరీరము ఇంద్రియాలన్నింటిని) అన్నివైపులనుండి ప్రకాశింప జేస్తుంది- చూస్తుంది. మళ్ళీ పూర్తిగా ఇంద్రియ సహితమైన రూపాన్ని ధరించి జాగ్రదవస్థలోనికి వస్తుంది. కాబట్టి, ఈ స్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మ రెండు అవస్థలలోను- ఇహలోక పరలోకాలలో ఒంటరిగానే వెడుతూ వస్తూ ఉంటుంది.

**మం॥ ప్రాణేన రక్షన్నవరం కులాయం బహిష్కులాయాదమృతశ్చరిత్వా. స ఈయతే మృతో యత్ర కామం హిరణ్మయః పురుష ఏక హంసః 12**

ఈ నికృష్టమైన శరీరాన్ని రక్షించే భారం ప్రాణానికి ఒప్పగించి (స్వప్నావస్థలో ప్రాణం ఈ శరీరాన్ని కాపాడుతూ ఉంటుంది. లేకపోతే మరణమేగదా!) ఈ అవినాశియైన ఆత్మ, శరీరానికి బయట యిష్టం వచ్చినట్లుగా విహరిస్తుంది. ఆ హిరణ్మయుడు, అమరుడు అయిన ఆ పురుషుడు అట్లా ఒంటరిగా ఎక్కడికి పోవాలని అనుకుంటే అక్కడికి పోయి విహరిస్తాడు. ఏ విసయాలమీద వాసన (కోరిక) ఉంటే ఆ విషయాలమీదకు పోయి విహరిస్తాడు. శరీరంలో ఉంటూ స్వప్నం చూస్తూన్నా శతీరంతో అనినికి సంబంధం ఉండదు.

**మం॥ స్వప్నాంత ఉచ్చావచమీయమానో రూపాణి దేవః కురుతే బహూని ఉతేవ స్త్రీభిః సహ మోదమానో జక్షదుతేవాపి భయాని పశ్యన్. 13**

స్వప్నావస్థలో ఈ ఆత్మపురుషుడు ఉచ్చ, నీచ భావాలను పొందుతూ అనేకమైన వాసనలతో కూడిన రూపాలను కల్పించుకుంటాడు. ఆ రూపాలతో స్త్రీలతో కలసి సంతోషిస్తాడు. మిత్రులతో కలసి నవ్వుతాడు. పెద్ద పులులు మొదలైన క్రూరమృగాలను చూచి భయపడతాడు. ఈ విధమైన అనుభవాలతతో కూడినవాడై స్వప్నావస్థలో చరిస్తాడు.

స్వప్నభోగం నుండి కూడా ఆత్మ అసంగంగానే ఉంటుందని చెపుతున్నారు.

ఈ స్వప్న సమయంలో ఆత్మ రమిస్తూ,క్రీడిస్తూ పుణ్య, పాపాలను చూచి తిరిగి, ఏ జాగ్రత్‌స్థానం నుండి (ఎట్లా, ఎచటినుండి, ఏ విధంగా బయలుదేరిందో మళ్ళీ ఆచటనుండి అదే విధంగా) తిరిగి జాగరిత స్థానానికి- జాగ్రదవస్థకు వస్తుంది- ఆ స్వప్నావస్థలో చూచినవాటిచేత

బంధింపబడదు. ఎందుచేత ? ఆ పురుషుడు (తైజసాత్మ) అసంగుడు కాబట్టి ! ఒకవేళ అతడు కమనాయుక్తుడే గనక అయితే జాగరితస్థానానికి తిరిగి వచ్చిన తరువాత కూడా ఆ ఆసక్తిజన్యమైన (స్వప్నంలో) దోషాలతో లిప్తుడై (అంటివవాడై) ఉండాలి. అట్లా ఉండటంలేదు. కాబట్టి అతడు అసంగుడే !

జనకుడన్నాడు :'ఓ యాజ్ఞవల్క్యా ! మీరు చెప్పింది నిజం ! స్వప్నావస్థలోని భోగాలనుండి కూడా పురుషుడు అసంగుడై ఉంటాడనే విషయం బోధించారు. దక్షిణగా మీకు వేయి ఆవులిస్తాను. తరువాత కూడా మోక్షానికి సంబంధించిన విషయం ఉపదేశించండి.'

**మం॥ స వా ఏష ఏస్మిన్బుద్ధ్యాన్తేరత్వా చరిత్వా, దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతి యోన్యాద్రవతి స్వప్నాన్తాయైవ. 17**

ఈ మంత్రంలో, జాగరితస్థానంలో రమించే, చరించే పురుషుడు కూడా స్వప్న సుషుప్తిలోని పురుషునిలాగానే అసంగుడనే విషయం చెపుతున్నారు–

ఆ పురుషుడు జాగరిత స్థానంలో రమిస్తూ విహరిస్తూ పుణ్య పాపాలను చూస్తూ, ఏ మార్గం నుండి ఏ విధంగా స్వప్నంలో నుండి జాగ్రవస్థలోకి వెళ్ళాడో, మళ్ళీ అదే మార్గం నుండి అదేవిధంగా జాగరితస్థానం నుండి స్వప్నస్థానానికి తిరిగి వస్తున్నాడు. ఆ సమయంలో స్వప్నస్థానంలో విహరించేటప్పుడు, జాగరితస్థానంలోని అనుభవాలు ఆసక్తి జన్యమైన దోషాలు అతనికి అంటటంలేదు. అంటే అసంగుడై ఉంటున్నాడు.

**మం॥ తద్యథా మహామత్స్య ఉభే కూలే నుసంచరితి పూర్వం చా పరం చ, ఏవమేవాయం పురుష ఏతా వుభావన్తావను సంచరతి స్వప్నాంతం చ బుద్ధాంతం చ. 18**

అన్ని స్థితులలోను ఆత్మ యొక్క అసంగత్వానికి ఉదాహరణ చెపుతున్నారు– ఒక పెద్ద చేప నదిలో ఉంది. అది ఈవలి ఒడ్డు నుండి ఆవలి ఒడ్డుకు. ఆవలి ఒడ్డునుండి ఈవలి ఒడ్డుకు– రెండు తీరాలకు సంచరిస్తూనే ఉంటుంది. జలప్రవాహం వల్ల అది జలప్రవాహానికి వశం కాకుండా, అలలను నిరోధిస్తూ ఆలసిపోకుండా సంచిరస్తూనే ఉంటుంది. అట్లాగే ఈ జీవాత్మ ప్రారబ్ధకర్మలచేత ప్రేరేపింపబడి. స్వప్న స్థానం నుండి జాగరిత స్థానానికి, జాగరిత స్థానం నుండి స్వప్నస్థానానికి తిరుగుతూనే (వస్తూపోతూనే) ఉంటుంది.

**మం॥ తద్యథాస్మిన్నాకాశే శ్యేనో వా సురవ్లో వా విపరి పత్య శ్రాంతః సంహత్య పక్షౌ సంలయాయైన ధ్రియతే, ఏమవమేవాయం పురుష ఏతస్మా అంతాయ ధావతి యత్ర సుప్తో న కంచన కామం కామయతే, న కంచన స్వ్నం పశ్యతి. 19**

సుషుప్తిలోని ఆత్మ (ప్రాజ్ఞుని) యొక్క విశ్రాంతి స్థానాన్ని గూర్చి డేగను (పక్షిని) ఉపమానంగా గ్రహించి వర్ణిస్తున్నారు.

ఆకాశంలో డేగగాని, గ్రద్ధగాని అన్నివైపులకు ఎగిరి ఎగిరి అలసిపోయినప్పుడు తన రెక్కలను ఆడించకుండా నిశ్చలంగా ఉంచి తన గూటి దిక్కుకు మొగం పెట్టి ముందుకు (గూటివైపుకు) పరుగెడుతుంది. ఇది మనం నిత్యమూ చూస్తూనే ఉన్నాము. సరిగ్గా అట్లాగే జీవాత్మ జాగ్రత్, స్వప్నస్థానాలలో ప్రారబ్ధకర్మానుసారం తిరిగి తిరిగి తన కర్మఫలాన్ని అనుభవిస్తూ అలసిపోయి, సుషుప్తిస్థానం వైపుకు పరుగెడుతుంది. అక్కడకి చేరి పడుకొని ఏ విధమైన భోగకాంక్షలు లేకుండా – స్వప్నాలు చూడకుండా విశ్రమిస్తుంది.

**మం॥ స యో మనుష్యాణాం రాద్ధః సమృద్ధో భవతి, అన్యేషామధిపతిః, సర్వైర్మాను ష్యకైర్భోగై, సంపన్నతమః స మనుష్యాణాం పర్మ ఆనందః; అథ యే శతం మనుష్యాణా మానన్దాః స ఏకః పితృణాం జితలోకానామానందః; అథ యే శతం పితృణాం జితలోకానా మానందాః స ఏకో గంధర్వలోక ఆనందః; అథ యే శతం గర్వలోక ఆనందాః స ఏకః కర్మదేవానా మానందః– యే కర్మణా దేవత్వ మభిసంపద్యన్తేః అథ యే శతం కర్మదేవానా మానందాః ఏ ఏక ఆజాన దేవానామానందః, యశ్చ శ్రోత్రియో వృజివో కామహతో థ యే శత మాజాన దేవానామానన్దాః స ఏకః ప్రజాపతిలోక ఆనంద; యశ్చ శ్రోతియో వృజినో కామహః; అథ యే శతం ప్రజాపతి లోక ఆనందాః స ఏకో బ్రహ్మలోక ఆనందః, యశ్చశ్రోత్రియో వృజినో కామహతః; అథైష ఏవ పరమ ఆనందః, ఏష బ్రహ్మ లోకః సమ్రాడితి హోవాచ యాజ్ఞవల్క్యః; సో హం భగవతే సహస్రం దదామి, అథ ఊర్ధ్వం విమోక్షా యైన బ్రూహీతి; అత్ర హ యాజ్ఞ వల్క్యోబిభయాం చకార, మేధావీ రాజా సర్వేభ్యో మా న్తేభ్య ఉదరౌత్సీదితి. 33**

(మానవులు మొదలు బ్రహ్మవరకు అనుభవించే ఆనందం యొక్క తారతమ్యాన్ని వర్ణిస్తూ పరమానంద స్వరూపాన్ని నిర్ణయించటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఇదే విధమైన అనందమీమాంస తైత్తిరీయ ఆనందవల్లిలో కూడా చేయబడ్డది.)

మానవులలో మంచి అవయవసౌష్టవం కలిగి, సమస్త లభోగ సామగ్రి కలిగి ఉండి, స్వతంత్రుడై, ఇతరులను పాలించేవాడై ఉండి, మానవోపభోగమైన సమస్త సామగ్రి కలిగి ఉండి, అందరిని మించినట్టి వానికి కలిగే ఆనందాన్ని మానుషానందము అంటారు. అంటే, మానవలోకంలో ఇటువంటివాని ఆనందం అన్నిటకింటె ఎక్కువది.

ఇటువంటి మానుషానందం వందరెట్లు అయితే, పితృలోకాన్ని జయించిన పితృగణానికి ఒక ఆనందం అవుతుంది– అంటే, పితృదేవానందం అవుతుంది.

ఇటువంటి పితృదేవతల యొక్క ఆనందానికి వందరెట్లు అధికమైన ఆనందం గంధర్వలోకంలో ఉండేవారి ఆనందమౌతుంది. అటువంటి గంధర్వలోకానందానికి వందరెట్లు అధికమైన ఆనందం అయితే, అగ్ని హోత్రాది కర్మల ద్వారా దేవత్వాన్ని పొందిన కర్మదేవతల ఆనంద మౌతుంది.

ఇటువంటి కర్మదేవతల ఆనందానికి వందరెట్లు అధికమైన ఆనందం ఆజ్ఞానదేవతల అనందమౌతుంది (ఆజానదేవతలు అంటే పుట్టుకతోనే దేవతలుగా పుట్టినవారు) ఈ ఆజానదేవతల ఆనందానికి వందరెట్లు అధికమైన ఆనందం. ప్రజాపతియొక్క ఆనందమౌతుంది.

పాపరహితుడు, కోరికలు లేనివాడు, శ్రోత్రియుడు, విద్వాంసుడు అయినవాని ఆనందం కూడా ఇదే ! ఈ ప్రజాపతియొక్క ఆనందానికి వంద రెట్లు అధికమైన ఆనందం హిరణ్యగర్భుని యొక్క ఆనందం అవుతుంది. అట్లాగే ఆప్తకాముడు, శ్రోత్రియుడు, కోరికలు లేనివాడు, విద్వాంసుడు అయినవాని ఆనందం కూడా ఇటువంటిదే ! (బ్రహ్మానందం వంటిదే) ఇది పమోత్కృష్టమైన ఆనందం. ఓ రాజా ! 'ఇదే బ్రహ్మలోకం. అని అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

ఇది విని జనకుడిట్లా అన్నాడు– 'మీ ఈ ఉపదేశానికి మారుగా మీకు వెయ్యి ఆవుల్ని యిస్తున్నాను. ఇకముందు కూడా తాము నాకు బంధ విముక్తుడనయ్యేందుకు కావలసిన ఉపదేశమే చేయండి.'

ఈ మాటలు విని యాజ్ఞవల్క్యుడు భయభీతుడైనాడు– 'ఈ రాజు తెలివిగలగాడు. మోక్షానికి సాధనభూతమైన సమస్త ప్రశ్నలకు నిర్ణయాలు ఇచ్చేందుకుగాను నన్ను ఈ విధంగా బంధిస్తున్నాడు.' అని అనుకున్నాడు. అంటే, ఈ రాజు నేను చెప్పినదంతా విని మళ్లీ ప్రతిసారి క్రొత్త ప్రశ్నను అడుగుతూనే ఉన్నాడు. ఈ విధంగా యాజ్ఞవల్క్యునికున్న సంపూర్ణ జ్ఞానాన్ని అతడు పొందాలని అనుకుంటున్నాడు. అతనికిచ్చిన వరం దీనికి తోడైంది. యాజ్ఞవల్క్యుని భయకారణం ఇదే ! అంతేగాని, జనకుని ప్రశ్నలకు సమాధానం చెప్పలేనని కాదు.

**మం॥ స వా ఏ ష ఏతస్మిన్స్వప్నాన్తే రత్వా చరిత్వా, దృష్ట్వైన పుణ్యం చ పాపం చ, పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాన్తాయైన. 34**

జాగ్రదవస్థనుండి స్వప్నానికి, స్వప్నం నుండి సుషుప్తికి పోయిన పురుషుడు, స్వప్నాంతంలో సుషుప్తిలో రమిస్తూ, విహరించి, పుణ్య పాపాలను తనకేమీ అంటకుండా, కేవలం చూచి వెళ్ళిన మార్గాన్నే తిరిగి తన నియమిత స్థానానికి (జాగ్రదవస్థలోనికి) వస్తున్నాడు.

**మం॥ తద్యథా నః సు సమాహిత ముత్సర్జద్యాయాత్, ఏవమేవాయం శరీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢ ఉత్సర్జన్యాతి యత్రైత దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి. 35**

ఇక్కడ నుండి పునర్జన్మను గురించి చెపుతున్నారు.

ఈ శరీరం నుండి వేరొక శరీరానికి వెళ్ళాలి కాబట్టే, జీవాత్మ, సుషుప్తి నుండి మళ్ళీ జాగ్రదవస్థకు వచ్చినట్లు చెవుతూ, ఈ ప్రపంచం నుండి నిష్క్రమించటాన్ని సోదాహరణంగా వివరిస్తున్నారు.

బాగా బరువుతో నింపబడ్డ బండి కిఱ్ఱుమని చప్పుడు చేస్తూ పోతూ ఉండటం మనం చూస్తూనే ఉన్నాం. అట్లాగే ఈ శరీరంలోని ఆత్మ స్వయం ప్రకాశమానుడైన పరమాత్మచేత ప్రకాశితుడై శబ్దం చేస్తూ వెడతాడు– ఊర్ధ్వ శ్వాసతో ఈ లింగశరీరంలోని మర్మస్థానాలను వదలి వెళ్ళిపోతాడు.

**మం॥ స యత్రాయ మణిమాసం న్యేతి– జరయా వోపత పతా వాణిమానం నిగచ్ఛతి– తద్యథామ్రం వోదు మ్బరం వా పిప్పలం వా బాన్ధనాత్ప్ర ముచ్యతే, ఏవ మేవాయం పురుషం ఏభ్యోం గేభ్యః సంప్రముచ్య పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి ప్రాణాయైన 36**

ఊర్ధ్వ శ్వాసకు కారణం చెపుతున్నారు.

హస్తపాదాది అవయవాలతోకూడినట్టి, అవిద్యాజన్యమైనట్టి, ఈ దేహం, వృద్ధాప్యం మొదలైన కారణాలవల్ల కృశించిపోతుంది. అప్పుడు మామిడిపండులాగా, అత్తిపండులాగా, రావిపండులాగా కొమ్మకు గల సంబంధాన్ని వదిలించుకొని క్రింద పడ్డట్లుగా, ఈ శరీరంలో ఉన్న పురుషుడు కూడా ఈ శరీరావయవాల నుండి వదిలించుకొని– తన కర్మ ననుసరించి– ఏ మార్గం నుండి వచ్చాడో ఆ మార్గానే మరొక యోనిలో (జన్మ స్థానం) ప్రాణంతో కూడిన అవయవాలతో ప్రకటమవటం కోసం వెళ్ళి పోతాడు. (ప్రాణాది అవయావాలు ఉంటేనే గాని

కర్మఫలాన్ని అనుభవించటానికి వీలులేదు కాబట్టి. ఆ విధమైన శరీరం కోసం వెతుక్కుంటూ పోతాడు.

**మం॥ తద్యథా రాజాన మాయాన్త ముగ్రా ప్రత్యేనః సూతగ్రామణో న్నై పానైరావసథైః ప్రతికల్పిన్తే, అయమాయాతి, అయమాగచ్ఛతీతి, ఏవం మైవం విదం సర్వాణి భూతాని ప్రతికల్పన్తే, ఇదం బ్రహ్మే యాతి, ఇద మాగ చ్ఛతీతి. 37**

పట్టాభిషిక్తుడైన రాజు తన రాజ్యంలోకి వెళ్ళేటప్పుడు రాజుయొక్క సేవకులైన ఉగ్రులు (చోరులు మొదలైనవారిని శిక్షించే క్రూర కర్మలు చేసేవారు) పాపకర్మలు చేయటానికి నియుక్తులైన

సూతులు (సంకర జాతి వారు) ఇతర గ్రామాధికారులు భోజన భోజనాదులు, నివాస వసతులు సిద్ధ పరచుకొని 'ఇదిగో ! వస్తున్నారు. ఇదిగో రాజుగారు వస్తున్నారు!' అనుకుంటూ, రాజుకోసం ఎదురుచూస్తూ ఉన్నట్లుగా, ఒక శరీరాన్ని వదలి, వేరొక శరీరాన్ని పొందటానికి వచ్చే ఆత్మను చూచి, సమస్త భూతాలు 'ఇదిగో పరమాత్మ, పరబ్రహ్మ వస్తున్నాడు. ఇదిగో పరమాత్మ వస్తున్నాడు' అనుకుంటూ ఎదురుచూస్తూ ఉంటాయి.

**మం॥ తద్యథా రాజానం ప్రయియాసన్తముగ్రాః ప్రత్యేనస సూత్రగ్రామణ్యో భి సమాయన్తి, ఏవమే నేను మాత్మాని మన్తకాలే సర్వే ప్రాణా అభినమాయన్తి యత్రైత దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి.** **38**

పైన చెప్పినట్లు, ఈ విధంగా వచ్చే రాజుగారి ముందు నడుస్తూ వెళ్ళే ఉగ్రులు, సూతులు, ఇతర గ్రామాధికారులలాగా, ఊర్ధ్వ శ్వాస తీసుకోవటం ప్రారంభించగానే, అంత్యకాలంలో– సమస్త ప్రాణాలు చక్షురాది ఇంద్రియాలన్నీ – ఈ జీవాత్మకు ముందుగా నడుస్తూపోతాయి.

## నాల్గవ బ్రాహ్మణం

**పునర్జన్మను గూర్చి వర్ణిస్తున్నారు. ఈ సందర్భంలోనే లింగాత్మ చక్షురాదిస్థానాల నుండి ఏ విధంగా విముక్తమౌతుందో చెపుతూనే ఈ పునర్జన్మను గూర్చే ఇంకా విపులంగా చెపుతూ, విముక్తి అవేది ఎప్పుడు ఏ విధంగా కలుగుతుందో చెపుతున్నారు.**

**మం॥ సయత్రాయ మాత్మాబల్యం న్యేత్య సంయోహమివ న్యేతి, అథైనమేతే ప్రాణా అభిసమాయన్తి; స ఏతా స్తేజోమాత్రా; సమభ్యాదదానో హృదయమేవాన్వ వక్రామతి; స యత్రైష చాక్షుషః పురుషః పరాజ్ పర్యావర్తతే థారూపజ్ఞో భవతి.** **1**

ఈ ఆత్మ– జీవాత్మ దుర్బలమైనట్లుగా అయి (ఆత్మ దుర్బలమవటం అనేది ఉండదు. ఇంద్రియాలు దుర్బలమవటంపట్ల, అదే ఆత్మ దుర్బలమైనట్లుగా అనిపిస్తుంది. అంతే) సమ్మూఢస్థితిని చెంది– వివేకం పోయి, ఏమీ తెలుసుకోలేని స్థితికి వచ్చినట్లుగా అయినప్పుడు అప్పుడే మనం స్పృహలేదు అని అంటాము. (ఆత్మకు విమూఢస్థితి అంటూ ఉండదు– చూచేవారికి అట్లా కనిపిస్తుంది అంతే.) వాక్కు మొదలైన ప్రాణాలు ఆ ఆత్మఎదుట చేరతాయి. (ఆ స్థితిలో ఇంద్రియాలు దేహాన్ని ఎట్లా వదలి వెడతాయో, ఆత్మలోనికి ఎట్లా చేరతాయో చెపుతున్నారు) ఆ స్థితిలో కండ్లు మొదలైన ఇంద్రియాలు తమలోని తేజస్సును; అంటే రూపాదిగ్రహణ శక్తులన్నింటిని, ఉపసంహరించుకొని హృదయంలో అభివ్యక్తమయ్యే విజ్ఞానమయునిలో (ఆత్మలో) చేరిపోతాయి. అప్పుడు ఈ చాక్షుష పురుషుడు (కంటికి అధిదేవత సూర్యుడని తెలుసుకున్నాం గదా ! ఆ

ఆదిత్యాంశ) అన్నివైపుల నుండి వేరైపోతాడు. అంటే భోక్త యొక్క (ఆత్మ యొక్క) కండ్లను అనుగ్రహించటం మానివేసి, తన ఆదిత్య స్వరూపాన్ని పొందుతాడని భావం. ఆ స్థితిలో మరణాసన్నుడైన పురుషుడు రూపాలకు సంబంధించిన జ్ఞానాన్ని కోల్పోతాడు. (అప్పుడే మనం 'ఆ మనిషికి కంటి చూపుపోయింది' అని అంటాం అంటే, స్వప్నావస్థలో లాగానే నేత్రాల్లోను, ఇతర ఇంద్రియాల్లోను ఉండే జ్యోతి ఉపసంహరింపబడుతుంది. అప్పుడు మనం, అతని చూపు పోయిందని, మాట పోయిందని అంటూ ఉంటాము.

**మం॥ ఏకీభవతి, న పశ్యతీత్యాహుః; ఏకీభవతి, న జిఘ్రతీ త్యాహుః, ఏకీభావతి, న రసయిత ఇత్యాహుః; ఏకీ భవతి, న వదతీత్యాహుః, ఏకీభవతి; న శ్రుణోతీ త్యాహుః; ఏకీభవతి, న మనుత ఇత్యాహుః, ఏకీ భవతి, న స్పృశతీత్యాహుః; ఏకీ భవతి న విజావాతీ త్యాహుః తస్య హైతస్య హృదయ స్యాగ్రం ప్రద్యో తతే; తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి- చక్షుష్టోవా, మూర్ధ్నోవా, అన్యేభ్యోవా, శరీర దే శేభ్యః, త ముత్క్రామన్తం ప్రాణో నూత్క్రామతి; ప్రాణమనూత్క్రామన్తం సర్వేప్రాణా అనుత్క్రా మన్తి; స విజ్ఞానోభవతి, స విజ్ఞానమేవాన్వ వక్రామతి, తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ. 2**

**మం॥ తద్యథా తృణజలాయుకా తృణస్యాంతం గత్వాన్య మా క్రమమా క్రమ్యాత్మాన ముపసంహరతి, ఏవ మేవాయమాత్మేదం శరీరం నిహత్య- అవిద్యాం గమయిత్వా- అన్యమాక్రమ మాక్రమ్యాత్మాన ముపసంహరతి. 3**

జీవాత్మ మరియొక శరీరంలో ప్రవేశించటాన్ని దృష్టాంత పూర్వకంగా వివరిస్తున్నారు. జలగ ఒక గడ్డిపోచమీద చివరకుపోయి, మరియొక గడ్డిపరకను పట్టుకొని- ఆశ్రయాన్ని పొంది, శరీరాన్ని ముడుచుకుంటుంది. దానితో మొదటి గడ్డిపోచమీద నున్న దాని శరీరం పట్టు తప్పిపోతుంది. రెండవ గడ్డిపోచమీద పూర్తిగా ఆధారాన్ని పొందుతుంది. అట్లాగే జీవాత్మ లోగడ తానున్న శరీరాన్ని చంపి, దానిని అచేతనంగా చేసి, రెండవ శరీరాన్ని ఆశ్రయంగా పొంది, మొదటి శరీరం నుండి తన్ను తాను ఉపసంహరించుకొంటుంది. అంటే క్రొత్త శరీరంలో ఆత్మభావాన్ని పొందుతుంది. ఇది జీవుడు దేహాంతర ప్రాప్తి- మరియొక శరీరాన్ని పొందే పద్ధతి.

(జలాయుక అంటే జలగ అని అర్థం చెపుతారు. అంతకంటె గడ్డి మీద సంచరించే గొంగళిపురుగును ఉపమానంగా గ్రహిస్తే బాగా సరిపోతుంది. జలగకు నీరు నివాస స్థానం, గడ్డిమీద ఎక్కువగా ఉండదు. రక్తం దాని ఆహారం. కాని గొంగళి పురుగు ఒక ఆకును పూర్తిగా అనుభవించి, దానిని నిస్సారం చేసి, వేరొక ఆకుమీద ఆశ్రయాన్ని సంపాదించి, దేహాన్ని కుంచించి, మొదటి ఆకును వదలివేస్తుంది)

**మం॥ తద్యథా పేశస్కరీ పేశసో మాత్రా మపాదాయాన్య న్నవతరం కల్యాణ తరం రూపం తనుతే, ఏవమేవాయ మాత్మేదం శరీరం నిహత్య- అవిద్యాం గమయిత్వా- అన్నన్నవతరం కల్యాణతరం రూపం కురుతే- పిత్ర్యం వా, గంధర్వ వా, దైవం వా, ప్రాజాపత్యం వా, బ్రాహ్మం వా, అన్యేషాం వా భూతానాం. 4**

కంసాలి (స్వర్ణకారుడు) బంగారవు ముద్దను తీసికొని దానితో క్రొత్తదైనట్టి అందమైనట్టి ఆభరణాన్ని తయారుచేసినట్లుగా, ఈ జీవాత్మ ఈ ప్రస్తుతమున్న రూపాన్ని- శరీరాన్ని పాడుచేసి,- అచేతనావస్థకు చేర్చి, పితృదేవతల రూపం గాని, గంధర్వ రూపంగాని, దేవతల రూపం గాని ప్రజాపతి, బ్రహ్మ, హిరణ్యగర్భ లోకాలను అనుభవించటానికి ఏదో ఒక అందమైన శరీరాన్ని గాని రచించుకుంటాడు. అయితే, ఈ శరీరాలు అతని కర్మనుబట్టి, అతని ఉపాసనను బట్టి సిద్ధిస్తాయి. ఈ పైన చెప్పినవే కాక ప్రేతరూపం, పక్షుల రూపాలు కూడా కర్మను బట్టి లభించవచ్చు.

**మం॥ స వా ఆయమాత్మా బ్రహ్మ విజ్ఞానమయో మనో మయః ప్రాణమయశ్చ క్షుర్మయః శ్రోత్రమయః పృథివీ మయ ఆపోమయో వాయుమయ ఆకాశమయస్తేజో మయో తేజోమయః కామమయో కామమయః క్రోధమయో క్రోధమయో క్రోధమయః ధర్మయో ధర్మమయః సర్వమయ స్తద్య దేతదిదంమయో దోమయ ఇతి, యథాకారీ యథాచారీ తథాభవతి- సాధు కారీ సాధుర్భవతి, పాపకారీ పాపోభవతి, పుణ్యః పుణ్యేనకర్మణా భవతి, పాపః పాపేన అథోఖల్వాహుః కామమయ ఏవాయం పురుష ఇతి; స యథాకామో భవతి తత్క్రతుర్భవతి, యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే, యత్కర్మ కురుతే తదబి సంపద్యతే. 5**

ఈ ఆత్మయే బ్రహ్మ. ఈ బ్రహ్మము విజ్ఞానమయము, అంటే విజ్ఞానము అని నిరూపింపబడినది. అట్లాగే ఈ బ్రహ్మము మనోమయము- మనస్సుగా నిరూపింపబడినది. అదే విధంగా ప్రాణమయము, చక్షుర్మయము, శ్రోత్రమయము. పృథివీమయము, జలమయము, వాయమయము, ఆకాశమయము, తేజో మయము, అతేజోమయము, కామమయము- కోరికగా నిరూపింపబడినది. ఆకామమయము, క్రోధమయము, అక్రోధమయము, ధర్మయము, ఆధర్మ మయము, సర్వమయము, అంటే, మనకు ఈ శరీరంలో, ఈ సృష్టిలో కనిపించే సమస్తము బ్రహ్మమయమని తేలుతోంది గదా ! ఇంకా విపులంగా చెపుకోవాలంటే ఈ జీవాత్మ విజ్ఞానంతో, తన్యత్వాన్ని- అభేదాన్ని పొందినపుడు అది విజ్ఞానమయము, అట్లాగే, అధర్మంతో అభేదాన్ని పొందినపుడు ధర్మమయం, అధర్మంతో అభేదాన్ని పొందితే ఆధర్మమయ మౌతుంది. ఈ విధంగా మంచి చెడ్డలు సమస్తం, ప్రత్యక్ష పరోక్షవస్తువులు సమస్తము, ఆ బ్రహ్మమే ! ఏ విధమైన

తాదాత్మ్యాన్ని– అభేదాన్ని పొందితే ఆ రూపంగా కనిపిస్తాడు కాబట్టి శుభుడుగాను, అశుభుడుగాను కూడా కనిపిస్తాడు. పుణ్యాత్ముడుగాను, పాపాత్ముడుగాను కూడా కనిపిస్తాడు. పుణ్యకర్మలతో తాదాత్మ్యంపొందితే పుణ్యాత్ముడు. పాపకర్మలతో తాదాత్మ్యం చెందితే పాపాత్ముడు. ఈ పురుషుడు కామమయుడు –కోరికలు, కలవాడు. అతడు ఏ విధమైన కోరికలు కోరుతాడో ఆ విధమైన సంకల్పాలే కలుగుతాయి. ఎటువంటి సంకల్పాలు కలుగుతాయో అటువంటి పనులలోనే ఇంద్రియాది సాధనాలు ప్రవృతమౌతాయి. (ఆచరిస్తాయి) కాబట్టి బ్రహ్మకు ఈ సంసార మయత్వం రావటానికి కారణం కోరిక (కామన) అని తేలుతోంది గదా !

(ఆత్మయే బ్రహ్మ అన్నారు. అంటే కూటస్థుడు, సాక్షి అయిన ఆత్మయే, ఆకలి దప్పికలు లేని, అపరోక్షాది లక్షణాలకు లక్ష్యమైన పరబ్రహ్మ అన్నారు. ఈ ఆత్మ విజ్ఞానమయము అన్నారు. అంటే ఆకలి దప్పికలు మొదలైనవి పరబ్రహ్మకులాగానే లేకపోయినా బుద్ధిచేత ఉపలక్షితమైనందున, విజ్ఞానమయుడు లేక బుద్ధిప్రాయుడైనాడు. ఈ విజ్ఞానమయాత్మనే పై వర్ణించారు.)

**మం॥ త దేష శ్లోకో భవతి. తదేవ సక్తః సహ కర్మణైతి లింగం మనో యత్ర నిషక్తమస్య. ప్రాప్యాన్తం కర్మణ స్తస్య యత్కించేహకరోత్యయం. తస్మాల్లోకా త్పునరైత్యస్మై లోకాయ కర్మణే. ఇతి ను కామయమానః; అథా కామయమానః యో కామో నిష్కామ ఆప్తకామ ఆత్మ కామో న తస్య ప్రాణా ఉత్క్రామన్తి, బ్రహ్మైవ సన్బ్రహ్మా ప్యేతి. 6**

ఆ విషయాన్నే ఈ శ్లోకం చెపుతోంది.

మనస్సే ప్రధానంగా కల లింగిదేహం దేనియందు మిక్కిలి ఆసక్తి కలిగి ఉంటుందో దానియందే అభిలాషను ప్రకటిస్తూ, కర్మతోబాటు దాని ఫలాన్ని కూడా పొందుతుంది. అంటే, ఆసక్తికి తగినట్టి అభిలాష (కోరిక) ఆ కోరికకు తగినట్టిపని, ఆ పనికి తగినట్టి ఫలం– ఇది ఒక క్రమం. జీవుడు ఈ ప్రపంచంలో చేసినట్టి కర్మకు తగినట్టి ఫలాన్ని పొంది, తరువాత లోకం నుండి మళ్ళీ కర్మచేయటానికి మనుష్యలోకానికి వస్తాడు; అంటే, మానవలోకం కర్మ ప్రధానమైనది. అయినప్పటికి ఫలంమీద ఆసక్తి వల్ల పరలోకానికి పోతాడు. మళ్ళీ కర్మచేయటానికి మనుష్యలోకానికి వస్తాడు. అంటే, కోరికలున్నవాడు అతడు చేసిన కర్మననుసరించి శుభాశుభ ఫలాలు పొందుతూ ఉంటాడు. ఇక కోరికలు లేనివాడి విషయం ! కోరికలు లేనివానిని అకాముడు, నిష్కాముడు, ఆప్తకాముడు, ఆత్మకాముడు అని అంటారు. అటువంటి తత్వజ్ఞానియైన వానియొక్క లింగదేహ రూపంలో ఉన్న ప్రాణాలు ఉత్క్రమణం చెంది; మరొక దేహం పొందటం జరగదు, అంటే, నిష్కాముడు కాబట్టి, కర్మశేషం లేదు కాబట్టి, శరీరం నుండి ప్రాణాలు పోయిన తరువాత మరొకదేహాన్ని పొందటమనేది జరగదు. అటువంటి నిష్కాముడు,– తత్త్వవేత్త బ్రహ్మ స్వరూపాన్ని పొంది బ్రహ్మమే అవుతాడు.

**మం॥ త దేష శ్లోకో భవతి యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే స్యహృది శ్రితాః అథ మృత్యో మృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుత ఇతి. తద్యథాహి నిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తాశయీత, ఏమమే వేదం శరీరం శేతే అథాయ మశ రీరో మృతః ప్రాణో బ్రహ్మైవ తే ఏవ; సో హం భగవతే సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః.** **7**

వెనుక చెప్పిన విషయాన్నే పై శ్లోకం ఇంకా విపులీకరిస్తోంది.

వెనుకటి మంత్రంలో కోరికలు లేనివానికి బ్రహ్మప్రాప్తి అవుతుందని చెప్పారు. ఈ మంత్రంలో తత్వజ్ఞాని, సామాన్యునివలె ఉత్క్రమణం చేయడని చెపుతున్నారు. ప్రాణోత్క్రమణమనేది సామాన్య దృష్టికి అందరిలోను ఒకే విధంగా ఉంటున్నట్లు కనిపిస్తుంది. కాని సామాన్యులకు, బ్రహ్మజ్ఞానికి ఈ విషయంలో ఉన్న భేదాన్ని చెపుతున్నారు.

పైన చెప్పినట్లుగా తత్వజ్ఞానియొక్క హృదయంలో ఉన్న కోరికలన్నీ సమూలంగా నాశనమైపోగానే అంతవరకు మరణ స్వభావం కల ఆ పురుషుడు అమరుడౌతాడు– అమరణ స్వభావుడౌతాడు– అయితే ప్రస్తుత శరీరం ఉందికదా ! ఏది ఏమవుతుంది? అది ఉండగానే అమరణధర్ముడు ఎట్లా అవుతాడు ? అనేది సందేహం. దానికి సమాధానంగా చెపుతున్నారు. ఏమని? ప్రస్తుతమున్న శరీరంతోనే అతడు బ్రహ్మను పొందుతాడు. ఎట్లా ? ఈ విషయమే దృష్టాంతంతో వివరిస్తున్నారు. పాము కుబుసాన్ని పుట్టరంధ్రం పైన వదలివేస్తుంది. ఆ కుబుసంలో ప్రాణంలేదు. అది చచ్చిపోయిన కుబుసం. ఆ విధంగా కుబుసాన్ని వదలివేసిన సర్పంలాంటివాడు ముక్తపురుషుడు. ఆ ముక్త పురుషునిచేత విడువబడిన ఆత్మలేని దేహం (అనాత్మదేహం– శవం) కుబుసం చచ్చినదానిలాగా పడి ఉంది. అంటే, కామాదులు తొలగి పోవటం చేత ఇప్పుడు అశరీరుడైనాడు. మరణధర్మం కల శరీరం లేదుకాబట్టి అతడు అమృతుడు. అయితే ప్రాణనక్రియ చేస్తున్నాడు, కాబట్టి ప్రాణం ఉంది. పరమాత్మ ప్రాణ శబ్ద వాచ్యుడు– ప్రాణానికి ప్రాణం. ఇది శరీరం లేని అమరమైన ప్రాణం– అమృత ప్రాణం– చావని ప్రాణం; అని పిలువబడే చేతనాత్మ బ్రహ్మమే గదా ! అదే తేజస్సు – విజ్ఞానజ్యోతి. అంటే దేహధ్యానం కారణంగా ప్రతీతమయ్యే ఈ సంసారం ఆ తత్త్వవేత్తను సంతప్తం చేయదు. అంటే, ప్రాణనక్రియ చేస్తున్నా, భజన భాజనాదులు చేస్తున్నట్లు కనిపిస్తున్నా, ఈ సంసారం అతనిని బంధించదు– సంతప్తం చేయదు– కోరికలు లేని కారణంగా ! అదే ముక్తి ! శరీరం ఉండగానే మోక్షం అంటే ఇదే ! ఆ శరీరం మీద కోరిక లేని కారణంగా అది చచ్చినట్లే ! కోరిక లేదు కాబట్టి, కర్మనిశ్శేషం అయింది కాబట్టి, ఇక జన్మలేదు– జీవన్ముక్తి పద్ధతి ఇది.

ఇది విని, జనకుడన్నాడు– ఓ మహానుభావా ! జనకుడనైన నేను మీకు వేయి గోవుల్ని యిస్తున్నాను.

**మం॥ తదేతే శ్లోకా భవన్తి. అణుః పన్థా వితతః పురాణో మాం స్పృష్టోనువిత్తో మయైవ. తేనధీరా అపియన్తి బ్రహ్మవిదః స్వర్గం లోకమిత ఊర్ధ్వం విముక్తాః. 8**

ఈ విషయాన్ని గురించే ఇంకా చెపుతున్నారు.

ఈ జ్ఞాన మార్గం దుర్విజ్ఞేయమైనది– తెలుసుకోవటం చాలాకష్టం. అందుచేత చాలా సూక్ష్మమైనది. ఈ జ్ఞానమార్గం చాలా విస్తృతమైనది ఇది మోక్షానికి సమర్ధవంతంగా తీసికొనిపోతుంది. వేదాలలో చెప్పబడినది అవటంవల్ల ఈ జ్ఞానమార్గం చాలా పురాతనమైనది. ఆ బ్రహ్మవిద్యా రూపమైన జ్ఞానమార్గం నాకు లభించటంవల్ల ముక్తి నన్ను పొంది ఉంది. ముక్తినాకు లభించింది. ఈ జ్ఞానమార్గం లేక బ్రహ్మవిద్యా మార్గం ద్వారానే బ్రహ్మవేత్తలైన ఇతరులు కూడా బ్రతికి ఉండగానే ముక్తులైనవారు. అంటే, కోరికలు నశించి ఆప్తకాములు, ఆత్మకాలము అయినారు. కాబట్టి శరీర సంబంధం వదలిపోయింది. ఇక ప్రారబ్ధకర్మక్షయంకాగానే పూర్వం చేసిన కర్మల ఫలం అనుభవించటం పూర్తికాగానే – మోక్షాన్ని పొందుతారు. ఇక జన్మ అనేది ఉండదు.

**మం॥ తస్మిన్ శుక్లముత నీలమాహుః పింగలం హరితం లోహితం చ ఏష పన్థా బ్రహ్మణా హానువిత్తః, తేనైతి బ్రమ్మవిత్పుణ్యకృత్తైజసశ్చ. 9**

ఈ మోక్షమార్గం విషయమై ముముక్షువులలో అభిప్రాయభేదం కనిపిస్తుంది. కొందరు ఇది (ఈ మోక్షమార్గం) శుక్ల వర్ణం– (తెలుపు రంగు) అని, కొందరు నీలపు రంగు అని, కొందరు ధూసరవర్ణమని, కొందరు ఆకుపచ్చ రంగు అని కొందరు ఎరుపు వర్ణమని అంటారు.

అంటే ఆ మార్గం ఆ రంగులో కనిపిస్తుందని అంటారు. యదార్థానికి శ్లేష్మాది రసాలతో నిండివుండటంవల్ల (అధ్యాయం 4. బ్రా 3 .మం 20) సుషుమ్నాది నాడులలో, సాధకునికి– హఠ యోగాదియోగులకు– ఈ విధమైన భ్రాంతులు కలుగుతాయి. (అభిప్రాయభేదమనేది హఠ యోగాది యోగ సాధకులకు, కేవల బ్రహ్మజ్ఞానులకు ఉన్న అభిప్రాయభేదంగా గ్రహించాలి) అటువంటి భ్రాంతులైనా కావచ్చు లేదా ఆది బ్రహ్మ మార్గం కాక వేరొకటి కావచ్చు– ఆదిత్య మార్గంలాగా – ఈ ఆదిత్య మార్గం వంటివి క్రముకుక్తికి సాధనాలు– అంటే, ఉపాస్యంలో (ఆదిత్యునిలాగా) లీనమై కల్పాతంంలో ఆ ఆదిత్యాది ఉపాస్యులతోబాటు కరబహ్మలో ఐక్యం కావటం. ఈ మోక్షమార్గమనేది సాక్షాత్తు పరబ్రహ్మద్వారా మాత్రమే అనుభూతమయ్యేది. దీనికి ఏ వర్ణమూ ఉండదు. ఆ మార్గం గుండా పుణ్యపురుషుడైనా బ్రహ్మవేత్త పరమాత్మ తేజాన్ని పొందుతాడు– తేజ స్వరూపుడైన పరమాత్మతో ఏకమౌతాడు.

యోగులకు వివిధ వర్ణాలుగా కనిపించే ఈ అనుభూతలన్నీ బ్రహ్మ మార్గాన్ని సూచించవని, హిరణ్య గర్భలోకానికి మార్గాన్ని మాత్రమే సూచిస్తాయని బ్రహ్మవేత్తల మతం. వారి అభిప్రాయం

ప్రకారం కోరికలన్నీ నశించినాయి కాబట్టి, కర్మశేషం లేదు కాబట్టి పునర్జన్మ అనేది అసంభవం. ఈ విధమైన (ఆత్మకామ, ఆప్తకాములు) బ్రహ్మవేత్త, బ్రహ్మజ్యోతిలోనే తనను లీనం చేసుకుంటాడు. ఆ జ్యోతికి ఏ విధమైన రంగు ఉండదు.

**మం॥ అంధం తమః ప్రవిశన్తి యే విద్యాముపాసతే తతో భూయ**
**ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః. 10**

విద్య, అవిద్య వీటిని ఉపాసించటంవల్ల కలిగే ఫలితాలను గూర్చి చెపుతున్నారు– అవిద్యను (కర్మను) ఉపాసించేవారు అంధకారంలోకి ప్రవేశిస్తున్నారన్నమాట. ఈ కర్మకాండలతో కూడినట్టి త్రయీవిద్య యందు (ఋక్, యజుస్, సామవేదాల యందు) అనురక్తులై యుండేవారు అంతకంటె అంధకారంలో పడిపోతారు. అంటే ఉపనిషత్తులో చెప్పబడిన జ్ఞానమార్గాన్ని ఉపేక్షించి కేవలం కర్మలు. వేదాధ్యయనాదులు చేసేవారు అజ్ఞానం అనే అంధకూపంలో పడిపోతారు. (ఇదే విషయం ఈ శోషనిషత్తు 9వ మంత్రంలో యథాతథంగా చెప్పబడ్డది.)

**మం॥ అనన్దా నామ తేలోకా అంధేన తమసావృతాః**
**తాం స్తే ప్రేత్యాభిగచ్ఛ న్త్యవిద్వాంసో బుధే జనాః. 11**

పైన చెప్పబడిన కర్మిష్ఠులు కేవలాధ్యయనపరులు పోయే లోకాలు సుఖరహితమైనవి. ఘోరమైన అంధకారంతో నిండినవి. అంటే పైన చెప్పిన ఆ కర్మిష్ఠులకు, కేవలాధ్యయన పరులకు మోక్షం లభించదు. స్వర్గాదులు లభించినా అవన్నీ మళ్ళీ జన్మమరణాల్ని, సుఖదుఃఖాల్ని ఇచ్చేవే ! ఆత్మజ్ఞానం మాత్రమే మోక్షానికి ఏకైక సాధనమని భావం. (ఇదే భావం ఈశోషనిషత్తు 3వ మంత్రంలో చెప్పబడ్డది.)

**మం॥ ఆత్మానం చేద్విజానీయాదమస్మీతి పూరుషః**
**కిమిచ్ఛన్కస్య కామాయ శరీర మమసం జ్వ రేత్. 12**

మానవుడు జ్ఞానంద్వారా 'నేను నిత్యుడు, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావంగల బ్రహ్మను' అని తెలుసుకోగలిగితే,అటువంటివాడు కోరదగినది ఇక ఏ వస్తువూ ఉండదు. అంటే, ఆత్మజ్ఞానం కలిగిన తరువాత, సాధకుడు కోరేందుకు కోరికలు ఉండవు– కోరికలు ఉండవు కాబట్టి కర్మ, కర్మ బంధనాలు ఉండవు. అటువంటి ఆత్మజ్ఞానం కలిగినవాడు భోగాల కోసమూ ఈ శరీరం వెంటపడీ బాధపడనక్కరలేదు– ఆత్మదర్శియైన ఆ సాధకుని జన్మమరణాది దుఃఖాలేవీ బాధించవు. ఆత్మజ్ఞాని స్థితి ఈవిధంగా ఉంటుందని తాత్పర్యం.

**మం॥ యస్యానువిత్తః ప్రతిబుద్ధ ఆత్మా స్మిన్సందేహ్యే గహనే ప్రవిష్టః స**
**విశ్వకృత్, స హి సర్వస్య కర్తా, తస్య లోకః స ఉ లోక ఏవ 13**

ఈ శరీరమనేది అనే అనర్థాలతో కూడినది. వివేక విజ్ఞానాలకు శత్రువులాంటిది. ఇది విషమస్థానం. అటువంటి ఈ శరీరంలో ప్రవేశించి ఉన్నట్టి ఆత్మను తెలుసుకోగలిగినట్టి వివేకవంతుడు, ఆ ఆత్మను పొందగలిగినట్టి జ్ఞాని, కృతకృత్యుడైనట్లే ! అట్టివాడు అన్ని కర్మలు చేసినట్లే ! ఈ లోకమంతా అతనిదే ! అతడే ఈ విశ్వస్వరూపుడైన ఆత్మగదా !

**మం॥ ఇహైవ సన్తో థ విద్మస్తద్వయం, న చేదవేదిర్మహతీ వినష్టిః**
**యే తద్విదురమృతాస్తే భవన్తి, అథేతరే దుఃఖ మేవాపియన్తి. 14**

ఇటువంటి అనర్థాలతో కూడినట్టి ఈ శరీరంలో ఉంటూనే మనం ఆ ఆత్మతత్త్వాన్ని గూర్చి తెలుసుకోగలిగితే కృతకృత్యులమౌతాము. లేకపోతే ఈ జన్మవల్ల మనకు గలిగే నష్టం ఇంతింత అనరానిది. అందుచేత ఆ తత్త్వాన్ని ఆత్మభావంతో తెలుసుకొన్న- ఆత్మసాక్షాత్కారాన్ని పొందినట్టి సాధకుడు మృత్యువును జయిస్తాడు- అంటే జనమరణాలను జయిస్తాడు. కాబట్టి అదే మోక్షం. ఆ విధంగా ఆత్మతత్త్వాన్ని సాక్షాత్కరించుకోలేని వారు జన్మ మరణాది దుఃఖాలు పొందుతూనే ఉంటారు.

**మం॥ యదైతమనుపశ్యన్త్యాత్మానం దేవమఞ్జసా ఈశానం**
**భూతభవ్యస్య, న తతో విజుగుప్సతే. 15**

భూతభవిష్యత్తులలో కూడా సమస్తాన్నీ శాసించేటటువంటి, ప్రకాశమయుడై నట్టి, కర్మఫల ప్రదాత (మనం చేసిన కర్మలకు ఫలాన్ని ఇచ్చే) అయిన ఆత్మను తెలుసుకోవాలి. ఎట్లా? గురువుయొక్క ఉపదేశాన్ని వినటం ద్వారా, శాస్త్రాలను వినటం ద్వారా తెలుసుకోవాలి. ఆ విధంగా తెలుసుకొని అపరోక్షరూపంలో ఆత్మసాక్షాత్కారం పొందినప్పుడు సాధకుడైన వాడు తన శరీరాన్ని తాను కాపాడుకోవాల్సిన అగత్యం ఉండదు. ఎందుచేత ? అతడు బ్రహ్మవేత్త ! బ్రహ్మవేత్తకు భయం ఉండదు. శరీర రక్షణ కోసం కోరిక కలగదు. అంటే అద్వయ స్థితిలో- ఒకడే అయినప్పుడు భయం ఉండదు. ఇతరులను చూచి గదా భయపడేది రెండవవాడు లేనప్పుడు శరీర రక్షణ ప్రయాత్నమూ ఉండదు. తన్నుతాను పరోక్షంగా ఉంచుకోవాల్సిన అగత్యమూ లేదు. సర్వాత్మ భావం కలిగినప్పుడు స్వీయ రక్షణ, పర నింద అనేవి ఉండనే ఉండవు.

**మం॥ యస్మాదర్వాక్సంవత్సరో హోభిః పరివర్తతే. తద్దేవా**
**జ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతే మృతమ్ 16**

పరమాత్మకు లోబడే సంవత్సరాలు, అహోరాత్రాలు తమ అవయవాలతో సహా (కాలానికి ఆనవాలు సంవత్సరాలు, నెలలు, పక్షాలు, రోజులు, గంటలు మొదలైనవి. పరమాత్మ

కాలస్వరూపుడు) తిరుగుతూ ఉంటాయి. మనకు కనిపించే సూర్యుడు, నక్షత్రాలు మొదలైన రోచిస్సులన్నింటికి జ్యోతిని ఇచ్చేవాడు ఆ పరమాత్మే. అతడు అమరణ ధర్ముడు– శాశ్వతుడు. అటువంటి అమరణ ధర్ముడు కాలనియంత అయిన పరమాత్మను, దేవతలు అయుర్ధాయాన్ని కోరినవారై ఆయుర్బ్రహ్మరూపంలో ఉపాసిస్తారు. పరమాత్మ ఆయుస్వరూపుడు కాబట్టి, ఆయుర్ధాయాన్ని కోరేవారు ఆయుర్ధాయ గుణంగా కలవానినిగా ఉపాసించాలి. అట్లా చేస్తే దీర్ఘాయుష్మంతులౌతారు అని భావం.

**మం॥ యస్మిన్పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః త మేవ**
**మన్య ఆత్మానం విద్వాన్బ్రహ్మామృతో మృతమ్.17**

పరబ్రహ్మయందు ఐదేసిగాగల అయిదు సమూహాలు ఉన్నాయి అంటే ఒక్కొక్క సమూహంలో ఐదేసి ఉన్నాయి (1) గంధర్వులు పితరులు, దేవతలు, అసురులు, రాక్షసులు (2) బ్రాహ్మణు, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిషాదులు, (3) ప్రాణ, అపాస, వ్యాన, ఉదాన, సమానములు (4) పృథివి జలం, తేజస్సు వాయువు; ఆకాశం (5) కండ్లు, చెవులు, ముక్కు, నోరు, చర్మములు లేదా త్తైత్తిరీయంలో చెప్పిన పొంక్తాలను చెప్పుకోవచ్చు) నీటితోపాటు అవ్యాకృతమైన ఆకాశం ఉంది. అటువంటి ఆ ఆత్మనే (సర్వాత్మనే అవినాశియైన పరబ్రహ్మనుగా భావిస్తున్నాను. ఇందుకు భిన్నమైనదానిని నేను ఆత్మగా అంగీకరించను. అవిద్యతో ఉన్నంతకాలం మృతుడనుగానే ఉన్నాను. ఇప్పుడు ఆ అజ్ఞానం తొలగిపోయింది. కాబట్టి ఈ ఆత్మను తెలుసుకోగలిగిన నేను (బ్రమ్మవేత్తను కాబట్టి) అమృతుడనే !

**మం॥ ప్రాణస్య ప్రాణముత చక్షుష శ్చక్షురుత శ్రోత్రస్య శ్రోత్రం మనసో**
**యే మనో విదుః తే ని చిక్యు ర్బ్రహ్మ పురాణమగ్ర్యం. 18**

పరబ్రహ్మయొక్క శక్తివల్లనే అంటే, అతడు అధిష్టించి ఉన్నందువల్లనే నేత్రాదుల్లో చూచేశక్తి వచ్చింది పరమాత్మవల్లనే ఇంద్రియాలన్నింటికి వాటి వాటి విషయాలను గ్రహించే శక్తి వచ్చిందని భావం. అట్టి ఆ పరబ్రహ్మను ప్రాణానికి ప్రాణంగా, నేత్రానికి నేత్రంగా, శ్రోత్రానికి శ్రోత్రంగా మనస్సుకు మనస్సుగా (అంటే ఈ ఇంద్రియాలన్నిటిలోకి చోదకశక్తిగా) ఎవరు తెలుసుకోగలుగుతారో వారు పురాతనుడైనట్టి ఆ పరబ్రహ్మను తెలుసుకోగలుగుతారు.

**మం॥ మనసైవానుద్రష్టవ్యం, నేహ నానాస్తి కించన, మృత్యోః స**
**మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి. 19**

పరమార్థ జ్ఞానంతో, పరిశుద్ధమైన మనస్సుతో మాత్రమే, గురూపదేశం పొందటం ద్వారా పరబ్రహ్మను దర్శించాలి. పరమార్థజ్ఞానం, పరిశుద్ధమైన మనస్సు ఈ రెండూ ముఖ్యం. తరువాతనే

గురూపదేశం ఉపకరిస్తుంది. ఆ పరబ్రహ్మలో అనేకత్వం లేదా నానాత్వం అనేది ఏమీలేదు. నానాత్వాన్ని భేదదర్శియైనవాడు మాత్రమే చూస్తాడు. ఈ విధంగా పరమాత్మతో అనేకత్వాన్ని (భేదభావాన్ని) చూచేవాడు ఒక మృత్యువు నుండి ఇంకొక మృత్యువుకు పోతాడు. భేదదృష్టికి అజ్ఞానం కారణం. దానివల్ల మాటిమాటికి పుడుతూ చస్తూ ఉంటాడని తాత్పర్యం.

**మం॥ ఏకధైవానుద్రష్టవ్య మేతదప్రమయం ధ్రువమ్ విరజః**
**పర ఆకాశాదజ ఆత్మా మహాన్ధ్రువః. 20**

ఆచార్యుని ఉపదేశం పొందిన తరువాత, ఆ బ్రహ్మను– ఆకాశం లాగా– లోపల, బయట కూడా శూన్యంగా ఉండే విజ్ఞాన ధనుని రూపంలో దర్శించాలి. ఆ పరబ్రహ్మ ఒక ప్రమాణం (రుజువు) చూపించేందుకు విషయం కాదు. ఆ పరబ్రహ్మము ధృవము, నిర్మలము, ఆకాశం కంటె సూక్ష్మము, జన్మలేనిది, నాశనము లేనిది, గొప్పదైనట్టి ఆత్మయే !

**మం॥ తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః. నాను**
**ధ్యాయాత్ బహూన్ శబ్దాన్, వాచో విగ్లానం హి తదితి. 21**

అధికంగా శాస్త్రాభ్యాసం చెయ్యటం కూడా బ్రహ్మనిష్ఠకు ఆటంకమే అనే విషయం చెపుతున్నారు.

బుద్ధిమంతుడైన బ్రాహ్మణుడు (బ్రహ్మనిష్ఠ గలవాడు) బ్రహ్మను మాత్రమే తెలుసుకొని– అనవసరమైన ఇతర విషయాలు వదలిపెట్టి ఆ పరబ్రహ్మమీదనే మనస్సు లగ్నం చేయాలి. అనేక మాటలను గురించి ఆలోచించకూడదు– అదంతా వాక్పరిశ్రమ మాత్రమే ! అందుకునే ముండకోపనిషత్తులో ఆత్మను ఓంకారంగా ధ్యానం చేయమన్నారు. ఓంకారం మిక్కిలి సూక్ష్మమైన శబ్దప్రతీక (బ్రహ్మకు) ఎక్కువమాటలు మాట్లాడటం గాని లేక శ్రమకు మాత్రమే కారణమౌతుంది– ఉపయోగమేమీ ఉండదు.

**మం॥ స వా ఏష మమానజ ఆత్మా యో యం విజ్ఞాన మయః, ప్రాణేషు య ఏషో న్తర్హృదయ ఆకాశ తస్మింఛేతే, సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధి పతిః; స న సాధునా కర్మణా బూయాన్, నో ఏవా సాధునా కనీయాన్, ఏష సర్వేశ్వరః; ఏష భూతాధి పతిః ఏష భూతపాలః, ఏష షేతుర్విధరణ ఏషాం. లోకానాం అసంభేదాయ; తేమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిధిషన్తి యజ్ఞేన దానేనే తపసా నాశ కేన, ఏవ మేవ విదిత్వా మునిర్భవతి. ఏత మేన ప్రవా జినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి ఏతద్ధస్మ వైతత్ పూర్వే విద్వాంసః ప్రజాం న కామయన్తే, కిం ప్రజయా కరిష్యామో యోషాం నో యమాత్మాయం లోక ఇతి, తే**

**హస్మ పుత్రైషణాయాశ్చ విత్తైసణా యాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థ్యాయాథ భిక్షా చర్యం చరన్తి; యా హ్యేవ పుత్రైషణా సా విత్తైషణా, యా విత్తైషణా సా లోకైషణా, ఉభే హ్యేతే ఏషణే ఏవ భవతః! స ఏష నేతి నేత్యాత్మా, అగృహ్యో నహి గృహ్యతే, అశీర్యో నహి శీర్యతే, అసంగో నహి సజ్యతే, అసితో న వ్యథతే, న రిష్యతి; ఏతము హైవైతే న తరత ఇతి- అతః పాపమకరపమితి, అతః కల్యాణమకరపమితి; ఉభే ఉ హైవైష ఏతే తరతి, వైనం కృతాకృతే తపతః. 22**

బంధనాలను, మోక్షాన్ని సహేతుకంగా ప్రతిపాదించారు. మోక్ష స్వరూపాన్ని నిరూపించారు. ఇక ఈ ఆత్మ విషయంలో వేదమంతా ఏ విధంగా వినియుక్తమౌతుందో- ఉపయోగపడుతుందో చెప్పాలి. అందుకోసం ఈ మంత్రం ఆరంభిస్తున్నారు.

జన్మరహితుడు, మహత్తత్త్వమునై ఆత్మయే ప్రాణుల్లో విజ్ఞానమయంగా, స్వయం జ్యోతిగా ఉంటుంది. హృదయంలో ఉన్న ఆకాశంలో ఆ పురుషుడు ఉంటాడు. అతడే అన్నిటిని తన అధీనంలో ఉంచుకొనే శాసకుడు. అన్నిటికి- ఇంద్రియాలన్నింటికి అధిపతి. అతడు శుభకర్మల వల్ల వృద్ధిపొందడు- అతనికి శుభకర్మల వల్ల గొప్పదనం రాదు. అశుభ కర్మల వల్ల క్షీణించడు- శుభాశుభ కర్మలు అతనికి అంటవు. అతడు సర్వేశ్వరుడు. సమస్త భూతాలకు అధిపతి- పాలకుడు. ఈ భూలోకం మొదలైన లోకాలకు సరిహద్దుకట్టలాగా వేరు వేరుగా ఉండేటట్లు ఈ లోకాలను ధరించి ఉంటాడు. అటువంటి ఈ ఆత్మను బ్రహ్మ జిజ్ఞాసువులైనవారు, జాతిచేత బ్రాహ్మణులైనవారు వేదాధ్యయనము, యజ్ఞ, దాన, నిష్కామ తపస్సుల ద్వారా తెలుసుకోవటానికి (ఆత్మను) ప్రయత్నిస్తూ ఉంటారు. ఆ ఆత్మను తెలుసుకొని మౌనులౌతారు. ఈ ఆత్మలోకాన్ని కోరుతూ ఉండే త్యాగులు సమస్తాన్ని పరిత్యజించి సన్న్యాసులౌతారు. పూర్వం ఋషులు (సన్యాసులు) సంతానాన్ని కోరేవారు కారు, అని చెపుతారు. ఎందుచేతనంటే, 'మనం ఈ సంతానం వల్ల పొందేది ఏముంటుంది? మోక్షకాములం కాబట్టి ఈ ఆత్మలోకాన్ని పొందటమే మనం అభీష్ట' అనుకొనేవారు. ఈ విధంగా తలచి, నిశ్చయించుకొని, ముముక్షువులు పుత్రైషణ, ధనైషణ, లోకైషణ అనే ఈ ఏషణత్రయాన్ని అతిక్రమించి, భిక్షాటన చేస్తూ ఉండేవారు. పుత్రైషణ అంటే ధనైషణ అన్న మాటే ! ధనైషణ అంటే లోకైషణ అన్నమాటే ఈ ఏషణలన్నీ ఒకదానికొకటి సాధ్య సాధనాలు. 'నేతి నేతి' (ఆత్మ అనేది ఇదికాదు, ఇదికాదు) మొదలైన మహాతత్త్వ వాక్యాలద్వారా చెప్పబడి, నిర్ధారింపబడిన ఆ ఆత్మ గ్రహించటానికి వీలుకానిది- పట్టువడనిది, అది అశీర్యము- కాబట్టి నాశనంలేనిది. అది అసంగము- కాబట్టి దేనినీ అంటదు. అది దేనిచేత బంధింపబడదు. బంధింపబడి లేదు- కాబట్టి దుఃఖమూ లేదు, నాశనమూ లేదు.

ఈ విధమైన ఆత్మజ్ఞానిని మాత్రమే ధరాధర్మ సంబంధమైనట్టి హర్షశోకాలు బాధించవు. అతనికి 'నేను పాపం చేశాననే పశ్చాత్తాపం గాని, నేను పుణ్యం చేశాను' అనే సంతోషంగాని ఉండవు. ఇటువంటి ద్వంద్వాలకు (కష్ట సుఖాలు, పాప పుణ్యాలు, హర్షశోకాలు మొదలైనవి) అతడు అతీతుడు. అందుచేతనే అటువంటి తత్త్వవేత్త చేసినట్టి నిత్యనైమిత్తక కర్మలుగాని, చేయనట్టి కర్మలుగాని ఫలాన్ని ఇవ్వవు. చేయనందువల్ల ప్రత్యవాయం కలుగదు- పాపం రాదు. అని భావం.

**మం॥ త దేతదృచాభ్యుక్తమ్ ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న వర్ధతే కర్మణా నో కనీయాన్. తస్యైన స్యాత్పదవిత్; తం విదిత్వా న విప్యతే కర్మణా పాపకేన. ఇతి, తస్మాదేవం విచ్ఛాన్తో దాన్త ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాత్మన్యే వాత్మానం పశ్యతి, సర్వమాత్మానం పశ్యతి; నైనం పాప్మా తరతి, సర్వం పాప్మానం తరతి నైనం పాప్మా తరతి, సర్వం పాప్మానం త పతి విపాపో విరజో విచికిత్సో బ్రాహ్మణో భవతి; ఏష బ్రహ్మ లోకః సమ్రాట్; ఏవం ప్రాపితో సీతి హోవాచ యాజ్ఞవల్క్యః; సో హం భగవతే విదేహాఀ దదామి, మాం చా పి సహ దాస్యాయేతి. 23**

బ్రాహ్మణుని ద్వారా- బ్రహ్మజ్ఞాని ద్వారా చెప్పబడిన విషయమే ఈ మంత్రం ద్వారా వ్యక్తం చేయబడ్డది. 'నేతి, నేతి' అనే శ్రుతివాక్యం ద్వారా ప్రతిపాదింపబడిన బ్రహ్మను దర్శించినవాని మహిమ కర్మలు చేసినందువల్ల పెరగదు- కర్మలు చేయనందు వల్ల తరగదు. అందుచేత ఆ మహిమయొక్క స్వరూపాన్ని- బ్రహ్మను- తెలుసుకోవాలి. ఆ విధంగా తెలుసుకొన్న వానిని ధర్మాధర్మ కర్మల యొక్క ఫలం అంటదు. పుణ్య పాపాలు వానిని అంటవు. ఈ విధమైన జ్ఞానాన్ని పొందినవాడు, బాహ్యేంద్రియ వ్యాపారాలన్నీ ఉపశమించినవాడై - శాంతించిన వాడై- అంతః కరణ తృష్ణ లేనివాడై నందున, దాంతుడు, సమస్త కోరికల నుండి ఉపరతుడు (విముఖుడు) ద్వంద్వాలను సహించే తితిక్షువు అయి, సమాహిత చిత్తుడై, తనలోనే ఆత్మను దర్శిస్తాడు. తనలోనే అందరిని చూస్తాడు. వానిని ధర్మాధర్మ రూపమైన పాపాలు అంటావు. అతడు సమస్త పాపాలను అతక్రమిస్తాడు. పాపాలు, తాపాలు అతనికి దుఃఖ కారణాలు కాలేవు. అంతేకాదు- అతడే సమస్త పాపాలను తపింపచేస్తాడు- భస్మం చేస్తాడు. అతడు పాపరహితుడు. కోరికలు లేనివాడు. అనుమానాలు లేని బ్రహ్మవేత్త అవుతాడు. కాబట్టి, ఓ రాజా ! (జనకుడా!) ఇదే బ్రహ్మలోకం ! ఈ లోకానికి నీవు చేర్చబడ్డావు'

ఈ విధంగా అన్న యాజ్ఞవల్క్యునితో జనకుడు అన్నాడు- 'ఓ మహాత్మా ! ఈ విదేహ రాజ్యాన్ని, దానితోపాటు నన్ను మీకు సమర్పించు కొంటున్నాను అని.

**మం॥ స వా ఏష మహాజన ఆత్మా న్నాదో వసుదానః,**
**విన్దతే వసు య ఏవం వేద. 24**

ఆ ఆత్మ గొప్పది, జన్మలేనిది; సమస్తమైన అన్నాలకు భోక్త అయినది సమస్త భూతాలకు అవి చేసిన కర్మలకు ఫలాన్ని ఇచ్చేది ఈ ఆత్మే ! ఈ విధంగా భావించి బ్రహ్మోపాసన చేసేవానికి సమస్త కర్మల ఫలము, చేయకుండానే ప్రాప్తిస్తుంది. అంటే అతడు కూడా భోక్త అవుతాడు. సంపదలు పొందుతాడు. ఇవి కనిపించే ఫలాలు. మళ్ళీ జన్మ లేకపోవటమనేది కనిపించని ఫలం.

**మం॥ స వా ఏష మహాజన ఆత్మాజరో మరో మృతో భయో బ్రహ్మ;**
**అభయం వై బ్రహ్మ; అభయం హి వై బ్రహ్మ భవతి య ఏవం వేద. 25**

ఈ జన్మరహితమైన ఆత్మ గొప్పది. ముసలితనం లేనిది, చావు లేనిది. భయం లేనిది, బ్రహ్మస్వరూపం కలది. అభయమే (భయం లేక పోవటమనే స్థితే) బ్రహ్మ పైన చెప్పిన ఆత్మనే 'అభయ బ్రహ్మ' గా తెలుసుకొన్నవాడు అభయ బ్రహ్మ స్వరూపుడౌతాడు. దీనిలో సందేహం లేదు.

ఇంతవరకు జరిగిన విషయాన్ని ఒకసారి సింహావలోకనం చేసుకుందాం.

మధుకాండలో శ్రుతి ఆధారంగా 'బ్రహ్మ సత్యము' అనే విషయాన్ని నిర్ధారించారు. తరువాతిదైన జనకుని యాగంలో యాజ్ఞవల్క్యునితో ఇతర ఋషులు జరిపిన చర్చ ఆధారంగా తార్కికంగా, హేతు బద్ధంగా, మధుకాండలో చెప్పినట్టి బ్రహ్మసత్యమనే విషయాన్ని ధృవీకరించటం జరిగింది. పిమ్మట జనక యాజ్ఞవల్క్య సంభాషణ (4-వ అధ్యాయం) అంతా గురుశిష్యసంవాద రూపంలో, గురువు శిష్యునికి బ్రహ్మోపదేశం చేస్తున్న పద్ధతిలో సాగింది. చర్చనీయాంశం ఒక నిర్ధారణకు వచ్చినట్లైంది.

రాబోయే బ్రాహ్మనంలో సర్వసంగ పరిత్యాగం (సన్యాసం) తో కూడిన ఆత్మజ్ఞానం మోక్షానికి సాధనమనే విషయాన్ని ఉపసంహార పద్ధతిలో విశదీ కరిస్తున్నారు. ఇంతవరకు తెలిసినదేమంటే, సర్వసంగ పరిత్యాగంతో కూడిన ఆత్మజ్ఞానం-- ఆత్మదర్శనం- మోక్షానికి సాధనమని, ఈ విషయాన్నే శ్రుతులను అధారంగా చూపి, తార్కికంగా నిర్ధారించారు. ఎందుకు? కొందరికి శ్రుతుల (వేదాలు) మీద శ్రద్ధ ఉండవచ్చు. మరొకొందరికి హేతువాదం, తర్కం మీద శ్రద్ధ ఉండవచ్చు కాబట్టి.

## ఐదవ బ్రాహ్మణం

ఈ చెప్పబోయే విషయమే రెండవ అధ్యాయం 4-వ బ్రాహ్మణంలో చెప్పబడ్డది. విషయాన్ని బట్టి, సందర్భాన్నిబట్టి మళ్ళీ చెపుతున్నారు. సన్యాసంతో కూడిన ఆత్మజ్ఞానం మోక్షానికి సాధనమని తేలింది కాబట్టి, యాజ్ఞవల్క్యుడు సన్యాసానికి భార్యయైన మైత్రేయి నుండి అంగీకారాన్ని కోరటంతో ఆరంభిస్తున్నారు.

**మం॥ అథ హ యాజ్ఞవల్క్యస్య ద్వే భార్యే బభూవతుః మైత్రేయీ చ కాత్యా యనీ చ; తయోర్హ మైత్రేయీ బ్రహ్మవాదినీ బభూవ, స్త్రీ ప్రజ్ఞైవ తర్హి కాత్యాయనీ; అథ హ యాజ్ఞవల్క్యో న్యద్వృత్తముపాకరిష్యన్. 1**

యాజ్ఞవల్క్యుని ఇరువురు భార్యలు. మైత్రేయి, కాత్యాయని అని వారి పేర్లు, ఈ ఇద్దరిలో మైత్రేయి జ్ఞానవంతురాలు- బ్రహ్మ చర్చ చేయటానికి తగిన సామర్థ్యం కలది. రెండవ భార్యయైన కాత్యాయని గృహిణివలె గృహ సంబంధమైన కార్యకలాపాలు నిర్వహించటంలో నేర్పరి. ఈ స్థితిలో యాజ్ఞవల్క్యుడు గృహస్థ జీవనానికి భిన్నమైన సన్యాసదీక్ష తీసుకోవటానికి నిర్ణయించుకున్నాడు.

**మం॥ మైత్రేయీతి హోవాచ యాజ్ఞవల్క్యః, ప్రవ్ర జిష్యన్వా అరే హమ స్మాత్స్థా నాదస్మి, హన్తతే తే నయా కాత్యాయన్యాన్తం కరవాణీతి. 2.**

మైత్రేయితో ఈ విధంగా అంటున్నాడు- ఓ మైత్రేయీ ! నేను ఈ గృహస్థ జీవాన్ని వదలి ఎక్కడికైనా వెళ్ళిపోవాలని అనుకుంటున్నాను- అంటే, సన్యాస ఆశ్రమ స్వీకారం చేయాలని అనుకుంటున్నాను. కాబట్టి నీ అనుమతి కోరుతున్నాను నీ కిష్టమైతే, నీకు, కాత్యాయనికి ఆస్థి సంబంధమైన పంపకాలు చేస్తాను.'

**మం॥ సా హోవాచ మైత్రేయీ, యన్న మ ఇయం భగోః సర్వా పృథివీ విత్తేన పూర్ణా స్యాత్, స్యాం న్వహం తేతామృతాహో- నేతి; నేతి హోవాచ యాజ్ఞ వల్క్యః, యథైవోపకరణవతాం జీవితం తథైవ తే జీవితం స్యాత్, అమృతత్వస్య తు నాశస్తి విత్తేనేతి. 3**

మైత్రేయి అన్నది- 'స్వామీ ! ఈ భూమిమీద ఉన్న సంపద అంతా నాకు లభిస్తే, ఆ సంపదవల్ల నాకు మోక్షం వస్తుందా?'

యాజ్ఞవల్క్యుడన్నాడు- 'రాదు ! రాదు ! భోగభాగ్యాలు ఉన్నవాని జీవితం ఎట్లా ఉంటుందో నీ జీవితం కూడా అట్లాగే ఉంటుంది. అంతే గాని, సంపదవల్ల మోక్షాన్ని ఆశించటం వ్యర్థం. ధనం వల్ల మోక్షం లభించటం అసంభవం.

**మం॥ సా హోవాచ మైత్రేయీ, యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యాం ? యదేవ భగవాన్వేద త దేవ మే బ్రూహీతి. 4**

మైత్రేయి అన్నది– 'ఏ సంపదవల్ల నాకు మోక్షం లభించిందో అటువంటి సంపదను తీసుకొని నేను ఏమి చేయను? మోక్షానికి సాధనం మీకు తెలిసి ఉంటే దానిని నాకు బోధించండి' అని.

**మం॥ స హోవాచ యాజ్ఞవల్క్యః ప్రియా వై ఖలు నో భవతీ సతీ ప్రియ– మవృధత్, హన్త తర్హి భవత్యేత ద్వ్యాఖ్యాస్యామి తే, వ్యాచక్షణాస్య తు మే నిది ధ్యాసత్వేతి. 5**

యాజ్ఞవల్క్యుడన్నాడు– 'మైత్రేయీ ! నీవు లోగడ నాకు సంతోషాన్ని కలిగించావు. ఇప్పుడు కూడా ఈ విధంగా మాట్లాడి నా సంతోషాన్ని అధికం చెశావు. కాబట్టి, నీ యెడ ప్రసన్నుడనై అమరత్వ సాధనాన్ని గూర్చి వ్యాఖ్యానిస్తాను. నేను చెప్పబోయే విషయాలను బాగా మననం చెయ్యి!'

**మం॥ స హోవాచ, న వా అరే సత్యుః కామాయ పతిః ప్రియోభవతి, ఆత్మనస్తు కామాయ సతిః ప్రియో భవతి. న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి, ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి, న వా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్తి, ఆత్మనస్తు కాయా పుత్రాః ప్రియా భవన్తి. న వా ఆరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతిన, న వాఅరే పశూనాం కామాయ పశవః ప్రియా భవన్తి, ఆత్మనస్తు కామాయ పశవః ప్రియా భవన్తి. న వా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి. న వా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియం భవతి, ఆత్మవస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి. న వా అరే లోకానాం కామాయ లోకాః ప్రియా భవన్తి, ఆత్మనస్తు కామాయ లోక ప్రియా భవన్తి, న వా అరే దేవానం కామాయ దేవాః ప్రియా భవన్తి, ఆత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవన్తి. న వా అరే వేదానాం కామాయ వేదాః ప్రియా భవన్తి. ఆత్మవస్తు కామాయ వేదాః ప్రియా భవన్తి, న వా ఆరే భూతానం కామాయ భూతాని ప్రియాణి భవ న్తి. న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి. ఆత్మా వా అరే ద్రష్టవ్యః– శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యా మైత్రేయి; ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాత సర్వం విదితం. 6**

ఆత్మయంటే అందరికి సర్వాధికమైన ప్రేమ ఉంటుందని. ఆ ఆత్మను తెలుసుకోవటమే ప్రధానమని చెపుతున్నారు.

యాజ్ఞవల్క్యుడంటున్నాడు. 'ఓ మైత్రేయీ ! నేను ఈ దిగువ చెప్పబోయే విషయంలో సందేహం లేదు. విను, భార్యకు భర్త ప్రియమైన వాడు అవుతున్నాడంటే అది భర్త ప్రయోజనం కోసం కాదు. ఆత్మ ప్రయోజనం కోసం– తన (భార్యయొక్క) ప్రయోజనం కోసం అతడు ప్రియుడు అవుతున్నాడు. అట్లాగే భార్యకోసం భర్తకు భార్య ప్రియురాలు కావటం లేదు– ఆత్మ ప్రయోజనం– భర్త ప్రయోజనంకోసం భార్య ప్రేమాస్పదురాలవుతోంది. పుత్రుల ప్రయోజనం కోసం పుత్రులు ప్రేమాస్పదులు కావటం లేదు. ఆత్మ ప్రయోజనం– తల్లిదండ్రుల ప్రయోజనం కోసం పుత్రుడు తల్లిదండ్రులకు ప్రేమాస్పదుడౌతున్నాడు. ధనం యొక్క ప్రయోజనం కోసం మనకు ధనం ప్రియమైనది కావటం లేదు. తమ కోసమే– ఆత్మ ప్రయోజనం కోసం ధనం మనకు ప్రియమైనది అవుతోంది. అట్లాగే పశువులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, లోకాలు, దేవతలు, వేదాలు, పంచభూతాలు, ఇవీ అవీ ఎందుకు? సమస్తము మనకు ప్రియమైనవి అవటానికి కారణం ఆత్మ ప్రయోజమే. తన స్వలాభమే తప్ప, వాటి ప్రయోజనం వల్లకాదు. ఆత్మ ప్రయోజనం కోసమే సమస్తము ప్రియమైనవి అవుతున్నాయి కాబట్టి ఆ ఆత్మయే చూడదగింది. ఓ మైత్రేయీ ! ఆ ఆత్మయే తెలుసుకోదగినది. ఆ ఆత్మ ఒక్కటే వినదగినది. ఆలోచించదగినది, మననం చేయదగినది, ధ్యానం చేయదగింది. కాబట్టి, మైత్రేయీ ! ఆత్మ యొక్క శ్రవణం, దర్శనం, మననం, విజ్ఞానం (తెలియటం) గనక జరిగితే అవన్నీ తెలుస్తాయి. ఎందుచేతనంటే, వాటి అన్నింటికి ఆత్మ అధిష్ఠానం, మిగతావన్నీ అధ్యస్త వస్తువులు. ఆత్మకు వ్యతిరిక్తమైనదేదీ లేదు కాబట్టి అధిష్టానమైన ఆత్మ తెలిస్తే అన్నీ తెలిసినట్లే !

**మం॥ బ్రహ్మ తం పరాదాద్యో న్యత్రాత్మనో బ్రహ్మ వేద, క్షత్రం తం పరాదాద్యో న్యత్రాత్మనః క్షత్రం వేద, లోకాస్తం పరాదుర్యో న్యత్రాత్మనా లోకాన్వేద, దేవాస్తం పరాదుర్యో న్యత్రాత్మనో దేవాన్వేద, వేదాస్తం పరాదుర్యో న్యత్రాత్మనో వేదాన్వేద, భూతాని తం పరాదుర్యో స్య త్రాత్మనో భూతాని వేద, సర్వంతం పరాదాద్యో న్యత్రాత్మనః సర్వం వేద; ఇదం బ్రహ్మ, ఇదం క్షత్రమ్, ఇమే లోకాః, ఇమే దేవాః ఇమే వేదాః, ఇమాని భూతాని, ఇదం సర్వం యదయమాత్మా. 7**

భేద దృష్టిని నిందిస్తూ అభిన్నమైన ఆత్మతత్వాన్ని ఉపదేశిస్తున్నారు.

బ్రాహ్మణ జాతిని ఆత్మ కంటె (తన కంటె) భిన్నమైనదిగా తలిస్తే ఆ బ్రాహ్మణ జాతి అట్టివానిని పరాస్తం చేస్తుంది– తృణీకరిస్తుంది. ఎవడు, క్షత్రియజాతిని తనకంటె భిన్నమైనదిగా తలుస్తాడో అట్టివానిని క్షత్రియజాతి పరాస్తం చేస్తుంది. అట్లాగే లోకాల్ని తనకంటె భిన్నంగా చూస్తే వానిని లోకాలు తృణీకరిస్తాయి. దేవతల్ని ఆత్మకంటె భిన్నంగా తలిస్తే దేవతలు అతనిని

పరాస్తం చేస్తారు. వేదాల్ని తనకంటె భిన్నంగా తలచిన వానిని వేదాలు లెక్కచేయవు. భూతాల్ని తనకంటె భిన్నంగా తలిస్తే అటువంటి వానిని అన్నీ తృణీకరిస్తాయి. ఎందుచేతనంటే, బ్రాహ్మణ క్షత్రియాది జాతులు, లోకాలు, దేవతలు, వేదాలు, భూతాలు, సమస్తమూ ఆత్మయే ! అన్యమేదీ కాదు.

**మం॥ స యథా దుందుభేర్హ న్య మానస్య వ బాహ్యాన్ఛబ్దాన్ శక్ను యాద్గ్రహణాయ, దుందుభేస్తు గ్రహణేన– దుందుభ్యాఘాతస్య వా – శబ్దో గృహీతః. 8**

**స యథా శంఖస్య ఆ్మయమానస్య న బాహ్యాన్ఛ బ్దాన్ శక్ను యాద్గ్రహనాయ, శంఖస్య తు గ్రహణేన శంఖధ్మస్యవా– శబ్దో గృహీతః. 9**

**స యథా వీణాయై వాద్యమానాయైన బాహ్యాన్ఛబ్దా న్ఛక్ను యాద్గ్రహణాయ, వీణాయై తు గ్రహణేవ– వీణావాదస్యవా– శబ్దో గృహీతః. 10**

**స యథార్ద్రైధాగ్నేరభ్యాహితస్య పృథగ్ధూమా విని శ్చరన్తి, ఏవం వా అరే స్య మహతో భూతస్య నిఃశ్వ సితమేతద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదో థర్వాం గిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యనువ్యాఖ్యానాని, వ్యాఖ్యానానీష్టం హుత మాశితం పాయితం, అయం చ లోకః, పరశ్చ లోకః, సర్వాణి చ భూతాని, అస్యైవైతాని సర్వాణి నిఃశ్వ సితాని. 11**

సర్వాత్మ దర్శనానికి కొన్ని దృష్టాంతాలు చూపిస్తున్నారు. (ఈ మంత్రాల భావం 2వ అధ్యాయం 4వ బ్రాహ్మణంలో చెప్పబడ్డదిగాన సంగ్రహంగా ఇస్తున్నాము.)

కఱ్ఱచేత కొట్టబడిన నగారా చేసే బాహ్యశబ్దాల వివరాల్ని గ్రహించటం– గుర్తించటం కష్టం, నగారాను, నగారాకున్న సామాన్య స్వరాన్ని లేక నగారా దెబ్బల వల్ల ఉత్పన్నమయ్యే స్వరం వల్లనే గుర్తించగలం.

శంఖాన్ని ఊదినప్పుడు ఆ శంఖం యొక్క బాహ్య శబ్దాన్ని ఎవరూ గ్రహించలేరు. కాని శంఖాన్ని, లేదా శంఖాన్ని పూరించటాన్ని గ్రహించినపుడు అది (శబ్దం) పట్టుబడుతుంది.

మ్రోగింపబడ్డ వీణ యొక్క బాహ్య శబ్దాన్ని గ్రహించటం ఎవరి వల్ల కాదు.కాని, వీణను, వీణావాదనాన్ని గ్రహించినపుడే ఆ శబ్దం పట్టుబడుతుంది.

తడిపి ఉన్న కట్టె పుల్లలతో ఆధానం చేసినపుడు రకరకాల పొగలు వస్తాయి. మైత్రేయీ! ఆ పొగలే ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వ వేదం, ఇతిహాసాలు, పురాణాలు,

విద్యలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణాలు, వైదికవస్తు సంగ్రహాలు, వాక్య స్వరూపాన్ని చెప్పే సూత్రాలు, ఆ సూత్రాలకు వ్యాఖ్యానాలు, మంత్ర వ్యాఖ్యానాలు, ఇష్టములు (యజ్ఞంలో) హవనం చేసిన హుతాలు, తిన్నవి, త్రాగినవి, ఈ లోకాలు, పరలోకాలు, సమస్త భూతాలు, ఇవన్నీ ఆ పరమాత్మ నిశ్వాసాలే !'

**మం॥ స యథా సర్వాసామపాం సముద్ర ఏకాతయనం, ఏవం సర్వేషాం స్పర్శానాం త్వగేకాయతనం, ఏవం సర్వేషాం గంధానాం నాసికే ఏకాయతనం, ఏవం సర్వేషాం రూపాణం చక్షురేకాయతనం, ఏవం సర్వేషాం శబ్దానాం శ్రోత్రమేకాయతనం, ఏవం సర్వేషాం సంకల్పానాం మన ఏకాయతనం, ఏవం సర్వాసాం విద్యానాం హృదయమేకాయతనం, ఏవం సర్వేషాం కర్మణాం హస్తావేకాయతనం, ఏవం సర్వేషా మానం దానాముపస్థ ఏకాయతనమ్, ఏవం సర్వేషాం విసర్గాణాం పాయురేకాయతనం, ఏవం సర్వేషా మధ్వనాం పాదావేకాయతనం, ఏవం సర్వేషాం వేదానాం వాగేకాయతనం.**

సమస్త జలాలకు– ఎక్కడెక్కడి జలాలైనా– అన్నిటికి లయస్థానం (కలిపేచోటు) సముద్రమే! అట్లాగే స్పర్శలకు లయస్థానం చర్మం, సమస్త గంధాలకు (వాసనలకు) ప్రళయస్థానం నాసికయే! సమస్త రసాలకు– రుచులకు– లయస్థానం నాలుకయే ! సమస్త సంకల్పాలకు ఏకమాతమైన లయస్థానం మనస్సే ! సమస్త విద్యలు కలిసిపోయే చోటు హృదయమే ! సమస్త కర్మలకు ఒకే ఒక చోటు చేతులే ! సమస్త అనందాలకు ఒకే ఒక ఉనికి జననేంద్రియమే ! సమస్త విజర్జనాలకు ఏకమాత్రస్థానం పురీషనాళమే ! అట్లాగే అన్ని మార్గాలకు ఒకే ఆయతనం పాదాలు. అట్లాగే వేదాలన్నిటికి ఏకమాత్రమైన స్థానం వాక్కు !

**మం॥ స యథా సైంథవఘనో నన్తరో బాహ్యః కృత్స్నో రసఘన ఏవ, ఏవం వా ఆరే యమాత్మానన్తరో బాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ; ఏ తేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవాను వినశ్యతి, న ప్రేత్య సంజ్ఞాస్తీత్యరే బ్రవీమీతి హోవాచ యాజ్ఞ వల్క్యః 13**

ఉప్పు ముద్ద లోపట, బయల అంతటా అన్ని విధాల పూర్తిగా ఒకే విధమైన ఉప్పదనాన్ని కలిగి ఉన్నట్లే ఈ ఆత్మకూడా బాహ్యాభ్యంతర భేదాలేవీ లేకుండా పూర్తిగా ప్రజ్ఞానఘన రూపంలో ఉంటుంది. సంపూర్ణమైన జ్ఞానరూపంలో ఉంటుంది. ఆ ఆత్మ, ఈ భూతాలతో బాటు ప్రత్యేక తత్వంలాగా చక్కగా పైకి వచ్చి వాటితో పాటే నష్టమౌతుంది. అందుచేతనే చచ్చిపోయిన తరువాత దీని గుర్తు ఉండదు. అభేదాన్ని పొందిన తరువాత దీని ప్రత్యేక సంజ్ఞ– గుర్తు ఉండదు. మైత్రేయీ! నేను చెప్పే విషయం ఇది! ' అని అన్నాడు యాజ్ఞవల్క్యుడు.

**మం॥ సా హోవాచ మైత్రాయీ, అత్రైవ మా భవనాన్మో హాన్తమాపీపితత్, న వా అహమిమం విజానామీతి; స హోవాచ, వ వా అరే హ మోహం బ్రవీమి, అవినాశీ వా ఆరే యమాత్మానుచ్ఛిత్తి ధర్మా. 14**

మైత్రేయి అంది– 'స్వామీ ! ఈ ప్రజ్ఞాన ఘనుని విషయమై చెపుతూ, చచ్చిపోయిన తరువాత దాని సంజ్ఞ (గుర్తు) ఉండదు. అని చెప్పి నన్ను మోహంలో – గందరగోళంలో– పడేశారు. ఈ విషయం. నాకు అర్థం కావటం లేదు.' అని.

యాజ్ఞవల్క్యుడు అన్నాడు– 'ఓసీ ! మైత్రేయీ ! నేను భ్రమింపజేసేది ఏమీ చెప్పలేదు. ఈ ఆత్మ నిజంగా అవినాశియే ! నిస్సందేహంగా దీనికి నాశనం లేదు. ఇది మార్పు చెందదు– దీనికి చావు లేదు. (శరీరంతో ఉన్న సంబంధం– ఆ శరీరం సంసర్గం వల్ల వచ్చిన సంజ్ఞ మాత్రమే పోతుంది అని భావం)

**మం॥ యత్ర హిద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి, తదితర ఇతరం జిఘ్రుతి, తదితర ఇతరం రసయతే, తదితర ఇతర మభివదతి, తదితర ఇతరం శ్రుణోతి, తదితర ఇతరం మనుతే, తదితర ఇతరం స్పృశతి, తదితర ఇతరం విజానాతి; యత్ర త్వస్య సర్వమాత్మైవా స్పృశతి, తదితర ఇతరం విజానాతి; యత్ర త్వస్య సర్వమాత్మైవా భూత్, తత్కేన కం పశ్యేత్; తత్కేన కం జిఘ్రేత్, తత్కేన కం రసయేత్, తేత్కన కనుభివదేత్, తత్కేనం కం శ్రుణుయాత్, తత్కేన కం మన్వీత, త్కేన కం స్పృశేత్, తత్కేన కం విజానీయాత్ ? యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్ ? స ఏష నేతినేత్యాత్మా, అగృహో న హి గృహ్యతే, అశీర్యో న హి శీర్యతే, అసంగో న హి సజ్జతే, అసితో న వ్యథతే, న రిష్యతి, విజ్ఞాతారమరే కేన, విజానీ యాత్, ఇత్యుక్తానుశాసనాసి మైత్రేయి, ఏతావదరే ఖల్వమృతత్వమితి హోక్త్వా యాజ్ఞవల్క్యో విజహార 15**

ఓ మైత్రేయీ ! అవిద్యావస్థలో ద్వైతంగా కనిపిస్తుంది. ఆ విధమైన ద్వైత స్థితిలోనే అన్యుడు అన్యుని చూస్తాడు6 ఒకడు వేరొకణ్ణి చూస్తాడు. అన్యుడు అన్యమైన దానిని వాసన చూస్తాడు. (ద్వైత స్థితిలో వాసన చూచేవాడు, వాసన చూడబడేది విడిగా కనిపిస్తుంది.. అద్వైత స్థితిలో ఈ భేదం ఉండదు. ఇట్లాగే అన్నీ గ్రహించాలి) అన్యుడు అన్యమైన దానిని రుచి చూస్తాడు. ఒకడు ఇంకొకనితో మాట్లాడతాడు. అన్యుడు అన్యమైన దానిని వింటాడు. అన్యుడు అన్యమైన దానిని మననం చేస్తాడు. అన్యుడు అస్యమైన దానిని స్పృశిస్తాడు. ఒకడు తనకంటె భిన్నమైన దానిని తెలుసుకుంటాడు. దీనికి వ్యతిరేకంగా విద్వాంసుని దృష్టి సర్వాత్మభావాన్ని పొందినపుడు– అన్నీ తానే అయినపుడు అద్వైతస్థితిని పొందినపుడు ఎవడు ఎవనిని చూస్తాడు? చూచేవాడు,

చూడబడేవాడు విడివిడిగా ఉండదు. ఇద్దరూ ఒకటే అవుతారు. అట్లాగే ఎవడు దేనిని రుచి చూస్తాడు? రుచి చూచేది భిన్నంగా ఉండదని భావం. (ఇట్లాగే అన్ని విషయలు గ్రహించాలి) ఎవడు ఎవడితో మాట్లాడుతాడు. ఎవడు దేనిని వింటాడు. ఎవడు దేనిని గూర్చి ఆలోచిస్తాడు? ఎవడు ఎవరిని స్పృశిస్తాడు ? ఎవడు ఎవరిని తెలుసుకుంటాడు? తెలుసుకొనేవాడు వేరు, తెలుసుకోబడేది వేరుగా ఉండదు-ఇద్దరూ ఒకటే ! దేని ద్వారా పురుషుడు వీటన్నింటిని తెలుసుకుంటున్నాడో, దానిని దేని ద్వారా తెలుసుకోగలుగుతాడు? 'నేతి నేతి' ఇది ఆత్మ కాదు, ఇది ఆత్మకాదు- అనే ఉపనిషన్మహావాక్యం ద్వారా నిర్ధారించబడిన ఆత్మ అనేది అగ్రాహ్యము- పట్టుకోవటానికి వీలు లేనిది. అశీర్యము- నాశనం కానిది. అసంగము- దేనితోను అంటుకోనిది. అది బంధింపబడదు. పీడింపబడదు. క్షీణం కాదు. మైత్రేయీ ! విజ్ఞాతయైన వానిని ఎవరు తెలుసుకోగలుగుతారు? ఈవిధంగా ఉపదేశించటం అయినది. మైత్రేయీ ! నిశ్చయంగా ఇదే అమృతత్వమని తెలుసుకో ! అని ఉపదేశించి యాజ్ఞవల్క్యుడు సన్యసించాడు.

## ఆరవ బ్రాహ్మణం

(ఇంతటిలో) యాజ్ఞవల్క్యకాండ (మునికాండ) పూర్తి అయింది. ఇక ఈ కాండకు గురుపరంపరను చెప్పి ముగిస్తున్నారు.)

**మం॥ అథవంశః**

(మధుకాండ చివరలో 2వ అధ్యాయం చివరలో యిచ్చిన ఆచార్యపరంపరయే కాబట్టి మళ్ళీ యివ్వలేదు. అచ్చుటచట స్వల్పమైన మార్పులున్నా దానివల్ల గ్రంథానికి, విషయానికి అభ్యంతరమేమీ రాదు.)

# ఐదవ అధ్యాయం

## మొదటి బ్రాహ్మణం

**మం॥ ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే. పూర్వస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే. ఓం ఖం బ్రహ్మ; ఖం పురాణం; వాయురం ఖమితి హ స్మాహ కౌరవ్యాయణీ పుత్రః; వేదోయం బ్రాహ్మణా విదుః; వేదైనేన యద్వేదితవయం. 1**

ఆ నిరుపాధిక పరబ్రహ్మము పూర్ణమైనదే ! ఈ సోపాధిక కార్య బ్రహ్మము కూడా పూర్ణమైనదే! ఆ పూర్ణము నుండే (నిరుపాధిక పరబ్రహ్మము నుండే) ఈ పూర్ణము (సోపాధిక బ్రహ్మము) ఆవిర్భవించింది కాబట్టి రెండూ పూర్ణమైనవే ! తత్వసాక్షాత్కార సమయంలోను, ప్రళయ సమయంలోను, పూర్ణము (ఉపాధి లేక రూపంతో కూడిన కార్యబ్రహ్మము- సగుణ బ్రహ్మము) యొక్క పూర్ణత్వాన్ని తనలో లీనం చేసుకోవటం వల్ల, ఆ పూర్ణము- నిరుపాధిక బ్రహ్మము మాత్రమే మిగులుతుంది- సగుణ బ్రహ్మము నిర్గుణ బ్రహ్మంలో లీనంకాగా మిగిలేది నిర్గుణ బ్రహ్మం మాత్రమే ! అందుచేతనే- సోపాధిక నిరుపాధిక బ్రహ్మములు రెండు పూర్ణమైనవే ! ఒకటే ! కాబట్టి, ఈ ఉపాసనకు సంబంధించిన ఖిలకాండ కూడా ఈ ఉపనిషత్తులో చోటు చేసుకోవటంలో అభ్యంతరం ఉండనక్కరలేదని భావం.

ఆకాశ బ్రహ్మము ఓంకార స్వరూపం కలది. (ఇక్కడ ఖం అనే శబ్దానికి కేవలం భౌతికమైన ఆకాశం అని అర్థం తీసుకోకూడదు) కాబట్టి ఈ ఆకాశ బ్రహ్మ పరమాత్మ స్వరూపమే ! ఆకాశంలో వాయువు ఉంటుంది. అటువంటి ఆకాశమే 'ఖం' అని కౌరవ్యాయణి కుమారుడు అన్నాడు. అంటే, 'ఖం'అనే శబ్దానికి మామూలుగా పంచభూతాలలో ఒకటైన ఆకాశమనే పైకి తోచే అర్థం. కాని బ్రహ్మకాశ మనేది గౌణార్థం- దాగి ఉన్న అర్థం. ఈ ఓంకారం, వేదం ఇవన్నీ పేర్లు- వీటి ద్వారానే మనకు తెలిసికోదగినట్టి బ్రహ్మ యొక్క ప్రకాశం కలుగుతోంది- స్ఫురిస్తోంది. ఈ విషయం బ్రహ్మవేత్తలకు తెలుసు. ఎందుచేతనంటే, వేదితవ్యం (తెలసికొనదగిన వస్తువు) యొక్క జ్ఞానం ఈ ఓంకారం వల్ల కలుగుతోంది. ఒంకారాన్ని చెప్పటం వల్ల తెలుసుకోదగినట్టి బ్రహ్మమనేది స్ఫురిస్తోంది.

## రెండవ బ్రాహ్మణం

**మం॥ త్రయాః ప్రాజాపత్యాః ప్రజాపతౌ పీతరి బ్రహ్మచర్యా మూషుః– దేవా మనుస్యా అసురాః ; ఉషిత్వా బ్రహ్మచర్యం దేవా ఊచుః; బ్రవీతు నో భవా నితి; తేభ్యో హై తదక్షర మువాచ ద ఇతి; వ్యజ్ఞాసిష్ఠా 3 ఇతి; వ్యజ్ఞాసిష్మేతి హోచుః, దామ్యతేతి న ఆత్థేతి; ఓమితి హోవాచ, వ్యజ్ఞాసిష్టేతి. 1**

దేవతలు, మానవులు, అసురులు– ఈ ముగ్గురు ప్రజాపతి పుత్రులు. వారు శిష్య భావంతో ప్రజాపతి వద్ద బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ ఉన్నారు. బ్రహ్మచర్య వ్రత పరిసమాప్తి అయిన తరువాత దేవతలు, తండ్రి అయిన ప్రజాపతితో– 'మాకు ఉపదేశం చేయండి అని అడిగారు. ప్రజాపతి, వారికి 'ద' అనే అక్షరాన్ని ఉపదేశించి, మీరు దీని అర్థం తెలుసుకున్నారా?' అని అడిగాడు. దేవతలు అవును. ఇది మాకు అర్థమైంది. మీరు మాకు ఈ అక్షరం ద్వారా దమాన్ని– ఇంద్రియ దమనాన్ని ఉపదేశించారు" అని అన్నారు. (దేవతలు స్వభావతః జితేంద్రియులు కారు. వారికి ఇంద్రియ నిగ్రహం ఉండదు. అందుచేత వారికి ఇంద్రియ నిగ్రహం అవసరం. 'ద' అనే అక్షరంతో ఇదే బోధించాడు) 'అవును ! మీరు సరిగానే అర్థం చేసుకున్నారు'. అన్నాడు ప్రజాపతి. ఇంద్రియ సుఖాలతో మునిగి తేలే దేవతలకు 'దమము' అవసరం.

**మం॥ అథ హైనం మనుస్యా ఊచుః, బ్రవీతు నోభవానితి; తేభ్యో హైతదేవాక్షరమువాచ ద ఇతి; వ్యజ్ఞాసిష్టా 3 ఇతి; వ్యజ్ఞాసిష్మేతి హోచుః, దత్తేతి న అత్థేతి; ఓమితి హోవాచ, వ్యజ్ఞాసిష్టేతి. 2**

తరువాత ప్రజాపతితో మానవులు ఇట్లా అన్నారు– 'మాకు కూడా ఉపదేశం చేయండి.' అని.

ప్రజాపతి వారికి కూడా 'ద' అనే అక్షరాన్నే, ఉచ్చరించి, ఉపదేశించాడు. అట్లా ఉపదేశించి అడిగాడు– 'మీకు అర్థమైందా?' అని.

మానవులు అన్నారు– 'అవును అర్థమైంది. మాకు మీరు ధానం చేయండి అని ఉపదేశించారు.' మానవులు స్వభావతః లోభులు, స్వార్థపరులు అయి ఉంటారు.కాబట్టి ఆ దోషం నుండి విముక్తి పొందటానికి దానమే మార్గం. అని ప్రజాపతి ఉద్దేశ్యం.

'అవును. మీరు సరిగానే అర్థం చేసుకున్నారు.' అన్నాడు ప్రజాపతి.

**మం॥ అథ మైనమసురా ఊచుః, బ్రవీతు నో భవానితి; తేభ్యో హైతదేశాక్షర మువాచ ద ఇతి; వ్యజ్ఞాసిష్టా 3 ఇతి, వ్యజ్ఞాసిష్యేతి హోచుః, దయధ్వ మితి న ఆత్థేతి; ఓమితి హోవాచ,**

**వ్యజ్ఞాసిష్టేతి; తదేత దేవైషా దేవీ వాగనునదతి స్తనయిత్నుర్ద ద ద ఇతి– దామ్యత దత్త దయధ్వమితి; తదేతత్త్రయం శిక్షేత్– దమం దానం దయామితి. 3**

తరువాత దైత్యులు ప్రజాపతిని అడిగారు– 'తమరు మాకు కూడా ఉపదేశం చేయండి అని.

ప్రజాపతి దైత్యులకు కూడా 'ద' అనే ఒక అక్షరాన్నే ఉపదేశించి 'మీకు అర్థమైందా?' అని అడిగాడు.

అసురులన్నారు– 'అవును, మాకు అర్థమైంది. మీరు మాకు 'దయచూపుము' అని ఉపదేశించారు.

ప్రజాపతి అన్నాడు– 'మీరు సరిగానే అర్థం చేసుకున్నారు అని.

ఆనాడు ప్రజాపతి చేసిన అనుశాసనం నేటికి కూడా మేఘ గర్జన రూపంలో చెప్పే దైవవాణి 'దదద' గా మనకు వినిపిస్తోంది. అంటే దమనం చెయ్యి, దానం చెయ్యి, దయ చూపు అని. అందుచేతనే దమనము, దానము, దయ ఎవరికి తగినట్లు వారు నేర్చుకున్నారు. ఈనాడు కూడా ఆయా స్వభావాలు కలవారు పైన చెప్పిన ఆయా గుణాలు అలవరచుకోవాలి– సుఖలోలురు దమాన్ని, లోభులు దానాన్ని, క్రూరులు దయను అలవరచుకోవాలని తాత్పర్యం.

## మూడు బ్రాహ్మణం

**మం॥ ఏష ప్రజాపతిర్యద్ధృదయం; ఏతద్బ్రహ్మ, ఏతత్సర్వం, తదేతత్త్ర్యక్షరం –హృదయం మితి, హృ ఇత్యేక మక్షరం; అభిహరన్త్యస్మై స్వాశ్చాన్యే చ య ఏవం వేద; ద ఇత్యే కమక్షరం; ద దత్యస్మై స్వాశ్చాన్యే చయ ఏవం వేద; యమిత్యేకమక్షరం; ఏతీ స్వర్గం లోకం య ఏవం వేద. 1**

(దమము, దానము, దయ అనేవి అన్ని ఉపాసనలకు ప్రధానం. ఈ మూడు గుణాలు ఉన్నవాడే ఉపాసనకు అర్హుడు. జ్ఞానం ద్వారా నిర్గుణ బ్రహ్మ ప్రాప్తిని గూర్చి చెప్పటం పూర్తి చేసి, ఇప్పుడు ఆ నిర్గుణ బ్రహ్మయొక్క సగుణ రూపాల్ని ఉపాసించటం చెపుతున్నారు.)

ఈ హృదయమనేదే ప్రజాపతి– అదే బ్రహ్మ– అదే అన్నిటికి ఆత్మ కాబట్టి ! అందుచేతనే అన్నిటికి ఆత్మ కాబట్టే– అది సర్వం. దానిని 'సర్వం' అని కూడా అనవచ్చు. 'హృదయం' అనే మాటలో మూడు అక్షరాలున్నాయి. ఇందులో మొదటి అక్షరం 'హృ' అనేది. "హృ। అనే ధాతువుకు తీసికొనవచ్చు అని అర్థం) ఈ విషయం తెలుసపుకున్నవానికి హృ అనే ధాత్వర్థం తెలుసుకొని

హృదయ బ్రహ్మోపాసన చేసే వానికి– అతని బంధువులు (ఇంద్రియాలు) ఇతరులు బంధువులు (ఇతరుల ఇంద్రియాలు) కూడా బహుమతులు (బలి) తీసికొని వస్తాయి. తరువాతి అక్షరం 'ద' అనేది. (ద అనే ధాతువుకు ఇచ్చుట అని అర్థం) ఈ విషయం తెలుసుకొని ఉపాపన చేసేవానికి అతనికి సంబంధించినవారు. ఇతరులు కూడా 'శక్తులను బహుమతిగా ఇస్తారు. చివరి అక్షరం 'య' అనేది (య అనే ధాతువుకు లోనికి వెళ్ళుట అనే అర్థం ఉంది) ఇది తెలుసుకొని హృదయ బ్రహ్మను ఉపాసించేవాడు స్వర్గంలోనికి వెడతాడు.

(ఈ విధంగా విజ్ఞానానికి విలయమైన హృదయం యొక్క ప్రాముఖ్యతను స్తుతించటం కోసం ఈ హృదయ బ్రహ్మోపాసనను చెప్పారు. అంటే హృదయమనే అక్షరాల అర్థాన్ని ప్రాశస్త్యాన్ని గుర్తించి, విజ్ఞానమయమైన హృదయాన్ని బ్రహ్మగా భావించి ఉపాసిస్తే– నిరంతరం స్మరణ– చేస్తే వచ్చే ఫలాన్ని చెప్పారు. కేవలం హృదయం అనేదానిని వల్లించినంత మాత్రం చేత ఏమీ ఫలం ఉండదు అని గ్రహించాలి.)

## నాల్గవ బ్రాహ్మణం

**మం॥ తద్వైత తదే దేన దాస– సత్యమేవ, సయో హైతం మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి, జయతీమాన్లోకాన్; జిత ఇన్న్యసావసత్, య ఏవ మేతం మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి; సత్యం హ్యేవ బ్రహ్మ. 1**

ఆ హృదయ బ్రహ్మమే సత్యం కూడాను. అంటే, సత్యం కూడా బ్రహ్మమే –హృదయమే బ్రహ్మమైనట్లు ! ఈ సత్యబ్రహ్మము 'మహద్యక్షం ప్రథమజం'– గొప్పది, పూజనీయమైనది, మొదట పుట్టినది– ఈ మూడూ సత్య బ్రహ్మ గుణాలుగా చెప్పారు. ఈ విధంగా సత్యబ్రహ్మను భావించుకొని ఉపాసన చేసేవారు (1) ఈ లోకాన్ని జయిస్తారు. (2) అతని శత్రువులంతా అతని చేత జయింపబడతారు (3) శత్రువులు అస్తిత్వం లేని వారౌతారు– శత్రువులు మిగలరు. సత్యబ్రహ్మకున్న పై మూడు శక్తుల వల్ల ఉపాసకుని ఈ మూడు ఫలాలు కలుగుతాయి. ఈ సత్యాన్ని బ్రహ్మగా భావించి ఉపాసిస్తే– సత్యమే బ్రహ్మ కాబట్టి; ఉపాసనకు అనురూపమైన ఫలం పొందుతారు.

## ఐదవ బ్రాహ్మణం

**మం॥ ఆప ఏ వేదమగ్ర ఆసుః; తా ఆపః సత్యమసృజన్త, సత్యం బ్రహ్మ, బ్రహ్మ ప్రజాపతిం, ప్రజాపతి ర్దేవాన్, తే దేఆవః సత్యమేవోపాసతే; తదేతత్ర్యక్షరమ్– సత్యమితి; స ఇత్యేకమక్షరమ్, తీత్యేకమక్షరమ్, యమిత్యేకమక్షరమ్, ప్రథమోత్తమే అక్షరే సత్యం, మధ్యతో**

**నృతం, తదేతదనృతముభయతః సత్యేన పరిగృహీతం, సత్యభూయమేవ భవతి; నైవం విద్వాంస మనృతం హినస్తి.** **1**

సత్యమనే పేరులో గల అక్షరాలు ప్రతీకలుగా సత్యబ్రహ్మను ఉపాసించే విధం చెవుతున్నారు.

మన కండ్లముందున్న నామరూపాలతో కూడిన ఈ ప్రపంచం (సృష్టి) మొదట్లో అంతా జలమయంగానే ఉండేది. ఆ జలమే సత్యాన్ని సృష్టించింది. అందుచేత సత్యమే బ్రహ్మము. (జలము అంటే, యజ్ఞకర్మలలో ఉపయోగించే ఆహుతులు– అవి ద్రవరూపంలో ఉంటాయి. కాబట్టి. ఈ జలమే హుతం చేయబడ్డ తరువాత సూక్ష్మాంశంగామారి ఇతర భూతాలతో కలసి సృష్టికి కారణభూతమైంది) ఆ జలమే సత్యాన్ని సృష్టించింది. కాబట్టి అది మొదట పుట్టింది– హిరణ్యగర్భుడు లేక సూత్రాత్మ– సత్యం. ఆ సత్య బ్రహ్మం ప్రజాపతిని (విరాట్‌ను) ఆ ప్రజాపతి దేవతలను సృష్టించారు. ఆ దేవతలు కూడా ఈ సత్యబ్రహ్మనే ఉపాసిస్తారు. (ఈ సత్యబ్రహ్మ, సూత్రగా మొదట పుట్టినది ప్రజాపతి పుట్టుకకు కారణమైంది కాబట్టి మహత్ (గొప్పది) దేవతలకు పూజనీయం.

ఈ విధంగా వెనుకటి మంత్రంలో చెప్పిన సత్యబ్రహ్మకున్న మూడు గుణాలు (మహద్యక్షం ప్రధమజం) సరిపోయినాయి.

పరబ్రహ్మ పేరే సత్యం. ఈ సత్యం అనే మాటలో మూడు అక్షరాలున్నాయి (సత్‌యం) 'స' అనేది ఒక అక్షరం. ఈ కారంతో కూడిన (ఉచ్చారణ సౌలభ్యం కోసం– తెలియజేయాటానికి వీలుగా) 'త్' ఒక అక్షరం. 'యం' అనేది ఒక అక్షరం. మొత్తం మూడు కలిస్తే సత్యం అయినది. మొదటి అక్షరం సత్యం. చివరి అక్షరం సత్యం. మధ్యనున్న 'త్' తకారం మృత్యువు లేక అసత్యం. ఎందుచేతనంటే అదిహల్లు. దానికి స్వతంత్ర ఉచ్చారణ కూడా లేదు– అచ్చుతో చేరితే తప్ప. (ఆ అక్షరాన్ని చూపించటానికే ఈ కారంతో చేర్చారు. కాబట్టి ఈకారంతో చేతి అక్షరంగా కనిపించే తకారం అసత్యమే! అయితే ఈ అసత్యానికి (త్) ముందు వెనుకనున్న అక్షరాలు సత్యాలు. కాబట్టి ఆ అక్షరాల బరువు (ఊతం) అధికంగా ఉంటుంది. కాబట్టి సత్యబహుళము అవుతుంది– మధ్య నున్న తకారం తేలిపోతుంది– అంటే అసత్యం తేలిపోతుంది.

(హల్లు యొక్క ధర్మం అచ్చులతో కలసిపోవటం కాబట్టి ఈ త్ అనే హల్లు కూడా తరువాతి అచ్చుతో కలసి తన ప్రత్యేక అస్తిత్వాన్ని కోల్పోయింది.)

ఈ విధంగా సత్యబ్రహ్మ యొక్క సత్యత్వాన్ని తెలుసుకొని ఉపాసన చేసేవానిని అసత్యం (మృత్యువు ఏమీ చేయలేదు. అంటే, అనుకోకుండా తెలియక ఏదైనా ఉచ్చరించినా అసత్యదోషం రాదు, అని భావం.

**మం॥ తద్యత్తత్సత్యమసౌ స ఆదిత్యః– య ఏష ఏతస్మి న్మండలే పురుషః, యశ్చాయం దక్షిణే క్ష న్పురుషు, తావేతావన్యోన్యస్మిన్ ప్రతిష్ఠితౌ; రశ్మిభిరేషో స్మి న్ప్రతిష్ఠితః, ప్రాణైరయమముష్మిన్ స యదో(త్క మిష్యన్భవతి శుద్ధమేవైతన్మండలం పశ్యతి నైనమేతే రశ్మయః ప్రత్యాయన్తి. 2**

ఆదిత్య మండలం (సూర్యమండలం) లో ఉన్న పురుషుడు, దక్షిణ నే(త్రంలో (కుడికంటిలో) ఉన్న పురుషుడు ఒకడే ! సత్యమనే పేరు కలవాడే ! అనే విషయాన్ని విపులీకరిస్తున్నారు.

ఈ సత్యమనేదే ఆదిత్యుడు. ఆదిత్య మండలంలో ఏ పురుషుడు ఉన్నాడో, అతడే దక్షిణ నే(త్రంలో ఉన్న పురుషుడు కూడాను. ఇరువురు ఒకరిలో ఒకరు ప్రతిబింబిస్తారు. తన కిరణాల ద్వారా అను(గహిస్తున్న ఆదిత్య పురుషుడు, ఈ చాక్షుష పురుషునిలో ప్రతిష్ఠితుడై ఉంటాడు. అట్లాగే, ఈ చాక్షుష పురుషుడు ప్రాణాల ద్వారా ఉపకారం చేస్తూ ఆ ఆదిత్య పురుషునిలో ప్రతిష్ఠితుడై ఉంటాడు. ఆదిత్య పురుషుడు తన కిరణాల ద్వారా వెలుగునిస్తూ చాక్షుష పురుషునికి తోడ్పడుతున్నాడు. అట్లాగే చాక్షుష పురుషుడు తన ప్రాణ శక్తి ద్వారా (చూచే శక్తి ద్వారా) ఆదిత్య పురుషుని వ్యక్తంచేస్తూ అతనికి తోడ్పడుతున్నాడు. కన్ను చూడలేకపోతే ఆదిత్యుడు ప్రకాశించినా, ప్రకాశించకపోయినా ఒకటే గదా !

ఈ శరీరానికి సంబంధించిన చాక్షుష పురుషుడు ఈ శరీరం నుండి వెళ్ళిపోయేటప్పుడు విజ్ఞానమయుడైన ఆదిత్యపురుషుడు తన కిరణాలను ఉపసంహరించుకోవటం వల్ల, ఆ కిరణాలు ఈ చాక్షుష పురుషుని చేరవు. ఆ కండ్లు లొత్తలైపోతాయి. అప్పుడీ చాక్షుష పురుషునికి ఆదిత్య మండలం చంద్రబింబం లాగా స్వచ్ఛంగా, కాంతివిహీనంగా కనిపిస్తుంది– సూర్య కిరణాలు అతని వద్దకు రావు కాబట్టి, చాక్షుష కిరణాలు తన అధిదేవత అయిన సూర్యకిరణాలలో చేరిపోయినాయి కాబట్టి ! ఈ విధంగా ఇరువురు ఒకరికొకరు ఉపకారం చేసుకుంటూ ఉండటంవల్ల ఒకే సత్యాత్మకు అంశాలని (ఆదిత్యాంశ, చాక్షుషాంశ) చెప్పవచ్చు.

**మం॥ య ఏష ఏతస్మిన్మండలే పురుష స్తస్య భూరితి శిరః, ఏకం శిరః, ఏకమేతదక్షరం; భువ ఇతి బాహూ; ద్వౌ బాహూ; ద్వే అక్షరే; స్వరితి ప్రతిష్ఠా; ద్వే ప్రతిష్ఠే, ద్వే ఏతే అక్షరే; తస్యోపనిషదహరితి, హన్తి పాప్మానం జహాతి చ య ఏవం వేద. 3**

ఆదిత్య మండలాలంతర్గతుడైన పురుషునికి గల వ్యాహృతి రూపమైన అవయవాలను వర్ణిస్తున్నారు.

ఆదిత్య మండలంలో ఉన్న సత్యనామధేయుడైన పురుషునికి 'భూః' అనేది శిరస్సు. (భూః , భువః, సువః, ఇవి వ్యాహృతులు. హోమం చేసేటప్పుడు. గాయత్రీ జపానికి, ప్రాణాయామానికి,

పరిషేచనానికి ఇట్లా కర్మల్లో వీటిని ఉపయోగిస్తారు) శిరస్సు ఒకటే ఉంటుంది. ఈ 'భూః' అనే వ్యాహ్యృతిలోని అక్షరం కూడా ఒకటే ! 'భువః అనే వ్యాహృతి సత్యబ్రహ్మకు భుజాలు. భుజాలు రెండు ఉంటాయి. ఈ వ్యాహృతిలోని అక్షరాలు రెండు. 'సువః' అనే వ్యాహృతి ఈ సత్యపురుషునికి పాదాలు. పాదాలు రెండు ఉంటాయి. 'సువః అనే వ్యాహృతిలోని అక్షరాలు రెండు ఉంటాయి. ఈ సత్యాత్మక బ్రహ్మకు రహస్యనామం ఉపనిషత్. ఆ ఉపనిషత్తు ఏది? 'అహః' అనేది అతని రహస్యనామం. ఈ అహర్నామమైన బ్రహ్మాన్ని ఈ విధంగా (వ్యాహృతుల రూపంలో) తెలుసుకొని– భావించి ఉపాసించేవాడు పాపాల్ని చంపేస్తాడు, పాపాల్ని వదిలేస్తాడు.

## ఆరవ బ్రాహ్మణం

**మం॥ మనోమయో యం పురుషో భాఃసత్యస్తస్మిన్నన్త ర్హృదయే, యథా వ్రీహిర్వా యవో వా; స ఏష సర్వస్యేశానః, సర్వస్యాధిపతిః, సర్వమిదం ప్రశాస్తి యదిదం కించ. 1**

పరబ్రహ్మకున్న సూక్ష్మరూపాల్లో ఈ మనోమయరూపం ఒకటి, ఆదిత్య రూపం లాగానే. ఈ మంత్రంలో మనోమయపురుషుని వర్ణిస్తున్నారు.

ఈ మనోమయపురుషునికి ప్రకాశమే స్వరూపం. 'భాసత్యః' ప్రకాశసంజ్ఞకమైన జ్యోతియే సత్యం. అదే అతని రూపం, కాబట్టి 'భా సత్యః' అంటే భాస్వరుడు. ఈ పురుషుడు ధాన్యపు గింజలాగా, బార్లీ గింజలాగా సూక్ష్మపరిమాణంలో హృదయంలో ఉంటాడు. అతడే ఈ అన్నిటికి (ఇంద్రియాలకు) అధిపతి. ఈ ప్రపంచానికలంతకు శాసకుడు. (ఈ రూపంలో ఈ విషయం తెలుసుకొని ఉపాసన చేసేవాడు అన్నిటికి శాసకుడౌతాడు)

## ఏడవ బ్రాహ్మణం

**మం॥ విద్యుద్బ్రహ్మేత్యాహుః; విదానాద్విద్యుత్, విద్య త్యేనం పాప్మనో య ఏవం వేద విద్యుద్బ్ర హ్మేతి; విద్యుద్ధ్యేవ బ్రహ్మ. 1**

సత్యబ్రహ్మ స్వరూపమే అయినట్టి, ఆశేషపాప నివృత్తి కలిగించేటటువంటి, విశిష్ట ఫలాన్ని యిచ్చే వేరొక ఉపాసన చెపుతున్నారు.

విద్యుత్తే బ్రహ్మ; అని అంటున్నారు. అంధకారాన్ని ఖండిస్తుంది. చీలుస్తుంది కాబట్టి విద్యుత్తు ఇటువంటి గుణం కలిగిన విద్యుత్తును బ్రహ్మగా భావించి ఉపసాన చేసేవాడు తనకు దేవత్వం లభించటానికి అడ్డంకిగా ఉన్న పాపాలన్నింటిని ఖండిస్తాడు. ఈ ఫలం ఉపాస్యమైన విద్యుత్తుకు అనుగుణంగానే ఉంటుంది. కాబట్టి విద్యుత్తే బ్రహ్మ.

## ఎనిమిదవ బ్రాహ్మణం

**మం॥ వాచం ధేనుముపాసీత; తస్యాశ్చత్వారః స్తనాః స్వాహాకారో, వషట్కారో హన్తకారః స్వధాకారః; తస్య ద్వౌస్తనౌ దేవా ఉపజీవన్తి- స్వాహాకారం చ వషట్కారం చ, హన్తకారం మనుష్యాః, స్వధా కారం పితరః; తస్యాః ప్రాణ ఋషభ; మనో వత్సః**

ఆ సత్య బ్రహ్మ యొక్క రూపాంతరమైన వాగ్బ్రహ్మోపాసనను విశదీకరిస్తున్నారు- వాక్కు అంటే, ఋక్ యజు స్సామరూపాత్మకమైన ధేనువు లాంటిది. ఈ వాక్కును త్రయీరూపాత్మకమైన ధేనువుగా భావించి ఉపాసించాలి. ఆ వాగ్రూపమైన ఆవుకు నాలుగు స్తనాలు. అవి, స్వాహాకారము, వషట్కారము హస్త, స్వధాకారము అనేవి. వీటిలో స్వాహాకారము, వషట్కారము ఈ రెంటిద్వారా దేవతలకు హవిస్సులు ఇస్తారు. 'హన్త' అంటూ మానవులకు అన్నదానిదికం చేస్తారు. స్వధాకారం ద్వారా పితరులకు శ్రాద్ధయోగ్యమైన వస్తువులు యిస్తారు. త్రయీ (మూడు వేదాలు) రూపాత్మకమైన వాగ్ధేనువుకు ఇవి నాలుగు స్తనాలు గదా ! నీటి ద్వారా దేవమానవ పితృదేవతల కోరికలు తీరుతున్నాయి కాబట్టి వారు దూడల వంటివారు. ప్రాణమే ఆ ధేనువు యొక్క వృషభం- ఆం బోతు. ప్రాణం ద్వారానే వాక్కు ప్రసవిస్తుంది- మనస్సు దాని దూడ, ఎందుచేతనంటే మనస్సు ద్వారానే ఆలోచించిన విషయంతో వాక్కు యొక్క ప్రవృత్తి జరుగుతుంది. ఈ విధమైన ఉపాసన చేసిన వానికి వాగ్రూపమైన బ్రహ్మప్రాప్తి కలుగుతుంది.

## తొమ్మిదవ బ్రాహ్మణం

**మం॥ అయమగ్నిర్వైశ్వానరోయో యమన్తః పురుషే యేనేదమన్నం పచ్యతే యదిదమద్యతే; తస్యైష ఘోషో భవతి యమేతత్కర్ణావపిధాయ శ్రుణోతి, స యదోత్క్రమిష్యన్భవతి నైనం ఘోషం శ్రుణోతి. 1**

ఈ శరీరం లోపల ఉండే అగ్నిని వైశ్వానరాగ్ని అంటారు. ఇది మనకు బయట కనిపిస్తూ ఉండే శరీరారంభకమైన భూతాగ్ని కాదు. దీనిని జఠరాగ్ని అంటాము. ఈ జఠరాగ్ని వల్లనే అన్నం తింటున్నాము. తిన్న అన్నం జీర్ణమౌతోంది దీనివల్లనే ! ఈ జఠరాగ్నికి ఒక విధమైన శబ్దం (ఘోష) ఉంది. ఆ శబ్దం ఎట్లా ఉంటుంది ? మనం రెండు చెవులలోను వ్రేళ్ళుపెట్టి మూసేస్తే వచ్చే శబ్దం ఈ జఠరాగ్ని ఘోషయే ! అయితే, శరీరంలో నుండి ప్రాణం లేచిపోయటప్పుడు- భోక్త ఉత్క్రమణం చేసేటప్పుడు, ఈ ధ్వని వినిపించదు.

## పదవ బ్రాహ్మణం

**మంII యదా వై పురుషో స్మాల్లోకాత్ప్రైతి స వాయుమా గచ్ఛతి, తస్మై స తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖం, తేన స ఊర్ధ్వ ఆక్రమతే; స ఆదిత్యమాగచ్ఛతి, తస్మై స తత్ర విజిహీతే యథా లంబరస్య ఖం, తేన స ఊర్ధ్వ ఆక్రమతే; స చంద్రమసమాగచ్ఛతి, తస్మై స తత్ర విజిహీతే యథా దుందుభేః ఖం, తేన స ఊర్ధ్వ ఆక్రమతే; స లోక మాగచ్ఛత్య శోకమహిమం, తస్మిన్వసతి శాశ్వతీః సమాః. 1**

విద్వాంసుడైన పురుషుడు– ఉపాసకుడు, ఈ లోకం నుండి నిష్క్రమించేటప్పుడు వాయువును పొందుతాడు. ఆకాశంలో ఘనీభూతమై ఉండే వాయువు అతని కోసం ఛిద్రయుక్తమౌతుంది– అంటే ఆ వాయువులో ఒక కన్నం ఏర్పడుతుంది. అట్లా చిద్రయుక్తమై వాయు రూపంలో ఉన్న అతనికి త్రోవ యిస్తుంది. ఆ చిద్రం చక్రం యొక్క చిద్రం (ఇరుసు పట్టే కన్నం) అంత ఉంటుంది. ఆ రంధ్రం గుండా ఆ ఉపాపకుడు వాయు రూపంలోనే పైకి పోతాడు. అట్లా పోయి సూర్యలోకాన్ని చేరతాడు. ఆ సూర్యుడు కూడా అతనికి పైకి పోయేందుకు మార్గం ఇస్తాడు. ఆ రంధ్ర మార్గం ఢమరుకానికుండే కంత అంత ఉంటుంది. (ఢమరుకం అనేది బుడబుక్కలగొట్టం లాంటి వాద్యం) ఆ రంధ్రంలో నుండి ఉపాసకుడు ఇంకా పైకిపోయి చంద్రలోకం చేరతాడు. చంద్రలోకం కూడా అతనికి రంధ్రం ద్వారా పైకి పోయేందుకు మార్గాన్ని యిస్తుంది. ఆ రంధ్రం దుందుభి (నగారా) రంధ్రమంత ఉంటుంది. ఈ రంధ్రంలో నుండి ఉపాసకుడు పైకి పోతాడు. అక్కడికిపోయి మానసిక దుఃఖాలు, శరీర తాపాలూ ఏమీ లేనట్టి ప్రజాపతిలోకాన్ని చేరి అనంతకాలం (అనేక సంవత్సరాల పాటు) అనేక బ్రహ్మకల్పాలు అక్కడ నివసిస్తాడు. స్వల్ప పరిమాణంలో శరీరం నుండి వెలువడిన జీవాత్మ (ప్రాణం) పోను పోను బృహద్రూపం ధరించటం వల్లనే ఆయాఛిద్రాలు పెద్దవిగా అవసరమైనాయని ఊహించవచ్చు– ప్రజాపతి లోకానుభవానికి తగినంత ప్రాణరూపంగా మారుతూ ఉండి ఉండాలి.

## పదకొండవ బ్రాహ్మణం

**మంII ఏతద్వైపరమం తపో యద్వ్యాహిత స్తప్యతే, పరమం మైవ లోకం జయతి య ఏవం వేద; ఏతద్వై పరమం తపో యం ప్రేతమరణ్యం హరన్తి; పరమం హైవ లోకం జయతి య ఏవం వేద, ఏతద్వై పరమం తసో యం ప్రేతమగ్నావభ్యాదధతి, పరమం హైవ లోకం జయతి య ఏవం వేద. 1**

జ్వరం వచ్చినప్పుడు శరీర తాపం పెరుగుతుంది కదా ! నిజంగా ఆ జ్వర తాపం కూడా ఒక విధంగా గొప్ప తపస్సే ! ఎందుచేతనంటే జ్వర తాపంలోను, తపస్సు వల్ల కలిగే తాపంలోను కూడా శరీరానికి ఒకే విధమైన క్లేశం కలుగుతుంది. ఈ విధంగా భావించిన

వానికి, రోగాలను నిందించని వానికి, ఏ లోకాలు ప్రాప్తిస్తాయి? నిజంగా అట్టి వానికి లభించేది ఉత్కృష్టమైన లోకమే ! అటువంటి పరమ లోకాన్ని- గొప్ప లోకాన్నే జయిస్తాడు. మృతుడైన వానిని ఋత్విక్కులు అంత్యక్రియల కోసం గ్రామానికి చివర ఉండే అడవిలోకి తీసుకొనిపోతారు గదా ! అట్లాగే తపస్వి కూడా తపస్సు చేయటానికి అడవికి పోవాలి. కాబట్టి జనపదం వదలి వనానికి పోవటం ఇద్దరికీ ఒకటే ! మరణాసన్నమైనవాడు ఈ సత్యాన్ని గ్రహిస్తే అతనికి పరమలోకం లభిస్తుంది. అగ్ని సంస్కారం చేసేటప్పుడు మృతుని చుట్టూ అగ్ని ఉంచుతారు గదా ! నిజంగా అదే అతని పరమ తపస్సు- అగ్నిలో తపించటం- కాలటం ! ఈ విధంగా తెలుసుకున్నవాడు పరమలోకాన్ని- ఉత్తమ లోకాన్ని జయిస్తాడు.

## పన్నెండవ బ్రాహ్మణం

**మం॥ అన్నం బ్రహ్మేత్యేక ఆహుః తన్న తథా, పూయతి వా అన్నమృతే ప్రాణాత్, ప్రాణో బ్రహ్మేత్యేక ఆహుః, తన్న తథా, శుష్యతి వై ప్రాణ ఋతే న్నాత్; ఏతే హ త్వే దేవతే ఏకధాభూయం భూత్వా పరమతాం గచ్ఛతః; తద్ధ స్మాహ ప్రాతృదః పితరం, కిం స్విదేవైనం విదుషే సాధు కుర్యాం కిమే వాత్మా అసాధు కుర్యామితి; స హ స్మాహ పాణినా, మా ప్రాతృదః , కస్త్వేన యోరేకధాభూయం మూత్వా పరమతాం పాణినా, మా ప్రాతృదః, కస్త్వేన యోరేకధాభూయం మూత్వా పరమతాం గచ్ఛతీతి; తస్మా ఉ హైతదు వాచ వీతి; అన్నం వై వి, అన్నే హీమాని సర్వాణి భూతాని విష్టాని; రమతి; ప్రాణోవై రమ్, ప్రాణే హీమాని సర్వాణి భూతాని రమన్తే; సర్వాణి హ వా అస్మిన్ భూతాని విశన్తి; సర్వాణి భూతాని రమన్తే, య ఏవం వేద. 1**

రెంటి (అన్నప్రాణాల) ఏకత్వాన్ని సాధన చేసి ఎవడు బ్రహ్మ భావాన్ని పొందాడు?' ఈ విధంగా పైన చెప్పిన సాధనను నిషేధించి ప్రాతృదునితో అతని తండ్రి అన్నాడు- 'వి' – విష్టాని అంటే ఆశ్రయం పొందుతున్నాయి అని అర్థం. 'వి' ఇదే సమస్త భూతాలకు ఆశ్రయం అవుతోంది కాబట్టి అన్నం అవుతోంది. ఈ 'వి' రూపంలో ఉన్న అన్నంలోనే సమస్త ప్రాణులు ప్రవిష్టమై ఉన్నాయి. అన్నానికి ఉన్న రెండవ గుణం 'రమ్'. ఈ 'రమ్' అనేదే ప్రాణం. ఎందుచేత ? ఈ ప్రాణశక్తి వల్లనే సమస్త ప్రాణులు రమిస్తున్నాయి- విహరిస్తున్నాయి. అందుచేత 'రమ్' అంటే ప్రాణం ఈ విధంగా సమస్త భూతాలకు ఆశ్రయరూపమైన అన్నము, సమస్త భూతాలకు రమణ రూపమైన ప్రాణాన్ని తెలుసుకొని ఉపాసించే వానిలో సమస్త ప్రాణాలు ప్రవేశిస్తాయి- అన్ని భూతాలు అతనిలో రమిస్తాయి- అన్ని భూతాలకు అతడు ఆశ్రయమౌతాడు. ఇది ఉపాస్యానికున్న గుణాలకు అనురూపమైన ఫలం.

## పదుమూడవ బ్రాహ్మణం

**మం॥ ఉక్థమ్; ప్రాణో వా ఉక్థమ్, ప్రాణో హీదం సర్వముత్థా పయతి; ఉద్ధాస్మాదుక్థ విద్వీర స్తిష్ఠతి, ఉక్థస్య సాయుజ్యం సభోకాతాం జయతి, య ఏవం వేద. 1**

(ఉక్థోపాసనను గూర్చి చెపుతున్నారు– ఉక్థమనేది స్తుతి రూపంలో స్తోత్ర రూపంలో ఉండే మంత్రం– మహావ్రతయాగంలో (సోమయాగంలో) దీని ప్రాధాన్యత ఎక్కువ.)

ప్రాణమే ఉక్థం. ప్రాణమనేది ఇంద్రియాలన్నింటిలోను ప్రధానమైంది– ఉక్థమనేది స్తోత్ర మంత్రాలన్నింటిలోను ప్రధానమైనది. ప్రాణం ఉన్నప్పుడే జగత్తు అంతా లేచి కర్మలు చేయగలుగుతోంది– ఉత్పాదన కర్మల వంటివి. కాబట్టి ఉక్థమే ప్రాణం. ప్రాణం లేనిదే ఎవరూ లేవలేరు. ఈ విధంగా ఉక్థగుణ విశిష్టమైన ప్రాణ బ్రమ్మని ఉపాపించేవాడు. ప్రాణవిదులైన వీరుపుత్రుల్ని కంటాడు. ఇది దృష్ట ఫలం. ఆ ఉక్థ ప్రాణంతో సాయుజ్యాన్ని, సాలోక్యాన్ని పొందుతాడు. ఇది అదృష్ట ఫలం.

**మం॥ యజుః; ప్రాణో వై యజుః, ప్రాణే హీమాని సర్వాణి బూతాని యుజ్యన్తేః యుజ్యన్తే హాస్మై పర్వాణి భూతాని శ్రైష్ఠ్యాయ, యుజుషః సాయుజ్యం సలోకతాం జయతి య ఏవం వేద. 2**

యజస్సు రూపంలో ప్రాణోపాసన చేయాలి. ప్రాణం యజస్సు ఎట్లా అయింది? ప్రాణాలుండడం వల్లనే సమస్త ప్రాణులు ఒకదానితో ఒకటి కలసి ఉంటున్నాయి. ప్రాణం లేకపోతే ఈ విధమైన సంయోగం కలిగించే సామర్థ్యం ఉండదు. అందుచేతనే ప్రాణమనేది యజుస్సు. ఈ విధంగా తెలుసుకుని ఉపాసించే వానికి కలిగే ఫలం– సమస్త ప్రాణులు శ్రేష్ఠ భావం కోసం అతనిని కలుస్తాయి– అన్నిటికంటె అతడు శ్రేష్ఠుడౌతాడు కాబట్టి ! అంతేకాక యజుస్సు రూపమైన ప్రాణ బ్రహ్మలో సాయుజ్య సాలోక్యప్రాప్తి కలుగుతుంది.

**మం॥ సామ; ప్రాణో వై సామ, ప్రాణే హీమాని సర్వాణి భూతాని సమ్యంచి, సమ్యంచి హాస్మై సర్వాణి భూతాని శ్రైష్ఠ్యాయ కల్పన్తే సామ్నః సాయుజ్యం సలోకతాం జయతి, య ఏవం వేద. 3**

సామరూపంలో ప్రాణబ్రహ్మోపాసన చేయాలి. ప్రాణాలే సామం. ఎందుచేతనంటే, ప్రాణాల్లోనే సమస్త భూతాలు సుసంగతంగా ఉంటాయి. ప్రాణాల వల్లనే ప్రాణులన్నింటికి సామ్యప్రాప్తి కలుగుతోంది. సామ్యప్రాప్తికి కారణం సామం– ప్రాణమే ! సామ్యప్రాప్తే కాకుండా శ్రేష్ఠ భావానికి కూడా సమర్థమౌతున్నాయి. ఈ విధంగా తెలుసుకొని ఉపాసించే వానికి సామంతో సాయుజ్య సాలోక్యప్రాప్తి కలుగుతుంది.

**మం॥ క్షత్రం; ప్రాణో వై క్షత్రం, ప్రాణో హి వై క్షత్రమ్, త్రాయతే హైనం ప్రాణః క్షణితోః ప్ర క్షత్రమత్ర మాప్నోతి, క్షత్రస్య సాయుజ్యం సలోకతాం జయతి, య ఏవం వేద. 4**

ప్రాణమే క్షత్రమని భావించి ఉపాసన చేయాలి. ప్రాణమే క్షత్రమనే విషయం ప్రసిద్ధమే ! ఎట్లా ? ఈ పిండదేహాన్ని ప్రాణమే శస్త్రాది బాధల నుండి రక్షిస్తుంది కాబట్టి ! దెబ్బల నుండి కాపాడుతోంది కాబట్టి దానికున్న క్షత్రత్వం ప్రసిద్ధమే ! ఈ విధంగా ఉపాసించినందువల్ల కలిగే ఫలం– క్షత్రంతో సాయుజ్యం సాలోక్యం పొందటం.

## పదునాల్గవ బ్రాహ్మణం

**మం॥ భూమిర న్తరిక్షం ద్యౌరిత్యస్టావక్షరాణి, అష్టాక్షర హ వా ఏకం గాయత్ర్యై పదమ్, ఏతదు హైవాస్యా ఏతత్; స యావదేషు త్రిషు లోకేషు తావద్ధ జయతి యో స్యా ఏతదేవం పదం వేద. 1**

అనేకమైన సోపాధిక బ్రహ్మోపాసనలు చెప్పారు. ఇప్పుడు గాయత్రి మొదలైన ఉపాధి విశిష్టమైన బ్రహ్మోపాసనను గూర్చి చెపుతున్నారు.

భూమి అంతరిక్షం, ద్యౌః ఈ మూడింటిలోను మొత్తం ఎనిమిది అక్షరాలు ఉన్నాయి. (ద్యౌః అనే పదంలోని యకారాన్ని ప్రత్యేకాక్షరంగా గ్రహించాలి) ఈ మూడూ లోకాల పేర్లు. (గాయత్రి అనే ఛందస్సులో ప్రతిపాదానికి ఎనిమిది అక్షరాలు ఉంటాయి. అటువంటి పాదాలు మూడు ఉంటాయి.) కాబట్టి ఈ భూమి మొదలైన లోకాలు గాయత్రికి మొదటి పాదం. ఛందస్సులలో కెల్లా ఈ గాయత్రీ ఛందము ప్రధానమైంది. ఇది ప్రయోక్తల ప్రాణాల్ని రక్షిస్తుంది. ఈ త్రైలోకాత్మక రూపాన్ని, త్రైలోక్య రూపాత్మక పాదాన్ని తెలుసుకున్నవాడు త్రిలోకాలను జయిస్తాడు. త్రిలోకాల్లోని భోగసామగ్రిని పొందుతాడు. గాయత్రికున్న ఈ శక్తి ఇతర చందస్సులకు లేదు. ప్రాణమే గాయత్రి, కాబట్టి గాయత్ర్యుపాధికమైన బ్రహ్మోపాపన ఇష్టమైనది. విప్రజన్మకిది కారణం కూడాను. (గాయత్రితో బ్రాహ్మణుని, త్రిష్టున్‌తో క్షత్రియుని, జగతీ చందస్సుతో వైశ్యుని సృష్టించినట్లు శ్రుతి చెపుతోంది. విప్రుని రెండవ జన్మకు ఉపనయనానికి గాయత్రే కారణం.)

**మం॥ ఋచో యజూం షి సామానీత్యష్టావక్షరాణి; అష్టా క్షరం హ వా ఏకం గాయత్ర్యై పదమ్; ఏతదు మైవాస్యా ఏతత్; స యావతీయం త్రయీ విద్యా తావద్ధ జయతి యో స్యా ఏతదేవం పదం వేద. 2**

ఋచః, యజూంషి, సామాని ఈ మూడు పదాల్లోను మొత్తం ఎనిమిది అక్షరాలున్నాయి. ఈ ఎనిమిది అక్షరాలు గాయత్రి రెండవ పాదం– సంఖ్య సరిపోవటం వల్ల ఈ ఋక్

యజుస్సామాలు గాయత్రికి రెండవ పాదం. ఈ విధంగా త్రయీ విద్య (మూడు వేదాలు) రూపమైన గాయత్రి యొక్క ద్వితీయ పాదాన్ని తెలుసుకున్నవాడు అందరిని జయిస్తాడు. త్రయీ విద్య వల్ల ఏఏ ఫలితాలు లభిస్తాయో అవన్నీ లభిస్తాయి.

**మం॥ ప్రాణో పానో వ్యాన ఇత్యాష్టావక్షరాణి; అష్టా క్షరం హవా ఏకం గాయత్ర్యా పదమ్, ఏతదు హైవాస్యా ఏతత్; స యానదిదం ప్రాణి తనాద్ధ జయతి యో స్యా ఏతదేవం పదం వేద; అథాస్యా ఏత దేవ తురీయం దర్శతం పదం పరోరజా య ఏష తపతి ; యద్వై చతుర్థం తత్తురీయం; దర్శతం పదమితి దదృశ ఇవ హేష్యః; పరోరజా ఇతి సర్వఖు హ్యేవైష రజ ఉపర్యుపరి తపతి; ఏవం హైవ శ్రియా యశసా తపతి యో స్యా ఏత దేవం పదం వేద. 3**

ప్రాణ, అపాన, వ్యానం ఇవి ఎనిమిది అక్షరాలు. (వ్యానంలోని యకారాన్ని ప్రత్యేకాక్షరంగా గ్రహించాలి.) ఇది గాయత్రీ ఛందస్సులో మూడవ పాదం– సంఖ్యా సామ్యం వల్ల. ఈ విధంగా గాయత్రి యొక్క మూడవ పాదాన్ని తెలుసుకున్నవాడు సమస్తాన్ని పొందుతాడు.

ఈ ప్రాణి సమూహాన్నంతనూ ప్రకాశింప చేసేటటువంటి 'తురీయ దర్శితం పదం' ఇది నాల్గవ పదం– దీనినే తురీయ పాదం అన్నారు. దర్శితం పదం అనే దానికి ఆదిత్య మండలాంగతర్గతుడైన పురుషుడు కనిపిస్తున్నాడా అన్నట్లుగా అని అర్థం. 'పరో రజా' అంటే అన్ని లోకాలకు పైన ఆధిపత్యాన్ని స్థాపించి ప్రకాశిస్తున్నాడని అర్థం. అన్ని లోకాల మీద ఆధిపత్యాన్ని చెప్పటానికే ఈ మంత్రంలో 'ఉపరి, ఉపరి' అని రెండు సార్లు చెప్పారు. గాయత్రిలోని నాల్గవ పాదాన్ని ఈ విధంగా తెలుసుకున్నవాడు కాంతితో కీర్తితో ప్రకాశిస్తాడు– ఆదిత్యుడు అన్నిటి పైన శోభిస్తూ ప్రకాశిస్తున్నట్లు– తపిస్తున్నట్లు.

(గాయత్రీ ఛందస్సుకు మూడే పాదాలు. నాల్గవ పాదం (తురీయం) యదార్థంగా పాదం కాదు. కాని మూడు పాదాల్లోను అనుస్యూతంగా వస్తువన్న ప్రాణబ్రహ్మయైన ఆదిత్య స్వరూపాన్ని ఉద్దేశించి నాల్గవ పాదంగా చెప్పారు. జాగ్రత్, స్వప్న, సుషుప్తులలో ఉన్న తురీయం లాగా, లోకత్రయాత్మక ప్రాణ బ్రహ్మ, త్రయీ విద్యాత్మక ప్రాణ బ్రహ్మ, ప్రాణత్రయాత్మక బ్రహ్మ మొత్తం ఈ మూడు తురీయమైన ఆదిత్య ప్రాణంలో అంతర్భూతమై పోతాయి.)

**మం॥ సైషా గాయత్ర్యేష్మింస్తురీయే దర్శతే పదే పరో రజసి ప్రతిష్ఠితా, తద్వై తత్సత్యే ప్రతిష్ఠితమ్, చక్షుర్వై సత్యమ్, చక్షుర్హి వై సత్యం; తస్మాద్య దిదానీం ద్వౌ వివదమానావేయాతాం, అహమ దర్శమ్, అహమశ్రౌషమితి; య ఏవం బ్రూయాదహ మదర్శమితి; తస్మా ఏవ శ్రద్ధధ్యామ; తద్వై తత్సత్యం బలే ప్రతిష్ఠితం; ప్రాణో వై బలమ్, తత్ప్రాణే ప్రతి ష్ఠితం,**

**తస్మాదాహుర్బలం సత్యాదోగీయ ఇతి; ఏవం వైషా గాయత్ర్యధ్యాత్మం ప్రతిష్ఠితా, సా హైషా గాయం స్త్రతే; ప్రాణావై గయాః, తత్ప్రాణాం స్త్రతే; తద్యద్గయాం స్త్రతే; తద్యద్గయాం స్త్రతే తస్మాద్గాయత్రీ నామ; స యామే వామూం సావిత్రీ మన్వాహా, ఏషైన సా; స యస్మా అన్వాహ తస్య ప్రాణాంస్త్రాయతే.** **4**

వెనుక చెప్పినట్టి మూడు పాదాలు గల గాయత్రి, ఈ నాల్గవదైన 'తురీయ దర్శిత పరో రజా పాదంలో ప్రతిష్ఠితమైన ఉంది. (ఈ పదాల అర్థాలు వెనుకటి మంత్రంలో యివ్వబడ్డాయి) తురీయపదం సత్యంలో ప్రతిష్ఠితమై ఉంది. నేత్రమే మంత్రంలో యివ్వబడ్డాయి) తురీయపదం సత్యంలో ప్రతిష్ఠితమై ఉంది. నేత్రమే సత్యం, ఎందుచేతనంటే, ఏదైనా తగాదా వచ్చినప్పుడు ఒకడు 'నేను చూచాను' అని అంటాడు. ఇంకొకడు 'నేను విన్నాను' అంటాడు ఎవరు చెప్పింది సత్యమని నమ్ముతాము? కాబట్టి శ్రోత్రం కంటె నేత్రం సత్యం ! నిజంగానే ఈ తురీయ పదానికి ఆశ్రయం అయిన సత్యం, బలంలో ప్రతిష్ఠితమై ఉంది. అందుచేత సత్యం కంటె కూడా బలం ఎక్కువ ఓజోవంతమైంది. ఆ బలం ఏది? ప్రాణమే ఆ బలం. ఆ ప్రాణాల్లోనే బలం ఉంది. అందుచేతనే బలం (ప్రాణం) సత్యం కంటె ఓజోపూర్ణమైంది. ఆశ్రయం పొందినవాని వల్ల ఆశ్రయం ఇచ్చినవానికి బలం రావటం మనం లోకంలో చూస్తున్నాము. బలహీనుడు బలవంతునికి ఆశ్రయం ఇవ్వలేడుగదా ! ఈ త్రిపదా గాయత్రి ప్రాణాల్ని రక్షించేది– ఈ గాయత్రి ప్రాణంలో ప్రతిష్ఠితమై ఉంది. వాగాది ప్రాణాల్ని రక్షించేది గాయత్రి అని అర్థం. గాయత్రి అని పేరు రావటానికి కారణం ఇదే ! ఆచార్యుడు ఎనిమిది సంవత్సరాల వటువుకు ఉపనయనం చేసి, ఏ సవితృదేవతా సంబంధమైనట్టి సావిత్రిని ఉపదేశిస్తున్నాడో ఆ సావిత్రియే ఈ గాయత్రి ! రెండూ ఒకటే ! ఆచార్యుడు వటువుకు ఈ గాయత్రిని ఉపదేశిస్తున్నాడు. ఆ గాయత్రియే వటువు యొక్క వాక్కు మొదలైన ప్రాణాల్ని రక్షిస్తోంది– నరకాదులు పొందకుండా కాపాడుతోంది.

**మం॥ తాం హైతామేకే సావిత్రీ మనుష్టుభవన్వాముః; వాగమష్టుప్, తద్వాచమను బ్రూమ ఇతి; న తథా కుర్యాత్, గాయత్రీమేవ సావిత్రీ మనుబ్రూయత్, యది హ వా అప్యేవం విద్బహ్వివ ప్రతిగృహ్ణాతి, న హైవ తద్గాయత్ర్యా ఏకంచన పదం ప్రతి.** **5**

కొన్ని శాఖ వారు వటువులు త్రిపదగా గాయత్రిని ఉపదేశించటానికి మారుగా అనుష్టుప్ ఛందస్సులో ఉండే సావిత్రిని ఉపదేశిస్తారు. ఇది సరికాదు (1. తత్సవితుర్వ రేణ్యం 2. భర్గోదేవస్యధీమహి 3.ధియోయోనః ప్రచోదయాత్ –ఇది త్రిపదా గాయత్రి. పాదానికి ఎనిమిదేసి అక్షరాలు మూడుపాదాలు. ఇక అనుష్టుప్ సావిత్రి – 'తత్సవితుర్వృణీమహే, వయం దేవస్యభోజనం శ్రేష్ఠం (వై) సర్వధాతమమ్. తురంగభగస్య ధీమహి', పాదానికి ఎనిమిదేసి అక్షరాలు. నాలుగు

పాదాలు.) ఈ అనుష్టుభం ఉపదేశించేవారి ఉద్దేశ్యం ఏమంటే– 'వాక్కే అనుష్టుప్ అని, వాక్కే శరీరంలో ఉండే సరస్వతి అని, ఆ వాక్ స్వరూపమైన సరస్వతినే పటువుకు ఉపదేశిస్తున్నామని'. ఇది సరికాదు గాయత్రీ ఛందస్సులో ఉండే గాయత్రినే ఉపదేశించాలి. ప్రాణాల్ని రక్షిస్తుంది. కాబట్టి ప్రాణమే గాయత్రి కాబట్టి ! ఈ విషయం తెలుసుకున్నవాడు ఎంత అధికంగా ప్రతిగ్రహం చేసినా (దానం తీసుకున్నా) ఆ దోషం గాయత్రిలో ఒక పాదానికి సరిరాదు. అంటే ప్రతిగ్రహీతకు పాపం రాదు.

**మం॥ స య ఇమాం స్త్రీంల్లోకాన్పూర్ణాన్ప్రతిగృహ్ణీయాత్; సో స్యా ఏతత్ప్రథమం పదమాప్నుయాత్; అథ యావతీయం త్రయీ విద్యా యస్తావత్ప్రతి గృహ్ణీయాత్ సో స్యా ఏతద్ద్వితీయం పదమాప్నుఆత్, అథ యావదిదం ప్రాణి యస్తావత్ప్రతిగృహ్ణీయాత్ సో స్యా ఏతత్తృతీయం పదమాప్నుయాత్; అథా స్యా ఏత దేవ తురీయం దర్శతం పదం పరోరజా య ఏష తపతి, నైవ కేవచనాప్యం, కుత ఉ ఏతావత్ప్రతి గృహ్ణీ యాత్. 6**

గాయత్రీ ఉపాపకుడు ఆవులు, గుఱ్ఱాలు, వీటితో నిండిన భూదానాదులు మూడు లోకాలతో సహా స్వీకరించినా ఆ దానమంతా కలసి గాయత్రిలోని ప్రథమ పాదానికి మాత్రమే సరిపోతుంది. అంటే, ఆ దానం వల్ల కలిగే దోషం ప్రథమ పాదం జపిస్తేనే చాలు పోతుందని భావం. ఈత్రయీ విద్య (మూడు వేదాలు) తో సమానంగా దానం తీసుకున్నా ఆ దానమంతా కలిస్తే గాయత్రి యొక్క రెండవ పాదానికి సమానం. అట్లాగే ఎన్ని ప్రాణులున్నాయో వాటినన్నింటిని దానంగా తీసుకున్నా గాయత్రి యొక్క మూడవ పాదానికి సమానం అని భావం. (గాయత్రి యొక్క గొప్పదనాన్ని చెప్పటం కోసం ఈ విధమైన కల్పన చేయబడ్డది. దాన ప్రతి గ్రహ దోషం పోవటానికి గాయత్రీ జపం ఈనాటికి చేస్తూనే ఉన్నారు) గాయత్రి యొక్క ఈ మూడు పాదాల విజ్ఞానమే పైన చెప్పిన ప్రతి గ్రహ దోషాలను తొలగిస్తుందని భావం. ఇదే ఈ గాయత్రి యొక్క తురీయ దర్శిత పరోరజాపదం. ఈ అంతరిక్షంలో తపించేవాడు ఎవరూ దానంగా తీసుకోటానికి తగినవాడు కాదు. అంటే పైన చెప్పిన మూడు పాదాలకు సంబంధించిన దానం తీసుకోవటం అసంభవం. ఈ నాల్గవ పాదానికి సంబంధించిన దానం ప్రతి గ్రహించటం ఇంకా అసంభవం ! ఎందుచేత? ఈ ఆదిత్య మండలాంతర్గతుడైన పురుషుడు. అన్ని లోకాలపైనా ఆధిపత్యం స్థాపిస్తున్న వానిని ఎవరు ఇవ్వగలుగుతారు? ఎవరు గ్రహించగలుగుతారు? ఈ విధమైన గాయత్రి యొక్క శక్తిని తెలుసుకొని ఉపాసన చేయాలి.

**మం॥ తస్యా ఉపస్థానమ్– గాయత్ర్యస్యేకపదీ ద్విపదీ త్రిపదీ చతుష్పద్య పదసి, న హి పద్యసే, నమస్తే తురీయాయ దర్శతాయ పరోరజసే, అసావదో మా ప్రాపదితి; యం ద్విష్యాత్,**

**అసావస్మై కామో మా సమృద్ధీతి వా- న హైవాసైక్మ స కామః సమృధ్యతే యస్మా ఏవముపతిష్ఠతే- అహమదః ప్రాప మితి వా. 7**

ఈ మంత్రంలో ఆ గాయత్రిని ఉపాసించాలి, నమస్కరించాలి. ఆ మంత్రం ఏది? ఆ మంత్రార్థం ఇది- 'ఓ గాయత్రీ ! నీవు త్రైలోక్య రూపం గల ప్రథమ పాదంతో ఏకపదవి. త్రయీ విద్యారూపాత్మకమైన రెండవ పాదంతో ద్విపదివి. ప్రాణాద్యాత్మకమైన మూడవ పాదంతో త్రిపధివి. మండలాంతర్గత పురుష రూపమైన నాల్గవ పాదంతో చతుష్పధివి. ఈ విధమైన ఉపాసన చేత నాల్గు పాదాలు కలదానివిగా తెలియబడుతున్నావు- ఈ విధంగా ఉపాసకులు నిన్ను తెలుసుకుంటున్నారు. వాస్తవానికి నీవు నిరుపాధికవు- రూపం లేదు. కాబట్టి నీవు అపదవు. నిన్ను తెలుసుకోవటానికి అసలు పదాలు లేవు. అందుచేత మామూలుగా మేము అనుకొనే ఈ లోకాలన్నింటికి పైన విరాజిల్లుతూ ఉండే నీ తురీయపదానికి నమస్కారములు ! ఈ పాపాలనే శత్రువులే మాకు విఘ్నాలు, బాధలు కలిగించటంలో విఫలులగుదురు గాక ! ఉపాసకుడు ఎవనిని ద్వేషిస్తాడో అట్టివాని కోరికలు నెరవేరకుండుగాక !' ఈ భావార్థం గల మంత్రాన్ని చదివి గాయత్రీ ఉపాసన చేయాలి- ఉపస్థానం చేయాలి. ఉపాసకుడు ఎవనిని ద్వేషిస్తాడో అతడి పేరు చెప్పి ఫలానా వాని కోరికలు నెరవేరకుండు గాక ! అని ఉపస్థానం చేయాలి. అప్పుడు గాయత్రి ఆ పేరు గలవాని కోరికలు నెరవేర్చదు. అట్లాగే తన పోరు చెప్పుకొని తన కోరికలు నెరవేరుగాక అని ఉపస్థానం చేయాలి. (ద్వేషించేవాని పేరు చెప్పటం, తన పేరు చెప్పుకోవటం- తన కోరికలు చెప్పుకోవటం, ప్రాప్తించుగాక అనే మంత్రంలోని మూడు పదాలను ఉపాసకుడు తన అభీష్టాన్ని బట్టి మార్చుకోవచ్చు.)

**మం॥ ఏతద్ధవై తజ్జనకో వైదేహో బుడిలమాశ్వతరాశ్వి మువాచ, యన్ను హో తద్గాయ త్రీవిద్బ్రూథా తథా కథం హస్తీభూతో వహసీతి; ముఖం హ్యస్యాః సమ్రాణ్ణ విదాంచకారేతి హోవాచ; తస్యా అగ్ని రేవ ముఖం, యది హ వా అపి బహ్వివాగ్నా వభ్యా దధతి, సర్వమేవ తత్సందహతి; ఏవం హైవైవం విద్య ద్యపి బహ్విన పాపం కురుతే, సర్వమేవ తత్సంస్సాయ శుద్ధః పూతో జరో మృతః సంభవతి. 8**

ఈ గాయత్రీ విజ్ఞానం విషయమై విదేహరాజైన జనకుడు అశ్వతారాశ్వుని పుత్రుడైన బుడిలునితో ఈ విధంగా అన్నాడు- 'నీవు గాయత్రీ తత్వాన్ని తెలుసుకున్నవాడవైతే నీవు ప్రతి గ్రహ దోషం వల్ల ఏనుగువై ఈ విధంగా బరువు ఎందుకు మోయాల్సి వచ్చింది?' అందుకు బుడిలుడన్నాడు- 'రాజా ! నేను గాయత్రి ముఖాన్ని ఎరగను. ఆందువల్ల- గాయత్రి యొక్క ఒక అంగాన్ని తెలుసుకోనందువల్ల, నా గాయత్రీ విజ్ఞానమంతా వ్యర్థమైంది.'

అప్పుడు జనకుడన్నాడు– 'అగ్నియే గాయత్రి యొక్క ముఖం– నోరు లౌకిక పురుషులు అగ్నిలో కట్టెలు బాగా వేస్తే ఆ అగ్ని బాగా ప్రజ్వరిల్లుతుంది– అన్నిటిని భస్మం చేస్తుంది ఈ విషయం తెలుసుకున్న వాడు ప్రతి గ్రహాదికమైన పాపం ఎంత చేసినా అన్నిటిని భక్షించి ఆ ఉపాసకుణ్ణి పరిశుద్ధుని చేసి, ముపలితనం లేనివానినిగా, చావు లేని వానినిగా చేస్తుంది. అంటే గాయత్రీ విజ్ఞానం తెలిసినట్టి ఉపాసకుని అగ్నిని అంటుకోనట్లే ప్రతి గ్రహాది పాపాలు అంటవు.

## పదునైదవ బ్రాహ్మణం

**మం॥ హిరణ్మయేన పాత్రేన సత్యస్యాపిహితం ముఖమ్. తత్ త్వం పూషన్నపావృణు సత్యధర్మాయదృష్టయే. పూషన్నే కర్షేయమసూర్య ప్రజాపత్య వ్యూహరశ్మీన్. సమూహతేజః ; యత్తేరూపం కల్యాణతమం తత్తేపశ్యామి. యో సావసౌ పురుషః సో హమస్మి, వాయురనిలమృత మథేదం భస్మాన్తం శరీరం.**

**ఓం. క్రతో స్మర కృతోస్మర కృతం స్మర అగ్నేనయ సుపథా రాయే అస్మాన్, విశ్వానిదేవ వయునాని విద్వాన్. యుయోధ్యస్మజ్జుహురాణ మేనః, భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ. 1**

జ్ఞాన కర్మ సముచ్చయ అనుష్ఠాతలు చివరలో ఆదిత్య ప్రార్థన చేస్తారు. గాయత్రి చతుర్థపాదం ఆదిత్యుడే కాబట్టి, ఇది ఆదిత్య ప్రకరణమే అవుతుంది –కాబట్టి సందర్భం సరిపోతుంది.

ఆదిత్య మండలస్థుడైన సత్య బ్రహ్మ యొక్క ముఖం (ద్వారం) బంగారం లాంటి జ్యోతిర్మయమైన పాత్రతో కప్పబడి ఉంది. ప్రకాశవంతమైన మండలంతో కప్పబడి ఉంది– సమాహిత చిత్తులు కాని వారికి అది కనపడదు– వ్యష్టి సమిష్టి రూపమైన, అహంకార రూపమైన స్వర్ణ పాత్రతో కప్పబడి ఉంది కాబట్టి ! ఓ పూషుడా ! (జగత్తును పోషించేవాడా) సత్య, ధర్మ జిజ్ఞాసువునైన నాకు దర్శనం పూషుడా ! (జగత్తును పోషించేవాడా) సత్య, ధర్మ జిజ్ఞాసువునైన నాకు దర్శంన లభించేటట్లుగా ఆ మూతను– ఆవరణమును తొలగించు ! ఓ ఏకర్షీ ! (ఒకే ఒక మంత్ర ద్రష్టనైన ఋషీ ! ఓ సూర్యుడా ! (జగత్తులో ఉండే రస రశ్మి బుద్ధుల్ని ప్రేరేపించేవాడా ! నాకు కల్యాణ ప్రదమైన నీ దర్శనం అవటానికి వీలుగా నీ కిరణాలను ఉపసంహరించు. ఈ ఆదిత్య మండలంలో ఉండే పురుషుణ్ణే నేను. ఇప్పుడు' ఆధ్యాత్మిక వాయురూపమైన నా ప్రాణం; అధి దైవిక వాయు రూపంలో ఉండే సూత్రాత్మతో కలసి ఏకమగు గాక ! నా యీ శరీరం భస్మమగుగాక ! సంకల్ప వికల్పాత్మకమైన ఓ నా మనస్సా ! నేను స్మరించటానికి వీలైనట్టి శుభకర్మలను స్మరించు ఓ ! ఓ క్రతువా ! (యజ్ఞమా) ! నేను చేసిన శుభకర్మలను స్మరించండి. నేను చేసినవన్నీ స్మరించండి, ఆ విధంగా స్మరించాల్సిన సమయం ఆసన్నమైంది.

ఓ అగ్నీ ! మమ్మల్ని మా కర్మఫల భోగానికి (మా కర్మల ఫలం అనుభవించటానికి) శుభకరమైన మార్గానికి తీసికొనిపో ! ఓ దేవా ! నీవు మాకున్న జ్ఞానాన్ని, మేము చేసిన కర్మలను పూర్తిగా తెలిసినవాడవు. కాబట్టి మా కుటిల కర్మలను దూరం చెయ్యి ! మరణాసన్నులమైన మేము నిన్ను తప్ప ఎవరిని సేవించగలం ? అందుచేతనే నీకు అనేక నమస్కారములతో నిన్ను సేవిస్తున్నాము.

## సింహావలోకనం

గాయత్రియే ప్రాణం అన్నారు. వాగాది ఇంద్రియాల్ని కాకుండా ప్రాణాన్నే ఎందుకు గాయత్రి అన్నారు ? ప్రాణమనేది వాగాది ఇతర ఇంద్రియాలకంటె జ్యేష్ఠము– ముందు పుట్టింది కాబట్టి. అట్లాగే వాగాది ఇంద్రియాలకంటె ప్రాణము శ్రేష్ఠము. ఈ విషయాలను నిర్ణయించటానికే తరువాతి అధ్యాయం ప్రారంభిస్తారు.

ఆట్లాగే చక్షురాది ఇంద్రియాలున్నా ఉక్థ, యజు స్సామ క్షత్ర భావాలతో ప్రాణోపాసనం చేయాలని చెప్పారు. అంటే ప్రాణం అన్నిటికంటె శ్రేష్ఠమని ! దానిని నిరూపించటానికి తరువాతి గ్రంథం ఆరంభిస్తున్నారు.

# ఆరవ అధ్యాయం

## మొదటి బ్రాహ్మణం

**మం॥ ఓం యో హ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ; స్వానాం భవతి, ప్రాణో వై జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ; జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి, అపి చ ఏషాం బభూషతి య ఏవం వేద. 1**

శ్రేష్ఠమైన దానిని, జ్యేష్ఠమైన దానిని తెలుసుకున్నవాడు సజాతీయులలో శ్రేష్ఠుడు, జ్యేష్ఠుడు అవుతాడు. మిగతా అన్ని ఇంద్రియాలకంటె ప్రాణమే ముందు పుట్టింది– కాబట్టి జ్యేష్ఠము. శ్రేష్ఠము ఎట్లా అయిందో తరువాత చెపుతారు. ప్రాణమే జ్యేష్ఠము. శ్రేష్ఠము అని తెలుసుకున్నవాడు సజాతీయులలోను, ఇంకా ఎవరికంటె జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు కావాలని అనుకుంటాడో వారందరికి జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు అవుతాడు.

**మం॥ యో హ వై వసిష్ఠాం వేద వసిష్ఠః స్వానాం భవతి; వాగ్వై వసిష్ఠా; వసిష్ఠః స్వానాం భవతి, ఆపి చ యేషాం బభూషతి, య ఏవం వేద. 2**

వసిష్ఠమైన దానిని తెలుసుకున్నవాడు తన సజాతీయులలో వసిష్ఠుడు అవుతాడు. వసిష్ఠ అంటే ఏమిటి వాక్కే వసిష్ఠ– అధికంగా వసించేది లేక నివాసాన్ని ఇచ్చేది. కాబట్టి వసిష్ట మంచి వక్త ధనవంతుడై చక్కగా వసిస్తాడు. వసధాతువు ఆచ్ఛాదనము– పై కప్పు అని అర్థం ఇస్తుంది. ఆ అర్థంతో వక్తయైన వాడు (వాఙ్మ) సభలో అందరిని జయిస్తాడు– మించుతాడు. ఆచ్ఛాదిస్తాడు. ఈ విధంగా కూడా చెప్పవచ్చు. వసిష్ఠ గుణ ప్రధానమైన దానిని (వాక్కును) తెలుసుకొని ఉపాసించేవాడు స్వజనులలోను, ఇతరులలోను కూడా వసిష్ఠుడౌతాడు.

**మం॥ యో హ వై ప్రతిష్ఠాం వేద ప్రతితిష్ఠతి సమే, ప్రతితిష్ఠతి దుర్గే చక్షుర్వై ప్రతిష్ఠా, చక్షుషాహి సమేచ దుర్గే చ ప్రతితిష్ఠతి; ప్రతితిష్ఠతి సమే, ప్రతితిష్ఠతి దుర్గేయ ఏవం వేద. 3**

ప్రతిష్ఠను గురించి తెలుసుకున్నవాడు సమతల భూమిపై సకాలంలో ప్రతిష్ఠితుడౌతాడు. దుర్గమ స్థానంలోనూ ప్రతిష్ఠితుడౌతాడు– విషమకంటకావృత ప్రదేశంలోను, దుర్భిక్షకంలోనూ కూడా ప్రతిష్ఠితుడౌతాడు– ఆశ్రయం పొందుతాడు. ప్రతిష్ఠ ఏది? చక్షునే ప్రతిష్ఠ ఎందుచేత? చక్షువు చేతనే సమాన దుర్గమ దేవకాలాదులలో ప్రతిష్ఠితుడౌతున్నాడు– దేశ కాలాదులను గుర్తిస్తున్నాడు. కాబట్టి ప్రతిష్ఠాగుణం కలిగిన చక్షువును ఉపాసించేవాడు మంచి చోట. చెడు చోట, మంచి కాలంలో, చెడు రోజుల్లో కూడా ఆశ్రయం పొందుతాడు.

**మం॥ యో హ వై సంపదం వేద సంహాస్మై పద్యతే యం కామం కామయతే; శ్రోత్రం వై సంపత్, శ్రోత్రే హీమే సర్వే వేదా అభిసం, పన్నాః, సం హాస్మై పద్యతే యం కామం కామయతే య ఏవం వేద. 4**

సంపదను తెలుసుకున్నవాడు ఏ భోగాన్ని కోరితే ఆ భోగం పొందుతాడు. శ్రోత్రమే సంపద. ఎందుచేతనంటే, శ్రోత్రంలోనే వేదాలన్నీ చక్కగా నిష్పన్నమౌతాయి. –శ్రోత్రం కలవాడే వేదాలన్నీ చక్కగా అధ్యయనం చేయగలుగుతాడు. సమస్త భోగాలూ, వేదవిహితమైన కర్మల అధీనంలోనే ఉన్నాయి. అందుచేత ఈ సంపద్రూపమైన శ్రోత్రాన్ని తెలుసుకున్నవాడు ఏ భోగం కోరినా చక్కగా లభ్యమవుతుంది.

**మం॥ యో హ నా ఆయతనం వేదాయతనం స్వానాం భవతి, ఆయతనం జనానం, మనో వా ఆయతనం; ఆయతనం స్వానాం భవతి, ఆయతనం జనానం, య ఏవం వేద. 5**

ఆశ్రయాన్ని (ఆయతనం) తెలుసుకున్నవాడు స్వజనులకు తాను ఆశ్రయమౌతాడు. ఇతరులకు కూడా ఆశ్రయమౌతాడు. మనస్సే ఆయతనం– ఆశ్రయం. మనస్సు యొక్క సంకల్పాన్ని బట్టే ఇంద్రియాలు ఆయా విషయాల్లో ప్రవృత్తమౌతాయి. నివృత్తమౌతాయి. ఈ విషయం తెలిసి ఉపాసించేవాడు స్వజనులకు ఇతరులకు కూడా ఆశ్రయమౌతాడు.

**మం॥ యో హ వై ప్రజాతిం వేద జయ ప్రజాయతే హ ప్రజయా పశుభిః; రేతో వై ప్రజాతి; ప్రజాయతే హ ప్రజయా పశుభిః య ఏవం వేద.** **6**

ప్రజాపతిని తెలుసుకున్నవాడు ప్రజలతోను (సంతానం) పశువులతోను సంపన్నుడౌతాడు. రేతస్సే ప్రజాపతి– రేతస్సు వల్లనే ప్రజలు పుడుతున్నారు కాబట్టి. ఈ విధంగా తెలుసుకొని ఉపాసించేవాడు సంతానము, పశువుల సంపద కలవాడౌతాడు.

**మం॥ తేహీహే ప్రాణా అహం శ్రేయసే వివదమానా బ్రహ్మ జగ్ముః, తద్ధోచుః, కో నో వసిష్ఠ ఇతి; తద్ధోవాచ, యస్మిన్వ ఉత్క్రాన్త ఇదం శరీరం పాపీయో మన్యతే స వో వసిష్ఠ ఇతి.** **7**

ఈ వాక్కు మొదలైన ప్రాణాలన్నీ తమలోతాము నేను శ్రేష్ఠమైన దాననంటే, నేను శ్రేష్ఠమైన దానన వివాదపడి ప్రజాపతి వద్దకు వెళ్ళినాయి– తీర్పు కోసం –'ఓ భగవానుడా ! మాలో ఎవరు శ్రేష్ఠులు ?' అని అడిగినాయి. బ్రహ్మ అన్నాడు– 'మీలో ఎవరు శరీరంలో లేనందువల్ల శరీరం నుండి వెళ్ళిపోయినందువల్ల శరీరం మిక్కిలి పాపభూయిష్ఠమైనదిగా (అశుభకరమైనదిగా) అవుతుందో; అదే మీలో వశిష్ఠము' అని తేలికగా అన్నాడు– ఎవరికీ కోపం రాకుండా.

**మం॥ వాగ్ఘోచ్చక్రామ, సా సంవత్సరం ప్రోష్యా గత్యో వాచ కథమశకత మదృతే జీవితుమితి; తే హోచుః, యథాకలా అవదన్తో వాచా, ప్రాణ న్తః ప్రాణేన, పశ్యన్తశ్చక్షుషా, శృణ్వంతః శ్రోత్రేణ, విద్వాంసో మనసా, ప్రజాయమానా రేతసా, ఏవమజీవిష్మేతి; ప్రవివేశ హ వాక్.** **8**

మొదటగా వాక్కు ఈ శరీరం నుండి ఉత్క్రమించింది– లేచిపోయింది. ఒక సంవత్సరం తరువాత వాక్కు మళ్ళీ తిరిగివచ్చి అన్నది 'నేను లేకుండా మీరంతా ఎట్లా జీవించి ఉండగలిగారు?' అని. అప్పుడు మిగతా ఇంద్రియాలన్నాయి – మాటలు రాని మూగవాడు మాట్లాడలేక పోయినా, ప్రాణాలతో ప్రాణవ కర్మ చేసినట్లు, కండ్లతో చూచినట్లు, చెవులతో విన్నట్లు, మనస్సుతో కర్తవ్యాకర్తవ్యాల్ని తెలుసుకో గలిగినట్లు, జననేంద్రియంతో సంతానోత్పత్తి చేసినట్లు, మేము కూడా ఆ మూగవానిలాగా బ్రతికి ఉన్నాము.' ఇది విని వాక్కు తనకు వసిష్ఠత్వం లేదని తెలుసుకొని మళ్ళీ శరీరంలో ప్రవేశించింది.

**మం॥ చక్షుర్హో చ్చక్రామ; తత్సంవత్సరం ప్రోష్యాగత్యో వాచ, కథమశకత మదృతే జీవితుమితి; తే హోచుః, యథాన్ధా అపశ్యన్తశ్చక్షుషా, ప్రాణ న్తః ప్రాణేన, వదన్తో, వాచా, శృణ్వంతః శ్రోత్రేణ, విద్వాంసో మనసా, ప్రజాయమానా రేతసా, ఏవమజీవిష్మేతి; ప్రవివేశ హ చక్షుః.** **9**

చక్షురింద్రియం శరీరం నుండి ఉత్క్రమించింది. ఇక సంవత్సరం పాటు ప్రవాసంలో ఉండి తిరిగివచ్చి, మిగతా ఇంద్రియాలతో అన్నది– 'నేను లేకుండా మీరంతా ఎట్లా జీవించి ఉండగలిగారు ? అని

మిగతా ఇంద్రియాలు ఈ విధంగా సమాధానమిచ్చాయి– 'అంధుడు కళ్ళతో చూడలేకపోయినా, ప్రాణాలతో ఊపిరి పీలుస్తూ వాక్కులతో మాట్లాడుతూ, చెవులతో వింటూ, మనస్సుతో ఆలోచిస్తూ జననేంద్రియంతో సంతానాన్ని కంటూ బ్రతికేటట్లుగా మేమూ బ్రతికాము.'

ఇది విని నేత్రేంద్రియం తనకు వసిష్ఠత్వం లేదని తెలుసుకొని శరీరంలో ప్రవేశించింది.

**మం॥ శ్రోత్రం హోచ్చక్రామ; తత్సంవత్సరం ప్రోష్యాగ త్యోవాచ, కథమశకత మదృశే జీవితుమితి; తే హోచు; యథా బధిరా అశృణ్వన్తః శ్రోత్రేణ, ప్రాణన్తః ప్రాణేన, వదనో వాచా, పశ్యన్తశ్చక్షుషా, విద్వాంసో మనసా, ప్రజాయమానా రేతసా, ఏవమజీ విష్మేతి; ప్రవివేశ హ శ్రోత్రమ్. 10**

శ్రోత్రం ఉత్క్రమణం చేసింది శరీరం నుండి. ఒక సంవత్సరం కాలం ప్రవాసంలో ఉండి, శ్రోత్రం మళ్ళీ తిరిగి వచ్చింది. మిగతా ఇంద్రియాలతో – 'నేను లేకుండా ఎట్లా బ్రతకగలిగారు' అని అడిగింది.

ఇతర ఇంద్రియ ప్రాణాలన్నాయి– 'బధిరుడు– చెవిటివాడు చెవులతో వినలేకపోయినా, ప్రాణంతో ప్రాణనక్రియ జరుపుతూ, నోటితో మాట్లాడుతూ, కండ్లతో చూస్తూ, మనస్సుతో కర్తవ్యాకర్తవ్యాలు ఆలోచిస్తూ జననేంద్రియంతో సంతానాన్ని పొందుతూ జీవిస్తూ ఉన్నట్లే మేమూ బ్రతికి ఉన్నాము.'

ఈ మాటలు విని శ్రోత్రం తనకు వసిష్ఠత్వం లేదని గ్రహించి మళ్ళీ శరీరంలో ప్రవేశించింది.

**మం॥ మనో హోచ్చక్రామ; తత్సంవత్సరం ప్రోష్యాగత్యో వాచ, కథమ శకత మదృశే జీవితుమితి; తేహోచుః, యథా ముగ్ధా అవిద్వాంసో మనసా, ప్రాణన్తః ప్రాణేన, వదన్తోవాచా, పశ్యన్తశ్చక్షుషా, శ్రుణ్వన్తః శ్రోత్రేణ, ప్రజాయమానా రేతసా, ఏవమజీవిష్మేతి; ప్రవివేశ హ మనః 11**

పిమ్మట మనస్సు శరీరం నుండి లేచిపోయింది. ఒక సంవత్సరం పాటు బయట ఉండి మళ్ళీ తిరిగివచ్చి ఇతర ఇంద్రియాలను అడిగింది– 'నేను లేకుండా మీరంతా ఎట్లా ఉండగలిగారు?' అని.

మిగతా ఇంద్రియాలు ఈ విధంగా సమాధానమిచ్చాయి– 'వెఱ్ఱివాడు మనస్సుతో ఏమీ ఆలోచించలేకపోయినా, కర్తవ్యాకర్తవ్య నిర్ణయం చేయలేకపోయినా, ప్రాణాల్తో ప్రాణనక్రియ చేస్తూ నోటితో మాట్లాడుతూ, కండ్లతో చూస్తూ చెవులతో వింటూ, జననేంద్రియంతో ప్రజనన క్రియ చేస్తూ జీవించినట్లే మేమూ జీవించి ఉన్నాము.'

ఇది విని మనస్సు మళ్ళీ శరీరంలో ప్రవేశించింది– తనకు ప్రాముఖ్యత లేకపోవటం గుర్తించి.

**మం॥ రేతో హోచ్చక్రామ; తత్సంవత్సరం ప్రోష్యాగత్యో వాచ, కథమశకత, మదృతే జీవితుమితి, తే హోచు ర్యథా క్లీభా అప్రజాయమానా రేతసా, ప్రాణన్తః ప్రాణేన, వదన్తోవాచా, పశ్యన్తశ్చక్షుషా, శృణ్వన్తః శ్రోత్రేణ, విద్వాంసో మనసా, ఏవ మజీవిష్మేతి ప్రవి వేశ హ రేతః. 12**

పిమ్మట రేతస్సు శరీరం నుండి లేచిపోయింది. ఒక సంవత్సరం పాటు బయట ఉండి, తిరిగి వచ్చి, మిగతా ఇంద్రియాలను ఈ విధంగా అడిగింది– 'నేను లేకుండా మీరంతా ఎట్లా ఉండగలిగారు?' అని

అప్పుడు మిగతా ఇంద్రియాలు ఇలా అన్నాయి– 'నపుంసకుడు జననేంద్రియంతో సంతానాన్ని పొందటానికి అసమర్థుడైనా, ప్రాణంతో ప్రాణనక్రియ ఆచరిస్తూ, నోటితో మాట్లాడుతూ, కండ్లతో చూస్తూ, చెవులతో వింటూ, మనస్సుతో ఆలోచిస్తూ ఉన్నట్లే మేమూ బ్రతికాము.'

ఇది విని రేతస్సు తనకు వసిష్ఠత్వం లేకపోవటం గుర్తించి మళ్ళీ శరీరంలో ప్రవేశించింది.

**మం॥ అథ హప్రాణ ఉత్క్రమిష్య న్యథా మహాసుహయః సైంధవః షడ్వీశవంకూన్సం వృహేత్, ఏవం హైవా న్ప్రాణా న్సంవవర్హ; తే హోచుః, మా భగవ ఉత్క్రమీః, న వై శక్ష్యా మస్త్వదృతే జీవితుమితి; తస్యోమే బలిం కురుతేతి; తథేతి. 13**

తరువాత ప్రాణం శరీరం నుండి ఉత్క్రమించటానికి పూనుకుంది. వెంటనే వాగాది ఇంద్రియాలన్నీ చలించిపోవటం ప్రారంభించాయి. సింధు దేశంలో పుట్టే ఉత్తమాశ్వం. దానిని పరీక్షించేటప్పుడు కాళ్ళతో కలిపి కట్టబడిన కట్టు కొయ్యలను అమాంతం ఊడపీకినట్లుగా వాగాది ఇంద్రియాలన్నింటిని వాటి వాటి స్థానం నుండి పీకివేస్తున్నట్లు అయింది (ప్రాణం లేచిపోవటానికి పూనుకోగానే). అప్పుడు ఆ వాగాది ఇంద్రియాలన్నీ ప్రాణంతో –"ఓ దేవా ! మీరు శరీరం నుండి ఉత్క్రమించవద్దు ! మీరు లేనిదే మేము బ్రతకలేము" అని అన్నాయి.

అప్పుడు ఆ ప్రాణం ఇలా అంది– 'మీకు నా శ్రేష్ఠత్వం, వసిష్ఠత్వం తెలిసింది కాబట్టి ఇక మీరు నాకు కానుకలు ఇస్తూ ఉండండి" అని.

అందుకు వాగాది ప్రాణాలన్నీ 'సరే' అని అంగీకరించాయి– ముఖ్య ప్రాణానికి కానుకల్వీటానికి.

**మం॥ సా హ వాగువాచ, యద్వా అహం వసిష్ఠాస్మి త్వం త్వసిష్ఠో సీతి; యద్వా అహం ప్రతిష్ఠాస్మి త్వం తత్ప్రతిష్ఠో సీతి చక్షుః; యద్వా అహం సంపదస్మి త్వం తత్సంపదసీతి శ్రోత్రం; యద్వా అహమాయతన మస్మి త్వం తదాయతనమసీతి మనః; యద్వా అహం ప్రజాతిరస్మి త్వం తత్ప్రజాతిరసీతి రేతః; తస్యో మే కిమన్నం, కిం వాస ఇతి; యదిదం కించా శ్వభ్య ఆ కృమిభ్య ఆ కీటపతం గేభ్యస్త త్తేషా న్నమ్; ఆ పో వాస ఇతి; న హ వా అస్యానన్నం జగ్ధం భవతి; నానన్నం పరిగృహీతం, య ఏవమేతదనస్యాన్నం వేద; తద్విద్వాంసః శ్రోత్రియా అశిష్యన్త ఆచామన్తి, ఆశిత్వాచామన్తి; ఏతమేవ తదనమనగ్నం కుర్వన్తో మన్యన్తే. 14**

వాగింద్రియం అన్నది– 'నాకున్న వసిష్ఠత్వ గుణం యదార్థానికి నీదే ! నీవు లేకపోతే నాకీ గుణం లేదు. 'నేత్రం అంది– 'నాకున్న ప్రతిష్ఠ నీదే ! ప్రతిష్ఠా గుణం నీవల్లనే కలుగుతోంది. 'శ్రోత్రం అంది– 'నాకున్న సంపద్గుణం నిజానికి నీదే ! నీవు లేకపోతే నాకీ గుణం లేదు. మనస్సు అన్నది– 'నాకున్న ఈ ఆయతనమనే గొప్పదనం నీదే ! నీవల్లనే నాకీ గొప్పదనం వచ్చింది.'

రేతస్సు అంది– 'నాకున్న ప్రజాపతిత్వమనే గుణం నిజానికి నీదే ! అని.

ఇదంతా విని ప్రాణం అన్నది – 'ఈ విధమైన గుణాలన్నింటితోను కూడినట్టి నాకు అన్నమేది? వస్త్రమేది?' వాగాది ఇంద్రియాలన్నాయి– 'లోకంలో కుక్కలు క్రిమి కీటకాదులు, పక్షులు మొదలుగా గల ఈ ప్రాణులన్నీ నీ అన్నమే ! నీరు నీకు వస్త్రం. ఈ విధంగా ప్రాణం యొక్క అన్నాన్ని, తెలుసుకున్నవానికి అభ్యక్ష్య భక్షణమనేది ఉండదు– అభక్ష్య ప్రతిగ్రహమూ (దానం తీసుకోవటం) ఉండదు. ఈ విషయం తెలుసుకున్న శ్రోత్రియుడు విద్వాంసుడు అయినవాడు భోజనానికి ముందు భోజనానికి తరువాత కూడా ఆచమనం చేస్తాడు. ఎందుకోసం ? ప్రాణాన్ని నగ్నంగా లేకుండా వస్త్రంతో ఆచ్ఛాదిస్తున్నామనే భావంతో !'

## రెండవ బ్రాహ్మణం

ఇది ఖిలకాండ కాబట్టి ఇంతకు పూర్వం చెప్పినట్టి విషయాలు ఈ కాండలో చెప్పబడతాయి. అయిదవ అధ్యాయం చివరలో జ్ఞానకర్మ సముచ్చయాన్ని అనుష్ఠించేవాడు దేవయాన మార్గం కోసం 'అగ్నే నయసు పథా' అనే మంత్రంలో అగ్నిని ప్రార్థించటం చెప్పారు. 'సుపథ' మనే శబ్దం కర్మఫల ప్రాప్తి సాధన స్వరూపమైన మార్గాల్ని సూచిస్తోంది. అంటే, దేవయానాది అనేక మార్గాలున్నాయని తెలుస్తోంది. ఏ ఏ కర్మలను అనుష్ఠించటం వల్ల ఏ ఏ మార్గం లభిస్తుందో మొదలైన విషయాలు వివరించటం కోసం తరువాతి గ్రంథం ఆరంభిస్తున్నారు. అట్లాగే 'ఓ మైత్రేయీ ! కర్మానుష్ఠానం వల్ల అమృతత్వాన్ని ఆశించలేము.' అవి అన్నారు. దానికి కారణమేమిటో చెప్పలేదు. ఆ కారణం చెప్పాలి కాబట్టి తరువాతి గ్రంథం ఆరంభమౌతోంది.

**మం॥ శ్వేత కేతుర్హ్వా వా ఆరుణేయః పంచాలానాం పరిష దమాజగామ; స ఆజాగామ జైవలిం ప్రవహణం పరి చారయమాణం; తముదీక్ష్యాభ్యువాద, కుమారా 3 ఇతి, స భో 3 ఇతి ప్రతి- శుశ్రావ; అను శిష్టో న్వసి పిత్రేతి; ఓమితి హోవాచ. 1**

సుప్రసిద్ధుడైన ఆరుణి కుమారుడైన శ్వేతకేతుడు పాంచాలుర సభకు వచ్చాడు. అతడు జీవలుని పుత్రుడైన ప్రవాహణుడనే పాంచాలరాజు వద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో పాంచాలరాజు సేవకులు చేత పరిచర్యలు చేయించుకుంటున్నాడు. (రాజు శ్వేత కేతువుకు గల పాండిత్య గర్వం విని ఉన్నాడు. అందుచేత అతనిని వినీతుణ్ణి చేయాలనే ఉద్దేశ్యంతో) ప్రవాహణుని రాకను గాంచి- 'ఓ ! కుమారా !' అని పలకరించాడు. అతడూ అట్లాగే 'చిత్తం అయ్యా ! ' అని ప్రత్యుత్తరమిచ్చాడు. (క్షత్రియుణ్ణి బ్రాహ్మణుడు ఆ విధంగా చిత్తం ! అయ్యా ! అని సంభోదించటం తప్పు, అయినప్పటికి అతడు కోపంతో అట్లా అన్నాడు.)

ప్రవాహణుడిది విని 'నీ తండ్రి నీకు శిక్షణ యిచ్చాడా?' అని అడిగాడు. (సుశిక్షితుడు ఈ విధంగా సంబోధించడనే భావంతో)

శ్వేత కేతువు- 'ఆఁ ! నాకు తండ్రి శిక్ష యిచ్చాడు!'

**మం॥ వేత్థ యథేమా : ప్రజాః ప్రయత్యో విప్రతిపద్యన్తా 3 ఇతి; నేతి హోవాచ, వేత్థో యథేమం లోకం పునరా పద్యన్తా 3 ఇతి; నేతి హోవాచ; వేత్థో యథాసౌ లోక ఏవం బహుభిః పునః పునః ప్రయద్భిర్న సంపూర్యతా 3 ఇతి; నేతి మహైవోచా; వేత్థో యతి థ్యామాహుత్యాం హుతాయామాపః పురుషవాచో భూత్వా సముత్థాయ వదన్తీ 3 ఇతి; నేతి హైవో వాచ ! వేత్థో దేవయాస్య వా పథః ప్రతిపదమ్, పితృయాణ్యస్య వా- యత్కృత్వా దేవయానం నా**

**పన్థానం ప్రతిపద్యన్తే, పితృయాణం వా ? అపి హి న ఋషేర్వచః శ్రుతమ్– ద్వే సృతీ అశ్రుణవం పితృణా మహం దేవానాముత మర్త్యానాం, తాభ్యామిదం విశ్వమేజత్సమేతి, యద న్తరా పితరం మాతరం చ, ఇతి. నాహమత ఏకంచన వేదేతి హోవాచ.** **2**

ప్రవాణుడు శ్వేత కేతువును అయిదు ప్రశ్న లడుగుతున్నాడు–

ప్రవావాణుడు – "ప్రజలు చనిపోయిన పిమ్మట వేరు వేరు మార్గాలో పోతున్నారు గదా, ఆ మార్గాలు నీవు ఎరుగుదువా?"

శ్వేత కేతవు– "ఎరుగను"

ప్రవాహణుడు– "వారంతా మళ్ళీ ఈ లోకానికి ఎట్లా తిరిగివస్తున్నారో నీకు తెలుసా?"

శ్వేత కేతువు– "తెలియదు".

ప్రవాహణుడు– "ఈ విధంగా మాటిమాటికి చాలామంది చచ్చిపోయి వెడుతున్నా ఆ లోకం ఎందుచేత నిండటం లేదో నీకు తెలుసా?"

శ్వేత కేతువు– 'తెలియదు."

ప్రవాహణుడు– "ఎన్నిసార్లు ఆహుతిని హోమం చేస్తే జలం మానవాకారం దాల్చి లేచి మాట్లాడగలుగుతుందో నీకు తెలుసా?'

శ్వేతకేతువు– "తెలియదు."

ప్రవాహణుడు– "దేవయాన మార్గానికి కర్మరూపమైన సాధనమేదో పితృయాన మార్గానికి కర్మరూపమైన సాధనమేదో నీకు తెలుసా?" ఏ కర్మలు చేస్తే దేవయాన, పితృయాన మార్గాలు లభిస్తాయి? ఈ రెండు మార్గాలు మనుష్యులకు సంబంధించినవని విన్నాము. ఈ రెండు మార్గాల గుండా పోయేవారు బాగానే వెడతారని, ఈ మార్గాలు ద్యులోకానికి ఈ పృథివికి మధ్య ఉన్నాయని, ఈ రెంటిని తల్లిదండ్రులంటారని నీకు తెలుసా? (ద్యులోకం తండ్రి ఈ భూలోకం తల్లి.)

శ్వేత కేతువు– "ఈ ప్రశ్నల్లో దేనికీ సమాధానం నాకు తెలియదు."

**మం॥ అథైనం వసత్యోప మంత్రయాం చక్రే; అనాదృత్య వసతిం కుమారః ప్రదుద్రావ, స ఆజాగామ పితరం; తం హోవాచ, ఇతి వాన కిల నో భవాన్పురానుశిష్టా నవోచ ఇతి; కథం సు మేధ ఇతి; పంచ మా ప్రశ్నాన్ రాజన్య బంధుర ప్రాక్షీత్, తతో నైకంచన వేదేతి; కతమే త ఇతి, ఇమ ఇతి మ ప్రతీకాన్యుదాజహార.** **3**

తరువాత రాజైన ప్రవాహణుడు వినయంతో శ్వేత కేతువును తన వద్ద ఉండమని ప్రార్థించాడు. కాని శ్వేతకేతువు ఆచట ఉండటానికి తిరస్కరించి తన తండ్రి వద్దకు వచ్చాడు. తండ్రివద్దకు వచ్చి. "నా సమావర్తన సంస్కార సమయంలో నాకు అన్ని విద్యలు బోధించటం పూర్తి అయిందని అన్నారు, అది అబద్ధం" అన్నాడు.

తండ్రి కుమారుడన్న ఈ దెప్పి పొడుపుమాటలు విని కొడుకును "ఓ శుభదర్శనుడా ! నీకు ఎందుకు కష్టం కలిగింది." అని అడిగాడు.

అందు కాతాడు– "నన్నొక క్షత్రియబంధువు అయిదు ప్రశ్న లడిగాడు. క్షత్రియ బంధువనటం అనాదరభావాన్ని సూచించటానికి) నాకు ఆ ప్రశ్నల్లో ఒక్కటికూడా తెలియదు."

తండ్రి– "ఆ ప్రశ్నలేమిటి?" అని అడిగాడు.

శేత్వ కేతువు– "ఆ ప్రశ్నలివి అని" రాజు అడిగిన అయిదు ప్రశ్నల సంకేతాలను చెప్పాడు.

**మం॥ స హోవాచ, తథా నస్త్వం తాత జానీథా యథా యదహం కించ వేద సర్వమహం తత్తుభ్యమవోచం; ప్రేహి తు తత్ర ప్రతీత్య బ్రహ్మచర్యం వత్స్యావ ఇతి; భవానేవ గచ్ఛత్వితి; స ఆజగామ గౌతమో యత్ర ప్రవాణస్య జైవతేరాస, తస్మా ఆసనమాహృత్యోదక మాహారయాం చకార, అథ హాస్మా అర్ఘ్యం చకార; తం హోవాచ, వరం భగవతే గౌతమాయ దద్మ ఇతి. 4**

కోపంగా ఉన్న తన పుత్రుణ్ణి శాంతింప చేయటానికి తండ్రి ఇట్లా అన్నాడు – 'నాయనా ! నేను చెప్పేది నిజమని నమ్ము. నాకు తెలిసినదంతా నీకు బోధించాను. (రాజు అడిగిన ప్రశ్నలకు సమాధానం నాకూ తెలియదు.) కాబట్టి , పద, ఇద్దరము అక్కడకే– వెళ్ళి బ్రహ్మచర్యంతో అక్కడ ఉండి తెలుసుకుందాం.'

ఈ మాటలకు శ్వేతకేతువన్నాడు– "మీరే వెళ్ళండి!" అని; రాజు వద్దకు పోయి అతని ముఖం చూడటం కూడా ఇష్టంలేనట్లు అన్నాడు.

అంతట గౌతమజై వలి (శ్వేత కేతువు తండ్రి) ప్రవాహణుని సభకు వెళ్ళాడు. రాజు అతనికి ఉచితమైన అసనాన్ని యచ్చి, సేవకుల చేత జలం తెప్పించి పురోహితుల ద్వారా మంత్రపూర్వకంగా అర్ఘ్యం ఇచ్చాడు. పిమ్మట ఇలా అన్నాడు – "మహాత్ములైన గౌతములకు వరం ఇస్తున్నాను" అని. (మీరు కోరినది ఇస్తాను. అని భావము)

**మం॥ స హోవాచ, ప్రతిజ్ఞాతో మ ఏష వరః, యాం తు కుమార స్యాన్తే వాచమభాషథాస్తాం మే బ్రూహీతి. 5**

**సహోవాచ, దైవేషు వైగౌ త మ తద్వరేషు, మాను షానాం బ్రూహీతి. 6**

**స హోవాచ, విజ్ఞాయతే హాస్తి హిరణ్యస్యాపాత్తం గో అశ్వానాం దాసీనాం ప్రవారాణాం పరిధానస్య, మా నో భవాన్బహోరన న్తస్యాపర్యన్తస్యాభ్యవ దాన్యో భూదితి; స వై గౌతమ తీర్థేనేచ్ఛాసా ఇతి; ఉపైన్యహం భవ న్తమితి; వాచా హ స్మైవ పూర్వ ఉపయన్తి, స హోపాయనకీర్తవ్యో వాస. 7**

గౌతముడన్నాడు– "రాజా ! మీరు నాకు వరం ఇచ్చారు. నా పుత్రుని ముందు ప్రశ్నల రూపంలో మీరు అనిన విషయమే నాకు చెప్పండి. మీరు నాకిచ్చిన వరానికి బదులుగా నేను కోరేది ఇదే !"

రాజు అన్నాడు– 'ఓ గౌతమా! అది దేవతలకు సంబంధించిన వరం– విషయం. మీరు మానవులకు సంబంధించిన దానిని అడగండి!'

ఇది విని గౌతముడన్నాడు– "ఓ రాజా ! మానవులకు సంబంధించినట్టి సువర్ణాది వస్తువులు నావద్ద వున్నాయి. నాకు బంగారం, ఆవులు గుఱ్ఱాలు, దాసీజనం, పరివారం, వస్త్రాదులు అన్నీ వున్నాయి. మీరు అనంతమైనట్టి హద్దులేకుండా దానం చేసేవారై యుండి. నా విషయంలో దాతలు కాకపోవటం బాగుండదు."

అప్పుడు రాజు ఇలా అన్నాడు– "ఓ గౌతమా ! శాస్త్రోక్త పద్ధతిలో ఆ విద్యను పొందాలని కోరండి."

గౌతముడు అన్నాడు– 'మంచిది ! అట్లాగే ! నేను మీ వద్ద శిష్యభావంతో ఉంటాను. ఇంతకు పూర్వం కూడా ఆపత్కాలంలో బ్రాహ్మణులు క్షత్రియుల వద్ద విద్యా గ్రహణం చేశారు– అయితే సేవా పూర్వకంగా కాదు" ఈ విధంగా శిష్య భావాన్ని మాలతోనే వ్యక్తం చేసి గౌతముడక్కడ వున్నాడు.

**మం॥ స హోవాచ తథా నాస్త్వం మా పరాధాస్తవ చరితామహా యథేయం విద్యేతః పూర్వం న కస్మిం శ్చన బ్రాహ్మన ఉవాస; తాం త్వహం తుభ్యం వక్ష్యామి, కో హి త్వైవం బ్రువ న్తమర్హతి ప్రత్యాఖ్యా తుమితి. 8**

అతని దుఃఖాన్ని బాధను గమనించి రాజు ఇట్లా అన్నాడు– 'ఓ గౌతమా ! మీ పితామహాదులు, మా పితామహాదులు ఆపరాధాలను లెక్కించనట్లే మీరు కూడా మా అపరాధాన్ని లెక్కించకండి. పూర్వం ఈ విద్య ఏ బ్రహ్మణునివద్ద లేదు– ఈ విద్య క్షత్రియ పరంపరగా వచ్చిందనే విషయం మీకు తెలుసు. ఇప్పుడా విద్యను మీకు చెపుతాను. ఇంత వినయ పూర్వకంగా అడిగిన వానిని ఎవరు మాత్రం ఎట్లా కాదనగలరు? యోగ్యుడైనట్టి, అధికారియైనవానికి విద్యాప్రధానం చేయటం సమంజసమే గదా !'

**మం॥ అసౌవై లోకో గ్నిర్గౌతమ; తస్యాదిత్య ఏవసమిత్, రశ్మయో ధూమః, అహరర్చి: దిశోంగారా, అవాంతర దిశో విస్ఫులింగా, తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాః; శ్రద్ధాంజుహ్వతి; తస్యా ఆహుత్యై సోమోరాజా సంభవతి. 9**

"ఓ గౌతమా ! ఈ ద్యులోకమే అగ్ని. (నిజంగా అగ్ని కాకపోయినా అగ్నిగా భావిస్తున్నాము. తరువాత స్త్రీ పురుషుల్లో కూడా ఈ అగ్ని కల్పన చేయబడుతుంది. ఈ మంత్రంలో నాల్గవ ప్రశ్నకు ముందుగా సమాధానం చెప్పబడుతోంది- క్రమభంగమైనా ! ఎందుచేతనంటే, ఈ సమాధానం విషయం మీదనే మిగతా ప్రశ్నలు సమాధానాలు ఆధారపడి వున్నాయి.) ఆదిత్యుడే ఆ అగ్నికి సమిధల వంటి వాడు- ఆదిత్యుని వల్లనే ఆ అగ్నికి ఉద్దీపనం కలుగుతోంది కాబట్టి ! కిరణాలే ధూమం, పగలే జ్వాల, దిక్కులే నిప్పుకణాలు (నిప్పు బొగ్గులు) వెదజల్లబడుటమనే గుణం వల్ల అవాంతరం దిశలే నిప్పురవ్వలు. ఈ విధమైన ద్యులోకమనే అగ్నిలో ఇంద్రాది దేవతలు శ్రద్ధను హవనం చేస్తారు. ఆ ఆహుతుల వల్ల పితరులకు బ్రాహ్మణులకు రాజైన సోముడు (చంద్రుడు) ఉద్భవిస్తాడు- అంటే చంద్ర మండలంలో ఒక పురుషుడు ఉద్భవిస్తాడు. శ్రద్ధ అనేది జలతత్త్వం. దీనిని ఆవహ యాగ్నిలో సూక్ష్మాంశలో హోమం చేయటంవల్ల ఆ ఆహుతులు సోమలోకంలో ప్రవేశించి అక్కడ (సోమమండలంలో) కర్త యొక్క శరీరాన్ని ప్రారంభిస్తాయి.

రాజు అడిగిన ప్రశ్న- 'ఎన్ని ఆహుతులు హవనం చేసినందువల్ల 'నీరు' పురుష శబ్దవాచ్యమై లేచి మాట్లాడగలుగుతుంది?' అని. దీనిని నిర్ణయించటానికే 'ద్యులోకం అగ్ని' అంటూ ఈ విషయం చెప్పారు. దీనిని యజమాని యొక్క శరీరానికి ఆరంభమైనట్టి కర్మ సంబంధమైనట్టి జలం 'శ్రద్ధ' అనే పేరుగలది అనే విషయం తెలిసింది. శరీరంలో జలాంశం ఎక్కువ కాబట్టి శరీర సృష్టిలో దానికి ప్రాధాన్యత- అంతేకాని ఇతర భూతాలు ఉండవని కాదు. కర్మవల్ల పితృలోకం వస్తుందని శ్రుతి- 'యజ్ఞాలు, దానాలు, తపస్సుల వల్ల ధూమమార్గాన్ని పొందుతారు' అని.

**మం॥ పర్జన్యో వా అగ్నిర్గౌతమ; తస్య సంవత్సర ఏవ సమిత్, అభ్రాణి ధూమః, విద్యుదర్చిః, అశనిరంగా రాః, హ్రాదునయో విస్ఫులింగాః, తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవాః సోమం రాజానం జుహ్వతి, తస్యా ఆహుత్యై వృష్టిః సంభవతి. 10**

ఓ గౌతమా ! పర్జన్యుడే అగ్ని, సంవత్సరమే ఆ అగ్నికి ఇంధనం- ఎందుచేతనంటే, సంవత్సరంవల్లనే మేఘరూపమైన అగ్ని ప్రజ్వరిలుతుంది- శరత్తు మొదలు గ్రీష్మం వరకు తన అవయవాల ద్వారా మార్పు చెందుతూ సంవత్సరం అయ్యేటప్పటికి మేఘరూపమైన అగ్ని ప్రదీప్తమౌతుంది. ఇది పర్జన్యాగ్ని. మేఘమే పొగ, మెరుపే జ్వాల, ఇంద్రుని వజ్రమే నిప్పుకణాలు,

మేఘగర్జనలే రవ్వలు. ఈ పర్జన్యాగ్నిలో దేవతలు సోమ రాజును హవనం చేస్తారు. ద్యులోకంలో శ్రద్ధను హవనం చేయగా పుట్టిన సోమరాజును ఈ రెండవదైన పర్జన్యాగ్నిలో హోమం చేస్తారు. అట్లా చేయడంవల్ల వర్షం కురుస్తుంది.

**మం॥ అయం వై లోగ్ని ర్గౌతమ; తస్య పృథివ్యేవ సమిత్, అగ్నిరూమః, రాత్రి రర్చిః, చంద్రమా అంగారాః, నక్షత్రాణి విస్ఫులింగాః, తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవా వృష్టిం జుహ్వతి; తస్యా ఆహుత్యా అన్నం సంభవతి.** **11**

ఓ గౌతముడా ! ఈ లోకమే అగ్ని. పృథివి ఈ అగ్నికి ఇంధధనం అలాంది. అగ్ని అనేది ధూమం. రాత్రి అనేది ఈ అగ్నికి జ్వాల, చంద్రుడు నిప్పుకణం, నక్షత్రాలు నిప్పురవ్వలు. ఈ అగ్నిలో దేవతలు వెనుకటి మంత్రంలో ఉత్పన్నమైనట్లుగా చెప్పిన వర్షాన్ని హోమం చేస్తారు. ఆ ఆహుతులవల్ల అన్నం ఉత్పన్నమౌతుంది. అగ్నికి సమిథల తోడి సంబంధంతో జ్వాల పుదుతోంది.

ఈ పృథివీ ద్రవ్యరూపమైన సమిథల సంపర్కంతో జ్వాల పుదుతోంది. ఈ పృథివి యొక్క ఛాయనే రాత్రియందుండే అంధకారం అన్నారు. నిప్పుముద్దలాగా పున్నందున చంద్రుణ్ణి నిప్పుకణం అన్నారు.

**మం॥ పురుషో వా అగ్నిర్గౌతమ; తస్య వ్యాత్తమేవ సమిత్, ప్రాణో ధూమః, వాగర్చిః, చక్షురంగారాః , శ్రోత్రం మిస్ఫులింగాః, తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా అన్నం జుహ్వతి; తస్యా ఆహుత్యై రేతః సంభవతి.** **12**

ఓ గౌతమా ! చేతులు కాళ్ళు మొదలైన అవయవాదులతో కూడిన ఈ పురుషుడే అగ్ని; తెరచియున్న అతని నోరే సమిధలు. ప్రాణమే ధూమం. వాక్కే జ్వాల– వాక్కు అనే జ్వాలయే వస్తువును ప్రకాశింప చేస్తుంది– వస్తుబోధ కలుగుతుంది. నేత్రాలు నిప్పుకణాలు. శ్రోత్రాలు నిప్పుర్వలు. ఈ పురుషాగ్నిలో దేవతలు అన్నాన్ని హవనం చేస్తారు. ఆ ఆహుతులవల్ల అన్నానికి పరిణామ స్వరూపమైన వీర్యం ఉత్పన్నమౌతుంది.

**మం॥ యోషా వా అగ్నిర్గౌతము; తస్యా ఉపస్థ ఏవ సమిత్, లోమాని ధూమః, యోనిరర్చిః, యదన్తః కరోతి తే జ్గారాః, అభినందా విస్ఫులింగాః, తస్మిన్నే తస్మి న్నగ్నౌ దేవా రేతో జుహ్వతి; తస్యా ఆహుత్యై పురుషః సంభవతి, స జీవతి యావజ్జీవతీ, అథ యదా మ్రియతే.** **13**

యోషాగ్నిని వర్ణిస్తున్నారు. ఓ గౌతమా ! స్త్రీయే హోమాధిక రూపమైన అగ్ని. ఉపస్థయే సమిధలు. యోనియే జ్వాల. మైధున వ్యాపారమే నిప్పుకణాలు. ఆనందలేశమే నిప్పురవ్వలు.

ఈ యోషాగ్నిలో దేవతలు వీర్యాన్ని హవనం చేస్తారు. ఈ ఆహుతివల్ల పురుషుడు ఉత్పన్నమౌతాడు. ఆ పురుషుని ప్రారబ్ధం క్షీణమయ్యేవరకు జీవిస్తాడు. ప్రారబ్ధం క్షీణమైపోగానే మరణిస్తాడు.

**మం॥ అథైన మగ్నేయే హరన్తి; తస్యాగ్ని రేవాగ్ని ర్భవతి, సమిత్సమిత్, దూమో ధూమః, అర్చి రర్చిః అంగారా అంగారాః విస్ఫులింగా విస్ఫులింగా; తస్మిన్నే తస్మి న్నగ్నౌ దేవాః పురుషం జుహ్వతి; తస్యా ఆహుత్యై పురుషో భాస్వరవర్ణః సంభవతి. 14**

ఈ పురుషుడు చనిపోగానే ఋత్విక్కులు స్మశానానికి తీసికొని పోతారు. లోగడ చెప్పినట్లుగా కల్పితాగ్ని కాక, ప్రసిద్ధమైన ఈ అగ్నియే హోమాధికరణాగ్ని అవుతోంది. మామూలు కట్టెలే సమిధలు. మామూలుగా వచ్చే పొగయే పొగ. జ్వాలలే జ్వాలలు. నిప్పుకణాలే నిప్పుకణాలు. మామూలుగా నిప్పునుండి లేచే రవ్వలే రవ్వలు. అంటే వెనుకటిలాగా ఏవీ కల్పితాలు కావు. ప్రత్యక్షంగా మనం చూచేవే ! ఈ అగ్నిలో దేవతలు ఈ పురుషుణ్ణి అంతిమ ఆహుతిగా హవనం చేస్తారు. ఈ ఆహుతివల్ల పురుషుడు మిక్కిలి దీప్తిమంతుడౌతాడు– ఎందుచేత? గర్భాదానం మొదలుగా అంతిమ అహుతివరకు అన్ని సంస్కారాలు పొందియున్నందువల్ల ఆ విధంగా ప్రకాశిస్తాడు.

**మం॥ తేయ ఏవ మేత ద్విదుః, యే చామీ అరణ్యే శ్రద్ధాం సత్యముపాసతే, తే ర్చిరభిసంభవన్తి, అర్చిషో హః, అహ్న ఆపూర్వమాణ పక్షమ్, ఆపూర్వమాణ పక్షాద్యాన్షణ్మాసానుదఙ్ఙాదిత్య ఏతీఇ, మాసేభ్యో దేవలోకం , దేవలోకాదాదిత్యం, ఆదిత్యాద్వైద్యుతమ్, తాన్వైద్యుతాన్ పురుషోమానస ఏత్య బ్రహ్మలోకాన్ గమయతి; తే తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసన్తి; తేషాం వ పునరావృత్తిః. 15**

ఈ చెప్పినది పంచాగ్ని విద్య. (ద్యులోకాగ్ని, పర్జన్యాగ్ని, లోకాగ్ని, పురుషాగ్ని, యోషాగ్ని.) గృహస్థుడుగాని, వానప్రస్థుడుగాని, సన్యాసిగాని ఈ పంచాగ్ని విద్యను తెలుసుకొని, అరణ్యంలో శ్రద్ధాళువై హిరణ్యగర్భో పాసనచేసే వారంతా జ్యోతిరభిమాన దేవతను పొందుతారు. 'నేను అగ్ని నుండి పుట్టాను నేను అగ్ని యొక్క సంతానాన్ని' అని ఈ విధంగా సత్యాన్ని– హిరణ్యగర్భుని ఉపాసిస్తే అగ్ని స్వరూపులై అగ్నిని పొందుతారు. ఈ జ్యోతిరభిమాన దేవతను, శుక్ల పక్షాభి మాన దేవతనుండి పగటికి అభిమానియైన దేవతను, పగటికి అభిమాన దేవతనుండి శుక్ల పక్షాభిమాన దేవత నుండి ఆరు నెలల ఉత్తరాయణాభిమాన దేవతను పొందుతారు. ఈ ఉత్తరాయణంలోనే ఆరునెలలు సూర్యుడు ఉత్తర దిక్కుకు పయనిస్తాడు. ఈ ఉత్తరాయణ దేవతనుండి దేవతలుండే దేవలోకాన్ని, దేవలోకం నుండి ఆదిత్యలోకాన్ని. ఆదిత్యలోకం నుండి విద్యుదభిమాన దేవతలవద్దకు (బ్రహ్మ తన మనస్సు ద్వారా సృష్టించిన బ్రహ్మలోకవాసులు) ఒక మానస పురుషుడు

(బ్రహ్మలోకవాసి) వచ్చి బ్రహ్మలోకాలకు తీసికొని పోతాడు. వారు బ్రహ్మ లోకంలో చాలా సంవత్సరాలు ఉంటారు. వారు తిరిగి రావటమనేది వుండదు.

**మం॥ అథయే యజ్ఞేన దానేన తపసా లోకాన్జయ న్తి తేధూమ మభిసంభవన్తి, ధూమాద్రాత్రిం, రాత్రేర పక్షీయ మాణపక్షమ్, అథోఈయమాణపక్షాద్యాన్ షణ్మాసాన్ద క్షిణాదిత్యఏతి, మాసేభ్యః పితృలోకమ్, పితృలోకా చ్చాంద్రమ్, తే చంద్రం ప్రాప్యాన్నం భవన్తి, తాం స్తత్ర దేవా యథా సోమం రాజనమాప్యాయ స్వాపక్షీయస్వేతి, ఏవమేనాం స్తత్రభక్షయన్తి; తేసా యదా తత్పర్యవైత్య థేమమేవాకాశమభినిష్పత్యన్దే, ఆకాశాద్వాఉం, వాయోం, వాయోర్వృష్టిం, వృష్టేః పృథివీం తే పృథివీం ప్రాప్యాన్నం భవన్తి, తే పునః పురు షాగ్నౌహూయన్తే, తతో యోషాగ్నౌ జాయన్తే లోకా న్ప్రత్యుత్థాయినః; త ఏవమేవాను పరివర్తన్తే; అథ య ఏతౌ పన్థానౌ న విదుస్తే కీటాః పతంగాః యదిదం దన్దశూకం. 16**

పైన చెప్పిన ఉపాసకులవంటివారు కాక, కేవలం కర్మిష్ఠులై యజ్ఞ యాగాదులు, దానాలు, తపాలు ఆచరిస్తూ తద్వారా లోకాన్ని జయించే వారు, చనిపోయిన పిమ్మట దూమాభిమానదేవతలను పొందుతారు. ధూమం నుండి రాత్రికి అభిమానదేవతను, ఆ రాత్ర్యభిమానదేవత నుండి కృష్ణ పక్షాభిమానదేవతను, ఆ కృష్ణపక్షం నుండి ఆరునెలల పరిమితిగల దక్షిణాయనాన్ని, సూర్యుడు దక్షిణదిక్కుగా పయనించే ఈ దక్షిణాయనాన్నుండి పితృలోకాన్ని, పితృలోకం నుండి చంద్రలోకాన్ని పొందుతారు. ఆ చంద్రలోకంలో అన్నరూపాన్ని పొందుతారు. ఋత్విక్కులు 'ఆప్యాయస్వ ఆపక్షీయస్వ' 'నింపు, ఖాళీ చెయ్యి, అంటూ సోమాన్ని భక్షించినట్లుగా, దేవతలు ఆ అన్నాన్ని భక్షిస్తారు. కర్మక్షయమైపోగానే ఆకాశాన్ని పొంది, ఆకాశం నుండి వాయువును, వాయువు నుండి వర్షాన్ని, వర్షం నుండి భూమిని చేరతారు. భూమిని చేరిన తరువాత ఆ కర్మిష్ఠులు అన్నం అవుతారు. తరువాత మళ్ళీ పురుషాగ్నిలో హవనం చేయబడి, ఈ లోకంవైపుకు పోగల స్థితిని పొంది యోషాగ్నిలోమళ్ళీ జన్మిస్తారు. ఈ విధంగా మాటిమాటికీ వస్తూపోతూ ఉంటారు.

పైన చెప్పిన రెండు మార్గాలను తెలియనివారు (జ్ఞాన, కర్మ మార్గాలు) కీటకాలుగా, పురుగులుగా, కుట్టే పురుగులుగా, దోమలుగా పుడతారు. (ఈ విధంగా పునరావృత్తిని గూర్చిన రెండవ ప్రశ్నకు సమాధానం లభించింది. అట్లాగే ఆ లోకం నిండకపోవటం అనే మూడవ ప్రశ్నకు సమాధానం కూడా వచ్చింది)

ఈ కర్మ విభాగమనే బ్రాహ్మణంలోని సారాంశాన్ని పునరాలోచనం చేద్దాం.

### ప్రవాహణుడు అడిగిన ప్రశ్నలు

1) చచ్చిపోయిన తరువాత జనులు విభిన్న మార్గాలలో పోతారు గదా ! ఆ మార్గాలు నీవు ఎరుగుదువా ?

1) ఉత్తరాయణ, దక్షిణాయన మార్గాలు లేదా దేవయాన పితృయాన మార్గాలు.

2) మళ్ళీ ఈ లోకానికి ఎట్లా తిరిగివస్తారో తెలుసా ?

2) కర్మిష్ఠులు పితృయానాన పోయి, కర్మక్షయం కాగానే ఆకాశాన్ని చేరి దాని నుండి క్రమంగా వాయువు, వర్షం, భూమి, అన్నాన్ని పొంది పురుషాగ్నిని చేరి రేతోరూపం దాల్చి యోషాగ్నిలో హవనం చేయబడి మళ్ళీ పురుష రూపం ధరిస్తాడు.

3) ఈ విధంగా మాటిమాటికి చచ్చి అచటికి పోతున్నా ఆ లోకం ఎందువల్ల నిండటం లేదు ?

3) ఇట్లా మాటిమాటికి రాకపోకలు సాగడం వల్ల ఆ లోకం ఎన్నడూ నిండిపోదు.

4) ఎన్నిసార్లు హవనం చేయటం వల్ల జలం పురుష సంజ్ఞను పొంది లేచి మాట్లాడగలుగుతుంది?

(4) ద్యులోకాగ్నిలో శ్రద్ధను హవనం చేస్తారు. సోమరాజు ఉద్భవిస్తాడు. పర్జన్యాగ్నిలో సోమరాజును హవనం చేస్తారు. వర్షం పుడుతుంది. లోకాగ్నిలో వర్షాన్ని హవనం చేస్తారు. అన్నం ఉత్పన్నమౌతుంది. పురుషాగ్నిలో అన్నాన్ని హవనం చేస్తారు. పురుషుడు పుట్టి మాట్లాడగలుగుతాడు.

5) దేవయాన పితృయాన మార్గాలకు సాధనాలు తెలుసా ?

(5) దేవయాన మార్గానికి జ్ఞానము, ఉపాసన సాధనాలు, పితృయాన మార్గానికి కేవల కర్మ, దానం, తపస్సు సాధనాలు.

## మూడవ బ్రాహ్మణం

ఇంతకు పూర్వం ఉపాసన, కర్మ ఈ రెంటికి ఫలితాలను చెప్పారు. వీటిలో ఉపాసన అనేది స్వతంత్రమైనది. ఇంకొకరి ప్రమేయం లేదు. కాని, కర్మమార్గమనేది దైవ, మానుష, సంపదల అధీనమై ఉంది– దైవీ సంపద, మానవ సంపద రెండూ కర్మలు ఆచరించటానికి అవసరం. కాబట్టి కర్మ కోసం డబ్బు సంపాదించాల్సిన అవసరం ఉంది. ఆ విత్త సముపార్జనం

అనేది ప్రత్యవాయం కలగని పద్ధతిలో (పాపం సంక్రమించని పద్దతిలో) ఉండాలి. అందుచేత, ఈ బ్రాహ్మణంలో మహత్వప్రాప్తి కోసం 'మంథ' మనే పేరు గల కర్మను గూర్చి చెపుతున్నారు. 'మంథ' మంటే బాగా నూరినది, మర్దన చేసినది అయిన ముద్ద. మహత్వ ప్రాప్తి కలిగితే విత్తప్రాప్తి సహజంగానే కలుగుతుంది. అందుచేతనే విత్తాన్ని కోరేవారు. కర్మాధికారులు అయిన గృహస్థులు మహత్వ ప్రాప్తి కోసం ప్రార్థించాలని శ్రుతి చెపుతోంది. ఆ కారణంగా ఈ బ్రాహ్మణం ఆరంభిస్తున్నారు.

**మం॥ స యః కామయేత మహత్ప్రాప్ను యామితి, ఉదగ యన అపూర్యమాణ పక్షస్య పుణ్యాహే ద్వాదశాహ ముపసద్వ్రతీ భూత్వోదుంబరే కంసే చమసే వా సర్వౌషధం ఫలానీతి సంభృత్య పరిసమూహ్య పరిలిప్యాగ్ని ముపసమాధాయపరిస్తీర్యావృతా జ్యం సంస్కృత్య పుంసా నక్షత్రేణ మన్థం సంనీయ జుహోతి. యావన్తో దేవాస్త్వయి జాతేవద స్తిర్యంచో ఘ్నంతి పురుషస్య కామాన్, తేభ్యో హం భాగధేయ జుహోమి, తే మా తృప్తాః సర్వై కామస్తర్పయంతు– స్వాహా, యా తిరశ్చీ నిపద్యతే హం విధరణీ ఇతి, తాం త్వా ఘృతస్య దారయా యజే సంరాధనీ మహం– స్వాహా. 1**

ధనాన్ని కోరే కర్మాధికారియైన గృహస్థు తాను మహత్వాన్ని పొందాలని కోరేటట్లయితే, ఉత్తరాయణంలో, శుక్లపక్షంలో పుణ్యతిథి నుండి పన్నెండు రోజులపాటు పయో వ్రతాన్ని– పాలు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ– ప్రారంభించి, ఉదుంబర వృక్షపు కఱ్ఱతో చేసిన పాత్రలో అన్ని ఓషధులు, పండ్లు మొదలైనవి వేసి, పెరుగులో తేనెలో వెన్నలో నానబెట్టి పుల్లతో బాగా కలియబెట్టి ఒక ముద్దలాగా తయారు చేయాలి. ఆ విధంగా తయారుచేసిన ముద్దను మంథమంటారు. (ఈ ఓషధులు వ్రీహి, యవ, గోధుమాదులు పది రకాలకు తక్కువ లేకుండా ఉండాలి. అట్లాగే లభించిన పండ్ల రకాలన్నీ కలపాలి). తరువాత అగ్ని వేదికను దర్భలతో చక్కగా ఊడ్చి, పేడ నీళ్ళతో అలికి అగ్ని సంస్థాపన చేయాలి. తరువాత ఆగ్ని చుట్టూ దర్భలు పరచి గృహ్యసూక్తంలో చెప్పినట్లుగా ఘృతసంస్కారం చేసి, పురుష నక్షత్రాలతో (హస్త మొదలైన పుంలింగ నక్షత్రాలు) కూడిన శుభ దినాన, తయారుచేసిన ఉంచుకొన్న మంథాన్ని తనకు అగ్నికి మధ్యలో ఉంచుకొని ఈ దిగువ చెప్పబోయే మంత్రాలతో హోమం చేయాలి– ఆహుతులు ఇవ్వాలి. మంత్రార్థం ఈ విధంగా ఉంది–

ఓ అగ్ని దేవా? నీ అధీనంలో ఉంటూ వక్రబుద్ధులై, పురుషుల కోరికలకు విఘాతాలను, విఘ్నాలను కలిగిస్తూ ఉండే దేవతలను ఉద్దేశించి, వారి కోసం ఈ ఆజ్య భాగాన్ని హోమం చేస్తున్నాను. ఆ దేవతలు తృప్తిని పొందినవారై. నా కోరికలు తీర్తురు గాక ! స్వాహా ! (స్వాహా శబ్దంతో ఆహుతి ఇవ్వాలి.)

ఆ దేవతలు తృప్తి చెంది నన్ను సంపూర్ణమైన భోగాల ద్వారా తృప్తుని చేయుదురు గాక ! స్వాహా !

అందరి మృత్యువు తన చేతిలోనే ఉన్నదని భావిస్తూ నీ అధీనంలో ఉన్నట్టి, వక్రబుద్ధి కలిగినట్టి సమస్త భోగాలు ఇవ్వగలిగినట్టి ఆ దేవత కోసం ఈ ఘృతధారను హోమం చేస్తున్నాను. స్వాహా ! ఈ విధంగా ఘృతా హుతులు ఇవ్వాలి.

**మం॥ జ్యేష్ఠాయ స్వాహ, శ్రేష్ఠాయ స్వాహా, ఇత్యగ్నౌ హుత్వామంథే సంస్రవమవనయతి; ప్రాణాయస్వాహా, వసిష్ఠాయై స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవ మవనయతి; వాచే స్వాహా, ప్రతిష్ఠాయై స్వాహేత్యగ్నౌ హుత్వా మంథేస్త్ర సంవ్రమవనయతి; చక్షుషే స్వాహా, సంపదే స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రసవమవ నయతి; శ్రోత్రాయ స్వాహా, ఆయతనాయ స్వాహే త్యగ్నౌ హుత్వా మంథే సంస్రవ మవనయతి; మనసే స్వాహా, ప్రజాత్యై స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవమవనయతి, రేతసే స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవమవనయతి. 2**

**మం॥ అగ్నయే స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవ మవనయతి; సోమాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవ మవనయతి; భూః; స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రన మవనయతి; భువ; స్వాహే త్యగ్నౌ హుత్వా మంథే సంస్రవమవనయతి; భూర్భువః స్వః స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవ మవనయతి; బ్రమ్మణే స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవ మవనయతి; క్షత్రాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవమవనయతి, భూతాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవమవనయతి; విశ్వాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవ మవనయతి; సర్వాయ స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవమవనయుతి; ప్రజాపతయే స్వాహేత్యగ్నౌ హుత్వా మంథే సంస్రవ మవనయతి. 3**

జ్యేష్ఠాయ స్వాహా, శ్రేష్ఠాయస్వాహా అనే మంత్రాలతో ఆవసత్యాగ్నిలో హోమం చేసి, స్రువంలో మిగిలి ఉన్న నేతిని పిష్ఠపిండ రూపంలో ఉన్న మంథంలో వేయాలి –కారనివ్వాలి. (మంథపాత్ర లాగానే స్రుక్ స్రువాలు కూడా ఉదుంబర కాష్టంతోనే చేసి వుండాలి.)

ప్రాణాయస్వాహా, వసిష్ఠాయస్వాహా అనే మంత్రంలో హోమం చేసి స్రువంలో మిగిలి ఉన్న నేతిని మంథంలోనికి కారనివ్వాలి.

వాచేస్వాహా, ప్రతిష్ఠాయైస్వాహా అనే మంత్రంతో హోమం చేసి స్రువంలో మిగిలి ఉన్న నేతిని మంథపాత్రలోనికి కార్చాలి.

చక్షుషేస్వాహా, సంపదేస్వాహా....

శ్రోత్రాయస్వాహా, ఆయతనాయస్వాహా.....

మనసే స్వాహా, ప్రజాత్యైస్వాహా.....

రేతసేస్వాహా.....

అగ్నయేస్వాహా....సోమాయ స్వాహా.....

భూఃస్వాహా.....భువస్వాహా.....స్వః స్వాహా.....

భూర్భువఃస్వః స్వాహా....బ్రహ్మణేస్వాహా.... క్షత్రాయస్వాహా......భూతాయ స్వాహా.

**మం॥ అథైన మభిమృశతి– భ్రమదసి, జ్వలదసి, పూర్ణమసి, ప్రస్తబ్ధమసి, ఏకసభమసి, హింకృతమసి, హిం క్రియమాణమసి, ఉద్గీథమసి, ఉద్గీయమానమసి, శ్రావిత మసి, ప్రత్యాశ్రావితమసి, ఆర్ద్రే సందీప్తమసి, విభూ రసి, ప్రభూరసి, అన్నమసి, నిధనమసి సంవర్గో సీతి. 4**

తరువాత ఆ మంథాన్ని 'భ్రమదసి' అనే మంత్రాలతో స్పృశిస్తాడు. (తన ప్రతిష్ఠాతృదేవతయైన ప్రాణంతో ఏకీభావం చెందటంవల్ల ఈ మంథద్రవ్యం సర్వాత్మకమైనది– సమస్తమూ దీనిలోనే ఉన్నాయి). మంత్రార్థం ఈ విధంగా ఉంది– ఓ మంథమా; నీవు ప్రాణ రూపంలో అన్ని దేహాల్లోను తిరుగుతున్నావు. అగ్ని రూపంలో అన్ని చోట్ల ప్రజ్వలిస్తున్నావు. బ్రహ్మ రూపంలో పరిపూర్ణమైనదానవై యున్నావు. ఆకాశ రూపంలో నిష్కంపంగా ఉన్నావు (కదలకుండా). ఎవరితోనూ నీకు విరోధం లేకపోవటం వల్ల ఈ విశ్వరూపమైన సభతో సమానమైనదానవు. యజ్ఞారంభంలో ప్రస్తోత ద్వారా ఆచరింపబడే హింక్రియమాణానివి నీవే ! యజ్ఞారంభంతో ఉద్గాత ద్వారా ఆచరింపబడే ఉద్గీయమానం నీవే ! అధ్వర్యుని ద్వారా వినిపింపబడేటటువంటి, అగ్నీధ్రుని, ద్వారా చేయబడేటటువంటి ప్రత్యాశ్రావితం నీవే ! మేఘంలో చక్కగా ప్రకాశించేది నీవే ! వివిధ రూపాలు ధరించే ప్రభుడవు నీవే ! అన్నిటికి సమర్థుడమైన విభుడవు నీవే ! నీవు అగ్ని రూపంలో జ్యోతివి. కారణ రూపంలో అన్నిటిని ప్రళయస్థానానివి. అన్నిటికి సంహారకుడవైనందున సంవర్గము నీవే!

**మం॥ అథైన ముద్యచ్ఛతి– ఆమంసి, ఆహంహి తే మహి, స హి రాజేశానో ధిపతిః, స మాం రాజేశానో ధి పతిం కరోత్వితి. 5**

'ఆమంసి, ఆమంహి' అనే మంత్రాలు చదువుతూ పాత్రతో సహా మంథాన్ని పైకి ఎత్తుతారు. ఆ మంత్రార్థం ఇట్లా ఉంది– ఓ మంథమా ! నీవు అన్నీ ఎరుగుదువు– సమస్తము ప్రాణమయమని

ఎరుగుదువు. నేను నీ మహిమను బాగా ఎరుగుదును. ప్రాణమే రాజు. పరిపాలకుడు ప్రభువు. అటువంటి ప్రాణమే నన్ను రాజుగా ప్రభువుగా పరిపాలకునిగా తనతో సమానమైన గుణాలు కలవానినిగా (ఈ యజమానిని) చేయుగాక !

**మం॥ అథైన మాచామతి– తత్సవితుర్వ రేణ్యం. మధు వాతా ఋతాయతే, మధు క్షర న్తిసింధవః . మాధ్వీర్నః సన్త్వో షధీః, భూః స్వాహా. భర్గో దేవస్య ధీమహి. మధునక్త ముతోషః, మధుమత్పార్థివం రజః మధు ద్యౌరస్తునః ఫితా. భువః స్వాహా, థియో యో నః ప్రచోదయాత్. మధుమాన్నో వనస్పతిః, మధు మాగ్ం అస్తు సూర్యః. మాధ్వీర్గావో భవన్తు నః. స్వః స్వాహేతి, సర్వాం చ సావిత్రీమన్వాహ, సర్వాశ్చ మధుమతీః, అహమేవేదం సర్వం భూయాసం, భూర్భువః స్వః స్వాహా, ఇత్యన్తత ఆచమ్య పాణీ ప్రక్షాళ్య జఘనేనాగ్నిం ప్రాక్శిరాః సంవిశతి; ప్రాత రాదిత్య ముపతిష్ఠతే– దిశామేకపుండరీకమసి, అహం మనుష్యాణామేక పుండరీకం భూయా సమితి; యథేత– మేత్య జఘనేనాగ్ని మాసీనో వంశం జపతి. 6**

పిమ్మట 'తత్సవిత్యుర్వరేణ్యం' ఇత్యాది మంత్రాలతో మంథభక్షణం చేస్తాడు. ఆ మంత్రార్థం ఇట్లా ఉంది– కోరదగినట్టి ఆ సూర్యమార్గాన్ని నేను ధ్యానిస్తున్నాను. గాలి మెల్లగా, చల్లగా, సుగంధయుక్తంగా వీస్తోంది. నదులు తేనెలాగా మాధుర్యగుణ పరిపూర్ణాలై ప్రవహిస్తున్నాయి. ఓషధులన్నీ– ధాన్యాదులు మా కోసం మధుర రస పరిపూర్ణాలగు గాక ! భూస్వాహా ! (పై అర్థమిచ్చే మంత్రాన్ని చదివి మంథం నుండి కొంత భాగాన్ని తీసుకొని భక్షించాలి.) మేము సవితృదేవుని తేజస్సును ధ్యానం చేస్తున్నాము. మాకు రాత్రింబవళ్ళు సుఖప్రదాలు అగుగాక ! భూమిమీద ధూళి కూడా మాకు ఉద్వేగాన్ని కలిగించకుండుగాక భువః స్వాహా ! (ఈ అర్థమిచ్చే మంత్రాన్ని చదివి కొంత భాగాన్ని భక్షించాలి). మా బుద్ధుల్ని ప్రేరేపించే సవితృదేవత, మా కోసం మాధుర్య రసపరిపూర్ణమైన కిరణాలు. దిక్కులు. ఆవులు మా కొరకు సుఖప్రదమైనవి అగుగాక ! స్వః స్వాహా ! (ఈ అర్థమిచ్చే మంత్రం చదివి ఇంకొక భాగం భక్షించాలి.) తరువాత గాయత్రీ మంత్రాన్ని పూర్తిగా చదవాలి. పైన చెప్పిన పూర్తి ఋక్కును 'అహమేవేదం సర్వం భూయాసం= ఈ సమస్తం నేను అవుతాను –భూర్భువః స్వః స్వాహా మొదలైన మంత్రాలు చదివి మిగిలి ఉన్న మంథాన్ని పూర్తిగా భక్షించాలి. రెండు చేతులు కడుగుకొని అగ్ని హోత్రానికి పడమరవైపున తూర్పు దిక్కుకు అభిముఖుడై కూర్చోవాలి. తరువాత ప్రాతః కాలాన 'దిశామేక పుండరీకమసి...' 'ఓ సూర్యుడా ! నీవు దిక్కులలో పద్మము వంటి వాడవు. నేను మానువులలో పద్మము వంటి వాడను శ్రేష్ఠుడను, కావాలి' మొదలైన మంత్రాలద్వారా ఆదిత్యునికి నమస్కరించాలి.

పిమ్మట ఏ మార్గాన వెళ్ళాడో ఆ మార్గానే వచ్చి అగ్నికి వెనుక కూర్చుండి, తరువాతి మంత్రంలో చెప్పబోయే అంశాన్ని జపించాలి.

**మం॥ తం హైతముద్దాలక ఆరుణి ర్వాజసనేయాయ యాజ్ఞ వల్క్యాయా న్తేవాసిన ఉక్త్వోవాచ, ఆపి య ఏనం శుష్కే స్థాణౌ నిషించేత్, జాయేరఞ్ఛాఖాః, ప్రరో హేయుః పలాశా నీతి. 7**

ఈ మంథ కర్మను– ఈ విద్యను, అరుణుని కుమారుడైన ఉద్దాలకుడు శుక్ల యజుర్వేదాన్ని దర్శించిన యాజ్ఞవల్క్యునికి ఉపదేశిస్తూ అన్నాడు– 'ఈ మంథ ద్రవ్యాన్ని ఎండిపోయిన మ్రోడు మీద వేస్తే, ఆ మ్రోడుకు శాఖలు పుట్టి చిగుళ్ళు ఆకులు వస్తాయి. కాబట్టి కోరిన కోరికలు నెరవేరుతాయి అనటంలో అతిశయోక్తి లేదు. ఈ మంథకర్మ నిశ్చితమైన ఫలాన్ని ఇస్తుందని భావం.

**మం॥ ఏతము హైవ వాజసనేయో యాజ్ఞవల్క్యో మధు కాయ పైంగ్యాయాన్తేవాసిన ఉక్త్వోవాచ, ఆపి య ఏనం శుష్కే స్థాణౌ నిషించేత్, జాయేరంఛాఖాః, ప్రరోహేయుః పలాశానీతి. 8**

**ఏతము హైవ మధుకః పైంగ్యశ్చూలాయ భాగ విత్తయే న్తేవాసిన ఉక్త్వోవాచ, అసి య ఏనం శుష్కే స్థాణౌ నిషించేత్ జాయేరంఛాఖాః ప్రరో హేయుః పలాశానీతి. 9**

**ఏతము హైవ చూలో భాగవిత్తిర్జానకాయ ఆయ స్థూణాయా న్తేవాసిన ఉక్త్వోవాచ, అసి య ఏనం శుష్కే స్థాణౌ నిషించేత్ జాయేరంఛాఖాః ప్రరో హేయుః పలాశానీతి. 10**

**ఏతము హైవ మధుకః పైంగ్యశ్చూలాయ భాగ విత్తయే న్తేవాసిన ఉక్త్వోవాచ, అసి య ఏనం శుష్కే స్థాణౌ నిషించేత్ జాయేరంఛాఖాః ప్రరో హేయుః పలాశానీతి. 11**

**ఏవము హైవ సత్యకామో జాబాలో న్తేవాసిభ్య ఉక్త్వోవాచ, అపి చ ఏనం వుష్కే స్థాణౌ నిషించేత్, జాయేరంఛాఖాః, ప్రరోహేయుః పలా శానీతి; తమే తన్నా పుత్రాయ వాన్త న్తేవాసినే వా బ్రూయత్. 12**

ఈ మంథ్యవిద్యను వాజసనేయ యాజ్ఞవల్క్యుడు తన శిష్యుడైనట్టి, పైంగుని పుత్రుడైనట్టి మధుకుని ఉపదేశించి అన్నాడు– 'ఈ మంథాన్ని ఎవరైనా మ్రోడై ఎండిపోయిన చెట్టు మొద్దు మీద వేస్తే మళ్ళీ దానికి కొమ్మలు, ఆకులు, చిగుళ్ళు పుడతాయి.

ఈ మంథ విద్యను పైంగ్య మధుకుడు తన శిష్యుడైన భాగవిత్తుని కుమారుడు చూలునికి ఉపదేశించి అన్నాడు– 'ఈ మంథాన్ని ఎవరైనా ఎండిపోయిన చెట్టు మీద వేస్తే మళ్ళీ కొమ్మలు, చిగుళ్ళు ఆకులు పుడతాయి' అని.

ఈ మంథ విద్యను చూలుడు తన శిష్యుడైన జానకికి (అయస్థూణుని కుమారుడు) ఉపదేశించి అన్నాడు– 'ఈ మంథాన్ని ఎవరైనా ఎండిన మ్రోడు మీద వేస్తే అది కొమ్మలతో, చిగుళ్ళతో, ఆకులతో మళ్ళీ బ్రతుకుతుంది' అని.

ఈ మంథవిద్యను జానకి తన శిష్యుడైన (జాబాలుని కుమారుడైన సత్యకామునికి ఉపదేశించి అన్నాడు– 'ఈ మంథాన్ని ఎవరైనా ఎండిపోయిన చెట్టు మ్రానిమీద వేస్తే అది మళ్ళీ చిగురించి ఆకులతో కొమ్మలు తొడుగుతుంది.' అని.

ఈ మంథ విద్యను సత్యకాముడు తన శిష్యులకు ఉపదేశిస్తూ అన్నాడు– 'ఈ మంథాన్ని ఎండిన మ్రోడు మీద వేస్తే అది చిగిర్చి ఆకులతో కొమ్మలు తొడుగుతుంది' అని. ఈ మంథ విద్యను పుత్రుడు, శిష్యుడు కాని వానికి ఉపదేశించకూడదు. విద్యోపదేశానికి మామూలుగా ఆరుగురు అర్హులు. (శిష్యుడు, వేదాలు చదివిన శ్రోత్రియుడు, మేధావి, ధనమిచ్చేవాడు, పుత్రుడు, ఒక విద్యను గ్రహించి వేరొక విద్యను ఇచ్చేవాడు) ఈ ఆరుగురిలో ఈ మంథ విద్యను పుత్రునికి, శిష్యునికి మాత్రమే ఉపదేశించాలని చెప్పారు.

**మం॥ చతురౌదుమ్బరీ భవతి– ఔదుంబరః స్రువః ఔదు మ్బరశ్చమసః, ఔదుమ్బర ఇధ్మః, ఔదుంబర్యా ఉప మంథన్యౌ; దశగ్రామ్యాణి ధాన్యాని భవన్తి– వ్రీహి యవాస్తిలమాషా అణుప్రియంగవో గోధూ మాశ్చ మసూరాశ్చ ఖల్వాశ్చ ఖలకులాశ్చ; తాన్పిష్టా న్దధని మధుని ఘృత ఉపసించతి, ఆజ్యాస్య జుహోతి.** **13**

ఈ మధు కర్మలో ఉపయోగించే నాలుగు సాధనాలు ఔదుంబర కాష్ఠంతో చేసినవై ఉండాలి. స్రువము, పాత్ర, ఇధ్మము, రెండు ఉపమంథనములు. అందుచేతనే దీనిని చతురేదుంబర కర్మ అంటారు. దీనికి ఉపయోగించే దన్యాలు వరి, యవలు (బార్లీ) తిలలు, మినుములు, చిరువడ్లు, అలచందలు, గోధుమ, శెనగలు, అనుములు, కొఱ్ఱలు– పది అనే నియమం లేదు. ఎక్కువ కూడా ఉపయోగించవచ్చు. పండ్లు కూడా అంతే ! ఎన్నైనా చేర్చవచ్చు. గ్రామీణ ధాన్యాల్ని ఇతర సంబారాల్ని బాగా విసిరి పిండి చేసి పెరుగు, తేనె, నేయి కలిపి నేతితో సహా హోమం చేస్తారు.

## నాల్గవ బ్రాహ్మణం

ఈ బ్రాహ్మణంలో పుత్రోత్పత్తికి సంబంధించిన విషయం చెపుతున్నారు. పుత్రుని జన్మ శుభకరమై ఉండాలి. శుభమైన పద్ధతిలో పుట్టి, మంచి గుణ గణాలు కలిగినవాడై ఉండాలి. ధర్మపరుడైన కొడుకు పితరులను తరింపచేస్తాడు ప్రాణో పాసకుడు (వెనుకటి అధ్యాయంలో) శ్రీమంథ కర్మను ఆచరించాల్సిన విధానం చెప్పారు. దానివల్ల అతనికి హహత్త్వం– గొప్పతనం,

సంపద లభిస్తాయి. ఆ విధంగా శ్రీమంథ కర్మను ఆచరంచినవాడే పుత్రమంథ కర్మకు అర్హుడు. శ్రీ మంథ కర్మను ఆచరించి, భార్య యొక్క ఋతుకాలం కోసం ప్రతీక్షించాలి. వీర్యమనేది సమస్త రసాలకు సారభూతమైనదిగా 'ఏషాంవైరేతః' అనే మంత్రం ద్వారా చెప్పారు.

ఇక్కడ, ఆధునిక యుగంలో –ఇరవయ్యో శతాబ్దంలో ఉన్న మనం గుర్తు ఉంచుకోవాల్సిన విషయాలు కొన్ని ఉన్నాయి. మనం ప్రస్తుతం హేతువాద యుగంలో, యంత్రాల మధ్య మనది కాని పాశ్చాత్య నాగరికతతో కొంతవరకు –పూర్తిగా కాదు– ప్రభావితులమై. ప్రాచీన సంస్కృతిని అర్థం చేసుకోలేక, పూర్తిగా వదలుకోలేక కొట్టుమిట్టాడుతున్నాము. ఈ పరిస్థితి మత విషయాల్లోనే కాక, జీవితంలో అన్ని రంగాలలోను అట్లాగే బ్రతుకుతున్నాము.

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, హిందువై పుట్టిన ప్రతివాడూ, అంతేకాదు. మానవుడై పుట్టిన ప్రతివాడూ, అంతేకాదు, పశుపక్ష్యాదులు సైతం సంతానాన్ని ఆపేక్షించటం, తమ జాతిని పెంపొందింపజేసుకోవటానికి కృషి చేయటం చూస్తూనే ఉన్నాం. మానవుల్లో తప్ప పశుపక్ష్యాదుల్లో ఈ విషయంలో కొన్ని ప్రాకృతిక నియమాలున్నట్లు కనిపిస్తుంది. మానవులలో అది కూడా లోపించింది. సరే, ఇతర దేశస్థులలో సంతాన సంపాదనమనేది కేవలం లౌకిక దృష్టితో కూడి, ఒక సహజ ప్రవృత్తిగా ఉంటే ఉండవచ్చు. కాని భారతీయులకు సంతానోత్పత్తి ఎన్నడూ లౌకిక విషయం కాదు. మత, ధర్మాలు ఇంత క్షీణదశలో ఉన్న ఈనాడు కూడా గర్భం దాల్చినది మొదలు సీమంత, పుంసవవాదులు జాత కర్మాది గర్భాదాన పర్యంతం అనేక కర్మలను ఆచరిస్తూనే ఉన్నాం. చివరకు శిశువుకు అన్నం పెట్టటమనేది కూడా మనకు లౌకిక కర్మ కాదు. అంటే, కేవలం కామ వాంఛా పరితృప్తి కోసమే వివాహం, సంతాన ప్రాప్తి అనేవి మనవాళ్ళ దృష్టి కాదు– ఇవన్నీ ధర్మం కోసం. పుత్రుని వల్ల పరలోకం, కీర్తి లభిస్తాయి. పుత్రుడు తండ్రి యొక్క ప్రతి రూపం. తండ్రి నెరవేర్చలేక మిగిలిపోయిన ధర్మాన్ని కుమారుడు నెరవేర్చాలని, ఈ విధమైన ధార్మిక దృష్టి సంతానోత్పత్తికి భూమికగా ఉంది. ఇతరులకు ఈ విధమైన ధార్మికదృష్టి ఉన్నట్లు కనపడదు. అటువంటి సత్పుత్రుడు కలగాలని అంతా కోరతారు. కాని కేవలం జంతు ప్రవృత్తితో ప్రవర్తిస్తే అటువంటి సత్పుత్రులు పుట్టటం కష్టం, కాబట్టి మన భారతీయులు పూర్వం నుండి జాతకర్మాది అనేక కర్మలను నిర్ణయించారు. ఆ కర్మలకు శుభతిథులు శుభముహూర్తాలు నిర్ణయించారు. అంతేకాదు, శుభకరమైన పద్ధతులు విధించారు. ఈ విధమైన విధులను ఆధునికులు నిరసిస్తే నిరసించవచ్చు. పురాణాలన్నీ బూతుల బుంగలని రకరకాలుగా హేళన చేసే వారిని చూస్తున్నాం. వారి అజ్ఞానానికి, చారిత్రక దృష్టి లేమికి జాలిపడటం కంటే చేయదగింది లేదు. వేల సంవత్సరాల క్రితం ఉద్భవించి పురాణాలను, అపౌరుషేయాలుగా పరిగణింపబడే శ్రుతులను 20వ శతాబ్దంలో ఉండి, మన అల్పజ్ఞానంతో విమర్శించటం చూస్తే మన ముత్తాతలు పొంట్లు

తొడగలేదు, పొగ పీల్చలేదు, కాఫీ త్రాగలేదు కాబట్టి అనాగరికులని అన్నట్లుంటుంది. పురాణాలు బూతుల బుంగలని, వేదాలు కామశాస్త్రాలని తమ అల్పజ్ఞానంతో వెక్కిరించేవారు, ఈనాటి పత్రికల్లో సెక్కు విజ్ఞానం పేరు పెట్టుకొని వచ్చే రకరకాల రచనలను భార్య చూడకుండా భర్త, భర్త చూడకుండా భార్య, ఇద్దరూ చూడకుండా పిల్లలు చదువుతూ ఉండటం చూస్తూనే ఉన్నాం. అంతేకాదు– పాఠశాలల్లోని విద్యార్థినీ విద్యార్థులకు కామశాస్త్ర పాఠాలు సెక్సు విజ్ఞానం పేరుతో బోధిస్తే సెక్సు పరమైన నేరాలు ఉండవనే స్థితికి వచ్చాం. కుటుంబ నియంత్రణ పేరుతో చేయరాని ప్రయత్నాలన్నీ చేస్తున్నాం. అవన్నీ కల్చర్ క్రిందకు వస్తున్నాయి.

ఇప్పుడు చెప్పబోయే పుత్ర మంథమనే అధ్యాయం సత్పుత్రార్థులైనట్టి, కర్మిష్ఠులైనట్టి, ధార్మిక గృహస్థుల కోసం. అంతేగాని, కాముకుల కామవాంఛను ప్రకోపింపచేయటానికి చిన్న పిల్లలకు కామశాస్త్రం బోధించటానికి చెప్పింది కాదు. కాబట్టి దీనిని ఈ దృష్టితోనే అర్థం చేసుకోమని చెప్పటానికే ఉపోద్ఘాతం. ఇందులో ఉన్న ఔచిత్యం, మన ప్రాచీన ఋషుల తాత్త్విక, ధార్మిక దృష్టి, గ్రహించాలి. అప్పుడే మనకు జాతకర్మ మొదలుకొని అగ్ని సంస్కారం దాకా మానవుని సమస్త కర్మలకు, వృత్తులకు, ప్రవృత్తులకు సూత్రాత్మగా ఉండే ధర్మం మనకు బోధపడుతుంది. ఇందులో ఆధునిక సెక్సు విజ్ఞానాన్ని, ఆధునిక మానసిక శాస్త్ర సూత్రాలను వెదకి పెదవి విరవటం తగని పని.

**మం॥ ఏషాం వై భూతానాం పృథివీ రసః, పృథివ్యా ఆపః, అపామోషధయః, ఓషధీనాం పుష్పాణి, పుష్పాణాం ఫలాని, ఫలానాం పురుషః, పురుషస్య రేతః. 1**

ఈ స్థావర జంగమాత్మకమైన సమస్త భూతాలకు సారభూతమైనది పృథివి. ఈ పృథివికి సారభూతమైనది జలం, జలానికి సారభూతమైనది ఓషధులు, ఓషధులకు సారం పుష్పాలు, పుష్పాలకు సారం ఫలాలు, ఫలాలకు సారం పురుషుడు, పురుషుని సారం వీర్యం.

**మం॥ స హ ప్రజాపతిరీక్షాంచక్రే, హన్తాస్మై ప్రతిష్ఠాం కల్పయానీతి; స్త్రియం ససృజే, తాం సృష్ట్వాధ ఉపాస్త; తస్మాత్స్త్రియమధ ఉపాసీత; స ఏతం ప్రాం ఇఞ్చం గ్రావనమాత్మన ఏవ సముదపారయత్, తేనైనా మభ్యసృజత్. 2**

సృష్టికర్తయైన ప్రజాపతి 'ఈ సారతత్త్వమైన రేతస్సును నిక్షేపించేటందుకు తగిన ఆదార భూమిని నిర్మించాలి' అని ఆలోచించాడు. ఈ విధంగా ఆలోచించి ప్రజాపతి స్త్రీని సృష్టించాడు. స్త్రీని సృష్టించి అధో భాగాన్ని ఉపాసించాడు– అంటే మైధున కర్మను నిర్వర్తించాడు. కాబట్టి ఉత్తమ సంతానాన్ని కోరే సద్గృహస్థులు ఈ విధంగా స్త్రీ యొక్క అధోభాగాన్ని ఉపాసించాలి. ఈ

మైధున కర్మకు వాజపేయ యాగంతో పోలిక చెప్పబడ్డది. వాజపేయానికి సోమరసం కావాలి. ప్రజాపతి ఈ ఉత్కృష్టమైనట్టి, శిలాసదృశమైనట్టి జననేంద్రియాన్ని కఠినంగా చేసి స్త్రీతో సంసర్గంచేశాడు. వాజపేయ యాగసామ్యం చెపుతున్నారు.

**మం॥ తస్యావేదిరుపస్థః, లోమాని బర్హిః, చర్మాధిషవణే- సమిద్ధో మధ్యతః - తౌ ముష్కౌ; స యావాన్ హ వై వాజపేయేన యజమానస్య లోకో భవతి, తావానస్య లోకో భవతి య ఏవం విద్వానధోప హాసం చరతి; ఆసాం స్త్రీణాం సుకృతం వృంక్తే, అథయ ఇదమవిద్వానధోపహాసం చరతి, అస్య స్త్రియః సుకృతం వృంజతే.** 3

ఆమె ఉపస్థయే యజ్ఞవేదిక, రోమాలు దర్భలు- యోని మధ్యం అగ్ని పార్శ్వ భాగాలలో ఉండే గట్టి మాంస పిండాలు- ముష్కాలు రెండూ చర్మాధిషవణమనే పేర ప్రసిద్ధి చెందిన చర్మంతో చేసిన సోమ ఫలకాలు. వాజపేయ యాగం చేసినందువల్ల యజమానికి కలిగే ఫలం ఈ మైధున విజ్ఞానం తెలుసుకున్న ఉపాసకునికి లభిస్తుంది. ఈ విధంగా తెలుసుకొని మైధునకర్మను నిర్వర్తించే విద్వాంసుడు స్త్రీల పుణ్యాన్ని అవరుద్ధం చేస్తాడు. ఈ విషయం తెలియని అవిద్వాంసుడైతే స్త్రీ అతని పుణ్యాన్ని అవరుద్ధం చేస్తుంది.

**మం॥ ఏతద్ధస్మవై తద్విద్వానుద్దాలక ఆరుణిరాహ; ఏతద్ధ స్మ వై తద్విద్వా న్నాకో మౌద్గల్య ఆహ; ఏతద్ధ స్మ తద్విద్వాన్కుమార హారిత ఆహ; బహవో మర్యా బ్రాహ్మణాయనా నిరింద్రియా విసుకృతో స్మాల్లోకా త్ప్రయన్తి, య ఇదమ- విద్వాంసో ధోపహాసం చర న్తీతి; బహువా ఇదం సుప్తస్య వా జాగ్రతో వా రేతః స్కందతి.** 4

మైధున కర్మను వాజసనేయ యజ్ఞంగా తెలుసుకొన్నట్టి అరుణనందనుడైన ఉద్ధాలకుడు పై విధంగా చెప్పాడు. పై విధంగా (వాజస నేయంగా) తెలుసుకున్న ముద్గలుని పుత్రుడైన నాకుడు, కుమార హారితుడు కూడా ఈ విధంగానే అంటున్నారు- ఈ మైధున కర్మను, నిగ్రహంతో కూడిన పుణ్యకర్మగా భావించకుండా, ఇంద్రియలోలురై కేవల కామంతో నిర్వర్తించేవారు మరణశీలురైన మానవులే తప్ప, నిజమైన బ్రాహ్మణులు కారు. అటువంటివారు ఈ లోకంలోను, పరలోకానికి కూడా భ్రష్టులౌతారు. పైన చెప్పినట్టి ప్రాణోపాసకుడు భార్య యొక్క ఋతు కాలం కోసం ప్రతీక్షిస్తూ ఉండగా నిద్రలోగాని, జాగ్రదావస్థలోగాని, రాగ ప్రాబల్యం వల్ల రేతోపాతం జరిగితే ఈ దిగువ విధించిన ప్రాయశ్చిత్తం చేయాలి.

**మం॥ తదభిస్పృశేత్, తను వా మస్త్రయేత్- యన్మేద్య రేతః పృథివీమస్కాన్సీత్ యదోష ధీరణ్య సరద్యదపః ఇద మహంతద్రేత ఆదదే పున ర్మామైత్విన్ద్రియం పునస్తేజః పునర్భగ. పునరగ్ని**

**ర్దిష్ట్వా యథాస్థానం కల్పన్తామ్, ఇత్యనామి కాంగుష్ఠా భ్యామాదాయాన్తరేణ స్తనే వా భ్రూవౌ వా నిమృజ్యాత్.** **5**

ఆ రేతస్సును స్పృశించి ఈ విధంగా అభిమంత్రించాలి. ఈ వీర్యం స్ఖలనమై భూమి మీద పడ్డది. ఇదే అన్నంలోనూ పడ్డది. జలంలోనూ పడ్డది. ఈ రేతస్సును స్పృశిస్తున్నాను. అని ఆనామికాంగుష్ఠాలతో తీసి స్తనాలకు గాని, భ్రూమధ్యంలోగాని రాచి ఈ అర్థం గల మంత్రం పఠించాలి– 'ఈ ఇంద్రియం మళ్ళీ నాలోనికి రావాలి. ఈ విధంగా బయటకు వచ్చిన వీర్యం మళ్ళీ నాకు తేజస్సును, సౌభాగ్యాన్ని కలిగించుగాక ! అగ్నియే స్థానంగా గల దేవతలు ఆ రేతస్సును నా శరీరంలో యధాస్థానంలో స్థాపింతురుగాక !'

**మం॥ అథ యద్యుదక ఆత్మానం పశ్యత్తదభిమంత్రయేత –మయి తేజ ఇంద్రియం యశో ద్రవితం సుకృతమితి; శ్రీర్హ వా ఏషా స్త్రీణాం యన్మలోద్వాసాః; తస్మా న్మలోద్వాసనం యశస్వినీమభిక్రమ్యోప మంత్రయేత.** **6**

నీటిలో గనక వీర్యపాతం అయితే నీటిలో తన ప్రతిబింబాన్ని చూచుకొని 'మయితేజ' అనే మంత్రాన్ని పఠించి జలాన్ని అభిమంత్రించాలి మంత్రార్థం– 'ఓ దేవతలారా ! మీరు నాలో తేజస్సును, వీర్యాన్ని, యశస్సును, ధనాన్ని, సత్కర్మను ప్రతిష్ఠించండి. (పిమ్మట ఏ భార్య గర్భం నుండి పుత్రుని కోరుతున్నాడో ఆ భార్యను ఈ విధంగా స్తుతించాలి) ఈ భార్య స్త్రీలందరిలోను లక్ష్మీ స్వరూపమైనది – రజస్వల కారణంగా వస్త్ర చిహ్నాలు కనిపిస్తున్నాయి కాబట్టి ! మూడు రోజుల తరువాత స్నాన మాచరించిన భార్య వద్దకు వెళ్ళి 'మనం పుత్రోత్పత్తి కోసం ప్రయత్నించాలి' అని అనాలి.

**మం॥ సా చేదస్మైన దద్యాత్, కామమేనామవక్రీణీ యాత్; సా చేదస్మైనైవ దద్యాత్, కామమేనాం యష్ట్యా వా పాణివా వోపహత్యాతిక్రామేత్, ఇంద్రియేణ తే యససా యశ ఆదద ఇతి; అయశా ఏవ భవతి.** **7**

తరువాత భార్య వద్దకు వెళ్ళినప్పుడు ఆమె సంభోగానికి అంగీకరించకపోతే ప్రేమను ప్రకటించి, అప్పటికి అంగీకరించకపోతే భయపెట్టి, అప్పటికి అంగీకరించకపోతే, గొడ్రాలివై పోవునట్లుగా శపిస్తానని. ఆమె సమాగమాన్ని పొందాలి. అప్పటికి ఆమె తిరస్కరిస్తే ఈ మంత్రం – 'నేను నా యశః స్వరూపమైన ఇంద్రియంతో నీ యశస్సును హరించి వేస్తాను' అని పఠించాలి. అప్పుడామె వంధ్య లేదా దుర్భగ శబ్దవాచ్యమై యశోహీన అవుతుంది.

**మం॥సా చే దస్మై దద్యాత్ ఇంద్రియేణ తే యశసా యశ ఆదధామీతి; యశస్వినావేవ భవతి. 8**

ఆమె భర్తృ సమాగమానికి అంగీకరిస్తే ఆమెను ఆశీర్వదిస్తూ 'నేను నాయశః స్వరూపమైన ఇంద్రియంతో, నీలో యశస్సును ఆధానం చెస్తున్నాను.' అనే అర్థమిచ్చే మంత్రం పఠించాలి. ఇందువల్ల ఆ దంపతులు సత్సంతానవంతులౌతారు.

**మం॥ స యామిచ్ఛేత్కామ యేత మేతి, తస్యామర్థం నిష్ఠాయ, ముఖేన ముఖం సంధాయ, ఉపస్థమస్యా అభిమృశ్య జపేత్- అంగాదంగాత్సం భవసి, హృదయాదధిజాయ సే స త్వమంగకషాయో సి, దిగ్ధవిద్ధమివని మాదయేమామమూం మయీతి. 9**

తన భార్య, సంభోగానికి యిష్టురాలై ఉన్నదని తెలుసుకొనినవాడై, యోని యందు జననేంద్రియ స్థాపనం చేసి, ముఖానికి ముఖమానించి చేతితో ఉపస్థను స్పృశించి ఈ అర్థమిచ్చే మంత్రాన్ని చదవాలి – 'ఓ వీర్యమా ! నీవు నా ప్రతి అవయవం నుండి పుట్టావు. ముఖ్యంగా హృదయంలో ఉండే నాడి నుండి వ్యక్తమౌతున్నావు. నీవు నా అవయవాల సారానివి. విషాక్తమైన బాణం తగిలిన పక్షి మూర్ఛపోయినట్లుగా, ఈ నా భార్య నా యెడల పరవశమై నాకు అధీనయగుగాక అని.

**మం॥ అథ యా మిచ్ఛేన్న గర్భం దధీతేతి, తస్యామర్థం నిష్ఠాయ, ముఖేన ముఖం సంధాయ, అభిప్రాణ్యాపాన్యాత్, ఇంద్రియేణ తే రేతసా రేత ఆదద ఇతి; అరేతా ఏవ భవతి. 10**

పురుషుడు తన భార్య గర్భధారణ చేయరాదని అనుకొంటే, వెనుక చెప్పిన విధంగానే జననేంద్రియ స్థాపనం చేసి ముఖానికి ముఖం ఆనించి అభిప్రాణన కర్మ చేసి ఈ దిగువ అర్థం ఇచ్చే మంత్రాన్ని చదవాలి– 'ఇంద్రియ స్వరూపమైన వీర్యం ద్వారా నేను రేతస్సును గ్రహిస్తున్నాను.' ఈ విధంగా చేసినందున భార్య గర్భవతి కాదు.

**మం॥ అథ యస్య జాయాయై జారః స్యాత్తం చేద్ద్విష్యాత్, ఆమపాత్రే గ్నిముప సమాధాయ ప్రతిలోమం శర బర్హిస్తీర్త్వా, తస్మిన్నేతాః శరభృష్టీః ప్రతిలోమాః సర్పిషాక్తా జుహుయాత్– మమ సమిద్ధే హౌషీః, ప్రాణాపానై త ఆదదే– అసావితి; మమ సమిద్ధే హౌషీః, పుత్ర పశుంస్త ఆదదే సావితి; మమ సమిద్ధే హౌషీః, ఇష్టా సుకృతే త ఆదదే– అసావితి; మమ సమిద్ధే హౌషీః, ఆశాపరాకాశౌ త ఆదదే అసావితి; స వా ఏష నిరింద్రియో విసు కృతో స్మాల్లోకాత్త్రైతి, యమేవం విద్బ్రాహ్మణః శపతి; తస్మాదేవం విచ్ఛ్రోత్రియస్య దారేణ నోపహాస మిచ్ఛేదుత, హ్యేవం విత్సరో భవతి. 12**

విద్వాంసుడైన ఈ గృహస్థుని భార్యకు జారుడెవడైనా ఉంటే అతని యెడ ద్వేషంతో, అతనిని శిక్షించాలంటే ఆ పద్ధతి చెపుతున్నారు. పంచ భూ సంస్కారయుతంగా పచ్చి మట్టి పాత్రలో అగ్నిని స్థాపించి విపరీత పద్ధతితో అంటే, దక్షిణాగ్రంగా గాని, పశ్చిమాగ్రంగా గాని

కుశవృంతాలను– బర్హిస్సును పరచి, వాటిపై బాణాకారంగా ఉండే కుశాగ్రాలను నేతితో తడిపి, వాటి అగ్రభాగాలను వ్యతిరేకదిశలో ఉంచి అంతకు పూర్వం సిద్ధపరచి ఉంచిన అగ్నిలో ఈ దిగువ అర్థం వచ్చే మంత్రాలు చదువుతూ నాలుగు అహుతులు ఇవ్వాలి. మంత్రార్థం– 'ఓరీ ! దుష్టుడా ! యౌవనాది గుణాలతో కూడియున్న నా ఓషాగ్నిలో నీవు వీర్యాహుతి ఇచ్చావు. అటువంటి పాపివైన నీ ప్రాణాపానాలను నేను అంతం చేస్తున్నాను. ఈ అర్థం వచ్చే మంత్రంతోపాటు 'ఫట్' అని ఉచ్చరిస్తూ మొదటి ఆహుతి ఇవ్వాలి. తరువాత 'అసౌ మమ శత్రుః' అని ఆ శత్రువు పేరు చెప్పాలి. ఈ విధంగా నాలుగు మంత్రాలలోను మొదటి మంత్రంతో ప్రాణాపానాలను, రెండవ మంత్రంతో పుత్ర పశువులను, మూడవ మంత్రంతో యజ్ఞాన్ని, పుణ్యాన్ని, నాల్గవ మంత్రంతో జారుని ప్రతిజ్ఞాపూర్తిని, ప్రతిజ్ఞలను పాడుచేయటానికి చెప్పబడ్డాయి. ఈ విధంగా మంథకర్మను తెలుసుకొన్నట్టి విద్వాంసుడు ఎవనిని శపిస్తాడో వాడు ఇంద్రియరహితుడై పుణ్యమంతా నశించి, ఈ లోకం నుండి నిష్క్రమిస్తాడు. పరస్త్రీ గమనం వల్ల సంభవించే ఇటువంటి భయంకర పరిణామాన్ని గ్రహించి పరిహాసానికైనా పరస్త్రీ సంగమాన్ని కోరరాదు– ఈ విధమైన ఆభిచారం తెలిసిన విద్వాంసునికి శత్రువౌతాడు.

**మం॥ అథ య స్య జాయామార్తవం విన్దేత్, ప్రత్యహం కంసేన పిబేదహతవాసాః, నైనాం వృషలో న వృష ల్యుపహన్యాత్; త్రిరాత్రాన్త ఆప్లుత్య వ్రీహి నవ ధాతయేత్. 13**

రజోధర్మాన్ని పొందిన స్త్రీ మూడు రోజుల పాటు కంచుపాత్రతో త్రాగటం గాని, తినటం గాని చేయకూడదు. నాల్గవనాడు స్నానం చేసి, చిరుగులు లేని స్వచ్ఛమైన వస్త్రాన్ని ధరించాలి. స్నానానికి ముందు గాని తరువాత గాని ఋతువుమతియైన ఆమెను శూద్ర స్త్రీ పురుషులెవరూ తాకరాదు. మూడు రోజులైన పిమ్మట. స్నానం చేసిన తరువాత బియ్యం దంపే పని ఒప్పగించవచ్చు.

**మం॥సయ ఇచ్ఛేత్పుత్రో మే శుక్లో జాయేత, వేదమను బ్రువీత, సర్వమాయురియాదితి, క్షీరౌదనం పాచ యిత్వా సర్పిష్మన్తమ శ్నీయాతామ్, ఈశ్వరౌ జవ యితవై. 14**

శుక్లవర్ణం కలవాడైన (తెల్లగా) వేదాధ్యాయపరుడైన, పూర్ణాయుర్దాయం కలవాడైన పుత్రుడు కావాలని కోరుకునే దంపతులు పాలతో బియ్యాన్ని ఉడికించి దానిలో నేతిని కలిపి, ఆ క్షీరాన్నాన్ని భక్షించాలి. అప్పుడా దంపతులు అటువంటి పుత్రుని పొందటానికి సమర్థులౌతారు.

**మం॥ అథ య ఇచ్ఛే త్పుత్రో మేకపిలః పింగలా జాయేత, ద్వౌ వేదావనుబ్రువీత, సర్వమాయురియాదితి, దధ్యౌ దనం పాచయిత్వా సర్పిష్మన్త మశ్నీయాతామ్, ఈశ్వరౌ జనయితవై. 15**

కపిలవర్ణం- పింగళవర్ణం (రాగి రంగు) కలిగినట్టి, రెండు వేదాలు చదివినట్టి, పూర్ణాయుర్దాయవంతుడైనట్టి పుత్రుడు కావాలని కోరిన దంపతులు దధ్యోదనం (పెరుగు అన్నం)లో నేతిని కలిపి భక్షించాలి. ఆ విధంగా చేస్తే వారు కోరినట్టి పుత్రుని పొందటానికి సమర్థులౌతారు.

**మం॥ అథ య ఇచ్ఛేత్పుత్రో మే శ్యామో లోహితాక్షో జాయేత, త్రీన్వేదానను బ్రువీత, సర్వమాయురియాదితి, ఉదౌదనం పాచయిత్వా సర్పిష్మన్తమశ్నీయాతాం ఈశ్వరౌ జనయితవై. 16**

శ్యామవర్ణం (నల్లని) కలిగి, ఎఱ్ఱని కండ్లు కలిగి, మూడు వేదాలు అధ్యయనం చేసినట్టి, పూర్ణాయుర్దాయం కలిగినట్టి పుత్రుడు కావాలని కోరిన దంపతులు నీటితో బియ్యాన్ని ఉడికించి, ఆ అన్నంలో నేతిని కలిపి భక్షించాలి. ఆ విధంగా చేస్తే, తాము కోరిన గుణాలు కలిగిన పుత్రుని పొందగలుగుతారు.

**మం॥ అథయ ఇచ్ఛేద్దుహితా మే పండితా జాయేత, సర్వామాయురియాదితి, తిలౌదనం పాచయిత్వా సర్పిష్మన్త మశ్నీయాతామ్, ఈశ్వరౌ జనయితవై. 17**

తన కొమార్తె గృహకృత్యాలలో నిపుణయైన పండితురాలు కావాలని, పూర్ణాయుర్దాయం కలిగినది కావాలని కోరిన దంపతులు నువ్వులు, బియ్యము కలిపి ఉడికించి నేతితో కలిపి భక్షించాలి. అట్లా చేస్తే తాము కోరిన గుణగుణాల కల పుత్రికను పొందగలుగుతారు.

**మం॥ అథ య ఇచ్ఛేత్పుత్రోమే పండితో విగీతః సమితిం గమః శుశ్రూషితాం వాచం భాషితా జాయేత, సర్వాన్వేదానను బ్రువీత, సర్వమాయురి యాదితి, మాం సౌదనం పాచయిత్వా సర్పిష్మ స్తమశ్నీయాతామ్; ఈశ్వరౌ జనయితవై- ఔక్షేణ వా ర్ష భేణ వా. 18**

తమ పుత్రుడు లోకవిఖ్యాతుడు కావాలని, పండితుల, విద్వాంసుల సభలలో నిర్భయుడై, రమణీయమైనట్టి, సార్థకమైనట్టి మధురభాషణం కలవాడై, వేదాలన్నీ అధ్యయనం చేసినవాడై, పూర్ణాయుర్దాయ వంతుడై ఉండాలని కోరుకునే దంపతులు నాగలిదున్నే ఎద్దు మాంసంతో వండిన అన్నంలో నేతిని కలిపి భక్షించాలి. అట్లా భక్షిస్తే తాము కోరిన గుణగణాలు కలిగిన పుత్రుని కనగలుగుతారు. ఉక్షము = వీర్యసేచనం చేయగల ఆఁబోతు, ఋషభము= ఎక్కువ వయసు గల ఎద్దుల మాంసము చెప్పబడ్డది.

**మం॥ అథాభిప్రాతరేవ స్థాలీపాకావృతా జ్యం చేష్టిత్వా స్థాలీపాకస్యోపఘాతం జుహోతి- అగ్నయే స్వాహా, అనుమతయే స్వాహా దేవాయ సవిత్రే సత్యప్రస వాయ స్వాహేతి; హుత్వోద్ధత్య ప్రాశ్నతి, ప్రాశ్యే తరస్యాః ప్రయచ్ఛతి; ప్రక్షాల్య పాణీ, ఉదపాత్రం పూరయిత్వా తేనైనాం**

**త్రిరభ్యుక్షతి- ఉత్తిష్ఠాతో విశ్వావసో న్యా మిచ్ఛ ప్రపూర్వ్యాం సం జాయాం పత్యా సహేతి.** **19**

తరువాత నాల్గవనాడు నిత్యకృత్యాలన్నీ తీర్చుకొని, ఉదయమే దంపి ఉంచుకున్న బియ్యంతో స్థాలీపాక విధానంతో ఘృతసంస్కారం చేసి గిన్నెలో నుండి కొద్ది కొద్దిగా అన్నాన్ని తీసికొని 'అగ్నయే స్వాహా, అనుమయతే స్వాహా, దేవాయ సవిత్రే సత్యప్రసవాయ స్వాహా' మొదలుగా గల మంత్రాలతో మూడు ప్రధాన ఆహుతులు ఇవ్వాలి. ఈ విధంగా ఆహుతులు ఇవ్వగా మిగిలిన చరువును-శేషా న్నాన్ని నేయి కలిపి ముందుగా భర్త భుజించాలి. మిగిలిన దానిని భార్యకు ఇవ్వాలి. పిమ్మట చేతులు, కాళ్ళు కడుగుకొని, శుద్ధాచమనం చేసి, జలపాత్రను నింపి, తన భార్యను 'ఉత్తిష్ఠాతః' అనే మంత్రంతో మూడుసార్లు అభిషేకించాలి -మంత్రం మాత్రం ఒకేసారే చదవాలి.

**మం॥ అథైనామభిపద్యతే- అమో హమస్మి సా త్వమ్, సా త్వమ స్యమో హమ్, సామాహస్మి ఋక్త్వం, ద్యౌరహం పృథివీత్వం; తావేహి సంరభావహై, సహ రేతో దధావహై పుంసే పుత్రాయ విత్తయ ఇతి.** **20**

పిమ్మట భర్త తన అభీష్టానుసారం భార్యతోపాటు క్షీరాన్నాదులు భుజించిన తరువాత శయనించాలి. అప్పుడు 'అమో హ మస్మి' మొదలుగా గల మంత్రాన్ని ఉచ్చరిస్తూ- భార్యను కౌగలించుకోవాలి.

ఆ మంత్రార్థం ఇది- 'ఓ దేవీ ! 'నేను ప్రాణాన్ని, నీవు వాక్కువు. నేను ప్రాణాన్ని, నేను సామాన్ని, నీవు ఋక్కువు. నేను ఆకాశాన్ని, నీవు భూమివి. అందుచేత రా ! మనం దంపతులు- ఆలింగనం చేసుకుందాం. ఒక్కసారిగా రేతోధారణం చేసి మంచి పుత్రుని పొందుదాం !'

**మం॥ అథాస్య ఊరూ విహాపయతి- విజిహీథాం ద్యావా పృథివీ ఇతి; తస్యామర్థం నిష్ఠాయ, ముఖేన ముఖం సంధాయ త్రిరేనామనులోమామనుమాష్టిం- విష్ణు ర్యోనిం కల్పయతు, త్వష్టా రూపాణి పింశతు. ఆసించతు ప్రజాపతిర్ధాతా గర్భం దధాతుతే.** **21**

**మం॥ గర్భంధేమి సినీవాలి, గర్భం ధేమి పృథుష్టుకే. గర్భం తే ఆశ్వినౌ దేవా వాధత్తాం పుష్కర ప్రజౌ. హిరణ్మయీ అరణీ యాభ్యాం నిర్మంథతానశ్వినౌ. తం తే గర్భం హవామహే దశమే మాసి సూతయే. యథాగ్ని గర్భాపృథివీ, యథా ద్యౌరింద్రేణ గర్భిణీ. వాయుర్దిశాం యథా గర్భ ఏవం గర్భం దదామితే- అసావితి.** **22**

**మం॥ సోష్యన్తీ మద్భిరభ్యుక్షతి. యథా వాయుః పుష్కరిణీం సమింగ్యతి సర్వతః. ఏవా తే గర్భ ఏజతు సహావైతు జరాయుణా. ఇంద్రస్యాం వ్రజః కృతః సార్గలః స పరిశ్రయః. తమింద్ర నిర్జహి గర్భేణ సావరాం సహేతి.** **23**

**జాతే గ్ని ముపసమాధాయ, అంక ఆధాయ, కంసే పృషదాజ్యం సంనీయ పృషదాజ్య స్యోపఘాత జుహోతి– అస్మిన్సహస్రం పుష్యాస మేధమానః స్వేగృహే అశ్యోప సంద్యాం మా చ్ఛైత్సీత్ ప్రజయా చ పశుభ్చి– స్వాహా. మయి ప్రాణాంస్త్వయి మనసాజుహోమి– స్వాహా. యత్కర్మణాత్యరీరిచం, యద్వాన్యూన మిహాకరం. అగ్నిష్ట స్విష్టకృద్విద్వాన్స్విష్టం సుహుతం కరోతు నః– స్వాహేతి. 24**

పిమ్మట రెండు తొడలను వేరుగా చేసి 'విజిహీథాం ద్యావా పృథివీ' అనే మంత్రం చదవాలి. మంత్రార్థం – 'ఊరువుల రూపంలో ఉండే ఓ ఆకాశమా ! ఓ పృథివీ ! మీ యిరువురు వేరుకండి !' పిమ్మట జననేంద్రియాలను కలిపి, ముఖంతో ముఖం కలిపి, మస్తకం నుండి పాదాల వరకు భార్య యొక్క అవయవాలను మార్జనం చేయాలి. ఆ సమయంలో ఈ దిగువ మంత్రార్థమిచ్చే 'విష్ణుర్యోనిం కల్పయతు' అనే మంత్రం చదవాలి.

మంత్రార్థం– 'ఓ ప్రియురాలా ! సర్వత్ర వ్యాపించియున్న పరమాత్మ పుత్రజననంతో నీ జననేంద్రియాన్ని సార్థకం చేయుగాక ! సూర్య భగవానుడు నీ యింద్రియాలను, పుట్టబోయే శిశువు యొక్క అవయవాలను పరిపుష్టంగా, సుందరంగా ఉండేటట్లు చేయుగాక ! ప్రజాపతి నీలో తాదాత్మ్యం చెంది యుండి గర్భాన్ని గ్రహించుగాక! బ్రహ్మ నీ గర్భం యొక్క భరణ పోషణాదులు చేయుగాక !

అందరి చేత ప్రశంసింపబడే సినీవాలిని (అమావాస్య నీవు కాబట్టి గర్భాన్ని ధరించు, సూర్యచంద్రులు తమ కాంతిరూపమైన కమలాల మాలలు దాల్చి అభిన్నభావంతో నీలో చేరి గర్భాన్ని ధరింతురుగాక !

పూర్వకాలంలో అరణి (అగ్నిని రగుల్కొల్పే సాధనం) చాలా తేజోవంతంగా ఉండేది. వాటితోనే అశ్వినీకుమారులు అగ్ని మంథనం చేశారు. దాని నుండి ప్రకటమైనట్టి అమృతరూపమైన గర్భాన్ని నీలో స్థాపిస్తున్నాను. దీనిని నీవు పదవ నెల వరకు పెంచు. అగ్నిని భూమి ధరించినట్లు, ఇంద్రుని స్వర్గం గర్భంతో దాల్చినట్లు, వాయువును దిక్కులు గర్భంలో భరించినట్లు, నీ గర్భంలో ఈ పుత్రుని ఆధానం చేస్తున్నాను. ఓ దేవీ !(ఇక్కడ భార్య యొక్క పేరు చెప్పాలి.)

ప్రసవ సమయంలో, ప్రసవించే స్త్రీ మీద 'యథావాయః' అనే మంత్రం చదువుతూ జలాన్ని చల్లాలి. మంత్రార్థం ఈ విధంగా ఉంటోంది. చెరువులోని నీటిని వాయువు అన్ని వైపుల నుండి కల్లోలం చేస్తున్నట్లే నీ గర్భం కూడా తన స్థానం నుండి బయలుదేరి బయటకు వచ్చు గాక ! ఈ గర్భం వాయురూపంలో ఉండే ఇంద్రుడు. అటువంటి ఈ యింద్రుని కోసం ఈ

యోనిమార్గం గర్భవేష్టనంతో సృష్టింపబడ్డది. 'ఓ ఇంద్రుడా ! ఈ మార్గం చేరి జరాయువుతోబాటు బయటకు రమ్ము !' అని.

పునర్జన్మ అయిన తరువాత (తండ్రికి ఈ పుత్రజననం పునర్జన్మ)– పుత్ర జననం అయిన తరువాత, బాలుని తన ఒడిలోనికి తీసికొని, అగ్ని స్థాపనం చేసి, పెరుగు కలిసిన నేతిని తీసికొని కొద్ది కొద్దిగా 'అస్మిన్ సహస్రం' మొదలగుగా గలమంత్రాలతో ఆహుతులు ఇవ్వాలి. మంత్రార్థం ఇట్లా ఉంది– 'నేనీ ఇంట్లో పుత్ర రూపంలో వృద్ధిని పొందాను. వేల కొలది మనుష్యుల్ని పోషించేటందుకు సమర్థుణ్ణి కావాలి. నా, యీ సంతానంలో పూజలు, పశువులు, ఈ రెంటితో కూడిన సంపద ఎన్నడూ తరగకుండుగాక, నాలో ఉన్న ఈ ప్రాణాలను పుత్రునిలో హోమం చేస్తున్నాను–. స్వాహా ! నేను చేయవలసిన కర్మలలో హెచ్చుతగ్గులేమైనా చేసిన ఉంటే ఈ అగ్నిహోత్రునికి అదంతా తెలుసు. కాబట్టి ఆ అగ్నిదేవుడే, నా అభీష్టాలను ఈడేర్చేందుకుగాను, నా వల్ల కలిగిన కర్మలోప దోషాన్ని తొలగించుగాక స్వాహా.

**మం॥ అథాస్య దక్షిణం కర్ణమభినిధాయ వాగ్విగితి త్రిః; అథ దధి మధు ఘృతం సంనీయాన్తర్హితేన జాత రూపేణ ప్రాశయతి, భూస్తేదధామి, భువస్తే దధామి, స్వస్తేదధామి, భూర్భువః స్వః త్వయి దధామీతి. 25**

పై స్విష్టకృతహోమం తరువాత, తండ్రి శిశువు యొక్క కుడిచెవిని తన నోటివద్దకు తీసికొని వాక్, వాక్, వాక్ అని మూడు సార్లు అనాలి. అంటే, నీ బుద్ధి వేదత్రయ రూపమైన వాక్కు నందు పరిపుష్టమగుగాక అని తాత్పర్యం. తరువాత పాత్రలోనికి పెరుగు. నెయ్యి, తేనె కలిపి తీసికొని ఇతర లోహాలేవీ కలియనట్టి బంగారపు చెంచాలాంటిదానితో మూడుసార్లు 'భూస్తే' అనే మంత్రం చదివి, పిల్లవానిచేత నాకించాలి. మంత్రార్థం ఇట్లా ఉంటుంది– 'నేను నీలో భూలోకాన్ని స్థాపిస్తున్నాను. నేను నీలో భువర్లోకాన్ని స్థాపిస్తున్నాను. నేను నీలో స్వర్లోకాన్ని స్థాపిస్తున్నాను. నీలో భూర్భువః స్వః– అన్ని లోకాలను స్థాపిస్తున్నాను' అని.

**మం॥ అథాస్య నామ కరోతి వేదో సీతి దతస్య తద్గుహ్యా మేవ నామ భవతి. 26**

తరువాత శిశువుకు నామకరణం చేయాలి– 'నీవు వేదానివి' అని. కాబట్టి వేదమనేది ఆ శిశువుకు రహస్యమైన పేరు అవుతుంది.

**మం॥ అథైన్యం మాత్రే ప్రదాయ స్తనం ప్రయచ్ఛతి–యస్తేస్తనః శవయో యో మయోభూః, యో రత్నధా వసువిద్యః సుద్రతః సుద్రతః. ఏత విశ్వా పుష్యసి వార్యాణి సరస్వతి తమిహ ధాతవేకరితి. 27**

పిమ్మట పిల్లవానిని తల్లి ఒడిలోనికి ఇచ్చి 'యత్తేస్తనః' అనే మంత్రాలను చదివి పిల్లవానికి పాలు ఇప్పించాలి– మంత్రార్థం ఇది– 'ఓ దేవీ ! సరస్వతీ ! నీ స్తనాలు క్షీరానికి అక్షయ భండారాలు. ఆ క్షీరమే జీవనాధారం. అవి రత్నాల గనుల వంటివి– సమస్త సంపదలను ఇచ్చే దాతవంటివి. వాటితోనే నీవు శ్రేష్ఠమైన వాటినన్నిటిని పెంచుతావు. నా ఈ పుత్రుని జీవిక కోసం ఆ స్తనాన్ని నా ఈ భార్య శరీరంలో ప్రవేశపెట్టు !' అని. తరువాత పిల్లవానికి పాలు ఇవ్వాలి.

**మం॥ అథాస్య మాతరమభిమన్త్రయతే. ఇలాసి మైత్రావరుణీ, వీరే వీరమజీజనత్. సా త్వం వీరవతీ భవ, యస్మాన్వీరవతో కరత్ ఇతి, తం వా ఏతమాహుః, అతిపితా బతాభూః అతి పితామహో బతాభూః పరమాం బత కాష్ఠాం ప్రాపత్, శ్రియా యశసా బ్రహ్మవర్చసేన– య ఏవం విదో బ్రాహ్మణస్యపుత్రో జాయత ఇతి. 28**

తరువాత 'ఇలా సి' అనే మంత్రాలు చదువుతూ బాలుని, తల్లిని అభిమంత్రించాలి. మంత్రార్థం– "ఓ దేవీ ! నీవు పొగడదగినట్టి అరుంధతిని. ఓ వీరులారా ! నీవు వీరపుత్రుని కన్నావు. కాబట్టి నీవు వీరురాలువు. ఇటువంటి వీరుపుత్రుని కని నీవు నన్ను కూడా వీరుని చేశావు. ఈ పుత్రుని చూచి లోకులంతా 'ఇతడు తండ్రిని మించినవాడు, తాతను మించినవాడు' అని అనుకుంటారు. నీవు లక్ష్మి, కీర్తి, బ్రహ్మతేజస్సులతో కీర్తి యొక్క పై శిఖరాలకు చేరావు. ఇటువంటి విశిష్టమైన, జ్ఞాన సంపన్నుడైన పుత్రుని కన్నతండ్రి ఆ కుమారుని వలెనే ప్రశంసకు పాత్రుడౌతాడు."

## ఐదవ బ్రాహ్మణం

**మం॥ అథవంశః, పౌతిమాషీపుత్రః కాత్యాయనీ పుత్రాత్, కాత్యాయనీపుత్రో గౌతమీపుత్రాత్, గౌతమీ పుత్రో భారద్వాజీపుత్రాత్, భారద్వాజీ పుత్రః పారాశరీ పుత్రాత్, పారాశరీపుత్ర ఔపస్వస్తీ పుత్రాత్, ఔపస్వస్తీపుత్రః పారాశరీ పుత్రాత్, పారాశరీపుత్రః కతాత్యాయనీ పుత్రాత్, కాత్యాయనీ పుత్రః కౌశికీ పుత్రాత్, కౌశికీ పుత్ర అలమ్బీ పుత్రాచ్చ వైయా ఘ్రపదీపుత్రః కాణ్వీ పుత్రాచ్చ కాపీపుత్రాచ్చ, కాపీపుత్రః – 1**

పిమ్మట కాండత్రయాత్మకమైన వేదానికి (మధుకాండ, మునికాండ, ఖిలకాండ) ఆచార్యపరంపరను చెపుతున్నారు– పౌతీమాషీ పుత్రుడు కాత్యాయనీ పుత్రుని నుండి, కాత్యాయనీ పుత్రుడు గౌతమీ పుత్రుని నుండి, గౌతమీ పుత్రుడు భారద్వాజ పుత్రుని నుండి, భారద్వాజ పుత్రుడు పారాశర పుత్రుని నుండి, పారాశరీ పుత్రుడు ఔపస్వస్తీ పుత్రుని నుండి, ఔపస్వస్తీ

పుత్రుడు పారాశరీ పుత్రుని నుండి, పారాశరీ పుత్రుడు కాత్యాయనీ పుత్రుని నుండి, కాత్యాయనీ పుత్రుడు కౌశికీ పుత్రుని నుండి, కౌశికీపుత్రుడు ఆలంబీ పుత్రుని నుండి, ఆలంబీపుత్రుడు వ్యాఘ్రపదీ పుత్రుని నుండి, వైయా ఘ్రపదీ పుత్రుడు కాణ్వీపుత్రుని నుండి, కాపీ పుత్రుని నుండి, కాపీ పుత్రుడు–

**మం॥ ఆత్రేయీపుత్రాత్, ఆత్రేయీపుత్రో గౌతమీపుత్రాత్, గౌతమీపుత్రో భారద్వాజీపుత్రాత్, భారద్వాజీపుత్రః పారాశరీపుత్రాత్,పారాశరీపుత్రో వాత్సపుత్రాత్, వాత్సపుత్రః పారశరీపుత్రాత్, పారాశరీపుత్రో వార్కారుణీ పుత్రాత్, వార్కారుణీ పుత్రో వార్కారుణీపుత్రాత్, వార్కారుణీపుత్ర ఆర్తభాగీపుత్రాత్, ఆర్తభాగీపుత్రః శౌఙ్గీపుత్రాత్, శౌఙ్గీపుత్రః సాంకృతీపుత్రాత్, సాంకృతీపుత్ర ఆలంబా యనీ పుత్రాత్, ఆలంబాయనీపుత్ర ఆలంబీపుత్రాత్, ఆలంబీపుత్రో జాయన్తీపుత్రాత్, జాయన్తీపుత్రో మాండూకాయనీపుత్రాత్, మాండూకాయనీపుత్రో మాండూకీపుత్రాత్, మాండూకీపుత్రః శాండిలీ పుత్రాత్, శాండిలీపుత్రో రాథీతరీపుత్రాత్, రాథీ తరీపుత్రో బాలుకీపుత్రాత్, బాలుకీపుత్రః క్రౌంచికీ పుత్రాభ్యాం, క్రౌంచికీ పుత్రౌ వైదబృతీపుత్రాత్, వైదభృతీపుత్రః కార్శకేయీపుత్రాత్, కార్శకేయీ పుత్రః ప్రాచీనయోగీపుత్రాత్, ప్రాచీనయోగీపుత్రః సాంజీవీపుత్రాత్, సాంజీవీపుత్రః ప్రశ్నీపుత్రాదాసురి వాసినః, ప్రాశ్నీపుత్ర అసురాయణాత్, అసురాయణ ఆసురేః, ఆసురిః–** **2**

ఆత్రేయా పుత్రుని నుండి,.... ఆ సురాయణుడు ఆసురి నుండి, ఆసురి–

**మం॥ యాజ్ఞవల్క్యాత్, యాజ్ఞవల్క్య ఉద్దాలకాత్, ఉద్దారుకో రుణాత్, ఆరుణ ఉపవేశి, ఉపవేశిః కుశ్రేః, కుశ్రిః వాజశ్రవసః, వాజశ్రవా జిహ్వావతో బాధ్యో గాత్, జిహ్వావాన్బాధ్యోగః అసితాద్వార్ష గణాత్, అసితోవార్షగణోహరితాత్క శ్యపాత్, హరితః కశ్యపః శిల్పాత్కశ్యపాత్, శిల్పః కశ్యపః కశ్యపాన్నైధ్రవేః, కశ్యపోనైధ్రవిర్వాచః, వాగమ్భి ణ్యాః, అంభిణ్యాదిత్యాత్, ఆదిత్యానీమాని శుక్లాని యంజూషి వాజసనేయేన యాజ్ఞవల్క్యే నాఖ్యాయన్తే.** **3**

యాజ్ఞవల్క్యుని నుండి, ... .... అంభిని ఆదిత్యుని నుండి, ఆదిత్యుని నుండి పొందిన ఈ శుక్ల యజుర్వేదం వాజసనేయ యాజ్ఞవల్క్యుని ద్వారా ప్రసిద్ధిలోనికి తేబడింది.

**మం॥ సమానమా సాంజీవీపుత్రాత్, సాంజీవీపుత్రో మాండూకాయనే, మాండూ కాయని ర్మాండవ్యాత్, మాండవ్యః కాత్సాత్, కౌత్సోమాహిత్థేః, మాహిత్థి ర్వామకక్షాయణాత్, వామకక్షాయణః శాండిల్యాత్,శాండిల్యో వాత్స్యాత్, వాత్స్యః కుశ్రేః, కుశ్రిః యజ్ఞవచసో**

**రాజస్తంబాయనాత్, యజ్ఞవచారాజ స్తంభాయనః తురాత్కావషేయాత్, తురః కావ షేయః ప్రజాపతేః ప్రజాతిర్బ్రహ్మణః, బ్రహ్మ స్వయంభుః, బ్రహ్మణే నమః.** **4**

సాంజీవి పుత్రుని వరకు ఇది ఒకే వంశం. సాంజీవీ పుత్రుడు మాండూకాయని నుండి..... ... ప్రజాపతి బ్రహ్మ నుండి, ఈ విద్యను గ్రహించారు. బ్రహ్మ స్వయంభువుడు. స్వయంభువుడైన బ్రహ్మకు అనేక నమస్కారములు.

సంపూర్ణం

